# భారతి

సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౮. సంచిక ౧.

ఆంధ్రపత్రికా ముద్రాలయము _ మద్రాసు.

౧౯౩౧

నమో తస్స భగవతో అర్హతో సమ్మా సం బుద్ధస్స

# మంగళ సూక్తము

నే నిటులు వింటిని:—

తొల్లి బుద్ధభగవానుఁడు శ్రావస్తీ నగరమున [1]జేతవనమున అనాథపిండదుఁడు ధర్మము చేసిన తోఁటయందలి విహారమున నివసించుచుండెను. అప్పు డొకనాఁటి వేకువజామున మిగుల అందముకల యొకదేవత దిగి వచ్చెను. ఆమె కాంతిచే తోఁటయంతయు మెఱిసిపోయెను. ఆమె బుద్ధభగవానుని సమీపించి మ్రొక్కి ఓరఁగా నిలిచి యిటు లడిగెను:

క. అలదేవతలును నరులుం - బలుశాంతిని బొందుపొంటె మంగళములనుం
దెలిపిరిగాని మహా మం - గళము సుకం దాము తెల్పఁగావలె మాకున్.

బుద్ధభగవాను లిట్టులు చెప్పిరి:—

## మంగళ సూక్తము

చెడ్డవారితోడఁ జేరఁగాఁ బోకుంట - మంచివారితోడ మనుచునుంట
పూజ్యులైన వారి పూజించుటయు నిదే - మంగళముల కెల్ల మంగళంబు.

పూర్వజన్మమందు పుణ్యంబు చేయుట - యోగ్యదేశమందు మనికి గొనుట
చెప్పు పనిని దాను జేయఁగల్గుట యిదే - మంగళముల కెల్ల మంగళంబు.

చదువు లెల్లఁ జాలఁ జక్కఁగాఁ జదువుట - చేతి పనులు చేయు చెలువు గొనుట
గురువు లొద్ద శిక్ష గొనుటయు నియ్యదే - మంగళముల కెల్ల మంగళంబు.

తల్లి దండ్రులకును దా సేవ చేయుట - యంగనాసుతాదిసంగ్రహంబు
[2]పాప మంటకుండు వ్యాపార మియ్యదే - మంగళముల కెల్ల మంగళంబు.

---

౧. ఈ వనము జేతుఁ డను రాజుది. అనాథపిండదుఁడను నొక మహాధనికుఁడు ఈ తోఁటను ౧౮ కోట్ల బంగారు నాణెములకుఁ గొనెను. ౩౬ కోట్ల బంగారు నాణెములు వ్యయించి ఆ వనమున మఠములు కట్టించెను. ఇట్టి తోఁట నంతయు బుద్ధభగవానునకు దానము చేసెను.

ఈ యనాథపిండదుని అసలు పేరు సుదత్తుఁడు. బీదలకు అన్న మిడుచుండుటచే అనాథపిండదుఁ డను పేరు వచ్చెను.

౨. వేఁటయు మాదక ద్రవ్యము లమ్ముటయు, విషవస్తువు లమ్ముటయు, శస్త్రాస్త్రములు అమ్ముటయు జంతువులను బానిసలుగా నమ్ముటయు, భోగమువారి వ్యాపారము, ఇవి యయిదును పాపవ్యాపారములు.

దాన మొసఁగుచుంట ధర్మచర్యంబును - చుట్టపక్కములను జూచుచుంట
దోసఁగు లేని పనుల దొరఁకొనుటయు నిదే - మంగళముల కెల్ల మంగళంబు.

పాపపంకమందుఁ బడకుండ నుండుట - మద్యపానసంయమంబు గొనుట
ధర్మకార్యనిష్ఠ తప్పకుండుట యిదే - మంగళముల కెల్ల మంగళంబు.

గురుజనంబునెడల మరియాద, వినయంబు - లతోని ధర్మసేవ మఱియుఁ దుష్టి
చేయు మేలు మఱపుఁజెందని యోగ్యత - మంగళముల కెల్లమంగళంబు.

ఓర్మి మంచిమాటయును రేపుమాపులు - ధర్మబోధనంబు తప్పకుంట
శ్రమణగణమువారి సందర్శనంబును - మంగళముల కెల్ల మంగళంబు.

బ్రహ్మచర్య ధర్మపరిపాలనంబును - [3]ఆర్యసత్యములయు నాచరణము
నిశ్చలంబు తపము నిర్వాణ మొందుట - మంగళముల కెల్ల మంగళంబు.

ద్వంద్వములకు నెందు తాను చెందకయుంట - శోకపాపములకు సోఁకకుంట
పరమ శాంతి నెందుఁ బడయుట యియ్యదే - మంగళముల కెల్ల మంగళంబు.

మాంగళికంబు లీయవి సమస్తమునుం బొనరించు వారికిన్
ముంగల మూఁడు లోకములనున్ విజయం బగు నేడ కేఁగినన్
సంగతమౌ మహా పరమ శాంతియుఁ గావున నుత్తమంబులౌ
మంగళముల్ గదా యివియ! మానసమందుఁ దలంచి చూడుమా!

—అను: వేలూరి శివరామశాస్త్రి.

---

3. ఆర్యసత్యములు: బాధ ననుభవించుట, బాధకారణము, బాధ నాశనము, బాధనాశనమునకుఁగాను అష్టాంగమార్గము.

# విషయసూచిక

# చిత్రములు



---

౩. ఆర్యసత్యములు.

అష్టాంగమార్గము.

·౦. శ్రీనాది వెంకటగిరి.. ముగారు—... చదువుకొనవది.—భా. సం.



మేళము

చిత్రకారుడు: గుఱ్ఱం మల్లయ్యగారు, ఆంధ్రజాతీయకళాశాల, బందరు.



చెన్నపట్టణము, జనవరి ౧౯౩౧

సంపుటము ౮ ప్రమోదూత సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

మానవాభ్యుదయమునకు స్వధర్మ నిర్వాహణము సకలవ్యవస్థలయందును సాధనముగ నున్నది. సాంఘికవ్యవస్థలు, రాజ్యాంగములు, మతవ్యవస్థలు, సంప్రదాయాచారములు స్వధర్మాధారముననే వికాసమును పొందుచున్నవి. ధర్మవికాసముతో వ్యవస్థావికాసమును సహజముగ గలుగుచున్నది. సకలవ్యవస్థల వికాసమునకును మూలాధారమైన వాఙ్మయమును స్వధర్మాధారముననే వికసించుచున్నది. పరధర్మారాధనము ప్రబలియున్న వర్తమాన కాలమందు స్వధర్మారాధనము దుర్లభమై ఆత్మవికాసము దుస్తరమగుచున్నది. లోకముఖమందంతటను స్వధర్మాంగములైన స్వదేశ, స్వభావ, స్వజాతి, స్వాతంత్రములు పూజాపాత్రము లగుచున్నను, భారతవర్షమునందుమాత్రము నిందాపాత్రములై, సాహిత్యోపాసనము దురారాధ్యమై సాహిత్యవికాసము మందగమనము చేయుచున్నది.

సర్వతోముఖమైన సాహిత్యాభ్యుదయమునకు ఆత్మసామ్రాజ్యపరమైన స్వాతంత్ర్యము మూలాధారము. పారతంత్ర్యమునందు సాహిత్యాంగములైన శిల్పము, చిత్రకళ, వాఙ్మయము మొదలగు సకలాంగములును పారతంత్ర్యాశ్రయములై పాలక, పాలిత పోషణ లేక వికాసవంతములు గాకున్నవి. గతించిన ఏడేండ్లయందును సాహిత్యాభ్యుద

యమునకై భారతి చేయుచున్న సేవ స్వల్పమైనను ఆంధ్రలోకాదరణమును బడసినది.

భారతికి అష్టమ వర్ష మారంభ మైనది. గాంధిమహాత్ము డవలంబించిన సత్యాగ్రహ ధర్మము గతవత్సరమునందు భరతవర్షమునందు ధర్మసంస్థాపనమునకు రూపరేఖావిలాసములను దాల్చినది. మానవజీవితము సకలాంగవిలసితముగాని ప్రత్యేకావరణబద్ధము గా దనుపరమ ధర్మమును ప్రతిపాదించుటకు, గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము ప్రపంచమునకు విస్మయమును గలుగజేసినది. ఈ పరమార్థమును జీవయాత్రయందలి సకలాంగములందును రసవంతముచేయుట సాహిత్యమునకు పరమప్రయోజనము.

వర్తమానకాలమునందు ధనదేవత సర్వాధిష్ఠానదేవతయై వెలయుచున్నది. రాజ్యాంగములు, కావ్యములు, కళలు, విమర్శనలు, ధర్మములు, మతములు ధనాధారము లైనవి. సాహిత్యమును ధనమూలమైనది. పారతంత్ర్యస్థితియం దీవైపరీత్యము బీభత్సరూపములను గలుగజేయుచుండ సహజమైన స్వాతంత్ర కల్పనలు దుస్తరములైనవి. అపరిచితమైన ప్రాచీనశాస్త్రసంప్రదాయములో, లేక పర సంప్రదాయములో సాహిత్యోపాసనకు సాధనములైనవి. సుపరిచితములైన నిత్యసాహిత్య విధానములు సాహిత్యోపాసనమునకు సాధనములు గాక సాహిత్యనిర్మాణము దురారాధ్యమైనది. దేశావృతమైన ఈ అంధకార స్థితియందైనను సాహిత్యోపాసకుల సహాయప్రోత్సాహముల మూలమునను నిరంతరాయముగ భారతి సాహిత్యాభ్యుదయమునకు దోడ్పడజాలినందులకు సాహిత్యోపాసకులు అభివంద్యులు. భారతియందు గతించిన ఏడేండ్లయందును ప్రచురితములైన వ్యాసములు, పద్యములు, కథలు, గీతములు, చిత్రపటములు, నవలలు, నాటకములు, దేశావృతమైన సాహిత్య ధర్మప్రబోధమునకు నిదర్శనములుగ నున్నవి. సాహిత్యోపాసకులు ప్రజాజీవనమునకు సాధనములైన క్రొత్తకల్పనలను చేయుచు స్వధర్మారాధనమును జేయుచున్నారు.

ఆంధ్ర రాష్ట్రీయ సభ, సాహిత్యపరిషత్తులు, చిత్రకళాప్రదర్శనములు, సాంఘిక సభలు సర్వతోముఖమైన సాహిత్యాభ్యుదయమునకు తోడ్పడుచున్నవి. అనుదినమును ప్రచురితము లగుచున్న గ్రంథములు, పత్రికలు ప్రజాహృదయమునందు పరిస్ఫుటమైన గాథ ప్రబోధమును విశదము చేయుచున్నవి. ఈ మహాసంధిసమయమునందు ప్రజాజీవనమును రసవంతము చేయగల భారము త్యాగపరాయణులైన సాహిత్యోపాసకులమీద గలదు. నవయుగము సువిశాలమైన మానవధర్మాభ్యుదయము నభిలషించుచున్నది. సాహిత్యోపాసకు లీ పరమార్థమును గ్రహించి శ్రద్ధాపరాయణులై వారి సాహిత్యనిర్మాణములను దేశకల్యాణమునకును, సాహిత్యోపాసనకును సమర్పించి కృతార్థు లౌదురుగాక! గతసంవత్సరమునందు భారతికి వ్యాసములు వ్రాసియు, చిత్రములను బంపియు, నితరవిధముల సాయము జేసియు, సహాయ ప్రోత్సాహముల నొసగిన ఆంధ్రదేశ భాషాసేవకులకు పత్రికానిర్వాహకులు కృతాంజలుల నర్పించుచున్నారు.

—సంపాదకుడు.




# భార్య

పి. కోదండపాణిగారు

ప్రతిపనియందుఁ మఱియుం-బ్రతివిషయమునందుఁ దనదు పతిచేతను 'నా
సతి' యనిపించుకొనంబడు-సతియే సతి; దాని కెందు సాటియుఁ గలదే?

ఆయా దేశము లెంతయుం దిరిగి తా నత్యంతమున్ బెంగమై
స్వీయాగారముఁ జేరి పెద్దల కొగిం జేమోద్బలం జేయు పై
ఆయాకార మభూతపూర్వముగ బిట్టాలోకనం జేసి బా
హాయుగ్మంబును జాఁపి వచ్చునది యాహా భార్యయా? దేవతా?

తొలుకోడి కూఁత వేళల-మొలఁకువ రప్పించి లోన మొలఁగుచు మిగులం
దలఁపించుకొనఁగఁజాలిన-తలిరాకుంబోఁడి! నీవు ధన్యవు చుమ్మీ!

నో రూరఁగా వండు నోరెమ్ము కంచమ్ము పొత్తున భుజియించు పోఁడి గలిగి
మాటాడి హాస్యంబు లూటలై యుబుకంగ వాదోడుగా నుండు వార్త గలిగి
పూఁదోఁటలోఁ దోడఁ బోవుచుఁ జెలికాని ప్రతిబింబ మనిపించు పటిమ గలిగి
ఆవశ్యకంబైన యన్నింటిఁ జెప్పక చేయించుకొను నట్టి చేవ గలిగి
చెప్ప కొనునప్డు శిష్యగాఁ జెప్పునప్పు-డొజ్జగాఁ గను నొకచోట నున్నయప్పు
డంటుఁ దీవగ నడఁబాటులందు హృదయ-దేవతగ నొప్పు నిల్లాలు దివ్యరాలు.

ఎడఁద యెడందయుం గలిసి యేకమ యాగతిఁ గౌఁగిలించి యె
ప్పుడు నిఁక దూరదేశములు పోవవుగా యని గద్గదంబుగాఁ
బాడినుడు లల్ల నాడుచును పూవుల శయ్యను బాష్పశయ్యగా
నడరఁగఁ జేయు మేలి మగనాల! నినుం గొనియాడ నేర్తునే?

ఈశరీరము గూడను నిందులోన-పరిసి పోవ నిముడ్చుచో బరు వటంచు
వేఱు తెఱఁగైన విధి గాఁగ విధి సృజించు-నట్టి యేకాత్మ కాదె యిల్లా లసఁగ.

తా నెన్నని యలంతలుం గలఁతలున్ దండంబు గండంబులున్
(శ్రీ)నిర్యాణము లాజియుం దజయ మేనిం బొందెడిం గావుతన్!
నీ నెమ్మో మొక తూరి చాలుఁ గనునేనిం దూలు నవ్వన్నియుం
జానా, మంగళదేవతామణీ! నీజన్మంబు ధన్యం బహో!

మనసు నాఁకట్టెడు మహిమచే లేని సౌందర్యంబుల కుపాధి తాను భార్య
ప్రాణంబులకును స్వప్రాణంబు లొడ్డు సఖ్యంబులకు నుపజ్ఞ మల్లి యాలు
పురుషుని లోపంబు పోఁజేయ దొరఁకొన్న దైవ సంకల్పంబు తాను జాయ
ప్రియునిచే నెన్నాళ్లు ప్రేమింపఁ బడనేని కాను తగ్గని విధి గాదె పత్ని
భార్య యని చెప్పఁగాఁబడు పదమునందె-యెంత స్వాతంత్ర్య లక్ష్మియు నెంతదివ్య
వాణియును నెంత మతివైభవంబు గలదొ-యింతవఱకును జెప్పనే యెవ్వఁడేని?

నాకుం బెద్దవు నీవే-నీకున్ మఱి నేన పెద్ద; నీ వేమనినన్
నాకున్ విధి, నే నేమన-నీకున్ విధి; నియతి యెటులు నిర్మించె నోహో!—

చలిని నాపాదమస్తకము వాస్తవముగాఁ గలికి నీ నెమ్మోముఁ గప్పుకొందు
చిమ్మ చీఁకటిఁ బాయఁ జెలి! పువ్వునవ్వు నీ పిననవ్వు దీపమ్ము పెట్టికొందు
మెయి యెల్ల రాగిల్ల మెలఁత! నీగుణముల వరుసఁ బూమాలగా వయిచికొందు
ఊరక ననుఁ జూచుచుండుమా! యాకాశ గంగలో మున్కలాడంగఁ గందు
అన్ని ఋతువులయందున నలరు లన్ని-పూచుచుండెడి తీవవో పొలఁతిమిన్న!
పూర్వజన్మ తపః ఫలంబునను గాక-పుణ్యవతి భార్య యనునది పుట్టునొక్కొ!

మగవా రందఱు దూరదేశముల సంపాదించి నానాగతిన్
నగలో నాణెములో స్వభార్యలకుఁ గానుకల్ చేసి మెచ్చింతురో
ముగుదా! నేను విలోలజీవతరళంపుం బ్రేమహారంబె నీ
దగు వక్షంబు మనంబు కమ్ముకొనున ట్లర్పింతు నొక్కుమ్మడిన్.

---

# నన్నియయతులు—కొన్నిటి గతులు

నడకుదుటి వీరరాజుపంతులుగారు

ఒకానొక విమర్శనమును వ్రాయు సందర్భమున నాంధ్రమహాభారతమును బరిశోధించుచుండినప్పుడు నన్నయభట్టారకుని భారత భాగమున ఛందోనియమములు గొన్ని యున్నట్లు దోఁచెను. పిమ్మట నా స్ఫురణముతోనే యాతనిగ్రంథ మంతయుఁ బరీక్షింపఁగా నాయూహము కృతార్థమై మొనలేని యానంద మొదఁగూర్చెను. ఆ నియమములలో యతి నియమములు ప్రధానములు. అపురూపములును, అసాధారణములును, ఆశ్చర్యకరములును నగు నట్టి నియమములను బాటించి, నన్నయవలె గ్రంథరచనమును నెఱవేర్చిన కవిచంద్రుఁ డాంధ్రప్రపంచమున వేఱొకఁ డింతదనుకఁ గానరాలేదు. మఱియు నేలక్షణ గ్రంథకర్తలు గాని, యే ముద్రితాంధ్రమహాభారతపరిష్కర్తలు గాని, యేవిమర్శకులు గాని వానిని సమగ్రముగ గుఱుతించినట్లును గన్పట్టదు.

క్రీ. శ. పందొమ్మిదవశతాబ్ది కడపటిభాగమున నాతని సీస గీత నియమములు మాత్రము (ఎవరివలనఁ గనిపట్టఁబడిన నేమి) కీ. శే. పాఁడి వేంకటస్వామిగారి పేరితో అముద్రిత గ్రంథచింతామణి పత్త్రికయందు ప్రకటింపఁబడి లోకమునకు వెల్లడియైనవి. అవి గాక యితర విధములగు నియమములును నాతనిగ్రంథమున నత్యంత స్తవనీయములై విరాజిల్లుచున్నవి.

దుష్కరము లగు నన్ని నియమములను నన్నయకవి యేల పాటించెనో, యాతని కాలమున నాంధ్రలక్షణ గ్రంథము లెట్టివుండెనో, వాని నాతఁ డెంతదనుక ననుసరించి, లేక, యే రీతిని శాసించి తన గ్రంథమును ముగించెనో తెలిసికొనుటకుఁ దగిన యాధారము లిప్పటికిఁ గానరావు. ఆతనినాఁటివాఁడైన వేములవాడ భీమకవిదో, లేక, రేచనదో యైన కవిజనాశ్రయము మాత్రము నేఁటి ప్రచారమున నున్నది గాని, చిరకాలమునాఁటి దగుటచే భారతము వలెనే యదియు ననేక సంస్కరణముల పాలై బహువిధపాఠభేదములతో ననేక విధావతారముల నెత్తి తత్కర్త వ్రాసిన వెవ్వియో, యితరులు చేర్చిన వెవ్వియో నిర్ణయింపరాని దుఃస్థితియం దున్నది. మఱియు, రంగరాట్ఛందమున 'నన్నయభట్టులక్షణసారము'లోని వని యుదాహరింపఁబడినపద్యములు భారతలక్ష్యములకుఁ గేవలము విరుద్ధములై యుండుటచేఁ దద్గ్రంథము మననన్నయభట్టు వ్రాసినది గాదని చెప్పవచ్చును. కావున నన్నయభారతమునుబట్టియే యాతని నాఁటి తెలుఁగు లక్షణము నెఱుఁగవలసి యున్నది. ప్రస్తుతవ్యాసమున నాతఁడు తన గ్రంథమునం దనుసంధించియున్న యతులనుగూర్చియు, వానిగతులనుగూర్చియుఁ బ్రస్తావించెదను. మఱియు, నాంధ్రమహాభారతమును తత్తత్కవి కాల భాషా లక్షణ సంప్రదాయ

ములఁ బరిష్కరించి పరిశుద్ధముగఁ బ్రకటింపఁ దలంపుగొను భాషాపోషకుల సత్ప్రయత్నము నకు నీ నా పరామర్శ మించుకంత యేని సాహాయ్య మొనరింపఁగల దనునాశయముతోఁ బ్రదర్శించుచున్నాను.

## నన్నయనాఁటి యతిభేదములు

భట్టారక మహాశయుని* భారతభాగ మునఁ బాటింపఁబడిన యతిభేదములు కవిజనా శ్రయమునఁ గన్పట్టువానికంటెను గడు తక్కు వగఁ గానవచ్చుచున్నవి:—

౧. స్వరయతులు, ౨. వర్గయతులు, ౩. సంయుక్తాక్షర యతులు, ౪. సరస యతులు, ౫. ఏకతర యతులు, ౬. ముప్పది భక్తి యతులు.

ఈ యాఱు భేదములు గల యతులు మాత్రమే యాతని గ్రంథమున నుపయోగింపఁ బడినవి. క్రమముగ నవి యిచ్చట వివరింపఁ బడుచున్నవి.

### ౧. స్వరయతులు

అకారాద్యచ్చుల యతులు లక్షణగ్రంథ ములయందు చెప్పఁబడినట్లే (అ, ఆ, ఐ, ఔ ఇవి పరస్పరము యతిమైత్రి నొందును. ఇట్లే— ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ; ఉ, ఊ, ఒ, ఓ) నన్నయ గ్రంథమునందును పాటింపఁబడినవి. మఱియు, ళకారాది హల్లులను] అకారాద్య చ్చులు (యతిస్థానమున) సంధించునేని యా సంధించిన యచ్చునకే యతిమైత్రి సేయఁబడినది.

ఉదా:

"అర్థార్థులకు విపులార్థ మొసఁగుచు."
"వినుమ, లాదిక్షితినాథ! విక్రమాదిత్యనిభా!"

ఋ, రి - ల యతి:—

నన్నయ సభాపర్వద్వితీయాశ్వాసము (౧౯ ప.) న,

"ఋత్విజులండును విచారించి పూజించిరి."

అని ఋ, రి లకు యతిమైత్రి ఘటింపఁ బడినది. ప్రాచీనలాక్షణికులచే, అయుక్తాలుం బోలె సరసవడి తరగతియందైనఁ జేర్పఁబడని యీ అల్లులల విరామమైత్రిని గూర్చి యించు కంత చర్చింపవలసియున్నది.

ఈయతింగూర్చిన ఛందోదర్పణకారుని (అనంతామాత్యుని) యభిప్రాయ మీ రీతిగ నున్నట్లు గన్పట్టుచున్నది:

"ఋకారమునకు† యణాదేశశక్తిచే రేఫ మువచ్చుటం జేసి యది 'రి'తో విరతిఁబొందును."

పై ఋకార రేఫముల యతిమైత్రికి యణా దేశమే హేతు వగునేని తక్కిన ఇ, ఉ, ౡ లకును

---

* అరణ్యపర్వోత్తరభాగమున నెఱ్ఱన కవిత్వము సంకలితము చేరియుండుటచే, ఆభాగ మిచ్చట విమర్శనమునకుఁ జేరలేదు.

† యణాదేశ మనఁగా—ఇ, ఉ, ఋ, ౡ అను నీ యచ్చులకు సవర్ణేతరాచ్చు పరమైనప్పుడు క్రమముగా య, వ, ర, ల అనునవి యాదేశమగుట. ఉదా:— [illegible] + [illegible] = [illegible] + [illegible] — ఇత్యాదులు.

సిద్ధిని కల్పించుట న్యాయ్యము. ఏమన, ఇవి యును ఋకారముతో పాటు యణాదేశము గలుగునవియే. కావున, ఇ, ఉ, ఌ లకును యణాదేశశక్తిచే 'యి,వు,లి'లతో నట్టిమైత్రి చేకూరవలయును. ఌకార మాదిని గల ప్రసిద్ధశబ్దములు గానరావు గావున మిగిలిన ఇ, ఉ ల గతిని గూర్చి కనుఁగొందము. ఇకారము 'యి'తో యణాదేశవ్యాజమున నేమి, పరసవడి నెపమున నేమి, విశ్రమమైత్రి నొందుచున్నది. ఇఁక, ఉకారమునకు 'వు' తోడి యతిమైత్రిని గనుఁగొనవలయును. ఈయణాదేశలక్షణమును మన మున నిడికొనియే కాఁబోలు, నాంధ్రభాగవత భాగమును పూరించిన నారయ కవి ఉకార, తన్మిత్త్రములతో వుకారమునకు విశ్రమమును గల్పించినాఁడు. చూడుఁడు:

"ఉగ్రుఁడై పట్టి తెచ్చె సా-ల్వుండు."
—దశమస్కం. ఉత్తర. 889.

"ఒలయఁగఁ జాటించి యుద్ధ-వున కిట్లనిరి ."" 664

"కావునఁ దగ వర్ణుసుండు-పవనోగ్ర్యవుఁడున్." 714.

ఇంకను నిట్టి ప్రయోగము లొక రిద్దఱు కవులు చేసియున్నారు. కాని, వీనిని సాధువులుగా మనవా రంగీకరింతు రని తోఁపదు. కావునఁ బై నన్నయ ప్రయోగమునకు యణాదేశకారణము సమర్థనీయముగాఁ గన్పట్టదు. దానం జేసి యీ ఋ,రి ల యతికిఁ దగిన హేతువు నారయవలసి యున్నది. దీనింగూర్చిన నాయభిప్రాయము నిచ్చట విశదీకరించుచున్నాను.

(1) ఋకారమున స్వతస్సిద్ధముగు రేఫోచ్చారణము నిండి యున్నది. ఉచ్చారణసౌకర్యార్థము, అకారాదియు, ఉకారాంతము నైనట్లు 'అరు' అని సామాన్యముగాఁ బల్కుదురు గాని, పూర్వము దీనిని 'ఋ' అనియే యుచ్చరించెడివారు. కావుననే తక్కినయచ్చులకుంబోలె దీనికి సంధియడాగమాదు లేర్పడి యుండలేదు. 'రాముఁ డరిందముఁడు' అనువట్లు 'అతఁ డర్గ్వేది' అనిన నది సాధువు గాదు. ఇట్లే 'అనియె నజుఁడు; శ్రీహరి యరిగె' ఇత్యాదులయందుం బోలె 'ఋ' పరమైనచోట ద్రుతసంధియడాగమాదులు విధింపఁబడలేదు. కేవల స్థిరవర్ణకార్యమే దీనికిని దెలుఁగున జరుగుచున్నది.

(2) వేదమున ఋకారము 'రి'వలె నుచ్చరింపఁబడును. 'నిర్ ఋథో యశ్చనిస్వనః', 'వసిష్ఠ ఋషిః' ఇత్యాదులలోని ఋకారమును 'రి' వలెనే వేదపాఠకు లుచ్చరించెదరు. మఱియు, 'వృణీధ్వమ్, పృథివీ, దృగ్ంహా' ఇత్యాదులను 'వ్రిణీధ్వమ్, ప్రిథివీ, ద్రిగ్ంహా' ఇత్యాదిగఁ గొంచెము తేల్చి పలికెదరు. (తేల్చి పలుకకున్న నది వెనుకటి యక్షరముపై నూఁది దానిని గురువుగ నొనర్చును.)

(3) ఈ వేదోచ్చారణసంప్రదాయము ననుసరించియే కాఁబోలు, ఔత్తరాహులు 'ఋ, ౠ, ఌ, ౡ' లను 'రి, రీ, లి, లీ' అని నేఁడును బలుకుచున్నారు.

(4) ఆర్యు లుత్తరదేశమునుండి దక్షిణదేశమునకు వచ్చినతరువాతఁ దక్కిన సంస్కృతాక్షరములతో పాటు ఋకారమును వారి

[illegible]చ్చారణముతోనే మన పూర్వులచే స్వీకరింపఁబడినట్లును, అచ్చు గావున దానికి ఇ, ఎ లతో యతిమైత్రి యేర్పడినట్లును దోఁచెడిని.

(5) సంగీతశాస్త్ర మనాది. దాని రెండవ స్వరము ఋషభము. అది నేఁడును 'రిషభము' అని చెప్పఁబడుచున్నది. మఱియు దాని మొదటి యక్షరము 'రి' అని పాడఁబడుచున్నది! (స, రి, గ, మ, ప, ధ, ని.)

(6) నన్నయభట్టారకుని కాలమున సయిత మిది 'రి' వలెనే లిఖింపఁబడుచుండినట్లు నందంపూఁడి శాసనము (అతఁడు లిఖించినదే) తెలుపుచున్నది. దాని మొదటి రేకు 7 వ పంక్తి చివర 'ఋతుకః' అనునది 'రితుకః' అని చెక్కఁబడి యుండుటను బరీక్షించిన నివ్విషయము విశదము గాఁగలదు. మఱియు, పురాతనశాసనములయం దున్న "ప్రిథివీ, క్రిత్వా, న్రిపః" ఇత్యాదులను జూచినచో నక్కాలమున ఋకారోచ్చారణ మెట్లుండెడిదో తెలియ నగును. నన్నయనాఁటికి ఋత్వసంజ్ఞ (ృ) యేర్పడియున్నను, అతని తరువాత నూఱేండ్లకుఁ బుట్టిన కొణిదెనశాసనమున 'వృ' అనునది 'వ్రి' అనియే వ్రాయఁబడినది!

పైని వివరించిన హేతువులనుబట్టి నన్నయకాలమున ఋకారమునకుఁ గల 'లేఖనోచ్చారణసామ్యముచేతనే 'ఋత్విజుండనివిచారించి' అని ఋ రి లకు యతిమైత్రి యొనర్పఁబడియెననియు, కావుననే ప్రాచీనలక్షణగ్రంథములగు కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులయం దీయతి ప్రత్యేకము చెప్పఁబడలేదనియు, కాలక్రమమున 'ఋ' అను గుణితాక్షరమునకు నిక నొకరూపము చేర్పఁబడి ఋకార మేర్పడిన పిమ్మటనే 'ఋకారస్వరూప యతి' 'ఋవళి' ఇత్యాదిలక్షణములు పుట్టెననియు నూహింప నగుచున్నది. మఱియు,

"అఋషికుమారకట్టిన-చీరములు..."
అరణ్య. తృ. 104.

"గారవమున వచ్చి-యాఋషితోడ." ఆది. సప్త. 86.

ఇత్యాదిప్రయోగముల ఋ ర ప్రాసమునకును పై లేఖనసామ్యమే మూలమై యుండును. లేకున్న నేయచ్చునకును లేని ప్రాససౌభాగ్య మొక్క ఋకారమునకే కలుగుటకుఁ దగిన ప్రబలకారణము గానరాదు. పై హేతువులను బట్టి యణాదేశమువలననే యీమైత్రి యేర్పడినట్లు నిశ్చయింపను వలనుపడలేదు.

ఋ, ఌ-ల యతి:——

ఈయతినిగూర్చి లక్షణగ్రంథకర్త లెవ్వరును జెప్పియున్నట్లు గనఁబడదు. ముద్రిత భారతగ్రంథములయందు,

"కృతవీర్యుధన మెల్లఁ-గౢప్తి నేసి." ఆది. సప్త. 182.

అని ఋ ఌ లకు వడిమైత్రి నేయఁబడినట్లు గన్పట్టుచున్నది. రేఫలకారములకు యతిసంఘటనము నొనర్పని నన్నయమహాకవి ఋఌ లకు మాత్ర మొనర్చియుండునా? కావున నీపాఠము విశ్వాస్యము గాదు. శబ్దరత్నాకరకారుని

"కృతవీర్యుధన మెల్ల-గిలుబు నేసి"

అను పాఠమే పరిగ్రాహ్యము. (చూ. శ. ర. గిలుబు శబ్దము.)

ఋత్వసంబంధవళి:—

వట్రువసుడి యాదిగ నే పొల్లయిన నరియే 'ఇ, ఈ, ఋ, ఎ, ఏ' లతో వడిమైత్రి యునర్పవచ్చు నని తరువాతి లాక్షణికుల మతము. ఎట్లన,

"ఋగ్యజుస్సామవినుతుండు-గృష్ణుఁ డనఁగ."
(అనంతామాత్యుఁడు.)

"ఇనతనూభవుండు-వృషదర్వసుతు చేసె."
(అప్పకవి.)

దీనిని పోషించుదానివలెనే నన్నయభారతమున (అరణ్య. తృ. 97),

"ఇందుండు మాపని కృష్ణమృగచర్మ
కృతకుళానసతుా."

అని ఇ,కృలకు యతిమైత్రి యున్నట్లు దోఁపించు ప్రయోగ మొక్కటి అచ్చుప్రతు లన్నిటియందును గానవచ్చుచున్నది. ఋకారసంయోగముగల హాకారేతర హల్లున కిచ్చటను అచ్చుతో నన్నయభట్టు విశ్రమమును గల్పించి యుండలేదు. మఱియు వట్రువసుడి గలిగిన హల్లునకు దేనికిని ఋ, రిల తోనే యాతేఁడు యతిమైత్రిని గావించియుండలేదు. కావున నీయతి నన్నయ కిష్టమైనది గాదనుట స్పష్టము. ప్రాచీనలాక్షణికులు నీయతిని జెప్పలేదు.

పై యుదాహరణము మధ్యాక్కరలోని యొకపాదము. ఈమధ్యాక్కరలకు వచ్చినన్నిపాట్లు మన వాఙ్మయప్రపంచములోని యేపద్యములకును వచ్చియుండలేదు. ఏమన, తక్కిన పద్యములవలె మధ్యాక్కర పద్యము సరళమైన నడక గలది గాదు. మఱియు, నన్నయ గ్రంథమునఁ దక్క నివి తక్కిన ప్రబంధములయం దెచ్చటను లేవు. దానంజేసి భారతగ్రంథలేఖకులు విశేషపరిచితి లేమి దాని గమనము దెలియక, లక్షణము నారయక, తమకు సరిపడినట్లు దోఁచిననడకలను బట్టి కొన్ని పదములను మార్చియుఁ, గొన్నిటిని జేర్చియుఁ, గొన్నిటిని దీసివైచియు నన్నయ భట్టారకుని మధ్యాక్కరల నెల్ల నానావిధములఁ బాడుచేసినారు. ఈహేతువుచేతనే యిప్పటి విమర్శకులు గొందఱు మధ్యాక్కర లక్షణమునకు మాఱుత్రోవను ద్రొక్క నారంభించినారు. వీనిం గూర్చిన విమర్శమును మఱియొకప్పుడు ప్రకటించెదను.

ప్రస్తుతలక్ష్యము గల మధ్యాక్కరము వ్రాఁతప్రతులందు బహువిధ రూపములను దాల్చియున్నది. వానిలో నాంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమున నున్న భిన్నదేశపుఁబ్రతుల పాఠములఁ గొన్నిటిని మాత్రము నేఁటి వర్ణక్రమము ననుసరించి యిచ్చుటఁ జూపుచున్నాను.

i. మొదటిపాదము—

(1) "ఎందుండి వచ్చితిరి ఋషికుమార! యె
న్నండు నిట్టి." సం 844 ఈ వ్రాఁతప్రతి.

(2) "ఎందుండి వచ్చితి ఋషికుమారక!
యెన్నండు నిట్టి." సం 944 రు...

ii. రెండవపాదము—

(1) "సుందరాకారుని మునిపుత్త్రిఁ దొల్లి
చూచియుండఁగ." సం 881 రు...

(2) "సుందరాకారు మునిపుత్త్రి
జూచి యె రుంగ." సం 944 రు...

(౨) "సుందరాకార మునిపుత్త్రుఁ డొల్లి
మూఁచి రోసెఁ బోఁగ." సం 3444 రు...

iii. మూఁడవపాదము—

(1) "ఉందుండు విందుండు మని కృష్ణ మృగచర్మ
కృతకుశాసనము." సం. 4624 ర...

(2) "వింద విందుండు మని కృష్ణమృగచర్మ
కృతకుశాసనము." సం 944 రు...

(3) "విందు విందుండు మని కృష్ణచర్మ
కృతకుశాసనము." సం 881, 3444 రలు...

(4) "వింద విందుండు మని కృష్ణాజినా
కృతకుశాసనము." సం 2726 ర ...

iv. నాలవపాదము లేఖనభేదము లంత ముఖ్యములు గావు.

ఇట్లే నన్నయభారతమునఁ గల మధ్యాక్కరలన్నియు నానావిధలేఖనభేదములతో నిండియుండి లక్షణవిరుద్ధములై వివాదమును గొలుపుచున్నవి. తెలుఁగు భారతమును పలు ప్రతులసాయమున శ్రద్ధవొయిఁ బరిష్కరించి ముద్రింపించినపండితులు సాధ్యమైనంతవఱకు లక్షణానుగుణముగ వానిని సవరించి ప్రకటించినారు. కాని వానిలోఁ గొన్ని మధ్యాక్కరము లింకను లక్షణసమన్వితములై యుండలేదు. ప్రస్తావమున నున్నపద్యము ముద్రితగ్రంథములయం దెట్లున్నదో కనుఁగొనుఁడు:

"ఎందుండి వచ్చితి ఋషికుమార-యేసొన్నఁ డిట్టి
సుందరాకారు మునిపుత్త్రుఁ డొల్లి-మూఁచి రే పెఱుంగ
నిందుండు మని కృష్ణమృగచర్మ-కృతకుశాసనమ్ము
నందుండఁగాఁ బనిచె ఋషి యనుబుద్ధి-నర్తన్వి శ్రీక."
(కవలేపాటి రంగయ్యగారి పూర్వతన ముద్రణము.)

ఈపద్యము నాలుగుపాదములయందును గణములు తప్పినవి. మఱియు నొక వాక్యము నందే కర్తయగు 'ఏన్' అనునది రెండు మాఱులు పడినది. ఈదోషములను దప్పించు పొంటె 'ఆనంద ముద్రణాలయము' వారి మొదటి కూర్పు భారతమును బరిష్కరించిన పండితు లిట్లు ముద్రింపించిరి:

"ఎందుండి వచ్చితి వో ఋషికుమార-యెవ్వఁడు నిట్టి
సుందరాకారు మునిసుతు నేఁ డొల్లి-మూఁచి రెఱుంగ
నింకుండు మావని కృష్ణమృగచర్మ-కృతకుశాసనము
నందుండఁగాఁ బనిచె ఋషి యనుబుద్ధి-నర్తన్వి శ్రీక."

ఇప్పద్యమున గణదోష పునరుక్తి దోషములు దొలఁగినవి. పిమ్మట, కీ. శే. తేవప్పెరుమాళ్లయ్యగారు పరిష్కరించిన 'ఆనంద వారి' భారతము రెండవ కూర్పున (1909) నిట్లు సవరింపఁబడిన దీపద్య పూర్వార్ధము:—

"ఎందుండి వచ్చితి ఋషికుమార యే-వొన్నఁడు నిట్టి
సుందరాకారు మునిసుతు నేఁ డొల్లి-మూఁచి రెఱుంగ."

ఇందు మూలమున లేక మొదటికూర్పునఁ జేర్పఁబడిన 'వచ్చితివో' అనుదానిలోని 'వో' మాత్రము తొలఁగిపోయినది గాని పునరుక్తి మరలఁ బ్రాప్తించినది. మూఁడవ కూర్పున నిది సవరింపఁబడినది. "శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారు" ప్రకటించిన భారతమునఁ బైపునరుక్తి (అస్మదర్థక ప్రథమ) తొలఁగలేదు. శ్రీశారదామకుట ముద్రాలయమువారి (విశాఖపట్టనము) ప్రతి యానందవారి మూఁడవకూర్పు ప్రతి ననుసరించినదై యున్నది.

ప్రస్తావమున నున్న మూఁడవపాదము పైయుదాహృత ప్రతు లన్నిటియందును,

"ఇందుండు మీవని కృష్ణమృగచర్మ-కృతకుశాసనము."

అని ఇ, కృలకు యతిమైత్రి యున్నట్లు దెలుపుచునే యున్నది! ఈయతి నన్నయకవిమతమునకు సరిపడునది గాదని మొదట సూచించియే యుంటిని.

పైని వ్రాయఁబడిన లిఖితముద్రిత పుస్తకములయందుఁ గన్పట్టు నీపద్యములోని పదముల నన్నిటినిబట్టి పర్యాలోచన మొనర్చువారికి నన్నయకవిచంద్రునిపద్య మీ రీతి నుండునని స్ఫురింపకపోదు:—

"ఎందుండి వచ్చితి ఋషికుమారక!-యెన్నండు నిట్టి
కుంభకాకారు మునికుతు జేఁ గొల్లి-మాచి యెఱుంగ
విందు విందుండు మీవని మృగాజినా-వృతకుశాసనకు *
నందుండెఁ గాఁ జనిచె ఋషి యనుబుద్ధి-నత్తన్వి ప్రీతి."

ఇప్పు డీపద్యమునుండి సనాతన కవిసమ్మతము గాని ఇ, కృల యతియుఁ, ఋవరుక్తిదోషాదులును దొలఁగిపోయినవి. అర్థసౌభాగ్యమును, భావసౌందర్యమును గుదురుకొనినవి.

## ౨. వర్గ యతులు

క, చ, ట, త, ప వర్గములలో ననునాసికములు దక్క మిగిలిన యొక్కొకవర్గములోని నాలుగక్షరములును దమలోఁ దాము యతిమైత్రి నొందు నను సామాన్యవిధియే నన్నయ భారతమునఁ బాటింపఁ బడినది. ఉదాహరణము లనావశ్యకములు. దంత్యతాలవ్య చ జ లకును నన్నయ యతి గూర్చినాఁడు.

## 3. సంయుక్తాక్షర యతులు

"యతిస్థానమున రెండు గాని, రెంటికంటె నెక్కుడు గాని హల్లులు గలిసిన సంయుక్తాక్షర ముండినచో నం దేహల్లున కైన వడిమైత్రిఁ గూర్పవచ్చును." ఇది సామాన్య లక్షణము.

ఈసంయుక్తాక్షర యతుల విషయమున నన్నయమహాకవియుఁ దవలంబించిన నియమము లత్యద్భుతములును, అనన్యానుసృతములునై యాతని ప్రజ్ఞావిశేషమును, అసాధారణ కవితాశక్తిని వేనోళ్ల ఘోషించుచున్నవి. అవి యొక్కటొక్కటిగ నిచ్చటఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

### (అ) సంయుక్తరేఫవడి:—

యతిస్థానమున నిల్చిన (ఏకపదస్థము గు) సంయుక్తరేఫమునకు నన్నయ భారతమునం దెచ్చటను విశ్రమము లేదు! అనఁగా, సంయుక్తిఁ జెందిన యుపరిస్థితమగు రకారమునకుఁ గాని,

---

* 'మృగాజినావృత' అనునది కాలక్రమమున కృష్ణాజినావృత, కృష్ణచర్మకృత, కృష్ణమృగచర్మావృత ఇత్యాదిగ మాఱిమాఱి తుదకు "కృష్ణమృగచర్మకృత" అయినది. పురాణపఠనారంభమున మనవారనుదినము పఠించు ప్రార్థనాపద్యములలో నొకటి యగు "ప్రాంశుపయోదనీలతనుభాసితుఁ" అను వ్యాసస్తుతిపద్యములోని యీపదమానము నీలేఖకుఁడో యిచ్చటఁ జేర్చియుండును. తరువాత 'కృ'తో యతి కుదురుటకై 'విందు' 'ఇందు'గా మార్చియుండును. "మృగాజినావృతకుశాసనము" నం దున్నంత యర్థపుష్టి "కృష్ణమృగచర్మకృతకుశాసనము"గ లేదు. లేఖకప్రమాదమున కెట్టియతి కట్టిగతి పట్టినదో కదా!

అర్థస్థితమగు ప్రకారవడికిఁ గాని శబ్దశాసనుఁడు యతిఁ గూర్పలేదు. ఉదా:

"ప్రతిహతిశత్రుని క్రముఁడు-పాండవవంశవివర్ధనుండు సు
వ్రతుఁడు పరీక్షిదాత్మజుఁ డ-వద్యవిదూరుఁ డుదారకీర్తిని
ర్మితవివిధాధ్వరుండు జన-మేజయుఁడక్కఁ జనపాలుఁడు..."
ఆది. ప్ర. 88.

"ద్రోణాచార్యు పిలుంద బొప్పి కృతహ
స్తుల్ బద్ధగోధాంగుళి
త్రాణుల్ మార్గణపూర్ణతూణులు మహో
ధన్వుల్ కుమారుల్ దను
త్రాణోపేతులు రంగమధ్యమున వం
దన్ నిల్చి రుద్యద్ధ్వజా
శ్రీణీరమ్యులు భగ్నశత్రుప్రముఖులై
జ్యేష్ఠానుపూర్వంబుగన్." ఆది. వ. 9.

పై ప్రయోగములయం దితర హల్లులకే కాని రేఫమునకు విశ్రాంతి లేకుండుట తెల్లమగుచున్నది. భట్టారక మహాశయుని భారత భాగమునం దంతటను సంశ్లిష్టరేఫము యతి స్థానమునఁ గలవి 615 ప్రయోగము లున్నవి. వానిలో నొక్కదానికిని రేఫముతో యతిమైత్రి సేయఁబడలేదు. మఱియు,

"ప్రతాపగుణయుతులు సుతుల-ప్రహ్లాదాదుల్."
"స్రోతోమార్గ వినిర్గతో గ్రదహనా-ర్చుల్."
"కర్మములం దుద్యుతులైనవారికి నశ-ర్మప్రాప్తి."

ఇత్యాది ప్రయోగములందు సైతము నన్నయ నాఁటి లక్షణమునుబట్టి* యితరహల్లే కాని యతియందు రేఫము ప్రధానము గాదని యెఱుంగవలయును. ఇంకను,

"ఇంద్రాయుధ మార్త్యతేజ నిష
ధ ప్రభు." అర. ద్వి. 219.

అను నిట్టి రేఫేతరవర్ణ యతియే కాని,

"ధృ ద్రాయిక మూర్తియై వారి హా
రంబగు." విరాట. ప్ర. 1.

అను నిట్టి రేఫయుతి నన్నయగ్రంథమున లేనే లేదు!

☞ రెండుపదములు సమసించి సంయుక్తిఁ జెందినప్పుడు, రెండవపదము రేఫాది యయ్యె నేని యా రేఫమునకు మాత్రమే యతి సాభాగ్యము చేకూర్పఁబడినది.

"వినమ్రరాజన్య కిరీటమణి వి-రాజిత." ఆది. వ. 1.

(౪) సంయుక్తలకారయతి:—

సంయుక్తరేఫ నియమము వంటిదే సంయుక్తలకారమునకును వర్తింపఁజేయఁబడినది.

"పుణ్య శ్లోకు నలుని రోయఁ బను పు
ణ్యచరితు." అర. ద్వి. 154.

సమాసముపట్టునను సంయుక్తరేఫ లక్షణమువంటి లక్షణమే పాటింపఁబడినది:

"ధనుర్లాభము దివ్యబాణరథ
లాభము." సభా. ప్ర. 126.

(౫) కియ్యవడి :—

సంయుక్తాక్షరములలో రేఫేతర వర్ణమునకుఁ జేరిన కియ్యవడికిని నన్నయ వడిమైత్రి యొనర్పలేదు.

"తత్థ్యము సమకూరు భారతిక
థాక్రమం."

---

* నన్నయకు మున్ను పుట్టిన యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందును యతిస్థానమునఁ బ్రాకారవడితో సంయుక్తిఁ జెందిన యక్షరములు మూఁడు గలవు. వానికిని రేఫముతో యతి గూర్పఁబడలేదు!

"నైమిశారణ్య పుణ్యక్షేత్రమున."

ఇత్యాదులఁ బరీక్షింపఁదగును. మఱియు,

"విద్యాశ్రమతత్త్వ వితత్త్వమున
దానగుణాభిరతిన్." ఆది. ప్ర. 6.

అను నిట్టి ప్రయోగమునే కాని,

"విద్యాదయితుం డొనర్చె మహి-
తాత్ముఁడు." విరాట ప్ర. 6.

అను నిట్టి ప్రయోగమును నన్నయ భారతమునఁ జూపఁజాలము.*

ఇతర హల్లులతోఁ జేరినప్పుడే యీకియ్యవడికి వడియోగము లేదు గాని, రేఫముతోఁ జేరినప్పుడు మాత్రము విశ్రాంతి యీయఁబడినది.

"వీర్యమున గలయట్టి సర్పముల
రాజనమేజయు చేయు." ఆది. ప్ర. 127.

"వినయప్పుడు రాజకా
ర్యంబులందు." ,, సప్త. 118.

రెండుశబ్దములు సంధించినప్పు డేర్పడిన సంయుక్తపుఁ గియ్యవడికే వడి గలదు గాని పూర్వాక్షరమునకు లేదు.

"ఋగ్యజుఃపదక్రమంబుల క్రియన్."
ఆది. ద్వి. 192.

"అశ్వమపమమై ద్రోణపర్వ
మువఁరున్ సభలన్." ,, ప్ర. 47.

(జ) క్షకారయతి:—

నన్నయభారతమున క్షకారము యతిస్థానమున నుండెనేని దానియందున్న కకారమునకే (దాని వర్గాక్షరములతో) విశ్రమము గూర్పఁబడినది. ఉదా:

"శా. క్షోణీచక్రభరంబు గ్రక్కదల ది
క్కుల్ మ్రోయఁగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునం
గీర్వాణులున్." ఆది. ద్వి. 12.

క్షకారము యతిస్థానమునఁ గల ప్రయోగములు నన్నయ భారతభాగమున నఱువది యున్నవి. అన్నిట నిట్లే కవర్గముతోనే యతి యనుసంధింపఁబడినది. కాని యొక్కచో మాత్రము,

"క్షమయు తాల్చియుండఁ
జన దెల్ల ప్రొద్దు." అర. ప్ర. 217.

అని షకారమునకుఁ దన్మిత్రమైన చకారముతో యతి యున్నట్లు ముద్రిత గ్రంథములన్నిట నున్నది; తక్కిన యొండు రెండిటికింబోలెఁ బాఠాంతరములైనఁ జూపఁబడలేదు. వ్రాఁతప్రతులఁ బరిశోధింప, సరియగు పాఠము లభించినది. ఆం. సా. ప. కార్యస్థానమున నున్న కడపజిల్లాప్రతి (నెం 2644 రు) లో,

"క్షమయు తాల్చి యుండఁగా దెల్లప్రొద్దు."

అని యున్నది. కావున నన్నయ యిట్లే ప్రయోగించి యుండుననుట స్పష్టము.

(చ) క్షకారాధఃస్థితాక్షరయతి:—

క్షకారముక్రింద వేఱొక హల్లు చేరెనేని యాచేరినహల్లునకే యతి గాని, క్షకారమునకు నన్నయగ్రంథమున యతి లేదు.

* ఈ నియమమునకు విరుద్ధమై యున్న (సభా. ప్ర. 88) "దీపిత...డమో,ధ్యాపుర నాయకుండు జలజాప్తకులైకవిభూషణుండు విద్యా పరమార్థవేది శర-దబ్జ..." అనుపద్యము ప్రక్షిప్తమని యచ్చుప్రతులలో నే యున్నది గావున నిచ్చటఁ జర్చింపఁబడదు.

"లక్ష్మియుతుఁ డుత్తముండు జన
మేజయు." ఆది. ప్ర. 89.

"క్ష్మారాజ్యసుఖములఁ దనిసి
మానుగ గంగా." ,, చ. 181.

"ఇక్ష్వాకు కులోద్భవుండు బల
వంతుఁడు." అర. తృ. 200.

పై లక్షణమునకు భిన్నముగా సభాపర్వ ద్వితీయాశ్వాసము కడపట,

"లక్ష్మిజయాభిరామ! ధర్మ-శీల!"

అని గతానుగతికములగు నచ్చుప్రతు లన్నిట నున్నది. ఇది క్షకారనియమమునకే కాక యీ నియమమునకును భంగముఁ దెచ్చుచున్నది. ఆరణ్యపర్వ ప్రథమాశ్వాసము కడపట నున్న యీపద్యమును నన్నయలక్షణము నెఱుంగని యెవ్వరో పైమార్పుతోఁ దెచ్చి యిచ్చుటఁ బడవైచినారు! సరియగు ప్రయోగ మిది:

"లక్ష్మి జయాభిరామ! ధర్మ-మిత్ర!"
(వా. అర. ప్ర. చివర.)

(ట) జ్ఞకారయతి:—

జ్ఞకారము యతిస్థానమున నిల్చినపుడెల్ల నన్నియభట్టారకుఁడు జకార, తన్మిత్రములకే వడి నిల్పినాఁడు:

"అమ్మనుజేంద్రుఁ డైన నలు
యజ్ఞము ధర్మజా రాదనూయ యఁ
జ్ఞమ్మఁ బ్రయాగఁ జేసిన ప్ర
జాపతి యజ్ఞముఁ బాకపాణియ
జ్ఞమ్మను గృష్ణుయజ్ఞము ని
శాకరుయజ్ఞము నీ మనోజ్ఞ య
జ్ఞమ్మును నొక్క-రూప విల
సన్మహిమం గురువంశవర్ధనా!" ఆది. ద్వి. 222

మఱియు, అప్పకవి "ప్రౌఢకవులు గల్పింతు" రని చెప్పినట్లు కవర్గముతోఁ గాని,

"జ్ఞానులు పద్మగర్భవద-నంబులం."
(పావులూరి మల్లన.)

"జ్ఞేయస్వరూపమై-నెఱసి యుండు."
(నన్నిచోడకవిరాజు.)

ఇత్యాదులయందుంబోలెఁ 'దద్భవవ్యాజ విక్రమము'గా నకారముతోఁ గాని నన్నియ విరతి ఘటింపలేదు.

(డ) ఇతరసంయుక్త యతులు :—

(౧) క్షకార మూర్ధ్వగతము గాని త్రివర్ణ సంయుక్తములకెల్ల మధ్యస్థితహల్లుతోనే యతి:

"శాస్త్రములు తెలం గఱెంగిరి సు-దాత్త..."
ఆది. ప్ర. 10.

"ధృతరాష్ట్రవిధాతృ నియోగమున గా-ండంబడి."
సభా. ద్వి. 154.

ఈవిధియందు చేరఁదగిన,

"శార్ఙ్గవినిర్ముక్తనిశాతసాయకశతా-గ్రచ్ఛిన్నమై."
అర. ప్ర. 185.

అనుదాసలోని 'ఙ'కారమునకు యతియోగము లేమింజేసి కాఁబోలు, గకారమునకే యతి కూర్పఁబడినది.

మఱియు, క్షకార మధఃస్థిత మయ్యెనేని మరల మధ్యాక్షరమునకే యతి:

"కడుఁ బ్రశస్తములు స-త్క్షత్త్రవంశ్యులకు."
ఆది. చ. 58.

(౨) హలంతపదముతో హలాది శబ్దము సమసించినప్పు డేర్పడిన సంయుక్తాక్షర

మున నుత్తరపదాద్యక్షరముతోనే యతి గూర్పఁబడినది:—

"వ్యా, ధ్వజంబున నిలిపి కొలిచి
వాగ్గణపతులకా."  ఆది. ప్ర. 75.

"దివ్యావా, కృతి కతళృంగశైల నివ
సన్మునిసంఘుము."  ,, పం. 108.

ఇక్కడ—'ఉత్, తత్, మత్, అస్మత్, చలత్,......బుక్, దిక్...' ఇత్యాది హలంత శబ్దముల కెల్లఁ బరమైనహల్లునకే విరతి పాటింపఁబడినది. మఱియు, 'అ,న్మానస; అ, న్వనిధి'—ఇత్యాదిసమాసములపట్టునను ద్వితీయ పదాద్యలిపితోడనే యతిమైత్రి సేయఁబడినది.

పై లక్షణమునకు భిన్నముగా నన్నయ భారతమున కెల్ల నొక్క ప్రయోగము మాత్రము,

"స, త్క్రియ పది మేలు తత్క్రియక
లింబున కంటెకా."  ఆది. చ. 92.

అని యచ్చుప్రతులను, నాకు లభించిన వ్రాత ప్రతుల నన్నిటఁ జూపట్టుచున్నది. ఇది యీ లక్షణమునకే కాక యింతకు మున్ను చెప్పఁబడిన త్రివర్ణసంయుక్త యతి లక్షణమునకును, ముందు చెప్పఁబోవు 'అధఃస్థిత కవర్ణ సంయుక్త యతి' లక్షణమునకును విరోధముఁ గల్పించుచున్నది. కాన,

"వ, త్క్రియ పది మేలు దాని కత
కంబున కంటెకా."

అని కవి ప్రయోగించియుండు ననియు, నీ ప్రయోగ మంతప్రౌఢముగ నుండదని నన్నయ మతము నెఱుంగని పూర్వ లేఖకు లెవ్వరో పైరీతిని దిద్దియుందురనియు నాతలంపు. ఈతప్పు పాఠ మప్పకవీయమున 'అభేదవిరతులు' అను లక్షణమున కీయఁబడిన లక్ష్యమునందును గానవచ్చుచున్నది. ఈపాఠ మప్పకవినాఁటికే పుట్టియున్నదో, లేక భారతపాఠమునుబట్టి దాని యందును నెవ్వరైన సవరించినారో తెలియవలసి యున్నది. ఇంకను దాన్ని వ్రాఁత ప్రతులను, దీని వ్రాఁతప్రతులను బరీక్షించినచో సరియగు పాఠము లభియించునేమో యని నా విశ్వాసము. మఱియు,

"క. పితృగణహితార్థముగ స
త్క్రియ వొనరింపంగ బుద్ధిగలదు."
సభా. ప్ర. 95.

అనుదానిలోని యతిని గనుఁడు! పైనియమమునకుఁ గట్టువడియే యున్నది!

ఆరణ్యా. చ. 116 న,

"బృహ, త్తరభుజగశరీర వేష్టితశరీరుఁడై."
(ఆనందభారతము.)

అనునదియు పై నియమమునకు విరుద్ధమై యున్నది. కాని, మరల "బృహత్తర" అను పాఠాంతర మీయఁబడినది.

(3) అనునాసికములు గాక తక్కిన క, చ, ట, ప వర్గములలోని యక్షర మేదియైన వేఱొక యక్షరమునఁ జేరి యధఃస్థితంబై యతి స్థానమున నుండెనేని దానికే విశ్రాంతి గాని యూర్ధ్వస్థితంబునకు లేదు. మఱియు సకార మధఃస్థితంబైనను నిక్కడ యతి గూర్పఁబడినది.

ఉదా:

"ప్రుమత్కారముల మాటలు జగత్ప్రి
కాశితమై." ఆర. ద్వి. 257.

"ఖడ్గము దేఖాదులఁ బట్టి తెచ్చి ఘనుండై
కణ్వాశ్రమ..." ఆది. చ. 190.

"నిష్ఠురతర దీర్ఘ దండమున
డొల్లఁగ వేయుచు." ,, ప్ర. 152.

"స్ఫురణన చేసి సుస్థిరతఁ
బొందు..." ,, ద్వి. 44.

"మత్సరమున పడిఁ ద్రచ్చి త్రచ్చి
జన మతి యున్నన్." ,, ద్వి 18.

ఇత్యాదుల నారయునది. *

(మ) పైని వివరింపఁబడినవి గాక తక్కిన త, థ, న, ణ, మ, వ— ఇత్యాది హల్లులతో సంయుక్తి నొందినప్పుడుమాత్రమే "సంయుక్తాక్షరమున నేహల్లునకైనను వడి గూర్పవచ్చును" అను సామాన్యవిధి పాటింపఁబడినది (నన్నయ గ్రంథమున). ఉదా:

"స్తుతమతి దీర్ఘసత్త్రి మజి
తుం డొనరించె." ఆది. ప్ర. 82.

"స్తుతుల కలి ప్రీత మాన
సుఁడ నైతి." ,, ,, 109.

"వృథచిత్త సాత్త్వవ
స్థితుల చేయ." ,, పం. 230.

"స్థిరబలు మీరు వంచితిరో
చెప్పెర." ఆది. ష. 276.

"ఆత్మ మ్మున రక్షింపు దీని
నావచనమునన్." ,, పం. 100.

"యాత్మ మ్మునఁ జేయఁగా వలయుఁ
దత్పరిరక్షణ." ,, ష. 110.

"కృష్ణద్వైపాయనుఁ డేఁగుదెంచి నుతి
శిష్య బ్రహ్మసంఘంబుతో." ,, ద్వి 227.

"కృష్ణము పెడి శీత మయ్యె ముని
నాథున కుగ్రతపంబు పెంపునన్."
ఆది. సప్త. 118.

"బ్రహ్మనియుక్తుండై సనత్కు
మారుఁడు మహికిన్." ,, తృ. 91.

"బ్రహ్మణ్యుఁడు ప్రాజ్ఞ్యపూజ్యజల
దాసితనర్గుఁడు." ,, ష. 252.

"ఈశ్వరునకు భూషణం బయిన
వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్."
ఆది. ప్ర. 105.

"ఫేమేశ్వరకృతనిత్యప్రసాద
సౌజన్యనిధీ!" ఆశ్వ. ప్ర. 399.

ఇత్యాదుల నారయవలయును. నన్నయ యతు లీరీతిని బరిఢవిల్లుచున్నవి.

(తక్కిన యతులను గూర్చి రాఁబోవు భారతి సంచికయందు గననగును)

---

* పైనియమమునకు విరుద్ధముగా ఆర. ప్ర. 65 పద్యమున "ప్రభా, స్ఫార తేజుం బ్రభుఁ గాంచి పంజయుఁడు పం-జాత..." అని కొన్ని యచ్చు ప్రతులందు గానంబడుచున్నది గాని మఱికొన్నిట "భాస్వత్తేజున్" అని పాఠాంతర మీయఁబడినది.

# తొ ల క రి

పేమ్మరాజు లక్ష్మీపతిగారు

సంధ్య:—

అపరసముద్రవీచికల నస్తమయంబును జెందె రాజు తూ
రుపు తొలిప్రొద్దు చాతికల గ్రొంజిగిసోయఁగ మంటుకొన్న ద
ట్టపు జలదాంతరేఖల బెడంగు మనంబు హరింపఁజొచ్చె, వే
లుపు చెలువంబు భూమి నన లొత్తెడు నిత్తరి గర్షకోత్తమా!
పలుకుం దేనియ తీఁగగా నిగుడ భూపాలధ్వనిన్ మేలుకో!
తెలవారెం గను మార్యపుత్ర! వెస నేతె మ్మింక లెమ్మంచు స
త్కలకంఠంబుల పాడుచుండి రదె యాకర్ణింపు మీ విట్టి మే
ల్కొలుపుం బాటను పాడి చూపిన రసజ్ఞం డేమహాత్ముండొకో!
లలితవినీలమేఘశకలంబులపై మృదులారుణోదయో
జ్జ్వలనవకాంతిశోభలువిభాసిల లేత గులాబిరేకులై
మలయఁగ వాని దేల్చు సుకుమార కుమార సమీరవీచికా
విలసన మందగించె వినువీథుల బూర్వదిశాంచలంబునన్.

గొనబగు డాగురేకు తళుకుల్ చణుకుల్ దొలుకాడ నార వి
చ్చిన తొలిసంజచెల్వ మొక చిత్తరువై, తెరవోలె వ్రేలఁగ
ట్టిన యను వొప్ప; ముందర నటించెడు నచ్చరలేమ సోయగం
బెనయఁగజాలు మందపవనేరితకోమలమేఘమాలికల్.

పూచిన మోదుగుల్ కరగిపోసిన లోహము లంబరస్థలిన్
దాచిన రత్నమాలిక లుదాత్తరసాన్వితచిత్రసత్కళా
రోచులు సాంధ్యరాగములు రోదసి నిండె నపూర్వకౌతుక
శ్రీ చెలువార బ్రాతరుపసీసమయంబున దూర్పుదిక్కునన్.

ఒకయెడ మంకెనల్ మరియు నొక్కెడ లేతగులాబిపూవు లిం
కొకదరి నెర్రకల్వలు మరొక్కదెసన్ కరవీరమంజరుల్
రకరకముల్ ప్రసూననికరంబు లివన్నియు నొక్కమారుగా
వికసన మంది యొప్పె నుడువీథి బ్రభాతపు సందెచాయలన్.

తెరలు తెరల్ పొరల్ పొరలు తీరిచి, పేరిచి, పింజపింజగా
బరచిన సన్న పట్టువలిపంబులువోలిన మేఘమాల లం
బరమున వ్రేల వానిపయి వ్రాలెడు నందపు నందెవన్నియల్
కెరటము లల్లుచున్ తురగలించుచు నున్నవి లే మెరుంగులన్.

కనుచెదరు లక్కరం గంతంత కెగబ్రాకి కరగి తేరినది చెంగావిచాయ
చుట్టుచెంగావిలో సుడితిరుగు నొకకొంత లలితమై మలయు గులాబిరంగు(?)
తళతళ లంతకంతకు మీరి జిగి దేరి నారింజవన్నె గానంగనయ్యె
అది వన్నె మీరుచో తుద కెరుపుడాలు కడానినిగ్గులలో నడంగిపోయె(?)
నీలిమయె నిల్చె వీని యన్నింటివెనుక-నంతకంతకు బదునెక్కునట్టి కత్తి
యంచువోలెను గ్రొం దళుకారుచున్న-వెలుగువెల్లువ నివి యెల్ల మునిగిపోయె.

రంగులలోన రంగు లొకరంగున వేయితెరంగులై దిశా
ప్రాంగణసీమ లేమెరుగుటద్దకముల్ దడియారునట్లుగా
చెంగులు వ్రేల నారవయిచెన్ సరిగంచుల పట్టుపుట్ట మా
"రంగులరాణి" రాణ యొనరన్ కను మెంతటి సిద్ధహస్తయో!

ఆశాతాండవకేళియో, నవయుగ ప్రారంభలీలారసా
వేశక్రీడనమో, జగజ్జనమనోఽభీష్టానమావాప్తియో
యీ శిల్పక్రియ, లీ రసాభినయ, మీ శృంగారవారాశివీ
చీశోభల్ మినుముట్టుచున్నయవి వీక్షింపందగున్ కర్షకా!

శాసనముల్, నిషేధములు, శాస్త్రము లాదిగ కల్గు బంధముల్
గోసి నటించు కృష్ణుదును గోపికలుం బలె రంగు లేకమై
రాసము లాడుచుండిన యరాచక మెంతయు రమ్యమై, మహో
ల్లాసము గూర్చుచున్నది యిలాతలమున్ గయిసేయు కూర్పులన్.

నలుపో మెరుపో పసపో-కలవర్ణము లెల్ల కలియగలిపి చదలపై
జిలికిన నొలికిన నైనను-చెలువమె దళుకొత్తె, రసము చిప్పిల నదిరా!

# కాళిదాసుఁడు

విద్వాన్ గంటి జోగి సోమయాజి గారు,
M. A., L. T.

## ౧

### ఆతనికాలము, చరిత్రము మొదలగునవి

భారతదేశమునం దక్షరాస్యులలోఁ గాళిదాసుని నామధేయమును విననివా రుండరనుట యతిశయోక్తి గాఁజాలదు. ఇంతియ గాక యాయనకీర్తిలత లాసేతుహిమాచలమును వ్యాపించి సంస్కృతభాషాభిజ్ఞులగు పాశ్చాత్యపండితుల మూలఁగొని ఖండాంతరములయందును వ్యాపించి యున్నవి. ఆంగ్లదేశీయులు షేక్స్పియరు మహాకవి తమదేశంబునఁ బుట్టి యమూల్యనాటకరాజముల రచియించెను గదా యని యుప్పొంగునట్లే భారతీయులును గాళిదాసునంతటి ప్రతిభాశాలి మనదేశమునఁ బుట్టియుండెను గదా యని గర్వించుచుందురు. ఈ మహాకవియొక్క జీవితచరిత్రమును, నతఁడు రచియించిన కావ్యములయందలి యపూర్వరామణీయకమును, గవితాశిల్పమును గొన్ని వ్యాసములలోఁ జర్చింపవలయునని యూహించి మొట్టమొదట నాతని జీవితచరిత్రమును గుఱించియు, నాతఁడు రచియించె ననఁబడుచున్న పుస్తకము లెవ్వి యను విషయమును గుఱించియు నీవ్యాసమునందుఁ జర్చించుచున్నాను.

కాళిదాసకృతము లని యనేకగ్రంథముల పేరులు లోకములో వినవచ్చుచున్నవి. కాని యం దేవేవి నామమాత్రములో, గ్రంథరూపముగా లభించువానిలో నేవేవి యాతనిచే వ్రాయఁబడినవో నిర్ణయించుటకు మొదటఁ బ్రయత్నింతును. కాళిదాసుఁడే రచియించెనని యనేకు లొప్పుకొనిన గ్రంథము లేడు గనుపట్టుచున్నవి.

౧. అభిజ్ఞానశాకుంతలము—ఏడంకములు గలిగి శకుంతలాదుష్యంతుల వివాహాదులను వర్ణించు శృంగారరసప్రధానమగు నాటకరాజము.

౨. విక్రమోర్వశీయము—ఊర్వశీపురూరవసుల ప్రేమను వ్యక్తపఱచు శృంగారరసప్రధాన మగు నైదంకముల త్రోటకము.

౩. మాళవికాగ్నిమిత్రము — మాళవికాగ్నిమిత్రులు నాయికానాయకులుగా నున్న యైదంకముల శృంగారరసప్రధానమగు నాటకము.

౪. రఘువంశము—సూర్యవంశజుల చరిత్రమును వర్ణించు పందొమ్మిది సర్గములు గల మహాకావ్యము.

౫. కుమారసంభవము—పార్వతిని శివుఁడు వివాహమాడుటయుఁ, గుమారస్వామి జనించుటయు మొదలగు విషయములను వర్ణించు పదునేడుసర్గముల మహాకావ్యము.

౬. మేఘసందేశము — ప్రవాసమునం దున్న యక్షుఁ డొకఁడు తనప్రియురాలికి నంపు సందేశమును దెల్పు నూటయిరువదినాలుగు శ్లోకముల ఖండకావ్యము.

౭. ఋతుసంహారము—ఋతువులను వర్ణించు నొక కావ్యము.

పయి యేడును గాక వివిధములగు ముప్పదియొక్క కావ్యములు కాళిదాసుఁడు రచియించినట్లు తెలియవచ్చుచున్నది గాని యం దనేకములు నామమాత్రములే యయి యున్నవి. ౧. అంబాస్తవము, ౨. కల్యాణస్తవము, ౩. కాళీస్తోత్రము, ౪. కావ్యనాటకాలంకారము, ౫. గంగాష్టకము, ౬. ఘటకర్పరము, ౭. చండికాదండకస్తోత్రము, ౮. చర్చాస్తవము, ౯. జ్యోతిర్విదాభరణము, ౧౦. దుర్ఘటకావ్యము, ౧౧. నలోదయము, ౧౨. నవరత్నమాల, ౧౩. పుష్పబాణవిలాసము, ౧౪. మకరందస్తవము, ౧౫. మంగళాష్టకము, ౧౬. మహాపద్యషట్కము, ౧౭. రత్నకోశము, ౧౮. రాక్షసకావ్యము, ౧౯. లక్ష్మీస్తవము, ౨౦. లఘుస్తవము, ౨౧. విద్వద్వినోదకావ్యము, ౨౨. బృందావనకావ్యము, ౨౩. వైద్యమనోరమ, ౨౪. శుద్ధిచంద్రిక, ౨౫. శృంగారతిలకము, ౨౬. శృంగారరసాష్టకము, ౨౭. శృంగారసారకావ్యము, ౨౮. శ్యామలాదండకము, ౨౯. శ్రుతబోధ, ౩౦. సప్తశ్లోకీరామాయణము, ౩౧. సేతుబంధము.

ఇన్ని గ్రంథములను వ్రాసినవాఁ డొక్క కాళిదాసుఁడా లేక యనేకు లుండిరా యని కొందఱు సంశయించుచున్నారు. ఈప్రశ్నకు సరియయిన సమాధానము నిచ్చుటకుఁ దగు నాధారము లేమియును లేవు. కాళిదాస శబ్దమునకుఁ గాళికాదేవి సేవకుఁ డనునర్థ మగుటచేత నానామధేయమును ధరించినవార లనేకు లుండియుండ వచ్చును. ఇంతియ గాక, కాళిదాసుఁ డను పేరు పెట్టుకొనినయెడలఁ దమకావ్యములకుఁ బ్రసిద్ధి రాఁగలదని యూహించి తరువాతికవులలో నెవ్వరయిన నాపేరిఁ బెట్టుకొనినవా రుండినను నుండవచ్చును. మొత్తము మీఁదఁ గాళిదాసుఁ డను పేరు గల కవు లనేకు లుండినట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అందు 'కాశీ'గారు తమ మేఘసందేశోపోద్ఘాతమునందు రాజశేఖరకృతమగు నీక్రింది శ్లోకము నుదాహరించి, యాతఁడు ముగ్గురు కాళిదాసులైన నుండిన ట్లెఱిఁగి యుండవలయునని యూహించియున్నారు:

"ఏకోఽపి జీయతే హంత కాళిదాసో న కేనచిత్,
శృంగారే లలితోద్గారే కాళిదాసత్రయీ కిము."

అనేకులు 'కాళిదాసుఁడు' అను పేరు ధరించినవా రుండిరో లేదో మనకు నిశ్చయముగాఁ దెలియదు గాని 'రాక్షస కావ్యము'వంటి పుస్తకమును, 'రఘువంశము'వంటి గ్రంథమును వ్రాసిన పురుషుఁ డొక్కఁడే యగునా యని యెవ్వరైనను సందేహించుట కవకాశము లేకపోలేదు. మొత్తము మీఁదఁ గాళిదాసనామధేయులగు కవు లనేకు లుండిరను నూహ యుక్తియుక్తమని తోఁచుచున్నది.

తుద నుదాహరించిన ౩౧ గ్రంథములమాట యటుండఁగా, మొదటి (పేర్కొనిన) యేడు గ్రంథములును నొక్కనిచేతనే రచియింపఁబడెనని యెల్లరును నొప్పుకొనుచున్నారు. అందును మాళవికాగ్నిమిత్రమును గుఱించియు, ఋతుసంహారమును గుఱించియుఁ గొందఱు భిన్నాభిప్రాయమును వెలిఁబుచ్చిరి గాని, యా రెండును గాళిదాసుఁడు తన రచనాసామర్థ్యము బాల్యదశలో నున్నప్పుడు వ్రాసియుండవచ్చునని యితరులు సమర్థించిరి. ఈవిషయమును గుఱించియు ప్రత్యేకముగా నాయా కావ్యములనుగుఱించి వ్రాయువ్యాసములలో విపులముగా వ్రాయఁబడును.

ఇఁకఁ గాళిదాసుఁ డేకాలమువాఁడు? అతని చరిత్ర మేమి? యను ప్రశ్నములకు సమాధానము లీయవలయును. సంస్కృతకావ్యముల యొక్కయుఁ దత్కర్తల యొక్కయుఁ గాలములనిర్ణయించుటకు మన కాధారములు తక్కువ గావున వారినిగుఱించి యితరు లేమైనఁ దమగ్రంథములలో వ్రాసిరా యని పరీక్షించుటవలనను, నాయాగ్రంథములలో నితరులనుగుఱించి యేమైన వ్రాయఁబడెనదా యని పరికించుటచేతను గవులకాలముల నూహింపవలయును. సంస్కృతకవుల కాలనిర్ణయమున కిదియే సాధారణమగు పద్ధతి యనునప్పుడు ప్రాచీనుఁడగు కాళిదాసుని కాలనిర్ణయమునందును నిదియే మార్గ మని వేఱుగ వచియించు నావశ్యకము లేదు. కాళిదాసు తా నీకాలమువాఁడనని గాని, యీరాజు పోషణములో నుంటినని గాని నిశ్చయముగా నెచ్చటను జెప్పియుండక పోవుటచేఁ మన మక్కడక్కడ లభించు నాధారములను బట్టి యూహింపవలసినదిగా నున్నది.

కాళిదాసుఁడు మాళ్వారాజ్యములో నెక్కడనో యొక్కచోటఁ బుట్టియుండవచ్చునని కొందఱును, మాళ్వ యందలి యుజ్జయినీపట్టణమునందే పుట్టియుండనోపునని మఱికొందఱును నూహించుచున్నారు. ఈ యూహల కాధారములు రెండు కన్పట్టుచున్నవి. అందొకటి మేఘసందేశమునం దాతఁ డొనరించిన యుజ్జయినీపురవర్ణనము. రామగిర్యాశ్రమమునుండి బయలుదేఱి యుత్తరాభిముఖుఁడై యలకాపట్టణమునకుఁ బోవుచుండు మేఘునకు మార్గమున నుజ్జయినీప్రసక్తి లేకపోయినను నాపట్టణమును జూడక తీర దను వాక్యములతో కవి యం దాతనిఁ బ్రవేశపెట్టుట కవి కానగరమునందుఁగల యభిమానమును సూచించుచున్న దనియును, నానగరమే యాతని వాసస్థానము కానోపుననియుఁ గొందఱియూహ. మేఘునిఁ గవి యుజ్జయినీనగరము ప్రక్కకుఁ గొనిపోఁ దలఁచినప్పు డిట్లు చెప్పుచున్నాఁడు:

"వక్రః పంథా యదపి భవతః ప్రస్థిత స్యోత్తరాశాం,
సౌధోత్సంగప్రణయవిముఖో మా స్మ భూ రుజ్జయిన్యాః."

# ఆకస్మిక ఛాయా చిత్రములు

## (SNAP SHOTS)

మొదటి మూడు చిత్రములు శ్రీయుత కే. రంగస్వామయ్యంగారు తీసినవి.



౧. మాలకట్టి

అటుతరువాత నాపురశోభను మూఁడు పదిశ్లోకములలో వర్ణించి యున్నాఁడు. ఇంతకు ముందే యక్షునిచే "మిత్రమా! నీవు పోవుమార్గమునందు ప్రతిపర్వతము నందును నీకు లభింపఁగల మయూరకృతస్వాగతాదులచే నాలస్యమగును గావున నెట్లో త్వరితముగాఁ బోవుటకుఁ బ్రయత్నింపవలయును సుమా" అని (శ్లో. ౨౩: కథమపి భవాన్ గంతు మాశు వ్యవస్యేత్) మేఘునిచేఁ జెప్పించిన కాళిదాసుఁడే యిప్పు డిట్లు చెప్పించుటయును, "శేషైః పుణ్యైర్ హృతమివ దివః కాంతిమత్ఖండమేకమ్" అనియుజ్జయినిని వర్ణించుటచేతను పయిసంభావన యుక్తమేమో యనియును దోఁచుచున్నది. ఇంతియ గాక కవికి మాల్వాదేశమునందున్న చిన్నచిన్న నదులు, ఏర్లు, గడ్డలు సయితము చక్కఁగా తెలిసియున్నవని మనము గ్రంథములోని వర్ణనముఁబట్టి కనుఁగొనవచ్చును. ఇదియును బయియూహకుపబలకముగానే యున్నది.

ఇంతియ గాక కాళిదాసుఁ డుజ్జయినీనగరమున కధినాథుఁడగు విక్రమార్కుని యాస్థానమునఁ గవిగా నుండి యాతని పోషణము నందుచుండెనని జనశ్రుతి గోచర మగుచున్నది. ఈవాడుక ననుసరించి యీ క్రింది శ్లోకము నొప్పుచున్నది:

"ధన్వంతరిక్షపణకామరసింహశంకు
వేతాళభట్టఘటకర్పరకాళిదాసాః,
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

ఈశ్లోకమునుబట్టి కాళిదాసుఁ డొకప్పుడు విక్రమార్కుని యాస్థానమునందుఁ గవిగా నుండి, బాణుఁడు శ్రీహర్షుని యాస్థానమునందు గౌరవమును బొందినట్లే, గౌరవము నందుచుండెనేమో యనియే చెప్పనగును గాని, యిందలి కవులందఱును నొక్కకాలమువారు గాక పోవుటచే నంతకంటె నధికము నిర్ణయింపఁ జాలము. ఈశ్లోకమునుగుఱించి కీత్‌దొరగారు తమ సంస్కృత సారస్వత చరిత్రమునం దిట్లు చెప్పుచున్నారు:

"Of these Dhanvantari, as the author of a medical glossary, is older than Amarasimha, who also used Kalidasa; the fourth and fifth are mere names; Varahamihira definitely lived in the sixth century, and the dates of Kshapanaka as a lexicographer and of Vararuchi are unknown".

భిన్నకాలికులగు కవులను గుఱించి కథలను గల్పించి వానికిఁ బ్రచారముఁ గల్పించుట యాంధ్రసారస్వతము నందును బహుళముగా నున్నదని నన్నయతిక్కనాదుల జీవితచరిత్రములనుబట్టి మనకుఁ దెలిసిన విషయమేకదా! శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందలి యష్టదిగ్గజముల పేళ్లనుదెల్పుటయందును భిన్నకాలికులగు కవులను జేర్చి చెప్పియుండిన విషయము సువిదితమే.

కాళిదాసుఁ డుత్తమకులసంజాతుఁ డయ్యును గొన్ని కారణములచే నీచకులజులచేఁ బెంపఁబడినవాఁడయి, కాళికాదేవికి భక్తురాలగు నొక రాజకుమారిక యామెను శిక్షింప నెంచిన యామెగురువుచేఁ బెండ్లి చేయింపఁబడెనని యును, దరువాత నామెవలనఁ గాళికామహామంత్రంబు నెఱింగి యాదేవిప్రసాదంబున సర్వశాస్త్రపరిపూర్ణుం డయ్యెననియును లోకమునం దొకగాథ వినవచ్చుచున్నది. కవిప్రవరులని పేరొందిన రామరాజభూషణుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరన మొదలగువారిని గుఱించియు నిట్టి కల్పితకథలు వాడుకయందున్నట్లు మన మందఱ మెఱిఁగియున్న విషయమేగదా? కాఁబట్టి పైగాథ విశ్వసనీయము గాదని చెప్పుటయం దేమియు సంశయము నుండదు. కాళిదాసుని గ్రంథములనుబట్టియే మన మాతని జీవితమును సంబంధించిన విషయములను దెలిసికొనుటకుఁ బ్రయత్నింపవలయును.

మేఘసందేశమునందలి వర్ణనలనుబట్టి యాతఁడు మాల్వాదేశమునందలి యుజ్జయినీపురమునందు నివసించి యుండెనని యూహించుటకు బలమయిన యవకాశములు గలుగుచున్నవని పైని నిర్ణయించి యున్నాము. ఈతఁడు విక్రమార్కుని యాస్థానమునందుఁ గవిగా నుండి పోషణమునందుచుండెనని లోకమునం దొకకథ బహుళముగా వ్యాపించి యున్నదనియును, దానిని బూర్వులనేకులు గ్రహియించి యంగీకరించిరనియును గూడ ముందే తెలిసియున్నాము. అట్లుజ్జయినియం దుండిన విక్రమా

ర్కునికడ నీతఁడు పోషణము నందుచుండెనని మన మును నంగీకరించుచోఁ గలుగుననుపపత్తి యేమియును గనుపట్టదు. అయినను విక్రమార్కుని పోషణము నందు చుండిన యీ మహాకవి యొక్క గ్రంథములైన నాతనికిఁ గృతియిచ్చి యాతనిని బ్రశంసించి యుండలే దేలయని ప్రశ్నింపవచ్చును. ఆంధ్రకావ్యములయం దిట్టి 'కృతి యిచ్చుటలు' విశేషముగాఁ గన్పించుచున్నవి గాని సంస్కృతమం దంత లేవని చెప్పవచ్చును. అందును బ్రపంచోపకారార్థమై గ్రంథములను వ్రాసి తమ నామముల నయిన నా పుస్తకములయందుఁ జెప్పుట కిచ్చగింపని ప్రాచీన సంస్కృతకవులకాలములో నిట్టి యలవా టుండ లేదేమో యని తోఁచుచున్నది. విక్రమార్కునికిఁ గృతియీయక పోయినను గవి యక్కడక్కడఁ దన గ్రంథములయందు విక్రమపదమును దెచ్చిపెట్టినట్లు గన్పట్టుచుండుటచే బయియూహ బలపడుచున్నదని తెలుపనగును. ఊర్వశీ పురూరవసుల ప్రేమమునుగుఱించి వ్రాయఁబడిన త్రోటకమును వ్రాసి కవి విక్రమోర్వశీయమని పేరుపెట్టుట యీసందర్భమున నుదాహరింపఁ దగినది. ఇంతియగాక యా గ్రంథముననే పురూరవసునిచే రక్షింపఁ బడిన యూర్వశినిగుఱించి చెప్పునప్పుడు, 'దిష్ట్యా మహేంద్రోపకారపర్యాప్తేన విక్రమమహిమ్నా వర్ధతే భవాన్' అని చిత్రరథునిచేఁ జెప్పించియున్నాఁడు. పైసందర్భమునఁ గూడ విక్రమశబ్దమును దనయేలిక నుద్దేశించి చెప్పందలఁచి కథాసందర్భమున కనుకూల మగునట్లు శ్లేషించెననియును దోఁచుచున్నది. తిరిగి మఱియొకచోట నట్లే 'అనుత్సేకః ఖలు విక్రమాలంకారః' యని కవి చెప్పించి యున్నాఁడు. “శుశుభే విక్రమోదగ్రం వ్రీడయావనతం శిరః” అనునదియును బయివానినే పోలియున్నది. పయియుదాహరణములనుబట్టి చూచుటవలనఁ గాళిదాసుఁడు విక్రమార్కుని యాస్థానమునం దుండెనను నూహ బలపడుచున్నది.

కాళిదాసుఁడు బ్రాహ్మణుఁడని చెప్పుటలో నే నించుకంతయును సందేహింపను. ఈతఁడు రచియించిన గ్రంథములందలి సందర్భము లన్నియును బయియంశమును చెప్పకయే చెప్పుచున్నవి. ఈతనికిఁగల సంస్కృతభాషా ప్రావీణ్యమును, కణ్వమునిసాధుని యాశ్రమమునందలి యార్ష సంప్రదాయములను వర్ణించుటయును, శకుంత పుట్టినింటినుండి భర్తృగృహమున కేఁగునపుడు కణ్వుఁడు చేయు 'వైతానాస్త్వాం వహ్నయఃపావయంతు' అను నాశీర్వచనమును, విక్రమోర్వశీయమునందు పురూరవసుని కుమారుఁడగు నాయువుండిన మున్యాశ్రమాచార వర్ణనమును, రఘువంశప్రథమసర్గమునందలి యాశ్రమవర్ణనమును, కుమారసంభవమందలి పార్వతీతపోవర్ణనమును, గాళిదాసుఁడు ద్విజుండనియును, వైదికమార్గపరిచితుఁడనియుఁ దప్పక నిర్ణయించుచున్నవి. కాళిదాసుని గ్రంథములయందు వేదగతములయిన యభిప్రాయములును, నలంకారములును, సంప్రదాయములు ననేకములు గ్రహింపఁబడినట్లు మనకుస్థూలదృష్టిని దెలియుచున్నది గాని యవి యెక్కడెక్కడ నున్నవో, యెన్ని యున్నవో మున్ముం దాతని కళాకౌశలమును నిరూపించునపుడు పరీక్షింపనగును.

కాళిదాసుఁడు ఛాందసుఁడగు బ్రాహ్మణుఁడు మాత్రమే గాక లౌకికజ్ఞానయుక్తుఁడును, రాజగృహములయందును, రాజుల దైనికచర్యలయందును జరుగుసంగతుల నన్నిటిని జక్కఁగా నెఱిఁగినవాఁడనియును జెప్పనగును. విక్రమోర్వశీయము, అభిజ్ఞానశాకుంతలము ననురూపకములయందు విదూషకుని చర్యలను వర్ణించుసందర్భమునను, విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రములందు రాజభార్యల చరిత్రములను నిరూపించుటలోను, దుష్యంతుని గుఱించి 'స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః' ఇత్యాది శ్లోకమును, 'షష్ఠాంశవృత్తేరపిధర్మః ఏషః' అని పలికించుటచేతను, సంతానవిహీనుఁ డగు పౌరునిధనమును గుఱించిన నిర్ణయమును దుష్యంతునిచేఁ జెప్పించునవసరమునను, గాళిదాసునికిఁ గల రాజకార్యపరిచితి, లోకజ్ఞత, రసజ్ఞత మొదలగునవి యన్నియును దెలియుచున్నవి. కథయందుఁ జెప్పఁబడినట్లు కాళికా ప్రసాదముచే సంపాదించెనో, లేక గురుకులవాసాయాసముచేఁ గఱచెనో గాని, మొత్తముమీఁద కాళిదాసుఁ డనేక కళాపరిపూర్ణుఁడని మాత్రము నిశ్చయింపక తప్పదు. రెండవమార్గముచేతనే యీజ్ఞానమునంతటిఁగూడ నార్జించె ననుట యుక్తికిఁగూడ సరిపోవుచున్నది.

లోకములో నీతఁడు లౌకికశృంగారరసప్రధానుఁడయి విటుఁడుగా నుండి వేశ్యాలోలుఁడయి తుదకుఁ దన ప్రాణమునుగూడఁ బణ్యాంగనాకుండమున వ్రేల్చెనని యును జెప్పంబడు కథనుగుఱించిన సత్యాసత్యతలను బరీక్షింపవలసినది. పై వాదమును బలపఱచు వారు కాళిదాసుని కావ్యములయందు శృంగారరస బహుళత యుండుటను దమ యభిప్రాయముల కుపబలకముగాఁ జెప్పుదురు గాని యది విశ్వాసపాత్రము గాదు. విభావాదులచేఁ బరిపుష్టమయి యాస్వాదన యోగ్యమగు నుత్తమకావ్యశృంగార మేడ, తుచ్ఛమయి నింద్యమయిన వేశ్యాసంగ మెక్కడ? అశ్వమేధమునకును బ్రహ్మహత్యకు నెంతయంతరమున్నదో పయిరెంటికిని నంతటియంతర మున్నదని చెప్పవచ్చును. శృంగారరస ప్రధానములగు కావ్యములను వ్రాసిన శ్రీనాథాదులవఱకును లౌకికాధమ శృంగారమున కాలవాలములు కాలేదా యని యెవ్వరైనను శంకింపవచ్చును. కాని శ్రీనాథాదులు కొన్ని కొన్ని స్థలములందు వర్ణించిన యసభ్యపుశృంగారమునకును, గాళిదాసుని యుత్తమశృంగారమునకును నేమైన నీవిషయమున సామ్య మున్నదా? ఇంతకును 'అనిర్వర్ణనీయం పరకళత్రమ్' అను వాక్యమును దుష్యంతునిచేఁ జెప్పించిన కవి యోగ్యమయిన మనస్సు గలవాఁడనియే చెప్పుటకు సాహసింపఁగలముగాని తదన్యముగాదు. నిశ్చయమయిన యుదాహరణము లేవయిన లభియించునంతకును గాళిదాసుని నైతికప్రవర్తనమునకు లోక మారోపించు నింద నొప్పుకొనఁ జాలము. మనమాయన వ్రాసినకావ్యములయందు లభియించిన యాధారములంబట్టి యాతఁడుత్తమస్వభావముగల రసజ్ఞుఁడును, లౌకిక వైదికజ్ఞాన సంపన్నుఁడును ననియే దృఢముగాఁ జెప్పవచ్చును. ఇంతియ గాక మేఘసందేశమునందలి యనేకస్థలముల వర్ణనమునుబట్టియు, రఘువంశమునందలి యిందుమతీ స్వయంవరాగతరాజలోకమును వర్ణించుటనుబట్టియును గాళిదాసుఁడు హిందూదేశమునందలి యనేకభాగములందుఁ జరియించెననియుఁ గొంద ఱూహించుచున్నారు.

కాళిదాసకృత గ్రంథములయందలి నాందీశ్లోకములు మొదలగువానియందుఁ జేయఁబడినయిష్టదేవతానమస్కృతులను బరిశీలించిన యెడల నాతఁడు శైవుఁడనియే తేలుచున్నది.

అభిజ్ఞానశాకుంతల నాందీశ్లోకము:—

"యాసృష్టి స్స్రష్టు రాద్యా వహతి విధిహుతం
        యా హవి ర్యాచహోత్రీ,
యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా
        యా స్థితా వ్యాప్య విశ్వం,
యా మాహు స్సర్వభూత ప్రకృతిరితియయా
        ప్రాణినః ప్రాణవంతః,
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభి రవతు వ
        స్తాభి రష్టాభి రీశః."

విక్రమోర్వశీయములోని నాందీశ్లోకము:—

"వేదాన్తేషు య మాహు రేకపురుషం
        వ్యాప్యస్థితం రోదసీ,
యస్మి న్నీశ్వర ఇత్యనన్యవిషయ
        శ్శబ్దో యథార్థాక్షరః;
అంతర్యశ్చ ముముక్షుభి ర్నియమిత
        ప్రాణాది భిర్మృగ్యతే,
స స్థాణుః స్థిరభక్తియోగ సులభో
        ని శ్శ్రేయసా యాస్తు వః."

మాళవికాగ్నిమిత్రమునందలిస్తుతి:—

"ఏకైశ్వర్యే స్థితోఽపి ప్రణతబహుఫలే
        య స్స్వయం కృత్తివాసాః,
కాంతాసమ్మిశ్రదేహోఽప్యవిషయ మనసాం
        యః పరస్తా ద్యతీనామ్;
అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి
        ర్బిభ్రతో నాభిమానః,
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వ
        స్తామసీం వృత్తి మీశః."

రఘువంశమునందలి యాదిమశ్లోకము:—

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ."

కుమారసంభవమునందు శైవకథను వ్రాయుటచేతను మేఘసందేశమునందు మహాకాళనాథుని దేవాలయమును

గైలాసమునందలి శివునిఁ బార్వతిని వర్ణించుటచేతను బయి యూహ నిశ్చయమని చెప్పవచ్చును.

కాళిదాసుని కాలమును విమర్శించిన పండితులు వేఱువేఱు కాలములను సూచించియున్నారుగాని యేకాభిప్రాయులుగా నుండలేదు. వా రొనరించిన నిర్ణయము లన్నియును మూఁడు విధములుగా నున్నవి. క్రీస్తువెనుక నాఱవశతాబ్దమందు కాళిదాసుఁడుండియుండవచ్చునని కొందఱును, నాల్గవ శతాబ్దమునం దుండియుండవచ్చునని మఱికొందఱును, క్రీస్తు పూర్వము మొదటిశతాబ్దమునం దుండియుండవచ్చు నని కొందఱును నూహించిరి గావున వారి యూహలన్నిటిని వీలగువంతవఱకు క్రింద విమర్శింతుము.

కాళిదాసుని స్పష్టముగా సూచించునవి మూఁడాధారములు కన్పట్టుచున్నవి: 1. తంత్రవార్తికము, 2. బాణకృతహర్ష చరిత్రము, 3. రెండవపులికేశియొక్క ఐహోలు శాసనము. తంత్రవార్తిక మనునది మీమాంసా శాస్త్రమునకు సంబంధించిన గ్రంథము. కుమారిలభట్టుచే వ్రాయఁబడినది. ఈతఁడు ౭౦౧-౭౫౦ సం. (క్రీ. శ.) లో జీవించియుండిన ట్లూహింపఁబడినది. కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమునందలి యొక శ్లోకభాగము తంత్రవార్తికములో నుదాహరింపఁబడినది.

"ఏవంచ విద్వద్వచనా ద్వినిర్గతం
ప్రసిద్ధరూపం కవిభి ర్నిరూపితం,
సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః."

బాణకృతహర్ష చరితమునందు

"నిర్గతాసు న వాకస్య కాళిదాసస్య సూక్తిషు,
ప్రీతి ర్మధురసార్ద్రాసు మంజరీ ష్వివ జాయతే."

అను శ్లోకములోఁ గాళిదాసస్తుతి వర్ణింపఁబడినది. ఈ బాణుఁడు శ్రీహర్షుని యాస్థానకవియై యుండినట్లును, శ్రీహర్షుఁడు కనూజ, స్థానేశ్వరములను (౬౦౬-౬౪౭ క్రీ. శ.) బరిపాలించుచుండినట్లును దెలియవచ్చుచున్నది. క్రీ.శ. ౬౩౪ వ సం. కు సంబంధించిన ఐహోల్ శాసనమునం దీక్రింది శ్లోకములో కాళిదాసుఁడును, భవభూతియును సుప్రసిద్ధ కీర్తిమంతులనియును తెలుపఁబడినది.

"యేనాయోజి న వేశ్మ స్థిర మర్థవిధౌ వివేకినా జినవేశ్మ
స విజయతాం రవికీర్తిః కాళిదాసభారవికీర్తిః."

పై నుదాహరింపఁబడిన యీ మూఁడాధారములఁ బట్టి యేడవశతాబ్దారంభముననే కాళిదాసునికీర్తి లతలాసేతు హిమాచలమును బ్రాఁకి సుస్థిరమూలములయి విలసిల్లుచుండినట్లు తెలియవచ్చుచున్నది.

కాళిదాసుఁ డాఱవ శతాబ్దమునం దుండి యుండవచ్చు నను వారివాదమునకు మూఁడు ముఖ్యములయిన యాధారములు కలవు. (౧) కాళిదాసుఁ డుజ్జయినిలో విక్రమార్కుని యాస్థానమునం దుండినట్లు నానుడి వినవచ్చుచున్నదనియును దానికి నుపబలకముగా నొకశ్లోకమును ముందే యుదాహరించియున్నాము. ఈవిక్రమార్కునికాలమును నిర్ణయించుచు నీతఁడు ౫౪౪ (సం. క్రీ. శ.)లో నుజ్జయినికి రాజుగా నుండి సిథియనులను యుద్ధములో నోడించి పాఁడోలి యాయుద్ధస్మృతికిఁగా విక్రమార్కశకమును స్థాపించెననియును, నట్లు స్థాపించుటలో నాశకమునకుఁ బ్రారంభ సంవత్సరము నాఱువందల సంవత్సరములు వెనుకకుంజరపి నిర్ణయించెననియును, నట్టిశకము ౫౭ (క్రీ.పూ.)సం.నుండి ప్రారంభ మైనదనియును తెలుపుచున్నారు. ఈయూహ ముఖ్యముగా ఫెర్గుసనుదొరగారి సిద్ధాంతముపై నాధారపడియున్నది. (౨) పైసిద్ధాంతమున కుపబలకముగా పైవారు మేఘసందేశమునందలి ప్రథమాశ్వాసములోని ౧౪వ శ్లోకమునకు మల్లినాథునివ్యాఖ్యానమునుగూడ వేఱొక యాధారముగాఁ జెప్పుచున్నారు.

"స్థానా దస్మాత్సరసనిచులా దుత్పతో దఙ్ముఖః ఖం,
దిఙ్నాగానాం పథిపరిహరన్ స్థూలహస్తావలేపాన్."

పైశ్లోకార్థమునకు మల్లినాథుఁడు (౧౪వ శతాబ్దము) "రసికో నిచులో నామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయః పరాపాదితానాం కాళిదాస ప్రబంధ దూషణానాం పరిహర్తా......" అనియును, దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య" అనియు వ్యాఖ్యానము

చేసెను. ఈవ్యాఖ్యానమునందలి దిఙ్నాగాచార్యులు వసుబంధుని శిష్యుండనియు, నాతఁడు ౬వ శతాబ్దమునం దుండెననియును బయివాదము చేయువారి యూహ గావున నియ్యదియును మొదటిదానికి సరిపోయినది. (3) కాళిదాసుని గ్రంథములఁబట్టి యాతనికి జ్యోతిశ్శాస్త్రమునందు మంచిజ్ఞానము గలదనియు, నీజ్ఞానమును హైందవులు గ్రీకులనుండి గ్రహియించిరి గావునను నార్యభట్టే (౪౯౯ క్రీ. వె.) యిట్టి గ్రంథమును మొదట రచియించెను గావునను గాళిదాసుఁ డార్యభట్టుని యనంతరమే జీవించి యుండవలయుననియు నింకొక హేతువుగాఁ జెప్పుటచేఁ బయికాలము సమర్థింపఁబడుచున్నది.

పయి మూఁడు యుక్తులును నెంతమట్టుకు యుక్తమయినవో మన మిఁకఁ బరీక్షింతము. విక్రమార్కశకము ౫౪౪-వ సం. న (క్రీ.వె.) స్థాపింపఁబడిన దను వాదము సంబద్ధమనుటకు నంతకు ముందే యీ విక్రమార్కశకమునది మాలవశక మను పేరఁ బరఁగుచుండెనని తెలుపుచు లభియించిన శాసననిదర్శనములు ప్రబలములయిన యాధారములుగాఁ గనుపట్టుచున్నవి. శకము నారంభించుటకు నాఱువందల సంవత్సరములు వెనుకకు లెక్కించి ప్రారంభించి రనుటయును నిరాధారముగా నున్నది. డాక్టరు ఫ్లీటుదొరగారు చేసిన పరిశోధనలనుబట్టి పైసిద్ధాంతము చేయఁబడినది. ఇంకొక విశేష మేమనఁగా, గుప్తవంశపు రాజులచే నింతకుమున్నే యనఁగా నూఱుసంవత్సరములకు ముందే, పశ్చిమ హిందూస్థానము జయింపఁబడియుండుటచే నాఱవశతాబ్దమునందు శకవంశస్థు లచ్చటినుండి తఱుమఁబడుట యసంభవమని మేక్డొనలు దొరగారు చెప్పుచున్నారు. ఒకవేళ నీవిక్రమార్కుఁ డన్యదేశస్థులను నింకెవ్వరినైన నప్పుడు దఱిమియుండవచ్చునేమో యని సంశయింపవచ్చునుగాని పశ్చిమ హిందూస్థానమునుండి యాఱవశతాబ్దమునఁ దఱుమఁబడిన హూణులు సైతము 'యశోధర్మన్ విష్ణువర్ధనుఁడు' అను నాతనిచేఁ దఱుమఁబడినట్లు తెలియుచున్నదిగాని విక్రమార్కుని నామధేయమే సందర్భమునను జెప్పుట కవకాశము లేదు.

ఇఁకఁ గాళిదాసుఁడు [illegible]గాచార్యునితో సమకాలికుఁ డని చెప్పు మల్లినాథుని [illegible]ను మనము దృఢముగా విశ్వసింప వలను గాదు. [illegible] తన ప్రతిపక్షుఁడగు దిఙ్నాగుని గుఱించి కావ్యమునందు సూచింపఁడనియును, ప్రాచీనవ్యాఖ్యాతలచేతఁ జెప్పఁబడని యీవిషయమునందు పదునాల్గవ శతాబ్దమునం దుండిన మల్లినాథుని వాక్యములయందు విశేషము ప్రామాణ్యము నుంచ నవసరమే లేదనియును బండితు లభిప్రాయపడుచున్నారు. ఇంతియ గాక పయివాదమునందు దిఙ్నాగాచార్యునికాలమునునిర్ణయించుటలో వసుబంధుని కాలము నాఱవశతాబ్దమనియూహించి దానినాధారముగా గ్రహించియున్నారు. వసుబంధుని గ్రంథములు ౪౦౪ సం. (క్రీ. వె.) నకుఁ బూర్వమే భాషాంతరీకరింపఁబడినవని చీనాదేశపు గ్రంథములనుండి తెలియనగును. కావున రెండవయుక్తియంతయును నిరాధారమని తేలుచున్నది.

మూఁడవయుక్తియందు జ్యోతిశ్శాస్త్రగ్రంథము లార్యభట్టునకు ముందుండ లేదని యూహింపఁబడినది. ఈయూహయును నిరాధారమనియే డాక్టరు తీబో గారు సిద్ధాంతముచేసిరి. దానిని గుఱించి మేక్డొనలుగారు తమ సంస్కృతవాఙ్మయచరిత్రమునం దిట్లు వ్రాసిరి:

"But it has been shown by Dr. Thibaut that an Indian Astronomical treatise undoubtedly written under Greek influence, the Romaka Siddhanta is older than Aryabhatta, and cannot be placed later than 400A.D.'

పైవ్రాఁతనుబట్టి చూడఁగా క్రీస్తువెనుక ౪౦౦ సంవత్సరములకు ముందే హిందూదేశమునందు రోమకసిద్ధాంతమను జ్యోతిశ్శాస్త్రగ్రంథమొక్కటి బయలుదేఱెనని నిశ్చయమగుచున్నది గావునఁ గాళిదాసుఁ డాఱవశతాబ్దమునం దుండియుండవచ్చు ననువారి మూఁడవయుక్తి గూడ ఖండితమగుచున్నది.

కాళిదాసుఁడు గుప్తసామ్రాజ్యమునం దుండెననియును, క్రీ. వె. నాల్గవశతాబ్దమున జీవించియుండవచ్చుననియును నూహించువారల యుక్తులను మనము పరీక్షింపవలసియున్నది. ఈగుప్తవంశపు రాజులకును గాళిదాసు

నకును సంబంధమును నిశ్చయించు వారిలోఁగూడ కొన్ని రకాల మతము లున్నవి. "Though some scholars place Kalidasa in the reign of Samudragupta (330-375) and Chandragupta II (380-414), others would make him contemporaries of Kumaragupta (413-455) or Skandagupta (455-480) and some will have him in the time of Yasodharman." కాళిదాసుఁడు సముద్రగుప్తచంద్రగుప్తుల కాలములోనుండెనని కొందఱును, కుమారగుప్తుని కాలమందుండి యుండవచ్చునని మఱికొందఱును, స్కందగుప్తుని కాలమందుఁ గాని యశోధర్మని కాలమునందుఁగాని యుండియుండవచ్చునని యింకఁ గొందఱును చెప్పుచున్నారు. ప్రొఫెసరు కీత్, మేక్డొనలు మొదలగువారందఱును బయివాదమును బలపఱచుచున్నారు గావున వారిలో ముఖ్యుఁడగు కీత్ దొరగారి గ్రంథమునందుఁ జెప్పఁబడిన వాక్యముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాను: "Nevertheless it is difficult to dissociate Kalidasa from the great moments of the Gupta Power. He was later than Acvaghosha, and than the Dramatist Bhasa; he knew Greek terms, as his use of 'Jamitra' proves; the Prakrit of his dramas is decidedly later than Acvaghosha's and Bhasa's, and he cannot be put before the Gupta age. His complete acceptance of the Brahmanical system, the sense of sharing in a world of prosperity and power, the mention of the horse sacrifice in Malavikagnimitra, Raghu's conquests in the Raghuvamsa seem best explicable as the outcome of the enjoyment of the protection of a great Gupta ruler, and we must remember that Chandragupta II had the style of Vikramaditya with whose name tradition consistently connects Kalidasa. Nor is it absurd to see in the title 'Kumarasambhava' a hint at the young Kumaragupta, the heir apparent or even in Vikramorvasi an allusion to the title Vikramaditya."

పైవాదమునందున్న ముఖ్యమైనయుక్తులు:౧. కాళిదాసుఁడు తన గ్రంథములయం దశ్వఘోషుని గ్రంథములనుండి యనేకములగు ఛాయలను గ్రహించెననియును; ౨. కాళిదాసుని గ్రంథములయందు సాభిప్రాయముగా నుపయోగింపఁబడినదని, ముందుదాహరింపఁబడిన 'విక్రమ' పదము విక్రమాదిత్యబిరుదమును వహియించిన రెండవ చంద్రగుప్తుని నుద్దేశించి వాడఁబడెననియును; 3. రఘుమహారాజకృతదిగ్విజయవర్ణనము సముద్రగుప్తుని విజయయాత్రను బోలియున్నదనియును;—మూఁడు కనుపట్టుచున్నవి. సరిగాఁ బరీక్షింపఁబడినయెడల నీమూఁడు యుక్తులును గూడ నిలుమనవి గావు.

ఇందు మొదటి యుక్తియందు తెలుపఁబడిన యశ్వఘోషుఁ డనునాతఁడు 'కనిష్కుని' తో సమకాలికుఁడనియు, నీకనిష్కుఁడు క్రీస్తుశకము మొదటిశతాబ్దము తుదిని రాజ్యము చేసెననియును నిశ్చితమైనది కాబట్టి యీతఁడును నాకాలమునందే యుండి తీరవలయును. అశ్వఘోషుఁ డనేక గ్రంథములను వ్రాసి ప్రసిద్ధి కెక్కిన బౌద్ధమతస్థుఁడు. ఇందు ముఖ్యములగు శ్రవ్యకావ్యములు రెండు: (౧) బుద్ధచరిత్రము; (౨) సౌందరానందము. దృశ్యకావ్యములలో నొకటి శారికాపుత్త్రప్రకరణము. ఇంకొకటి రెండు రూపకములు వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది గాని వీనిప్రతు లెక్కడను సంపూర్ణముగా లభియించుటలేదు. బుద్ధచరిత్రమునందలి కథ బుద్ధదేవునికథ. ఈపుస్తకమునకును రఘువంశమునకును బోలిక లనేకములు కథపట్టులలోనే గాక కల్పనలయందును వర్ణనలయందును గూడఁ గన్పట్టుచున్నవి. సౌందరానంద మనునది బుద్ధుని సవతితమ్ముఁడగు నందునిమతమును మార్చుటను గుఱించిన కథను దెల్పుచున్నది. దీనికిని గుమారసంభవమునకును ననేకస్థలములయందు పోలికలు కన్పట్టుచున్నవి. అశ్వఘోషుఁడు రచియించెనని తెలియుచున్న రూపకముల ప్రతులయందు గ్రంథము సంపూర్ణముగా లభియింపకుండుటచేత నీగ్రంథములయందలి పోలికలను జక్కఁగా నిర్ణయించుటకు వీలు లేదు గాని దొరకినంతమట్టునకుఁ బరీక్షించిన యెడలవానికి శూద్రకవిరచితమగు మృచ్ఛకటికముతో నెక్కుడుపోలిక యున్నట్లు తెలియుచున్నది. అయి

నను గాళిదాసుని రూపకములతోఁడి పోలికలిందును లేక పోలేదు. ఇఁక నీపోలిక లన్నిటిని జక్కఁగాఁ బరీక్షించి కాళిదాసుఁడే యశ్వఘోషుని చూచి వ్రాసెనా లేక కాళిదాసుని వ్రాఁతలనే యశ్వఘోషుఁ డనుకరించెనా యనుప్రశ్నములకు సరియయిన సమాధానముల నొసంగ వలసినది. ఈవిషయమున సంపూర్ణమగు విమర్శనము రఘువంశాదికావ్యములనుగురించి వ్రాయఁబోవు వ్యాసములలో వ్రాయఁబడును. కీత్, మేక్డొనలు మొదలగువారనుకొనినయట్లు కాళిదాసుఁ డశ్వఘోషుని వ్రాఁతల ననుకరించె ననుటకంటె నశ్వఘోషుఁడే కాళిదాసుని వ్రాఁతల ననుసరించెనని నిర్ణయించుట సమంజసముగాఁ గన్పట్టుచున్నది. కావున పైవారు చెప్పెడి మొదటి యుక్తి ఖండితమగుచున్నది.

కాళిదాసుని గ్రంథములయందు వాడఁబడిన విక్రమపదము విక్రమాదిత్యు నుద్దేశించియే కానోపునని పూర్వమే తెలుపఁబడియున్నది. ఆవిక్రమాదిత్యుఁడు రెండవ చంద్రగుప్తుఁడు కాఁడనియును, వేఱొకఁడనియును ముమ్ముందు నిర్ణయింపఁబడును. ఇంతియ కాక కాళిదాసునిఁ బోషించిన విక్రమాదిత్యుఁ డుజ్జయినీ నగరమునం దుండినట్లు వినవచ్చుచున్నది గాని వేఱొకచోట నుండినట్లు వినరాకున్నది. కావున నీయుక్తియును బరీక్షాసహము గాలేదు.

ఇఁక మూఁడవయుక్తిలోఁ జెప్పఁబడిన సముద్రగుప్తుని దండయాత్రకును రఘుమహారాజ దిగ్విజయమునకును బోలికగలదనుటగూడఁ బరీక్షకునిలువదు. పైరెంటికిని జాలభేదము గలదు. రఘుమహారాజు దాఁటివెళ్లిన యనేకప్రదేశములకు సముద్రగుప్తుఁడు పోలేదు. సముద్రగుప్తుఁడు పంజాబు మొదలగుస్థలములలో పొందినవిజయముల పోలికలు రఘుదిగ్విజయమునందు లేవు. కాఁబట్టి గుప్తవంశపురాజుల పోషణములో నుండిన కాళిదాసుఁడు తన ప్రభువుయొక్క విజయములను మనసునం దుంచుకొని రఘుదిగ్విజయమును వర్ణించెననుట యుక్తము కాదు. సముద్రగుప్తుని దండయాత్రను వర్ణించిన హరిషేణుఁడే రఘుదిగ్విజయ వర్ణనమును బఠించి యత్యుక్తులచేఁ దనప్రభుని దండయాత్రను గూడ నధికముగా రఘుమహారాజ విజయమునవలెనే వర్ణించెనని చెప్పుట సమంజసము. కీతుగారు చెప్పిన పైవాక్యములలోని మిగిలిన యుక్తులు చాల ముఖ్యములు గాకుండుటచే విడిచివేయఁబడినవి.

ఇఁకఁ గాళిదాసుఁడు క్రీ. పూ. మొదటిశతాబ్దమునకుఁ జెందినవాఁడని చెప్పుటయే యుక్తముగా నున్నట్లున్నది గావున నావాదమును సమర్థించువారి యుక్తుల నీక్రింద వివరించుచున్నాను.

అశ్వఘోషుఁడు కాళిదాస గ్రంథములఁ జూచి యందలి భావములనే తనగ్రంథమునందు వేసికొనెననుట యుక్తమని ముందే చెప్పియున్నాము. క్రీ. శ. మొదటి శతాబ్దమునందే యశ్వఘోషుఁ డుండినట్లు తెలియుచున్నది. కావునఁ గాళిదాసుఁ డంతకుముందే, యనఁగా క్రీ. పూ. మొదటిశతాబ్దమునం దుండెననుట నిర్బాధము. రఘువంశమునందు నాల్గవసర్గములోని దిగ్విజయవర్ణనమునందును, నాఱవసర్గమందలి స్వయంవర రాజలోక నిరూపణమునందును గాళిదాసుఁడు చూపించిన హిందూదేశవిభాగమును బరిశీలించి యాతని కాలమును నిర్ణయించుటకు మంచి యాధారము గన్పించుచున్నది. సుహ్మ వంగదేశములు ప్రత్యేక విభాగములుగా రఘువంశమున నాల్గవసర్గమునం దుదాహరింపఁబడినవి గాని యాదేశములు గుప్తసామ్రాజ్య కాలమునాఁటికి మగధసామ్రాజ్యములోఁ జేరి తమ ప్రత్యేకతను గోలుపోయినవి. ఇట్టి ప్రత్యేక విభాగము క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్దమునం దుండుట కేయభ్యంతరమును లేదు. రఘువంశమున నాల్గవ సర్గమునందు రఘుమహారాజుత్కళుల సాహాయ్యమును గొని కళింగదేశముపై దండెత్తెనని వ్రాయఁబడినది. సముద్రగుప్తుఁ డుత్కళులను, వారికి సామంతులుగా నుండిన యాటవికులను గూడ నోడించెనని తెలియుచున్నది. కాళిదాసుఁడు గుప్తవంశీయులకాలమునందే యుండినయెడల నిట్లుత్కళులు రఘుమహారాజునకు మార్గమును జూపినట్లే వ్రాసి యుండఁడు. మొత్తముమీఁద కాళిదాసుఁడు వ్రాసిన గ్రంథములయందలి హిందూవిషయవిభాగము గుప్తసామ్రాజ్యకాలమునందలి విభాగమును బోలియుండక యంతకు ముందటికాలమునకు సంబంధించిన దానివలెనే యున్నది. కాఁబట్టి రఘువంశకర్తయగు కాళిదాసుఁడును

క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దమునందే యుండెనమట యుక్తముగాఁ దోఁచుచున్నది.

అట్లయినయెడలఁ గాళిదాసునిఁ బోషించిన యా విక్రమాదిత్యుం డెవ్వఁడో నిర్ణయింపవలసిన భారము మన పైనున్నది. క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమునందు కాలకాచార్యుఁ డను నాతఁడు సింధునది కావలిప్రక్కనుండి శకవంశస్థులను దిలిచికొని వచ్చి యుజ్జయినిని బరిపాలించుచుండిన గర్ధభిల్లుని సంహరింపఁజేసెనని జైనకథలం బట్టి తెలియవచ్చుచున్నది. ఈకాలమునందు కాళిదాసుని యుజ్జయినీ పట్టణ మన్య పరిపాలనములో నుండఁగా గర్ధభిల్లుని కుమారుఁడగు విక్రమాదిత్యుఁడు వారి నోడించి తనరాజ్యమును దిరిగి యాక్రమించెననియును జైనుల గ్రంథములనుబట్టి తెలియవచ్చుచున్నది. ఈవిక్రమార్కుని కాలమునందే కాళిదాసుఁ డుండినట్లు మన మూహింపవగును. ఈతనికాలముననే విక్రమార్కశకము ప్రారంభింపఁబడినదనికూడ కొంద ఱూహించుచున్నారు. విక్రమార్కశకమును స్థాపించినవా రెవ్వరను విషయమును జర్చించుట చారిత్రికులపని గావున నావిషయమునుండి విరమించెదము.

రెండవ కుమారగుప్తుని కాలములో వత్సభట్టి యను వానిచే వ్రాయఁబడిన మందసరపు శాసనమునందలి రచనను బరీక్షించినయెడల నాతఁడు తప్పక కాళిదాసుని శైలిననుసరించెనని తోఁచక మానదని యనేకు లభిప్రాయపడుచున్నారు. ఈశాసనము ౪౭౪ (క్రీ. శ.) సం. న వ్రాయంబడినదని గావునఁ బయియూహప్రకారము గాళిదాసుఁ డంతకు ముందే యుండెననియును, సుప్రసిద్ధుఁడయి యుండెననియు నూహింపక తప్పదు.

పయియుక్తులను బరీక్షించి చూడఁగాఁ గాళిదాసుఁడు క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దమున నుండెనని యూహించుట యుక్తముగాఁ గనుపట్టుచున్నది.

---

# వి ర హ వీ ణ

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు

దూరమే నిన్ను నన్ను సుతారమైన
వీణతంత్రుల నమ్మేళవించె నేడు:

నా గభీరశ్రుతిరణన్నాదమందు
నీ విమలరాగరేఖలే నిలిచి నిలిచి,
దేవి! భరమౌ నెదో భావ మావహించి
లోకలోకాల నీ నిశ ప్రాకిపోవు!
ఓ మధురగానజీవి! నాదోర్మి లేవా
పొంగి యుప్పొంగి యీ రేయి బొరలిపోయి,
ఇచటి నా హృదయమ్మునం దెచటి నీ యెడందనో నించి పూర్ణతనొందఁజేయు!

ఓ ప్రియా! రాగమాలికలేవో నేటి
విరహవీణాగళమ్మున విరిసి దూర
దూరమున కొనలే మృదుసారభాల
సంస్పృశించు విశాల ప్రశాంతరాత్రి!

---



3. రెండే ఎత్తులు



౪. హైకోర్టు (నడిరేయి)

శ్రీ పి. వి. సూర్యనారాయణరావుగారు తీసినది.



౫. సాధన

శ్రీ సి. జి. జగన్నాథదాసుగారు తీసినది.

# పద్యచూడామణి—బుద్ధఘోషాచార్యుఁడు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

సంస్కృతవాఙ్మయము మన భరతఖండముననే యుద్భవించినదని కొందఱు తలంతురు. కాని అఫ్గనిస్థానము, టిబెటు, బర్మా, సయాం, సింహళము, బాలిబెటా, కాంబోడియాలలోఁ గూడ సంస్కృతవాఙ్మయ మొకప్పు డతిశయముగా వ్యాపించియుండెననియు, మహాకవులు, మహర్షులు, ఋషికల్పులు పై దేశముల యందుద్భవించి ప్రసిద్ధి పొందిరనియుఁ బెక్కునిదర్శనములు కలవని పెక్కండ్రకుఁ దెలియదు.

సంస్కృత వాఙ్మయమున కత్యంతము నాధారభూతమగు వ్యాకరణ గ్రంథముఁ జేసిన పాణిని మహర్షి అఫ్గనిస్థానమునం దుద్భవించెను. ఆ పార్వతీక ప్రదేశముననే, ఆ మోటు జాతివా రుండు స్థలముననే, విశేష గోహత్యా పాతకు లుండుచోటుననే, పవిత్రమగు "అష్టాధ్యాయి"ని, "పాణినిశిక్ష"ను రచించెను. ఛాందోగ్య, బృహదారణ్య కోపనిషత్తులలోఁ బేర్కొనఁబడిన మంత్రకర్తలగు మునులు అఫ్గని, బెలూచిస్థానములు (మద్ర, గాంధార) నివాసముగాఁ గలవారని స్పష్టముగాఁ గాన్పించుచున్నది. వ్యాసమహర్షి తన భారత సంహితను హిమాలయమున రచించి శుకాదులకు హిమాలయోత్తరమునఁ బాఠము చెప్పినటలును, శ్రీశుకుఁ డచటి నుండియే పర్వతములను దాఁటి మిథిలాపురికి వచ్చినటులను మహాభారతమువలనఁ దెలియనగును. క్రీ. శ. ౪, ౫ శతాబ్దములప్రాంతమున నుండిన దిఙ్నాగాచార్యుని గ్రంథము లించుమించు నలువది త్రివిష్టపదేశముననే వ్యాప్తి నొందినటులను, పెక్కండ్రు వేదజ్ఞులు, పురాణపురుషులు త్రివిష్టప దేశీయులుగానే యుండినటులను చరిత్రల వలనను, పురాణములవలనను తెలియనగును. "బాలిబేటా" (బలి) ద్వీపములో సంస్కృత భారతమే రీతిని వ్యాపించినదియు నిచటి భారతమునకు నచటిభారతమునకుఁ గల భేదమును, అచట నుండిన భగవద్గీతలలోని శ్లోక వివరణమును మాడర్న్ రివ్యూ అను పత్రికయొక్క 1914 సం.రము జూలై సంచికలో నచటికిఁ బోయి వచ్చిన మహారాష్ట్ర దేశీయుఁడు వ్రాసి యున్నాఁడు. రెండేండ్లకు ముందు ఫ్రెంచి దేశస్థుఁడును, పాలీ, సంస్కృతభాషలయందు పండితుఁడై భారతీయ వాఙ్మయమునందు మిగుల నభిమానము గలవాఁడునగు "విస్వాన్ వెల్విన్" అను విద్వాంసుఁడు బాలిబేటాకుఁబోయి యచట నుండిన యనూచానసంపదగల బ్రాహ్మణులతో సంభాషించి, వారి వైదిక సాంస్కృతిక సంప్రదాయవిశేషములం గూర్చి చెన్నపురిలో విశేషోపన్యాసములం జేసియున్నాఁడు. ద్వీపాం

తరములలో ననూచాన వైదిక సంపద గల బ్రాహ్మణు లుండుట యెటుల సంభవించును? అది బలిద్వీపము గాన బలిచక్రవర్తితోఁ గొందఱు బ్రాహ్మణు లానాఁడే పాతాళలోకమునకుఁ బోయిరేమొ విచారింపవలసి యున్నది. ఆబలిద్వీపబ్రాహ్మణులు భారతీయ బ్రాహ్మణాచారములం దెలిసికొన యత్నించుచున్నటులు తెలియుచున్నది. ఇచటి బ్రాహ్మణసంఘములు కూడ వారిఁ దెలిసికొనుట యుక్తము కాదా? సయాము, కాంబోడియా (కాంభోజ) దేశములలో విశేషముగా సంస్కృత శాసనములును, రామాయణ గాథలును వ్యాపించి యున్నవి. కాంబోడియా దేశస్థులు రాముఁడు తమ దేశమునుండియే లంకకు సేతువుఁ గట్టెనని చెప్పెదరఁట! సయాము దేశప్రభువుల నామములు చాలవఱకు సంస్కృతనామమిళితములుగా నే యుండునఁట!

ఎచట బౌద్ధమత ముద్భవించెనో యచట నామతము నామమాత్రావశిష్టమై, టిబెటు, బర్మా, సయాము, కాంబోడియాది దేశములే తదభిజనము లని తత్తద్దేశీయులచేఁ దలఁపఁబడు స్థితికి వచ్చుచున్నది. బౌద్ధమతమునకుఁ బ్రస్థానత్రయతుల్యములుగాఁ దలఁపఁబడు "త్రిపిటకముల"పై వ్యాఖ్యాన గ్రంథములు పై దేశములలో నే వ్యాపించినవి. నేను బ్రస్తావించు "బుద్ధఘోషాచార్యుఁడు" భారతీయేతర మహాకవులలో నొకఁడై యుండెను.

### బుద్ధఘోషాచార్యుఁడు

ఈమహాపురుషుఁడు దక్షిణాత్య (బర్మా, సయాము, సింహళముల) బౌద్ధమత ప్రవర్తకాచార్యులలో ద్వితీయాచార్యుఁ డని పై దేశీయులు తలఁచి పూజింతురఁట! ఈతఁడు దక్షిణ బర్మాలోని "మార్టబాన్" అను పట్టణమునకు సమీపమునం దుండిన "థేటన్" అను గ్రామమునం దనూచాన బ్రాహ్మణ కుటుంబమునఁ బుట్టి వేదశాస్త్రములఁ జదివి ప్రతివాది భయంకరుఁడై ప్రారంభమున బౌద్ధమతమును ఖండించువాఁడుగ నుండెను. పిమ్మట బౌద్ధమత దీక్షితుఁడై తన్మతప్రచారమునకు మిక్కిలి పాటుపడెను. మధ్యవయస్సునం దాతఁడు బర్మా నుండి యోడపై వంగదేశములోని "తామ్రలిప్తి" రేవునం దిగి, గంగానదిలో పడవలపైఁ బ్రయాణము చేసి, సారనాథము, గయ మొదలగు బౌద్ధమత ప్రధానక్షేత్రములను సేవించి, యోడలమీఁదనే సింహళముఁ జేరి, "అనూరాధపురము"నం బెక్కేండ్లుండి, త్రిపిటకములతో సంబంధించిన విశేషవ్యాఖ్యానములను సంపాదించుటయే కాక సింహళములో నంతకుఁ బూర్వము బౌద్ధమత దీక్షితులు గాని యున్నత వంశజాతులకు బోధించి బౌద్ధమత దీక్ష నొసంగెను. అనూరాధపురమునం దుండిన కాలముననే "విశుద్ధిమగ్గ" అను నొక బౌద్ధమత గ్రంథమును వ్రాసెనఁట! పాలిభాషలోని కొన్ని మతగ్రంథములపై వ్యాఖ్యానములఁ జేయుటయే కాక చరమదశలోఁ ద్రిపిటకములపై బర్మాభాషలో వ్యాఖ్యానముఁ జేసెనఁట! బర్మానుండి భరతఖండమునకు, నచటినుండి సింహళమునకుఁ బోవుటకు బర్మాలోని కైలాసనాథాశ్రమాధికారి యగు "ధర్మ

పాలుఁ"డను నాతఁడు సహాయపడెనఁట! సిలోను నుండి తెచ్చిన వ్రాఁతప్రతులు "తైలాంగు" లిపిలోఁ గలవఁట! తైలాంగు లిపి యన తెలుఁగులిపి కాదా? క్రీ. శ. ౨-వ శతాబ్దమునసే సింహళమున "ఆంధ్రభాష"లో త్రిపిటక వ్యాఖ్యాన మొందు రచింపఁబడె నని యొకరు వ్రాసిరి. ౬, ౭ శతాబ్దములలో నాంధ్రులు వేంగిలిపిలో వ్రాయుచుండిరి. ఆ లిపిలో బుద్ధఘోషునిచేఁ దీసికొనఁబడిన గ్రంథము లుండెనేమో? ఈతఁడు కాళిదాస మహాకవి కించుక తరువాతను, భారవి, దండి కవుల కించుమించు సమకాలమున నుండి, క్రీ. శ. ౬, ౭ శతాబ్దముల నాఁటివాఁ డగునని యాతని గుఱించి బర్మా, సింహళ, పాశ్చాత్యదేశ పండితులు వ్రాయుచున్నారు.

## కవిత్వ విశేషములు

బుద్ధదేవుని గ్రంథాదియందు నుతించిన కవి యమరసింహుఁడు మాత్రమే యని మన కింతవఱకుఁ దెలియును. ఈ మహాకవి కూడ గ్రంథారంభమున నిటులు నుతించియున్నాఁడు:

శ్లో. కారుణ్యకల్లోలిత దృష్టిపాతమ్
కందర్పదర్పానల కాలమేఘం,
కైవల్య కల్పద్రుమ మూలకందం
వందే మహః కందళ మర్కబింబం.

కాళిదాసమహాకవి ననుకరింప నీకవి యెంతయేని గ్రంథారంభమునుండియుఁ బ్రయత్నించి కొన్ని యెడల నంతకంటెను గుణాతిశయములఁ జూపియున్నాఁడు. దిఙ్మాత్రముగ రెండంశములఁ జూపెదను.

గ్రంథాదిని తన్నుఁగూర్చి యిటులు వ్రాసికొనెను:

శ్లో. యస్యైకదేశం యతయోఽపి వక్తుం
నాలం బభూవు ర్నలినాననాద్యాః,
శాస్తు స్తదేశచ్చరితాపదానం
వక్తుం మనీషా మమ మౌఢ్య మేవ.

ఈశ్లోకము రఘువంశములోని
మందః కవియశఃప్రార్థీ
గమిష్యా మ్యుపహాస్యతామ్.
అనుశ్లోకము ననుకరించుచున్నది.

తథాపి తత్రాహిత భక్తిశక్త్యా
తదేత దాఖ్యాతు మహం ప్రవీణః,
తథా హి తత్పాద సమాశ్రయేణ
రజోఽపి లక్ష్మీం కురుతే హి పుంసామ్.

ఇందు కాళిదాసునకు భిన్నముగా వినయ విశేషముఁ జూపియున్నాఁడు.

మఱియు రఘువంశమునం దేడవ సర్గలో నిందుమతితోఁ గూడిన యజమహారాజు పురవీథులఁ బోవునపుడు పౌరవనితల శృంగారావస్థల నైదు శ్లోకములలో వర్ణించి యున్నాఁడు. ఇమ్మహాకవి బుద్ధుఁడు పురవీథులఁ బోవునపుడుండిన పౌరసుందరుల శృంగారచేష్టల నటులనే యేడుశ్లోకములలో వర్ణించి యున్నాఁడు.

రఘువంశమున నీ శ్లోకము కలదు:

విలోచనం దక్షిణ మంజనేన
సంభావ్య తద్వంచిత వామనేత్రా,

తత్రైవ వాతాయన సన్నికర్షం
యయౌ శలాకా మపరా వహంతీ.

దీనికి మారుగా బుద్ధఘోషుఁడు నాలవ సర్గయం దీక్రింది శ్లోకమును వ్రాసియుండెను:

నేత్రస్య తద్దర్శన సిశ్చలస్య
మాభూ దిదం రోధ ఇతీవ మత్వా,
అపాస్య కాలాంజన మాయతాక్షీ
వాతాయనం సత్వర మాయుతాక్షీ.

రఘువంశ శ్లోకము:
అర్థాచితా సత్వర ముత్థితాయాః
పదే పదే దుర్నిమితే గళంతీ,
కస్యాశ్చిదాసీ ద్రశనా తదానీ
మంగుష్ఠమూలార్పిత సూత్ర శేషా.

దీనికి మారుగ బుద్ధఘోషుఁ డిట్లనుకరించె:

పతివ్రతాయాః పరదర్శనాయ
యాత్రా న యుక్తేతి నిరుంధతీవ,
నితంబబింబా ద్రశనా గలంతీ
కస్యాశ్చి దంఘ్రిం కలయాంచకార.

పైబుద్ధఘోషుని శ్లోకములలోని గుణాలంకారములుహృదయంగమములుగా నున్నవి. ఇతని గ్రంథములోని పురవర్ణనము"నగస్త్యుఁడు" తన "నలకీర్తికౌముది" లో ననుకరించినటులఁ గాన్పించెను. దాని నింకను బరిశోధింప వలయును.

రామాయణము, భాగవతము, రఘువంశములలో వర్ణింపఁబడినట్టి భగవంతుని భూమిలో నవతరింపమని కోరినరీతిగానే, "తుషిత" లోకములోని తుషితు లందఱు భూమిలో బుద్ధు నవతరింపమని ప్రార్థించినట్లు బుద్ధఘోషుఁడు వర్ణించి యున్నాఁడు. ఈతఁ డుపయోగించిన పదములు కొన్ని నామలింగానుశాసనములోని పదములకంటె భిన్నముగా నున్నవని యేతద్గ్రంథ సంపాదకులు వ్రాసియున్నారు. దాని నింకను శోధింపవలసి యున్నది.

ఈగ్రంథపుఁ బ్రతు లీ భరతఖండమునఁ బెక్కుచోటులను లభించుచున్నవి. బర్మాలో ప్రచారమున నుండెనో లేదో తెలియదు.

భారతీయేతరుఁడు సంస్కృత భారతిలోఁ బ్రఖ్యాతి నొందె ననుటయే నా వ్యాసములోని విశేషమని విన్నవించుకొనుచున్నాను.

---

# శ్రీ కోటిలింగేశ్వరస్తోత్రము

కీ. శే. శ్రీ మన్మహోపాధ్యాయ బ్ర. కల్లూరి వేంకటరామశాస్త్రి గారు

[వారాణసీ క్షేత్రమునకుఁ బ్రతివాదియని విశ్రుతి కెక్కి దక్షిణదేశంబు నధివసించిన యీ కోటిలింగక్షేత్రంబున నొకానొక శివరాత్రి పర్వకాలంబునందు రథారూఢుం డగు కోటిలింగేశ్వరుండు తనదు దర్శనంబున నుల్లంబు నుల్లాసంబు నొందించి నన్ను స్వకీయస్తుతి విషయక మనోరథారూఢుం జేయంగ ధూర్జటిజటిలభక్తిభాసుర కవితా వితాన శాలిశయ్యతో సశేషరసజ్ఞాసీమసుధా మధురంబయ్యును నశేషరసజ్ఞాఽసీమ సుధామధురం బగు నట్టులు 16-6-1899 నాఁడు రచియింపఁబడిన పద్యరత్నంబులు.]

శ్రీ గోదావరి మాతృదేవతవలెన్ జిత్తాబ్జ మూరార్చి యా
హా! గంభీరభవద్దయారసముచాయం బొంగి యజ్ఞానని
ద్రాగామిన్నను లేపుచుం దెరల బోర్కాడించి ప్రేరేప నీ
క్రేగంటం బడి కొల్తు రక్ష యిదుమీ శ్రీ కోటిలింగేశ్వరా!

నతుల న్నీ కొనరించు ధన్యుఁడు గుఱాల్ నాగంబులున్ బల్లకీల్
చతురంభోనిధి మేఖలాఖిలమహీ సామ్రాజ్య మొప్పార ను
న్నతుఁడై యీ తనుకంచుకం బెడలినంతన్ గిత్తపై నెక్కి నం
చిత భిక్షుం డయి కొండకాఁ పగు బళీ! శ్రీ కోటిలింగేశ్వరా!

క్షితిపై గోష్పదతీర్థ సమ్ముఖగత శ్రీ గౌతమీతీరసై
కతవేదిన్ జలజాసనంబున నినున్ జ్ఞానాక్షి వీక్షించి స
ద్గతి చేకొన్నదె జన్మ మయ్యె యిటఁ దీర్ఘధ్వాంతముం ద్వద్దయా
ర్జిత సత్త్వన్ బరహంసనై పరఁగెడిన్ శ్రీ కోటిలింగేశ్వరా!

కొలువై కాశిపురంబు నివ్వటిల నీవుం బౌర సమ్మర్దనం
కులరావంబు తపోవిభూతి యనియో కోటానకోటుల్ జగం
బులఁ బ్రోవంగల కోటిలింగముల రూపుల్ దాల్చి నిశ్శబ్దతుం
దిల హార్షాస్పద మంచు నుంటివె యిటన్ శ్రీ కోటిలింగేశ్వరా!

పరిభాషావిధిశాస్త్రముల్ పదసమన్వయ్యైకవాక్యత్వపై
ఖరితో రంజిలి కార్యకాల మను పక్షంబందు నున్నట్లు ని

ర్భర రాగంబున నల్లుకొన్న తమ దాంపత్యంబు ధ్యానించుచుం
డి రహిం జెందుదు నాత్మలోన నెపుడున్ శ్రీ కోటిలింగేశ్వరా!

విను నీవే తలిదండ్రుడు బిడ్డఱును గావే? యర్ధనారీశమూ
ర్తిని విశ్వంబు సృజించి ప్రోచియు నయారే! "నేహ నానా స్తి కిం
చన" యన్నట్టి శ్రుతిప్రకారమున నీ జాగ్రల్లలాటంతపా
క్షిని సర్వంబు లయింప సాక్షివి గదా? శ్రీ కోటిలింగేశ్వరా!

ఆకారాయతకుండి బల్మిమెయి నీ యారాధకున్ దూఱి చా
ర్వాకుం బోలిన వ్యాజమూర్తియె సవర్ణభ్రష్టజుం డయ్యు శ్వే
తాకీర్ణోరు విభూతియై బకతపుం డాచార్య పీఠాప్తి ను
ద్రేకింపన్ ద్విజరాజరాశి యెదురా శ్రీ కోటిలింగేశ్వరా!

భాషానాథునిఁ బుష్పసాయకు నణంప న్నీవు పుత్రవ్యథా
ద్వేషం బూనక శౌరి నీకు ముద మొందింపన్ జగన్మోహినీ
వేషం బొంది యుదారతన్ మెలఁగె నీ పెంపుం బ్రభావంబు ని
శ్శేషం బా సొగసు న్నుతింపఁ దరమా శ్రీ కోటిలింగేశ్వరా!

హరివంశోక్తులు శేషధర్మముల వ్యాఖ్యల్ యోగవాసిష్ఠ వా
గ్గరి పాద్మాది పురాణగోష్ఠులు సదా చాటింప దుష్టార్తిత
త్పర శిష్టాభయహస్తదానపర సీతారామ రూపంబు దా
ల్చి రఘూర్వీశకులంబునన్ వె: సితో శ్రీ కోటిలింగేశ్వరా!

యమిరాజేంద్ర పురాణ దుందుభులు మ్రోయన్ స్వల్పనారాయణా
ర్థముతోఁ గూడిన నీ పరాంశమగు సీతారామ దేవావతా
రము గంగాయమునాంశసంగమితతీర్థంబట్లు నీచెంతఁ జే
రి మహాఘుంబులు చెందుచుండును గదా శ్రీ కోటిలింగేశ్వరా!

---

# ఆంధ్ర ముద్రారాక్షస విమర్శనము *

కీ. శే. మహోపాధ్యాయ వేంకటరాయశాస్త్రులుగారు, కళాప్రపూర్ణ

ఉ. ఎవ్వఁడు నిర్గుణుం డగు న
హీనశుభాచ్ఛగుణ ప్రశస్తుఁడై
యెవ్వఁ డదృశ్యమూర్తి యగు
సృష్టితవస్తు నితాంతవాసియై
యెవ్వఁ డనాద్యనాముఁ డగు
ఘృష్టితసృష్టిశుభాద్య నాముఁడై
యవ్విభు నాశ్రితార్తిహరి
హర్తను గొల్చెద మోక్షభిక్షకై.

(౧) అహీన; (౨) అచ్ఛ—పూ. అనచ్ఛమేని శుభ మెట్లు? 'శుభ' మనుటచే అచ్ఛత్వము లభించుచున్నది. (౩) మూర్తి—మూర్తి కలదని యర్థ మగుచున్నది. సృష్ట వస్తువులయందు మూర్తి గలిగియే యున్నాఁడనియు తోఁచుచున్నది. ఈపద మెత్తివేయునగు. (౪) నితాంత—పూర్ణము. ఎన్నిటియందునని అర్థమేని 'సర్వవస్తు'అనుట సరి. (౫) తృతీయపాదము ప్రలపితము. అనాద్యుఁడని బ్రహ్మమునకుఁ బేరు గాదు. ఆద్యమ్—ఆదౌభవ మాద్యమ్—తొలి నుండునది. సకలమునకును ముందు ఆదియందు బ్రహ్మమే గదా యుండినది. కావున దానిని విశేషణములచేఁ జెప్పినను ఆద్యమనఁదగును గాని అనాద్య మనఁదగదు. శబ్దార్థము లెఱుఁగక ఈకవి 'అనాది' అనునర్థమున 'అనాద్య'మని ప్రయోగించికొని యుండఁబోలును (౬) సృష్టిత—ఈరూపమును రక్షించుటకయి సృష్టిశబ్దముపయి 'తత్కరోతి' అనునర్థమున 'ణిచ్చు' చేర్చి, అపయి క్తప్రత్యయమును కూర్చినను సృష్టిత యను రూపము ధాత్వర్థోప సంగృహీత కర్మం బగుటచే నకర్మకధాతువై కర్మను చెప్పఁజాలక 'వస్తు'వునకు విశేషణము కాఁజేరదు. 'ఆచారార్థక్విప్పు' చేర్చి అటుపయి 'క్తాంతము' చేయుపక్షమునను ఆచారార్థము పొసఁగనందున ఈశబ్దము పనికిరాదు. ఇది 'సృష్టించు'అను తెనుఁగు నామధాతువుంబట్టి అది నామధాతువని యెఱుంగక, రంజించు-రంజితము, ఘటించు-ఘటితము, గుణించు-గుణితము, గణించు-గణితము—ఈమర్యాదను కల్పించిన యపభ్రంశమయి యుండనోపు. (౭) ఘృష్టిత... నాముఁడై—ఇదియు సృష్టితవంటి క్తాంతమా? లేక ఘృష్టి యనఁగా వరాహము గావున వరాహత యని భావార్థక తల్ప్రత్యయాంతమా? ఈ రెండవపక్షమున అర్థసమన్వయ మెట్లు? వరాహావతారము ఆద్యము గాదుగదా! 'శుభాద్యనాముఁడై' అనుచో 'ఆది + అనాముఁడై' యని ఛేదమా? లేక 'ఆద్య + నాముఁడై' యనియా? ఈప్రయోగము బ్రహ్మైకవేద్యముగానున్నది.

తే. గీ. అధికవిస్తీర్ణ భాషామహార్ణవమునఁ
గడుపు నిండంగ సారోదకములు ద్రావి
వసుమతీజన చాతక ప్రకరములను
దనివి నొందించు కవినీరదములఁ దలఁతు.

మేఘములు చాతకములను దనుపుట ఉదకముల నిచ్చుటచేతఁగాని త్రాగుటచేతఁ గాదు. కవులును లోకులం దనుపుట గ్రంథముల రచించుటచేతఁ గాని చదువుట చేతఁ గాదు.

తే. గీ. ఆది నొక్కండు మూర్తిత్రయంబు నేయ
నతని నందురుగా త్రిమూర్త్యాత్మకుఁ డని

* ఆంధ్రముద్రారాక్షసము (కీ. శే.) శ్రీ సుసర్ల అనంతరాము విరచితము. ఇంటర్మీడియటు పరీక్షా పాఠ్య గ్రంథము. కళాప్రపూర్ణుల యీవిమర్శనము నిండుగ నొక్కయంకమునకే లభింపలేదు. ఉపలబ్ధమైన యీయేక దేశమునను ఈసంచికయందు కేవలము పద్యములపై విమర్శనముమాత్రమే ప్రకటితమయ్యెను. శేషము రానున్న సంచికయందు. —సం. భారతి.

కాళిదాసుఁడు సృష్టించెఁ గా త్రయంబు
నాతనికిఁ జెల్లదే త్రితయా ర్యాత్మకాఖ్య!

ముద్రారాక్షస కర్తను విశాఖదత్తుని ఈ గ్రంథమున నెవటనుం బ్రశంసింపక, అప్రసక్తముగా కాళిదాసుం బొగడుట యుక్తము గాదు.

సీ. ధరణిపైఁ దామరతంపరయై కడు
వ్యాపించి కాకాసు పంకేదుగ్ధ
నీరధి యెవ్వాని నిండుచందురుఁబోలెఁ
గని తాఁ గృతార్థతఁ గాంచి వెలసె
నవనిపాలోన్నోటతపాళ్ళలుదారుఁడై
మెప్పు నొందుచు బ్రభు వితతివలనఁ
బ్రజల నేలెడుగురు రాయాఖ్యచిరకీర్తి
కడుపార నెవని కన్నతండ్రి
తేజరిల్లెడుఁ గమలాసతీసుగర్భ
శుక్తిముక్తాఫలంబను విశుద్ధకీర్తి
యతఁడు శ్రీశ్రీనివాసరాయుండు, విహిత
వర్ణపద్మాకరోదయభానుఁ డగుచు.

(౧) భూమిమీఁద వారధి వ్యాపించినం బ్రళయమే గదా; లోకనాశమే గదా! (౨) ప్రజల నేలెడు .........గన్నతండ్రి—ఇది మనుచరిత్రలోని సీసపాదంపు ననుకరణము. "కలశపాథోరాశి గర్భవీచిమతల్లి కడుపార నెవ్వానిఁ గన్నతల్లి." (౩) అతఁడు శ్రీ శ్రీనివాసరాయుండు etc.—ఇది "అతఁడు చెలు వొందు మధుకైటభారిమఱఁది etc." అను పూర్వోక్త సీసగీతమున కనుకరణము.

సీ. అణుమాత్రములనె యణువదియేఁడుల
స్నేహంబుఁ గూర్చు నీ చెలిమికాఁడు
తనప్రాణబంధు లందఱయందు లేనట్టి
ప్రేమంబు జూపె నీ ప్రియహితుండు
తీయూరు విడిచి యే నేఁగఁ దలఁచుకొనఁ
బోనీక యాగె నీ పుణ్యతముఁడు
నాయూరికార్త వెన్నం డైనఁ దెలుపుచో
నవ్వి మాన్పును బ్రీతి నన్నతండు
ఇట్టిఁడట్టిఁడనుచు నేతెఱ యెన్న నేల,
యేకగర్భజనితుఁడైన నిట్టిప్రేమ
నెట్టి ప్రాణసఖుఁడునైన నిట్టిచెలిమిఁ
గూర్పఁగాఁజాలఁడను చనుకొనఁగవచ్చు.

(౧) తన ప్రాణబంధు లందఱ యందు లేనట్టి స్నేహంబు—స్నేహంబు లేనియెడల ప్రాణబంధువులెట్లు?

క. ఎయ్యెడ రాజను హేంద్రం,
బెయ్యెడనీచెన్న నగరమిటు గూడితి కే
మియ్యెడ సముద్రలవణము
నయ్యెడవియసిరిగకాయ యందము దోఁపన్.

(౧) సముద్రలవణము నయ్యెడవి యసిరిగకాయ యందము — లవణ శబ్దమునకు దేనితో నన్వయము? 'కాయ యందము' అను షష్ఠీ సమాసములో కాయ యున్నది. దాని తో 'లవణము' అన్వయింపదు. మఱి దీని గతి ఏమి?

చ. తల నల ధన్య యెవ్వతె ? సు
ధాకరరేఖ ; మహిం దదాఖ్య నా
పాలఁతుక యొప్పునా ? యవును
మున్నె యెఱింగియు నేల విస్మృతుల్ ?
పలుక సుధాంశుఁ గూర్చి యల
భామను జెల్పెడి ; చంద్రు నొల్లనా
చెలి విజయుం గనుంగొనుమ
చేడియ ! నీవె యెఱింగె దంచు నా
చలినల పట్టి యొద్ద నల
జాహ్నవి దాఁచఁ దలంచి యిట్టి భా
షలు పచరించు శంకరుని
శాశ్వతము మి మ్మనయంబు నోముతన్.

(౧) ఎవ్వతె—ఎవ్వతె యని స్త్రీని గూర్చి యడిగిన ప్రశ్నకు రేఖయని యస్త్రీని ఉత్తర మిచ్చుట యందము గాదు, మందరు. (౨) 'పాలఁతుక యొప్పునా' అని స్త్రీనిగూర్చియే ప్రశ్నను రూఢిచేసినపుడును 'అవును' అని సుధాకరరేఖ స్త్రీయేయని యుత్తర మొసంగుట మందతరము. (౩) మహిన్—పాదపూరణము. మున్నె—యతిపూరణము.(౪)ఏల విస్మృతుల్—

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును గణ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




## గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్ర ద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జీ మేమే భరించెదము.

అడ్రసు:—**డాక్టర్ డి. యన్. జసాని,** 137 కికావీధి, గులాల్ వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, I37 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటీ ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర ! ఫల మధికము !! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు




## లోకామయహర కస్తూరి మాత్రలు

పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, గూరలు, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, అహారజీర్ణకాలమంగు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగులగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు.1 -8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-8 0.

**సారస్వతాసవం** :—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు సత్తినడుమ (సత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

ఏల 'విస్మృతుల్' అని బహువచనము? (౫) పలుక సుధాంశుఁగూర్చి యలభామను దెల్పుఁడి...ఎటింగెదు—'నారీం పృచ్ఛామి నేందుం' అని మూలము. 'స్త్రీ నడుగుచున్నాను, చంద్రుని గాదు' అని యర్థము. 'కథయతు విజయా నప్రమాణంయదీందుః' అని మూలము. 'చంద్రుని నమ్మనేని విజయ చెప్పును గాక!' అని యర్థము. ఈ రెండు వాక్యములు నిట్లు తృతీయ చతుర్థపాదములుగా భ్రష్టీకరింపఁబడినవి. 'కనుంగొనుము'—చూడుమని సహజమయిన యర్థము. అడుగుమని గోదావరీ వ్యవహారమున నొక యర్థము. అగోదావరీయుల కిది తెల్లము గాదు. (౬) విజయా—"(a)Name of Durga; (b) Name of one of her female attendants. Mu. 1. 1." Apte. ఇందువలన విజయ యనునది దేవికి చేటి గాని చెలి గాదని స్పష్టము. ఈ చతుర్థపాదమున తొలి చెలి గౌరియా, విజయయా? గౌరియేని, యసంగతముగా 'చేడియ!' యను నో సంబుద్ధిచిహ్నములు ముద్రించుట యసంగతము. (౭) నలిమల పట్టియొద్ద నలజాహ్నవి దాఁపఁ దలంచి—శబ్దస్వారస్యముచేత 'జాహ్నవిని పార్వతికి అప్పగింపఁ దలఁచి' అని యర్థ మగును. 'దేవ్యా నిహ్నోతు మిచ్ఛోః' అని మూలము. 'జాహ్నవిని పార్వతికి తెలియనీక దాఁపఁదలఁచి' అని దాని యర్థము. కావున తర్జుమా కేవలము మూలవిరుద్ధము. (౮) ఈ పద్యమున కాలుపాదములు.

చ. ధర తలక్రిందు లౌనని ప
　　దంబులు తేలికగాని యానుటన్,
కరములు చాఁచెనేని త్రిజ
　　గంబులు దాఁటు నటంచు వంగుటన్,
బరపిన నెల్లవస్తువులు
　　భస్మము సేయు నటంచుఁ జూపు లం
బరమున నుంచుటం బ్రబల
　　బాధకు లోనయి దుఃఖ మొందు నా
పురహరు నాట్య మెంతయును
　　బ్రోచెడు మిమ్ముల నెల్ల వేళలన్.

(౧) తలక్రిందులు—'అవనతిమ్' అని మూలము. "అవనతిః = Bending, bowing down, stooping; అవనతిమవనేః. Mu. I. 2. 38." Apte. ఇందువలన అవనతి యనఁగా వంగుట గాని తలక్రిందు లగుట గాదని తెల్లము. (౨) చాఁచెనేని—చాఁచెనను ప్రథమపురుషరూపము ఇచ్చట సరిగాదు. దీనివలన చాఁచినవాఁడు పంచమపాదోక్త పురహరుఁడు గాఁడని అర్థమగును. (౩) త్రిజగంబులు—కర్తయా; కర్మయా? (౪) వంచుటన్-దీనికి కర్మ యేది? 'చాఁచినయెడల త్రిజగములం దాఁటునని కరములను వంచుటచేత' అని చెప్పిన నన్వయ ముండును. (౫, ౬, ౭) అంబరమున నుంచుటన్, ప్రబలబాధకు లోనయి, ఎల్ల వేళలన్—ఈ మూఁడును మూలమున లేవు. తొలిరెండును మూలవిరుద్ధములు. అంబరమున నుంచిన గ్రహనక్షత్రాదులు కాలిపోవా? ప్రబలబాధయేని నృత్యము చేయనేల? (౮) దుఃఖ మొందు—మూలవిరుద్ధము. 'దుఃఖనృత్యమ్' అనఁగా ప్రయాసతోఁ గూడుకొన్న నృత్యమని యర్థమే కాని దుఃఖ మొందినవాఁడనియు, ఏడ్చినాఁడనియుఁ గాదు. (౯) పరపిన...నుంచుటన్—మూ. 'దృష్టిం లక్ష్యేషు నోగ్ర జ్వాలాకణముచం బధ్నతో దాహభీతేః' = "కాలు నను భయముచే లక్ష్యవస్తువుల మీఁదికి ఉగ్రదృష్టిని నిగుడ్పక" అని యర్థము. (౧౦) ద్వితీయ పాదమందు చాఁచుట ఏలకో? మూలమున 'అభినయతః' అభినయార్థమని తెలుపఁబడియున్నది అది యిందు త్యజింపఁబడినది. (౧౧) మూ. 'భూత్యాధారానురోధాత్'—ఇదియు నిందు త్యజింపఁబడినది. (౧౨) ఇది సంపాదికవి ఒకపాద మెచ్చు పెట్టుకొనియు మూలము పూర్ణముగా నిందులకుఁ దెచ్చుకొన నేరకపోయెను. మఱికొంత వదలివేసి నాలుగు పాదములతో నిలుపరాదా! లేక మూలాద్ధమెల్ల నిగిడించుటకు పాదములు పెంచుకొనుముఁ బోలదా? ఈ యుభయభ్రష్టత ఏమి? (౧౩) 'ఎల్ల వేళలన్' అను బహువచన స్వారస్యముచే ప్రాతర్మధ్యాహ్న సాయంసమయము లర్థమా! లేక రేబవళు లర్థమా? లేక అన్నియు నర్థమా! ఈపదమే లేకున్న ఇంతకన్న చక్కఁగ నుండదా!

ఆ. వె. బాలికుం డొకండు వ్యవసాయ మొనరింపఁ,
　　బూనుకొన్నఁ గూడ భూమి మిగుల
　　సారవంతమైన సస్యంబు ఫలియించుఁ,
　　గాని, వానిగుణము గాంచ దెప్డు,

(౧) ............................ (౨) పూనుకొన్న — యతిపూరణము. (౩) మిగుల — పాదపూరణము. (౪) కూడక — పూనుకొన్నఁగూడ: పూనుకొనకపోయిన ఫలించుట నిశ్చయమే కదా! పూనుకొన్నప్పటికిని ఫలించునని యనుభవవిరుద్ధ మర్థము. (౫) ఎపుడు — ఇది ఏల? పాదపూరణము. వ్యావహారిక ధోరణి.

ఆ. వె. ఒకతె జలము దెచ్చె నొక్కతె గంధంబు
దీయఁ, బూలు గ్రుచ్చెఁ దెలివి యొకతె,
కోట గ్రుమ్మ మండ గోలంబకణి యొ
క్కర్తెకరిత యింపు గలుగఁ బాడు.

(౧) పూలు గ్రుచ్చె — 'విచిత్రాః' అనునది త్యజింపఁబడినది. (౨) ఒక్కర్తెకరిత — పంచిన దొకరిత, పాడినది మరియొకరిత యని యిందున్నది. ఇది మూలవిరుద్ధము. మూలమున దంచునవియే కలహుంకారముతో రోఁకటితో పోటు వేయుచున్నదని యున్నది: 'ముసలమిద మియంచ పాతకాలే ముహు రనుయాతి కలేన హుంకృతేన'(౩)............(౪) ఇంపు గలుగఁ బాడు — మూలమందు కల హుంకారము చెప్పఁబడినదే కాని పాటగాదు.

ఆ. వె. చంద్రమండలమ్ము పరభసంబునఁ బూని
పాపి కేతు వకట ! పట్టఁ దలఁచె
పూవుఁబోఁడి! యైన బుధయోగ మద్దానిఁ
గాంచుచుంట నద్ది కలుగ దిపుడు.

(౧) చంద్రమండలంబు — 'చంద్రమసం పూర్ణమండలమ్.' ఇందు పూర్ణపదార్థము త్యక్తము. (౨) అద్దాని — దేనిని? చంద్రమండలమునా? ఆపక్షమున 'అద్ది' కలుగదు అనఁగా చంద్రమండలము కలుగదని యర్థముగాదా! ఈ 'యద్ది'కి విశేష్యమేమి? చంద్రమండలము కాదేని, పట్టఁదలఁచుటయా, పట్టుటయా? పట్టుటయే. ఈయన్వయము పీఁకులాటగానున్నది.

క. కటకట ! నందునివంశము
పటుతర నిజ కోపవహ్ని పాల్సేసిన యా
కుటిలుండు చంద్రగ్రహణం
బిట చేసనఁ జంద్రగుప్తుఁ డేయని యెంచెన్.

(౧) ఇట — ప్రాపశరణము. (౨) కుటిలుఁడు ... చంద్రగుప్తుఁడే — చంద్రగుప్తునికే కుటిలుఁడు విశేషణముగాఁ దోఁచును. (౩) చంద్రగ్రహణం బిట చేసనఁ జంద్రగుప్తుఁడేయని యెంచెన్ — చంద్రగ్రహణమే చంద్రగుప్తుఁడని యెంచెనా? లేక చంద్రగుప్తుఁడని యెంచెనా? చంద్రగుప్తునికి గ్రహణమని యెంచెనని మూలాభిప్రాయము. "చంద్రునికి గ్రహణమని చేసనఁ జంద్రగుప్తునికని యెంచెన్" అను రీతిని 'చంద్రునికి చంద్రగుప్తునికి' అని ఏకవిభక్తికముగ నున్నఁగదా మూలార్థమగును. 'చంద్రస్య గ్రహణమితి శ్రుతేః సనామ్నో మౌర్యేన్దోర్ద్విషదభియోగ ఇత్యవైతి'

తే. గీ. మదపుటేనుఁగు నెత్తురు మయిరి గలుగ
సంజ కెంజాయలో నున్న చంద్రుపగిది
నతిశయిల్లెడు ; హరి యట్టి యావులింప
నెవఁడు కోరలు పెకలింప నేర్చువాఁడు?

(౧) మదపుటేనుగు — మూ. "ఆస్వాదితద్విరదశోణితశోణశోభాం సంధ్యారుణామివ కలాం శశలాంఛనస్య; జృంభావిదారితముఖస్య ముఖాత్ స్ఫురంతీం కో హర్తుమిచ్ఛతి హరేః పరిభూయ దంష్ట్రామ్." దీని యర్థము: 'ఒకసింహము ఏనుఁగులరక్తమును అప్పుడే త్రాగి ఆవులించుచున్నది. ఆరక్తముచేత దానికోఱపల్లు సంధ్యారాగమునందలి చంద్రకళవలె ఎఱ్ఱఁగా వెలుఁగుచున్నది. అట్లావులింతలో నోరు తెఱచుకొని యున్న యాసింహమును ధిక్కరించి దానినోటిలోని యాకోఱను ఎవఁడు పెఱుకఁగోరుచున్నాఁడు.' ఇందు 'నందులు ఏనుఁగులు, సింహము చాణక్యుఁడు, సింహము నోటిలోని కోఱ చాణక్యరక్షితుఁడయిన చంద్రగుప్తుఁడు. ఇప్పుడే నందులం గూల్చి తృప్తుఁడయిన చాణక్యుఁడు మహాసమర్థుఁడు రక్షకుఁడైయుండఁగా ఎవఁడు చంద్రగుప్తుని పట్టువాఁడు' అని భావము. ఈభావముగాని, మూలపదాన్వయముగాని రాయని వారికి గోచరించి నట్లగపడదు. అందులకు జ్ఞాపిక కోఱలు అను బహువచనము. ఒకటియైన చంద్రగుప్తునికిం జెల్లును. పెక్కులయిన ప్రస్తుతమును సూచింపనేరవు. మఱియు నీతిర్గిమూ అంతిము మూలవిరుద్ధముగా నున్నది.

సీ. శత్రుకాంతల ముఖ చంద్రబింబంబులఁ
గడు శోకధూమంబు కతనమికుల
నలుపారఁజేసియు నయపవనంబున
మంత్రిభూజముల భస్మంబు చేసి
బంధుమిత్రులు ద్విజవర్గంబు లేకుండ
నందవంశమునకు నాశ మొసఁగి
భస్మంబు సేయంగ వస్తుజాలం బింకఁ
గానమి మత్ప్రతాపానలంబు
గీ. విపినమున వహ్ని శమియించు విధము దోఁప,
శాంతభావంబు నొందె నీ చందమునను
గాని మనమున ఖేదంబు గలిగి కాని
కరముఁ గోపింతు రరులని గాని కాదు.

(౧) శత్రుకాంతల—మూలము: "శ్యామీకృత్యాననేందూ నరియువతిదిశాం సంతతైః శోకధూమైః, కామం మన్త్రిద్రుమేభ్యో నయపవనహృతం మోహభస్మ ప్రకీర్య; దగ్ధ్వా సంభ్రాంత పౌరద్విజగణ రహితాన్నంద వంశప్రరోహాన్, దాహ్యాభావాన్న ఖేదాజ్జ్వలన ఇవ వనే శామ్యతి క్రోధవహ్నిః". (ఇట) శత్రుకాంతలు దిక్కులుగాను, వారిముఖములు చంద్రులుగాను, శోకము ధూమముగాను, సావయవరూపకముగా వర్ణింపఁబడినవి. ఈవర్ణన క్రోధమును దావానలముగా ఈశ్లోకమందే చతుర్థపాదమునఁ జేయువర్ణన కత్యంతానుకూలముగా నున్నది. శత్రుస్త్రీలు దిశలని యీతెనుఁగునఁ జెప్పనందున ఈరూపకము సొంపుపోయినది. (౨)నయపవనంబున మంత్రిభూజముల భస్మంబుచేసి—పవనముచే భస్మముచేసెననుట యసంగతము; అనుభవవిరుద్ధము. లోకములో అగ్నితో భస్మముచేయుదురుగాని గాలితోఁగాదు. మూ: 'మన్త్రిద్రుమేభ్యో నయపవనహృతం మోహభస్మప్రకీర్య'— 'నీతి యను గాలిచే లేఁబడిన అజ్ఞానమనెడు బుగ్గిని మంత్రులను చెట్లపైఁజల్లి' అని అర్థము. 'చాణక్యుఁడు నంద రాజమంత్రులను తనతంత్రములు తెలియనీక, నందరక్షణార్థమై వారేమి చేయవలెనో అదియు వారికి తెలియకుండునట్లు తననీతి ప్రయోగముచేత చేసెనని తాత్పర్యము. మఱియు కథలో చాణక్యుఁడు నందరాజులను కూల్చెనుగాని మంత్రులం ప లేదు. మంత్రులు రాక్షసాదులు బ్రాహ్మణులు. వారిహననము నెప్పుడు నెవరును యత్నింపరు. (౩) బంధుమిత్రులు ద్విజవర్గంబులేకుండ నందవంశమునకు నాశమొసఁగి—ఇది కేవలము భ్రష్టము. మూ: "దగ్ధ్వా సంభ్రాంతపౌరద్విజగణరహితాన్ నందవంశప్రరోహాన్." దీనియర్థము: 'దిగులుపడి పౌరులనెడు పక్షిసంఘము లెగిరిపోగా మిగిలి నిలిచియున్న నందరాజులనెడు వెదుళ్ల మొలకలను కాల్చి' అని. ఇదియు క్రోధము దావాగ్ని యనెడు రూపకమునకు మిగుల ప్రాపకము. దాని నిట్లు 'నాశమొసఁగి'నారు (౪) 'ప్రతాపానలంబు'—వక్త చాణక్యుఁడు-బ్రాహ్మణుఁడు; నీతిప్రయోక్త. యుద్ధవీరుఁడు గాఁడు; రాజుఁగాఁడు. ఇతనికి ప్రతాపమనుట అసంగతము. మూలమున 'క్రోధవహ్ని' యనియున్నది. (౫) 'ఈ చందమునను—యతిపూరణము. (౬) మనమున ఖేదంబుగలిగి కాని—ఇందు ఈమనము చాణక్యుని మనమని తోఁచును. మూలమున ఖేదము క్రోధవహ్నిదిగా చెప్పబడినది. 'నా కోపాగ్ని దహించుటకు దాహ్యము లేనందున—అనఁగా సర్వమును దగ్ధముచేసివేసినందున మఱి పనిలేక ఆఱెనేకాని అలయికచేత ఆఱినదికాదు. ఇంకను దాహ్యము కలదేని దానిని ఇప్పుడు దహింప సిద్ధముగానున్నది' అని మూలభావము; నే వలసితిని గానని మూలభావము కాదు. (౭) కరము కోపింతురరులని కాని కాదు—ఇది సొంత కల్పన; మూలమున లేదు. దీనిని మానిన నింతకన్న మేలు. పంచపాదులను, షట్పాదులను చెప్పుట కేమిన్యాయమో త్రిపాదికి అదేన్యాయము కలుగును. గీతవలన గీతమునకు చెఱుపే కలిగినది. ఎట్లన: అరులు కోపింతురని చాణక్యుడు వెఱచునని శిశువయినను దలఁచునా! గోలీలాడిన నాయన కోపించునని బాలుఁడు భయపడురీతిగా చాణక్యుఁడు అరులు కినియుదురని భయపడుచుండును గాఁబోలు! వారిచిత్తమున కగ్గు సేయ నితఁడు వెఱచునేని వారి కితఁడు మిత్రమే యగును; వారు నితనికి మిత్రులేయగుదురు. అట్టివారిని అరులనుట ఎట్లు! కావున నీపాదము శిశుజల్పితసరణిం బురణించుచున్నది.

మ. ఘను నాఁడాగతిఁ బట్టి నిందు సభలో
నన్ లాగి పోఁ ద్రోయఁ జా

చినవారందఱు తేఱి కోపించియును ఛీ
ఛీ యనుచు లోఁ దిట్టుచుం
గని చింతించిరి ; వారలే యిప్పు డిటుం
గన్నారుగా ! రోషమున్
గినుక న్సింగము కొండనుండి గజముం
గ్రిందం బడంద్రోయు లా
గున నే నందుని గద్దెనుండి త్వరతోఁ
గూల్పంగ నుత్సాహినై.

(౧) నిండుసభలో నన్—ఇది తప్పు. చాణక్యుని అగ్రభోజనపీఠమునుండి నెట్టివేసినట్లు కథలోనున్నది; సభలోనుండి యీడ్చివేసినట్లు లేదు. మూలములో 'అగ్రాసనతః'—'అగ్రాసనమునుండి' అని యున్నది. అనువాదకులు దానిని వదలినారు. ఆ యగ్రాసనమే అగ్రభోజనపీఠము. కథ చూచుకొనవలెను. కథను తెలుపవలసిన యగ్రాసనకథనమును మాని వ్రాయునారు అందులకై పాదమును 'అగతిన్' పట్టి 'నాఁద్రోయఁగ' అను పదముల ఖిలముచేసినారు. (౨)'అవశమ్'—'అసహాయుఁడనైన నన్ను' అని భావము. దానిం ద్యజించినారు. దానికిని పూర్వోక్తమే ప్రతినిధి. (౩) చూచినవారందఱు...కని చింతించిరి—'చూచిన'పదముండఁగా పైఁగా 'కని' పదమేల? (౪) ఓపియును—'యును' పదము నెత్తివేసికొనవలెను. 'ఓపియును....లోఁ దిట్టుచున్' అనుటచే ఓపనియెడల తప్పక లోఁ దిట్టుదురని గమ్యమగును. అట్లు చేయుదురనుట యసంగతము; ఓపలేని బహిరంగముగనే తిట్టుదురు. 'యును' పదము నెత్తివేసికొనిన ఈ యసంగతార్థస్ఫూర్తి యడఁగి ఆ సంగతార్థ స్ఫూర్తి కలుగును. (౫) ఛీ ఛీ!—వారింత ఒత్తియుండి లేని తనికిం దెలిసియే యుండును. ఈదేశ్యము నిట్లనాంధ్రగ్రయుక్తముగాఁ జెప్పుటందులకు ఫలమేమి? తనికిఁ దెలియుటయే? లోఁదిట్టినవారుం గావున 'ఛీ! ఛీ!' అనుటయే యుక్తము. (౬) కినుకన్, త్వరలో, ఉత్సాహినై—ఇవి నిర్మూలములు. పాదపూరణార్థము మాత్రములు. (౭) ఇందు త్యక్తములెవ్వియన: ముఖైః అవనతైః (మొగములువంచి). కొండనుండి—(అద్రి) శిఖరాత్. (గజమున్) (౮) జేన్ద్రమ్, సాన్వయమ్. (౯) లాగి—ఈయర్థమున నిట చప్పని వ్యావహారికపదము.

(౯) కినుకన్— కినుక (కోపము) సింగమునకా తనకా? (౧౦) ఉత్సాహినై —ఈమాట యిచట భావాభాసకరము. (౧౧) పంచపాది. అయిదుపాదములు కొనియును కథను, అర్థపుష్టికి వలసినపదములను ఏకిటిని విడిచిపెట్టినారు.

ఈ నంగుల నందఱుం గనిమి
నాటిని లక్ష్మిని జాఁగుప్తునం
దందము మీఱఁ బద్మము జ
లాశయమందునఁ బోలె స్థైర్యముం
బొందఁగ ; పంచినాఁడ ఫల
ము ల్సరిగాఁ గనె యిర్వురందు, నా
నందుని యందుఁ గోపమును
నా ప్రియశిష్యునియందుఁ బ్రేమయున్.

(౧) అందఱన్—తొమ్మండ్రుగనిని అని మూలమునన్నది. (౨) నందులన్—మూలమున భూదేవికి వ్యాధ్రోగము వంటి వారయిన అని నందుల కుపమానమున్నది. అనువాదకులు దానిని వదలినారు. (౩) పద్మము—పద్మము నాటుట యెట్లు? చచ్చిన వానిని పాఁతినట్లు పాఁతుటయా? పద్మము త్రుంచినపుడే చచ్చును. దానిని నాటి యది బ్రతుకుటయెట్లు? మూలమున 'నళినీ' అని తామరతీగ చెప్పఁబడినది. తీగను దుంపతో తెచ్చి నాటిన నది బ్రతుకును. మఱియు ఆ స్త్రీలింగము ఉపమేయమయిన లక్ష్మితో సామ్యార్థము ఎంత యొప్పిదముగా నున్నదో చూడుఁడు. పద్మమనుటచే ఆసామ్యము చెరుచుటయే గాక అసంభవమునుగూడ పలికినారు. (౪) ఫలముల్—దేని ఫలములు? మూలమున కోపప్రీతులయొక్క ఫలములు అని యున్నది; ఇందు తద్విసంవాదముగా. (౫) కోపము ప్రేమయును అనుటచే కోపప్రీతులే ఫలములని వర్ణితమైయున్నది. (౬) అన్వయము — 'అందముమీఱ': ఇది దేనికి చెందును? లక్ష్మికా? పద్మమునకా? (౭) స్థైర్యముఁ బొందఁగ — ఇది నాటుటకు విశేషణము; మిగుల వ్యవహితము. పై సెమికోలను లేనియెడల ఇది ధోరణ్యనుసారముగా పంచుటకు విశేషణమగును. వక్త్రర్థబోధకముగా శబ్దప్రయోగము చేసికొనవలయుఁ

గాని అచ్చుచిహ్నములం భిక్షించుటయు నొక ప్రయోగ లాలిత్యమా? (౮) 'అభియుక్తేన మనసా'—దీనిని వదలినారు.

చ. అరయఁగ విత్తసంయుతుఁడగు
నట్టినరేంద్రుని జేరియుందు రెం
తలో; పతి విత్తహీనుఁడయి
నం దను కష్టదశోకల్గు నంతఁ బా
యుదు; పతి సెల్లిన స్వామున
రాకులము న్మది దేనిఁ గోరిరో!
యగుదుగ ! నిన్నుఁ బోలెడు మ
హాత్ములు భూమిలమందు రాక్షసా!

(౧) చేరియుందురు— 'అర్థతః'— ధనముకొఱకు అని మూలము త్యక్తము. (౨) విత్తహీనుఁడయినన్— ఇది తప్పు. 'విపత్తిషు'—అపాయములలో పడియుండిన అని మూలము. 'తమ కష్టదశోకల్గునంతు'—ఇదియును దప్పు. 'పునస్సంప్రతిపత్తికాంక్షయా' — మరల నతనికి రాజ్యము వచ్చునను ప్రత్యాశచేత. అని మూలార్థము. (౩) 'మది దేనిఁగోరిరో'—ఇది అమూలకము. కారణము తెలియలేదని దీనికి భావము. కారణము మూలమునఁ జెప్పఁబడియున్నది. 'పూర్వసుకృతాసంగేన నిస్సంగయా భక్త్యా'—పూర్వము, అనగా ఆప్రభువు బ్రతికియున్నప్పుడు, అతను చేసిన మేలును స్మరించి ఆతనియందు ఇప్పుడు ఫలప్రత్యాశ లేనిభక్తిచేత—అని మూలార్థము. ఈభాగము మిక్కిలి ప్రధానమైనది. దీనిని వీరు వదలి 'దేనిఁగోరిరో' అని తెలిగించినారు. ఏదేని కోరిక గలిగి భర్తృకుల పక్షపాతము పూనినచో ఆ మంత్రియందు గొప్పతన మేమున్నది?

ఉ. స్వామికిఁ గూర్చువాఁడయినఁ
బ్రజ్ఞ యొకింతయు లేకయున్నచో
నేమి ప్రయోజనం బగును ?
ఎంతయుఁ బ్రజ్ఞను గల్గియుండియున్
స్వామికిఁ గూర్పఁడేని వృథ
భక్తియుఁ బ్రజ్ఞయుఁ గల్గువాఁడె పో
యీమహి భృత్యనామమున
కెంతయు నర్హుఁడు; భృత్యుఁ డయ్యుఁ దా
నీమహనీయసద్గుణము
లేవియుఁ జెందఁడ, జాయ నాఁ దగున్.

(౧) లేకయున్నచోన్ — ఎవరికి? (౨) లేకయున్నచోన్—లేనిచోన్ అనుటకు వాగ్డంబరము. (౩) ఒకింతయు...... ఇది మూలమున లేదు; అప్రయోజకము. (౪) ఏమి ప్రయోజనంబగును?—ఎవనికి? (౫) ప్రజ్ఞయొకింతయు—ఇందు ప్రజ్ఞాహీనతను మాత్రము చెప్పినారు. మూలమున 'కాతరేణ' అని విక్రమహీనతనుకూడ చెప్పినారు (౬) ప్రజ్ఞనుగల్గి—ఇదు ప్రజ్ఞనుమాత్రమే చెప్పినారు. మూలమున విక్రమముగూడఁ జెప్పఁబడియున్నది. (౭) ఎంతయు—ఇదియు అమూలకము. (౮) భక్తియుఁ బ్రజ్ఞయు—ఇచటను మూలమున విక్రమము గూడఁ జెప్పఁబడినది. (౯) ఈమహి—యతిప్రాసపూరణము. (౧౦) ఎంతయు—అమూలకము; యతిపూరణము. (౧౧) మహనీయ సద్గుణములు—మహనీయ=సత్; ఈ రెంట నొకటి మానఁదగు. (౧౨) చెందఁడ—చెందఁడేని అని యుండవలయును. (౧౩) జాయ—ఎవరికి? (౧౪) భృత్యనామమున కెంతయు నర్హుఁడు—మూలము: 'భూతయే తే భృత్యా నృపతేః'— ఆభృత్యులవలన రాజునకు భూతి అనగా ఐశ్వర్యము కలుగును—అని యున్నది. దానిని వీరు ఇట్లు మందీకరించినారు. (౧౫) జాయనాఁదగున్—ఇచట మూలములో 'సంపత్సు చాపత్సు చ' సంపదలయందును ఆపదలయందును అనియున్నది. ఈ బెడఁద మనకేల 'యని వదలినారు. (౧౬) ఇది పంచపాది. ఏల మఱి యొక పుంజీపాదములయిన వేసుకొని వదలినవారి భావమును తూర్పారపట్టినట్లు చెప్పుకొని పోవుచుండరాదు? త్యక్తములు ౬.

క. మనుజేంద్రుఁడును గజేంద్రుఁడు
ననయము చింతించుచుందు రాహారంబున్
గొనవలెఁ దమకుం దామని,
పనివడి తముఁ గొల్చు భృత్యవర్గము లుండన్.

ఈపద్య మధ్వాన్నముగా నున్నది. మూలము:
"స్వయ మాహృత్య భుంజానా
బలినో ఽపి స్వభావతః;

గజేన్ద్రాశ్చ నరేన్ద్రాశ్చ
ప్రాయ స్సీదన్తి దుఃఖితాః."

భావము:—'స్వభావముచే బలాఢ్యుఁడయ్యును తాను సంపాదించుకొని యనుభవించు రాజును, అట్లే స్వభావముచే బలాఢ్యమయ్యును తానే ఆహారము సంపాదించుకొని భుజించు గజమును ప్రాయికముగా దుఃఖముచే నలసిపోవును'-దీనికిని పద్యమునకును సంబంధము స్వల్పము; విసంవాద మధికము.

క. కమలము మిక్కిలి సౌంద
ర్యము గలదియె యైన దాని యంతఃకరణం
బు మిగుల నీచం బయినది
యమలుఁడగు చంద్రుఁ డిట్లు నా కాకున్నన్.

(౧) 'మనోహరాణామపి' యనుటకు 'మిక్కిలి సౌందర్యము గలదియె యైన' అని—తెనుఁగు దీర్ఘముగా నున్నది. (౨) మిక్కిలి—పాదపూరణము. (౩) మిగుల, అయినది—పాదపూరణములు. (౪) దానియంతఃకరణంబు మిగుల నీచంబయినది—ఇందులకు మూలము 'రూపాద్విసంవదతి శీలమ్'-'రూపమునకు విపరీతముగా నున్నది నడువడి' అని. ఈతర్జుమాపంక్తికిని మూలపంక్తికిని సామ్యము తక్కువ. (౫) ఇట్టు నా-కమలము ఇట్లనుట ప్రల్లదము. కమలమునకు వాగింద్రియ మెక్కడిది? అట్టిట్టట నిజమే అని యొప్పుకొందముగాక, అప్పటికయినను అది అనువాదకుల కెట్లు తెలిసినది? మూలమునః 'యానిసంద్రేవిరుద్ధాని'- ఏవి చంద్రునియందు విరుద్ధములో అని యున్నదిగాని ఇట్లు గిట్లు ఏమియు లేవు. (౬) అమలుండగు—మూలము: 'సంపూర్ణమండలేఽపి'—పూర్ణమండలముగలవాఁడయినను అని. చంద్రపరమున మండలశబ్దమునకు బింబపరముగాను, చంద్రగుప్తపరమున ద్వాదశరాజకమండలపరముగాను ప్రయోగము. వీరు ఈవిశేషణమును 'అమలుండగు' అని చప్పఁజేసినారు. ఇందు వక్త చారుఁడు. చంద్రగుప్తుని యందపరక్తులగు జనులంగనిపెట్టి తినని యీశ్లోకముచే సూచించుచున్నాఁడు. కమలములచే పైకనురక్తులవలె నటించుచు లోలోపల చంద్రగుప్తునిపై కుట్రలు చేయుచుండు జనులు సూచింపఁబడుచున్నారు. (౭) వచనములో కమలములు అని బహువచనముగా ఆరంభించి పిమ్మట పద్యములో ఏకవచనీకరించుట అందముగాదు. ఈ ఏకవచనము అపరక్తప్రజలు అనుమూర్తికి అనుకూలముగాను. బహువచన మనుకూలము.

శా. కౌలూతుం డలచిత్రవర్మ ధరణీ
కాంతుండు; కాశ్మీరభూ
పాలుం డౌ వల పుష్కరాక్షుఁడును; నా
పై నా నృసింహుండును; శా
ర్యాలంకారుఁడు సింధుసేనుఁడును; మే
ఘాఖ్యుండు; నా సేవురన్
నాలేఖ న్లిఖియించె దండుడిచి పో
నా చిత్రగుప్తుం డిటన్?

(౧) ధరణీకాంతుండు — యతిపూరణము. (౨) నాపై — నాపైకి బదులుగా మూలమున 'మలయనరపతిస్సింహనాదః' — మలయరాజు సింహము యొక్క నాదమువంటి నాదము గలవాఁడు— అని నృసింహునికి విశేషణము వేసినారు. దానికి బదులు ఈనాపై. (౩) సింధుసేనుండు-(సింధుషేణుఁడు) సింధుదేశపురాజని మూలమున. (౪) మేఘాఖ్యుండు—ఇతనికి మూలమున 'పంచమః పృథుతురగబలః పారసీకాధిరాజః' — అయిదవవాఁడు విస్తారము గుఱ్ఱపుదండుగలవాఁడు పారసీకదేశపురాజు అని విశేషణము లున్నవి. అవియెల్ల నిందుజ్యక్తములు. (౫) ఇటన్—అంత్యపూరణము.

క. కడు నిరపరాధి కైనన్,
వొడమెడుఁ జాణక్యుఁ జూడఁ బోవఁగ భీతుల్
గడు నపరాధిని నే నీ,
యెడ నాతనిఁ జూడ నెట్లు లేగెదు వాఁడన్?

(౧) కడు — ప్రాస పూరణము. (౨) భీతుల్—ఈ బహువచనము నాందీపద్యములోని 'విస్మృతుల్' అను బహువచనము వంటిది. (౩) ఈయెడ—ప్రాసపూరణము. (౪) ఎట్లు లేగెదువాఁడన్, (౫) చూడఁబోవఁగ—మూలార్థముఁ దెలిపెదు; అంతట నిందలిని బహుదోషములు స్పష్టపడును. "కరుణాహీనుఁడయినచాణక్యుఁడు ఆకస్మికముగా పిలిపించెనేని నిర్దోషుఁడయిన

కాను నికిగూడ భయముకలుగును. సదోషుఁడనైన నామాట చెప్పఁగలరుగదా?"

క. ఈ యుములు బహుళం బయ్యెన్,
బర దేశమునందు నిలిచె భామామణియున్
గఱచె నహి శిరసుమందుల
కొఱకై చనవలె హిమాద్రి కూటంబునకున్.

మూలమున కర్థము: 'వర్షించు చున్న మేఘములగర్జన నెత్తిమీద; ప్రియ దూరమందు. ఏమి యిదిసంభవించినది? హిమవంతమున దివ్యౌషధులు. పాము శిరమునఁగూర్చున్నది.

చ. అరయఁ గుశాగ్రబుద్ధులు మ
హాబలవంతులు నైన మంత్రులిం
దఱుఁ జలచిత్త లక్ష్మిఁ దమ
నందునియందటు నిల్పలేకపో
యి రిపుఁడు చంద్రగుప్తు వరి
యించినయామెను చంద్రునుండి సు
స్థిర మగుకాంతిఁ బోలె విడఁ
దీయఁగఁ జాలుదురే యొకింతయున్?

(౧) కుశాగ్ర బుద్ధులు — 'నయశాలిభిః'— నీతి శాలులు—అని మూలము. మంత్రులకు నీతిపాటవము వక్తవ్య విశేషము. 'కుశాగ్రబుద్ధి' సామాన్యము. నీతిచేతఁగదా వారు లక్ష్మిని రాజునందు నిలుపుదురు. వారు పఠింపవలసిన శాస్త్రమునకును నీతిశాస్త్రమని పేరుగాని కుశాగ్రబుద్ధిశాస్త్రమునిగాదు. 'ఆన్వీక్షికీత్రయీవిద్యాదండనీతిశ్చశాశ్వతీ'—కామందకము, 'కామందక నీతిశాస్త్రము'— శుక్రనీతిసారము. 'సర్వగుణైనవారి నీతి స్ఫురణము పగరాజునతనిభూమియు చెఱుచున్'— భారతము. రాజనీతి ఇత్యాదులను శతశః ఎఱుంగవచ్చును. ౨. బలవంతులు— మూలము 'విక్రాంతులు' అని. విక్రమము చెప్పుటయే శ్రేయము. విక్రమముచే గదా బలమునకు వినియోగము. విక్రమముచే బలము గమ్యముగాని బలముచే విక్రమము గమ్యముగాదు. (౩) మంత్రులు— మూలమున వక్రనాసాది మంత్రులని పేరుచెప్పఁబడి యున్నది. ఇందుఁగూడ పాదములు పెంచియేని యేల చెప్పరాదు? అనావశ్యకమని తలంచిరిగావలయు. (౪) ఇందటు—అమూలకము. అఁదఱనుట మేలు. (౫) నందుని యందు—'నందుఁడు జీవించియుండఁగా' అని మూలము. ౬. చలచిత్తలక్ష్మి—చలించుచున్న లక్ష్మిని అని మూలము. చలచిత్తయనుట స్వభావానువాదమాత్ర విశ్రాంతమగుటయేనం గావచ్చును. చలించుచున్న యనుటచే రాజ్యము నందుని యందు స్థిరముగ నెలకొనలేదనియు, శత్రువుల యభియోగము వలుమఱు కలుగుచుండెనని యు భావము. (౭) ఉత్తరార్ధము కేవలము మూలవిరుద్ధము. ఆ వక్రనాసాది మంత్రులే చంద్రగుప్తుని నుండి లక్ష్మిని తొలఁగింపలేరని యిందుఁ జెప్పఁబడియున్నది. మూలమున 'ఆలక్ష్మిని ఇపుడు చంద్రగుప్తునినుండి యెవఁడు వేఱుసేయ నేర్చు' నని యభిప్రాయము. ఎవఁడు వేఱుసేయ నేర్చు ననఁగా రాక్షస మంత్రి వేఱుసేయ సమర్థుఁడుగాఁడని వక్తృహృదయము. 'మహాసమర్థులయిన వక్రనాసాది మహామంత్రులే నంద రాజు జీవించియున్నప్పుడే సాధింపలేని రాజ్యలక్ష్మిని నందరాజు లేని యీకాలమున యీ సామాన్యమంత్రి రాక్షసుఁడు సాధింపగలఁడా! ఱొత్తుగా సాధింపఁ జాలఁడు' అని తారతమ్యనిబద్ధముగా రాక్షసాభియోగ నిష్ప్రయోజనతాకథనము. ఇట్టియుత్తరార్ధము 'పెంకాయపిచ్చికొండు' న్యాయమునవున్నది. (౮) ఉత్తరార్ధమున 'ప్రహ్లాదయంతంజగత్' లోకమును సంతోషపెట్టుచున్న, 'ఏకత్వ ముపాగతామ్' (చంద్రగుప్తునితో) నొకటిగా కలసిపోయిన— ఈరెండును సారవంతములే త్యక్తములు. ఇందు మొదటివిశేషణముచే రాజ్యస్థైర్యమునకు ముఖ్య కారణమయిన ప్రజానురాగము చెప్పఁబడినది. ప్రజానురాగము లేనందున నందునిరాజ్యము స్థిరపడలేదు. అది కలిగినందున చంద్రగుప్తునిది స్థిరపడినదని భావము. ఐక్యము చెప్పుటచే చంద్రునినుండి వెన్నెలను, సూర్యునుండి తేజమును, అగ్నినుండి వేఁడిని వేఱుచేయనలవిగానట్లు చంద్రగుప్తునుండి రాజ్యలక్ష్మిని తప్పించుట శక్యముగాదని భావము. మూలార్థాజ్ఞానముచే ద్రష్టిగా తప్పుటయేగాక సార విశేషణత్యాగముచే అతస్ఫూర్తిగ్నిగూడా నప్పఁబడినది:

క. తన ప్రభువునకుం గిట్టని
జనులను విడనాడి యెంతొ సౌఖ్యపడక యీ

ఘనుఁడు శిబిచక్రవర్తిం
దనశరణాగత భరణము నం దలపించుచున్.

(౧) విడనాడి —— 'పరసంవేదనే' ఇతరులను (పలాని చోట నున్నా రని) తెలుపుటచే అని మూలము. (౨) ఎంతో సౌఖ్యపడక—'సులభేష్వర్థలాభేషు' —అట్లప్పగించుటచే ధనములు సులువుగా దొరకుచున్నను అనిమూలము. (౩) ఉత్తరార్థమునకు శిబితప్ప నిట్టి దుష్కరమును మఱి యెవఁడు చేయును' అని మూలము. (౪) 'విడనాడి సౌఖ్యపడక' అనుటలో విడనాడె ననియు, ఆదోషమువలన సౌఖ్యపడలేఁడనియు ఒకయర్థమును, విడనాడకేదనియు విడనాడుటచే రాఁదగిన సుఖములం గోలుపోయెననియొకయర్థమును, రెండుపరస్పరవిరుద్ధార్థములు స్ఫురించుచున్నవి. (౫) మూలమున నిది అప్రస్తుతప్రశంసాలంకారముగానీరీతినున్నది: "పరులనుపట్టి యిచ్చుటచే అర్థములు సులువుగా లభింపనుండఁగా శిబిచక్రవర్తిగాక మఱి ఎవ రీరీతిని, ఇట్టిదుష్కరధర్మమును చేయుదురు?" ఈయప్రస్తుతప్రశంస ఎంతబలీయముగా నున్నదో, దాని యీ తెనుఁగు పద్యము ప్రస్తుతప్రశంస ఎంతదుర్బలముగా నున్నదో పరికింపుఁడు.

క. తను గాపాడుటకై గద,
తనప్రాణము లిప్ప డితఁడు త్యజియించెడు? నీ
ఘనమిత్రుని విషయంబునఁ
దనప్రాణముమాత్ర మితఁడు దాఁచుకొనెడు నా?

(౧) తనుఁ గాపాడుటకై —— ఇందలి తనశబ్దము లెవరికిఁ జెల్లునో తెలియుంగుట సులువుగాదు. రాక్షస చందనదాసు లిరువురిలో ఇతనికే ఈతనశబ్దమని నియమ మేర్పడదు. రెండవతనశబ్దము సహజముగా తొలి తన శబ్దారంభసామర్థ్యముచే రాక్షసునికే చెల్లును. రాక్షసుని ప్రాణములనుచందనదాసుఁడు రక్షింపకమానుచున్నాఁడని వాక్యార్థమగును. కథ తెలియక తప్పు దిద్దికొనఁ దెలియదు. రాక్షసునికి 'తప్ప'అని 'తెన్చ్ఛబ్దంబును, చందనదాసునికి అప్ప అని ఇదంశబ్దమును వెవ్వేరు సర్వనామములు ప్రయుక్తములయినందున మూలమున నీయవర్థములేదు. (౨) తనుఁగాపాడుకొనుటకై చచ్చుచున్నాఁడనియు అర్థముగాఁదగు, అనఁగా మహాపరాధులు రాజదండన భయముచే విషభక్షణాద్యుపాయముల నీల్గినట్లు అని భావమగును. ఈపద్యమున గణబంధము తప్ప పద్యమనిపించుటకు విశేషము మఱియేమియు లేదు. దీనిని వ్యావహారికశైలిలో గణబంధముతప్పించి వ్రాసెదంగనుడు. అప్పటికి నామాట స్పష్టపడును.

"తన్ను కాపాడడానికోసము తనప్రాణాలు ఇప్పుడితఁడు త్యజిస్తున్నాఁడు. ఈఘనమిత్రుని విషయంలో తనప్రాణము మాత్ర మితఁడు దాఁచుకొంటాడూ?"

ఉ. పోయినవారు పోయినను
బోఁదగ నెంచెదు వారు నిప్పుడే
పోయినఁ గాని యింద ఱిటు
పోయి రటంచని యెంచ; నందఱుం
బోయినఁ గాని నంతకుల
ముం ధర రూపము మాపినట్టినా
యీయొకచిత్తమున్ ననుఁ ద్య
జింపక నిల్చినఁ జాలు నెప్పుడున్.

(౧) పూర్వార్థమునకు సహజముగా నగునర్థము: ఇప్పటికి పోయినవారిని పోయినారని ఇప్పుడు నేనెంచను; పోఁదలఁచినవారుకూడను పోయిన పిమ్మట నొకటేమారు పోయిన వారందఱిని ఎంచెదను; పోయినవారుపోయిరని నే చింతిల్లను ఉన్న రందఱు పోయినను నేను పరకునేయను. నేనాశిక్షకులకన్న నెక్కుడుగా కార్యసాధికయైనదియు, సందులు సామ్మాలించి తననుహించును ప్రకాశించినదియు నైన నాబుద్ధి మాత్రము నన్నువదలకున్నఁజాలును.

తే. గీ. మహిని నేశ ప్రచారంబు మదబలంబు
దనరు స్వచ్ఛందగతియును దాన మహిమ
గలిగి పనగజ ఘట్టులు, మెలఁగునిన్నుఁ
బ్రజ్ఞ మెయిఁ బట్టి నృపులని మంత్రి జేయఁ
జేసెదవో లేదో చూడు సాచివ్య మీవె!

(౧) మహిని—పాద పూరణము (౨) తనరు—పాద పూరణము. (౩) చేసెదవో లేదో చూడు సాచివ్య మీవె— ఇదియాత్మగౌరవములేని క్షుద్రవైరుల ఉచితమైన జంకెన; అమూలకము. ౪. పంచపాది. [సశేషము]



స త్య సి నో టి

చిత్రకారుడు: మంత్రవాది వెంకటరామయ్యగారు, తెనాలి.

# భట్టబాణుని గృహాగమనము

కోమాండూరు కృష్ణమాచార్యులు గారు

ధౌతాసి ప్రతిమాంబరంబు విగళత్సౌదామనీ దామ ము
ద్ధూతాంభోధర మండలం బహిమరుద్దుర్వారభాస్వత్కర
స్ఫీతాంభోరుహ షండసంగత రటద్భృంగీసమారబ్ధ సం
గీతం బొప్పె శరత్సమాగమము లక్ష్మీకాంత నిద్రాంతమై.

చాతకలోక భీకరము చంద్రకళాన్య శిఖావళంబు ని
ర్ధూత సురేంద్రకార్ముకము దుర్దినకర్దమమర్దనాతపం
బ తతహంసనారసరవాకుల పాంథ జనంబు యూధికా
వ్రాత సుగంధమారుతము భాసురమయ్యె శరద్దినం బిలన్.

చారుతుషార బింబరుచి సాంద్రములున్ బరిపక్వశాలి కే
దారము లుల్లసత్తరళ తారకపంక్తులు ఫుల్లమల్లికా
హారులు మోదమాన కుముదాకరముల్ శరపుష్పరేణుసం
భార సమీరముల్ వొలిచె భాసురశారద వాసరావళుల్.

అట్టి శారదవేళ రాజాజ్ఞవడసి-బంధుతా దర్శనార్థియై బాణుఁ డరిగె
బ్రహ్మ ఘోషానునాదిత ప్రాంగణంబు-ప్రీతికూటంబు నిజమనః ప్రియకరంబు.

ధరణీనాయకు కొల్వుకూటమున విద్యావైభవోపార్జిత
స్థిరలక్ష్మీయుతుఁడై కులస్థవిర సంసేవాపరత్వంబునన్
జిరకాలంబున కాత్మభూమి కరుగన్ జిత్తంబు లుప్పొంగఁగాఁ
బరమప్రీతిని వచ్చి బాంధవులు సంభావించి రా బాణునిన్.

కులవృద్ధులకును గురుపద-జలజంబుల కప్పు డతఁడు సాగిలి ప్రమొక్కన్
జలజల నమ్మోదాశ్రులు-పులకలు వొడమంగ వృద్ధ భూసురు లతనిన్.

దీవించి కుశల మారసి-లేవంగాఁ దిగిచి కౌఁగిలింపుచు వత్సా
నీవంటివాని కతమున-మావత్సాన్వయము రాజమాన్యం బయ్యెన్.

సేమమె చక్రవర్తికి విశేషములేమి సభాంతరంబునన్
నీమొగ మిన్నినాళ్లు గననేరక కన్నులు వాఁచిపోయెఁ దం
డ్రీ! మముఁజూచు వేడ్కఁ బరమేశ్వరు నానతిఁబూని వచ్చితే
మా మనముల్ ప్రమోదరసమగ్నములయ్యెను వంశభూషణా.

అనుచు గురుజను లగ్గింపనాత్మనలరి-బందుగులు సేయు పూజల నందుకొనుచు
నచటి వారల సేమంబు లరయఁగోరి-పలికె బాణుండు సంభ్రమస్వాంతుఁడగుచు.

ఇంతకాలము మీరలిందఱు సుఖమున్నవార లేకద హవ్యవాహనుండు
సప్తజిహ్వాగ్రముల్ చవులూర మంత్రసత్ కృతపురోడాశ సంతతులు గొనునె
తోషిత ద్విజచక్రభూషితంబులు మహాధ్వరము లవిఘ్నమై వఱలు నొక్కొ-
ఉచితకాలంబున నుపనీతులై బ్రహ్మచారు లధ్యయనంబు సలుపువారె
జైమినీయాక్షపాదశాస్త్ర ప్రసంగ-మహిపతీరిత భాష్య వాక్యార్థగోష్ఠి
సరసకావ్య సుధారసాస్వాద సరణి-పూర్వముండినరీతి నిప్పుడును గలదె.

అనుటయు వార లిట్లనిరి:

వైతానవీతిహోత్రస-మేతులమై ప్రీతితోడ మెలఁగుచు విద్యా
చాతుర్యలీలఁ గాలమ-నాతురతం బుచ్చు మా కనామయ మనఘా.

భుజగాధీశ్వర దేహదీర్ఘ భుజుఁడా భూమీశ్వరుం దుర్వారా
ప్రజలన్ బిడ్డలకైవడిన్ మనుపఁ దత్పార్శ్వస్థపీఠంబు వి
ప్రజనుల్ సంతసమంద నీ వధివసింపన్ మాదృశబ్రాహ్మణ
వ్రజసౌఖ్యంబుల కేకొంత గలుగున్ వత్స్యాన్వయగ్రామణీ.

శక్తివంచన లేక యైశ్వర్యమునకుఁ - దగినరీతినిఁ గాలంబు దప్పకుండ
విప్రజనమాన్య వైదికవిధుల నెల్ల-నొకవిధంబునఁ దీర్చుచు నుంటిమయ్య.

వరుసన్ వారల సేమ మిట్లరసి సంభావించుచున్ హర్షభూ
వరునాస్థానములోని వార్తలు నిజాప్తశ్రేణికిన్ దెల్పుచున్
పరమప్రీతిని బాల్యచేష్టితములన్ భావించి భాషింపుచున్
జరిపెన్ బాణుఁడు కొంతప్రొద్దచట విస్రంభానులాపంబులన్.

(ఆంధ్రహర్ష చరిత్రమునుండి)

---

శుభం

# 'ఏకవీర' విమర్శ

టి. కామేశ్వరరావుగారు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిచే రచింపబడ్డ 'ఏకవీర' అనే నవల ఆమధ్య భారతిలో కొన్ని నెలలపాటు ప్రకటింపబడింది. ప్రకటన పూర్తి అవడంచేత అతునకలన్నిటిని కలిపి ఒకే సారి చదివి గుణాగుణాలను తెలుసుకోడానికవకాశం కలిగింది. (అతునకలను ఎప్పటికప్పుడు చదువుకోకూడదు, అట్లైతే మరి తునకలుగా ప్రకటించుకోవడ మెందుకు, మొదలైన ప్రశ్నలన్నీ వేరేవిషయాలు. ఇక్కడ వాటిని గురించి చర్చ పెట్టుకోలేదు.) శ్రీ సత్యనారాయణగారిప్పటివరకూ ఆంధ్రలోకానికి గొప్పకవులుగానే పరిచితులు. కాని వారు ఒక్క కవులే కాక గొప్పనవలాకారులని కూడా తెలుసుకోవలసి వుంది.

'ఏకవీర' కొంత చారిత్రకం, కొంత కల్పితం అని గ్రంథకర్త చెప్పివున్నారు. కల్పిత కథకు చారిత్రాంశాలతోడు. ఈ అంశాలవల్లే కథకు ప్రస్తుత పరిణామం కలిగింది. కల్పిత కథయొక్క విషాదాంతానికి చారిత్రకాంశాలే ముఖ్యకారణం. కొంతవరకూ మోదాంతంగా వుండవలసినకథ ఖేదాంతమైపోయింది.

## గ్రంథనామం:

ఈకథలో ప్రత్యేకంగా కథానాయకుడనీ, కథానాయిక అనీ యేర్పరచడానికి వీలు లేదు. కుట్టాన్, ఏకవీర, వీరభూపతి, మీనాక్షి — ఈనలుగురు కథలో సమానమైన ప్రాముఖ్యం పొంది వున్నారు. వీరిలో యేవొక్కరు భిన్నస్వభావులై వున్నా, లేక యేవొక్కరు లేకపోయినా కథయొక్క మార్గమే వేరయిపోయేది. కథకు ఏకవీర ఎంత ముఖ్యమో మీనాక్షీ అంతే; కుట్టాన్ ఎంత ముఖ్యమో వీరభూపతీ అంతే. "ఇది యొక విచిత్రకథా మంటపము. దీనికి మన మిద్దరము (కుట్టాన్ యేకవీరలు), మీనాక్షీ వీరభూపతులు నాలుగు స్తంభములము." అలాగయితే ఈగ్రంథానికి 'ఏకవీర' అని యెందుచేత పేరుపెట్టబడిందంటే: గ్రంథానికి 'ఏకవీర' అనే కాదు, 'మీనాక్షి' అని పెట్టవచ్చు. కాని వారి తాహతులో భేద ముంది. ఏకవీర ఉత్తమ వంశసంజాత. మీనాక్షి సామాన్య వంశంలో పుట్టింది. కథలో యిద్దరూ సమానమైన నడక కలవారుగా వున్నప్పుడు వారిద్దరిలోను యెంచడం వారి అభిజాత్యమును బట్టే. ఇంకా ఖానవల పేరు 'కుట్టాన్' లేక 'వీరభూపతి' అని అయినా పెట్టి వుండవచ్చు. కాని 'యేకవీర' అని పెట్టి వుండడానికి కారణం ఆమెను శ్రీ సుందరేశ్వరుడు ఆవేశించి ఒక మహాకార్యం చేయించేడు. అందు వల్లే ఈమె తక్కిన వారికంటె మిన్నగా చూడ తగింది. అందుచేతే యీ గ్రంథానికి 'యేకవీర'ని పేరు పెట్ట బడింది.

ఈనలుగురు వ్యక్తులు మహోత్కృష్టులు. అవసరమైనప్పుడు జితేంద్రియులు, సంపూర్ణమైన ప్రేమకలవారు, ఏవిషయంలోను ఒకరి కొకరు తీసిపోరు. వీరిలో ఏ కొంచెమైన అవగుణాలు లేవు.

ఈకథను యీమోస్తరుగా వికటంగా నడిపించినది దుర్విధే కాని యెవ్వరి యొక్క కుంఠిత శీలం కాదు. దుర్విధే మిగిలిన కథా పాత్రలచేత ఈరీతిగా చేయించింది. దుర్విధి అని మనం అంటాం. ఆఖరికి ప్రతిది విధి, తలరాత, ఖర్మం అనేస్తాం. ఆ అర్థంలోనే యిది దుర్విధి అనవలసి వుంది. ఇది ఆధ్యాత్మికమైన భావం. కాని కథనిట్లుగా మార్చిన భౌతిక కారణాలేవంటే, హిందూ సంఘంలోని దురాచారాలు. వాటికి తోడు పెద్దలయొక్క మూర్ఖత్వం, పిమ్మట కొన్ని అనివార్య ఘటనలు.

## కథాసంగ్రహం:

మధురను మసలిరాజైన ముత్తుకృష్ణప్ప నాయకుడు పాలిస్తున్నాడు. ఈయన మంత్రులలో ఉదయకా నేతుపతి ఒకడు. ఈయన కొడుకే కథానాయకుడైన కుట్టాన్.

కుట్టాన్‌కు వీరభూపతి అనుఒకమిత్రుడున్నాడు. వీరభూపతి సామాన్య వంశానికి చెందినప్పటికీ కుట్టాన్ వీరభూపతులు ప్రాణ స్నేహితులైనారు.

కుట్టాన్ మీనాక్షి అనే బాలికను వరించేడు. ఇతనితండ్రి కీసంగతి తెలిసి కూడా నిర్లక్ష్యం చేసి కుట్టాన్‌కు ఏకవీర అనే కన్యను పెండ్లి చేసేడు. కుట్టాన్ యొక్క మనోవ్యాధికి మందు లేక పోయింది. అతను ఏకవీరను గాక మీనాక్షినే ప్రేమించేడు.

వీరభూపతి చరిత్ర కూడా కుట్టాన్ వంటిదే. అతను యేకవీరను ప్రేమించేడు. కాని తండ్రి ఆజ్ఞను మీరలేక మీనాక్షిని వివాహమాడేడు. మీనాక్షి వీర భూపతిని గాక కుట్టాన్‌ను ప్రేమించింది. కాబట్టి ఈదంపతుల ప్రేమజీవితం పైదంపతులలాగే వుంది. ఇందు లోని చిత్ర మేమి టంటే, ఒకరు వలచిన స్త్రీని ఒకరు వివాహ మాడడం. కాని ఈవిషయం పాత్రల్లో ఒకరి కొకరికి తెలియదు. అది తెలిసిన విధమే చాలాఘోర మైనది. ఏకవీర చచ్చి పోయింది. వీరభూపతి సన్యాసి అయిపోయేడు. కుట్టాన్ ఋషి అయినాడు.

పాత్రలు,పాత్రపోషణ:

పైన చెప్పబడినట్లుగా ఈకథలో రెండు జతల ప్రేయసు లున్నారు ప్రేయసు లనడంకంటే దంపతు లంటేమేలు. ప్రేమ వున్నా లేకపోయినా దంపతులు దంపతులే కదా. కుట్టాన్ యేకవీర లొకజత; మీనాక్షి వీరభూపతులు రెండవజత. ఈరెండుజతల వ్యక్తులచరి త్రలు విచిత్రం. విచిత్ర మన్నంతమాత్రాన్ని వినోదం కాదు. తుదకు విషాదమే అయింది. అదెలా గంటే:—

కథానాయకుడైన కుట్టాన్ యువకుడు, విద్యాధి కుడు, సద్వంశజుడు. ఇతను మీనాక్షిని ప్రేమించేడు. ఇతనిప్రేమతీవ్రత యితనిచందుకాయ పెట్టిరహస్యాలే చెప్పుతున్నాయి. మీనాక్షి తక్కువస్థితి కలవాళ్లపిల్ల అని కుట్టాన్ తండ్రి కుట్టాన్‌కు మీనాక్షి నిచ్చి వివాహం చెయ్య నన్నాడు.

కుట్టాన్ తనదుఃఖ మంతా తన ప్రియమిత్రుడైన వీరభూపతివద్ద చెప్పుకుని, విలపించి కొంతవుపశమనం పొందుతూవుండేవాడు. కుట్టాన్ "నేనే ఒకసామాన్య సంసారములో పుట్టినచో నా కామె యింతదూర మయ్యే డిది కాదు" అన్నాడు. కాని కుట్టాన్ పొరపాటుమాట పలికేడు. స్థితిభేదంవల్ల యిటువంటి కష్టాలు తగ్గుతా యనుకొన్నాడు కాని అట్లు కాదు—అని చెప్పడానికి సామాన్యకుటుంబంలో పుట్టిన వీరభూపతి యొక్క ప్రేమభంగమే నిదర్శనం.

కుట్టాన్‌కు మీనాక్షిమీద గల ప్రేమ అతని యేడ్పే చెప్తుతూంది. తాను శాస్త్రోక్తంగా వివాహమా డినయేకవీరను ప్రేమించలేకపోయేడు. "నేను ప్రేమించిన స్త్రీని విడిచిపెట్టి బలవంతముగా నా మెడకు కట్టినస్త్రీని నా ప్రేమించవలెను" అని అంటూ తనపెళ్లినిగురించి "భగ వంతుడు కాదు, నాతండ్రి చేసినాడు. భగవంతునియిచ్ఛ లేనిది నాతండ్రి రుజువు చేయుటకు" అని తల్లి దగ్గిర కూర్చుని తలపోస్తున్నాడు.

ఇతని తలిదండ్రులు లితని వివాహ విషయంలో జోక్యం కలుగ జేసుకోకుండా వుంటే యితను సుఖించి వుండేవాడు. కాని అదెలాగు జరుగుతుంది? కుట్టాన్ తండ్రి కుట్టాన్ ప్రణయాన్ని, వీరభూపతి తండ్రి వీర భూపతి ప్రణయాన్ని దగ్ధంచేసి వాళ్ల జీవితాలను దుఃఖ భూయిష్ఠం చేసేరు.

కుట్టాన్ దుఃఖం వచ్చినప్పుడు పసిబిడ్డలాగు యేడుస్తాడు. ఏమాత్రం ఓర్పులేదు. అంతమాత్రంచేత అతనికి ఉత్తమ గుణాలు లేక పోయే యనుకోరాదు. అతను అధికధైర్యం, అధికపౌరుషం కలవాడు, మహావీ రుడు. ఇతనిలోని ప్రత్యేకత యేమి టంటే, తా నెంత ఉద్రేకం గలవాడో అవసరం వచ్చినప్పు డంత జితేంద్రి యుడు. అందుచేతనే వీరభూపతి యితన్ని ఋషి అన్నా డు. కుట్టాన్ యొక్క ఔన్నత్యం వీరభూపతి గ్రహించి, "ఇతడు దేనికి సమర్థుడు కాడు. ఇతడు తలచుకొనినచో పడిపోయిన విజయ నగర సామ్రాజ్యమును మరల సాధిం చి మధుర నాయకులచే పాలింపించునేమో" అన్నాడు. ఈవాక్యాలు బూటకాలు కావు. తిరుగ బాట్లచే ధ్వం సంకానున్న మధుర రాజ్యాన్ని యితనే రక్షించేడు. ఇంకా

యితనికొన్న శక్తి మెలాంటి దంటే, సాధారణంగా ఏమా నవుడైనా తాను కట్టుకున్న స్త్రీమీద తనకు ప్రేమ లే నప్పుడు ఆస్త్రీపట్ల భావరహితుడుగా వుండక నిర్దయు డుగా వుంటాడు. కాని కుట్టాన్ అట్టివాడు కాడు. ఏకవీరపట్ల భావరహితుడుగా వుండ ప్రయత్నించేడు కాని నిర్దయుడు మాత్రం కాలేదు.

కుట్టాన్ యొక్క ప్రణయచరిత్ర తెలిసిన వీర భూపతి కుట్టాన్‌తో అతని తొలిప్రేయసిమాట మరిచి పోయి యేకవీరనే గాఢంగా మనస్ఫూర ప్రేమించమని బతిమాలుకున్నాడు. దీనికి కారణం వీరభూపతి యొక్క దయాస్వాంతమే. కుట్టాన్ తాను ప్రేమించ ప్రయత్ని స్తానని మాట యిచ్చేడు.

ఏకవీర అంబాసముద్రాధిపతికూతురు. ఈమె విద్యాధికురాలు, ధర్మప్రవర్తనయం దిష్టం కలది. కాని ఉద్రేకాలకు సులభంగా లోబడిపోతుంది. ఈమెకు నై సర్గికంగా "జ్ఞానేంద్రియముల యొక్క స్పర్శగుణములో మహాకోమలత్వము, స్వచ్ఛత్వము" కలవు. ఈమహాకో మలత్వ మామె చిన్ననాడెట్లా వుండేదో 79వ పుటలో వర్ణింపబడి వుంది. పదునునాడు ఈమె కోపలక్ష్యంచేతే ఒకమారు చల్లనైన వర్ష బిందువులు మీద రాలగా ఆతనం దాన్ని భరించలేక బాహ్య జ్ఞానాన్ని పోగొట్టు కొంది. మరొకమారు వీరభూపతి పరిష్వంగసుఖాన్ని భరించలేక చైతన్యహీనురాలైంది. తుదకీమెయొక్క కోమలత్వమే ఈమెను నిర్జీవగా చేసింది—అది కుట్టాన్ ఈమెను కౌగిలించుకొన్నప్పుడే తటస్థించింది. ఇట్లీమె నైసర్గికం అద్భుతం. ఇంతకంటె అద్భుతమైనవిషయ మే మంటే, జగదీశ్వరుడైన చొక్కనాథుడే ఈమె నావే శించి హిందూమతాన్ని రక్షించేడు.

ఏకవీర మొదట ఒకపురుషుణ్ణి ప్రేమించింది. అత డెవడో ఆమెకు తెలియదు. (అతడు వీరభూపతే.) ప్రేమించిందన్న మాటే గాని ఆప్రేమ గాఢంగా మన స్సులో నిలవలేదు. ఏలన ఆమెతండ్రి క్రూరాత్ముడు. వానికి యిటువంటి విలాసాలు పనికిరావు. ప్రణయవిష యాల్లో స్వేచ్ఛ నిచ్చేవాడు కాదు. కాని ఈమాత్రపు ప్రతి బంధకంచేత గాఢమైన ప్రేమ యెప్పుడూ తగ్గిపోదు. అసలు కారణమేమి టంటే: ఆమె ప్రేయసుడు సామా న్యవంశస్థుడు. ఈస్థితిభేదంవల్ల ఆమెకు వానిమీద విశే షంగా ప్రేమ కలుగలేదు. ఈకారణంచేతే ఆమె తన మనస్సును వానినుండి మళ్లించుకొన ప్రయత్నించింది.

కుట్టాన్ యేకవీరలకు వివాహ మయింది. ఏకవీర తన మొదటి ప్రణయాధిపతినిగూర్చి యాచనచేస్తూ, "అతనికన్న ముందు యితనిని (కుట్టాన్‌ను) చూచిన యెంత బాగుండేది ? ఇప్పుడైన నేమి ? ఇతని నైన నకల్మష హృదయముతో సేవించగలను. ఇతనికి నాయందు ప్రేమ లేదు" అని అనుకొంది. పెండ్లిలోనె కుట్టాన్ ప్రేమ ఆమెకు తెలిసి పోయింది.

వీరభూపతి సామాన్యవంశస్థుడు. కుట్టాన్‌యొక్క ప్రాణ స్నేహితుడు. ఇతనుకూడ విద్యాధికుడే. తన యిరవై నాలుగో యేట ఒక కన్యను ప్రేమించేడు. ఆమె ఫలానా అని అతనికి తెలియదు. (ఆమె యేకవీర.) కాని ఆమెయందే మనస్సు నిల్పివున్నాడు. "ఆమె నన్ను ప్రేమించినది" అని అతని నమ్మకం. వీరభూపతి తలి దండ్రుల కావిషయం తెలిసింది. ఇటువంటిది వద్దని వాళ్లు బతిమాలుకున్నారు వినకపోతే మరణిస్తా మన్నారు. అందుచేత వీరభూపతి "తా నారీతిని వివాహమాడ" నని తల్లిదండ్రులకు వాగ్దానం చేసేడు. అతని దుఃఖ మిలాంటి ది. ఈమోస్తరు దుఃఖం చేత అతను చిన్నవయస్సులోనే వేదాంతి అయిపోయేడు. జీవితంలో అతనికి సంతోషం లేకపోయింది. కొంతకాల మయినపిమ్మట అతను నిజంగా వేదాంతి అయి సన్యసించి వెళ్లి పోయేడు.

మరికొన్నాళ్లకు తల్లిదండ్రు లతని కొక కన్యను చూసేరు. (ఆకన్య మీనాక్షి, కుట్టాన్ ప్రేమించినకన్య.) పెండ్లి దినం నిశ్చయంచేసేరు. అతను ఆవిషయాన్ని తన స్నేహితుడైన కుట్టాన్‌తో చెప్పేడు. కుట్టాన్ సంతో షించేడు. కుట్టాన్‌కుకూడా ఆకన్య తనప్రేయసి అయిన మీనాక్షి అని తెలియదు.

ఇంక మీనాక్షిచరిత్ర యెటువంటి దంటే: మీనాక్షి కుట్టాన్‌ను ప్రేమించింది. కాని యేమిప్రయోజనం? తల్లి

దండ్రులామెను వీరభూపతికిచ్చి పెళ్లి చేసేరు. ఆమె వీరభూపతితో తన్ను దాసీగా చూడమంది కాని భార్యగా చూడవద్దని బతిమాలుకొంది. వీరభూపతి ఆమెను వెరిగి, "నీ వేల యోగినివి కాలేదన్నాడు. అందుల కామె "నా తల్లిదండ్రులు నామాట వినలేదు. పతులైన మీరైన నా మాట వినరాదా? నాకు సంసారవాంఛ లేదు" అంది. ఆసంభాషణలోనే వీరభూపతి "నాస్నేహితుడైన కుట్టాన్" అనడంతోనే మీనాక్షి మెరుపులా మెరిసి అక్కడనుంచి వెళ్లిపోయింది. వీరభూపతి మాత్రమామె యేదో పనిమీద వెళ్లిపోయిందనుకొన్నాడు. అటుతర్వాత వీరభూపతి తన భార్యయొక్క ప్రణయచరిత్ర యెరిగి వుండడంచేత, అతను తనప్రణయచరిత్రకూడా ఆమెకు తెలియజెప్పాలని తనప్రణయిని రాసినలేఖ, ఆమె యొక్క చిత్రపటం మీనాక్షికి చూపించేడు. మీనాక్షి ఆమెపేరు చూసి 'యేకవీర' అని మనస్సులో పర్లించుకొంది. ఈయేకవీర కుట్టాన్ యొక్క భార్యఅని గ్రహించి ఊరుకుంది కాని వీరభూపతితో చెప్పలేదు.

వీరభూపతి మీనాక్షిని ప్రేమించేడు. కాని మీనాక్షిమాత్రం వీరభూపతిని ప్రేమించలేదు. అందుచేత ఇప్పటి ప్రణయంవల్ల కూడ అతనికి దుఃఖమే కలిగింది. ఈవిషయం కుట్టాన్ తో చెప్తున్నాడు. కుట్టాన్ చాలా విచారించేడు. ఏదో మాటమీదమాట వచ్చి కుట్టాన్ "నీభార్యపేరే"మన్నాడు. "మీనాక్షి" అని వీరభూపతి అన్నాడు. "అయ్యో" అని కుట్టాన్ క్రింద పడిపోయేడు. దుఃఖం ఆపుకోలేక అతను తనయింటికి పోయేడు.

మర్నాడు కుట్టాన్ వీరభూపతి యింటికి వచ్చి మీనాక్షికి తనసహస్యాలున్న నందుకాయ పెట్టి, పసుపు, కుంకం, చీర యిచ్చి, వీరభూపతితో తన పూర్వప్రణయాన్ని గురించి చెప్పేడు వీరభూపతి స్తబ్ధుడై పోయేడు. తనచెలికాని కెంతద్రోహం చేసేనుకదా అని అహోరాత్రాలు దుఃఖించేడు. కుట్టాన్ మీనాక్షియందు తనకు గల ప్రేమ అంతా సోదరప్రేమగామార్చేసేడు. అది చూసి వీరభూపతి "కుట్టాన్, నీవుఋషివి. నేనింకనూమనుష్యుడనే. త్రిగుణం దరేశ్వరుడవి ట్లవతరించినావు" అని అన్నాడు. మీనాక్షి కూడ కుట్టాన్ను సోదరుడిగా భావించింది. అంతటితో కుట్టాన్, యొక్క మీనాక్షియొక్క మనోభారాలు తీరిపోయేయి. కుట్టాన్కు యేకవీరమీద సంపూర్ణమైన ప్రేమ కలిగింది. మీనాక్షికి వీరభూపతి మీద నిండు అనురాగం కలిగింది. కాని వీరభూపతి స్థితి యెట్లున్నదంటే: "మీనాక్షి కుట్టాన్ వలచిన స్త్రీ... శారీరకమైన సంయోగము లేకపోయినను వారిరువురు భార్యాభర్తలు. వారిజీవితము లున్నంతవరకు నిది తుడిచి వేయబడునది కాదు" అని తలచేడు. అందుచేత మీనాక్షి కౌగిలిస్తే అతడు శవుని వలె వుండేవాడు. ఈమె స్తరుగా మళ్లా మునపటి స్థితి ప్రారంభమయింది.

కుట్టాన్ ఏకవీరను చూడాలని చాలా తొందర పడ్డాడు. కాని యింతట్లో రామనాథానికి వున్నట్లుగా ప్రయాణం కమ్మని తండ్రిదగ్గరనుంచి వర్తమానం వచ్చింది. అందుచేత అతను తనగృహానికి వెళ్లకుండానే రామనాథానికి బయలుదేరి పోయేడు. ముసలి రాజుకు జబ్బుగా వుండడంవల్ల కుట్టాన్ తండ్రి మధురకు రావలసి వచ్చింది.

కుట్టాన్ యొక్క తండ్రి మధురకు వచ్చేడు. ఒకనాడు రాతడు వీరభూపతి యింట్లో భోజనం చేస్తూవుండగా వీరభూపతి కుట్టాన్ యొక్క చరిత్ర అంతా సంక్షేపంగా అతనికి తెలియజేసేడు. మీనాక్షిని చూసి, "కన్యా, అన్నకు నామీద యెంత ప్రేమ యుంకొంటిరి" అంది. తనకుమారుని సంసారానికి మంచిరోజులు వచ్చేయని కుట్టాన్ తండ్రి సంతోషించి, "ఇప్పుడు కొడుకును, కోడలిని విడిగా వుంచరాదు" అని అనుకొన్నాడు.

ఏకవీరకు మీనాక్షికి స్నేహం క్రమక్రమంగా వృద్ధి అయింది. ఇద్దరూ ఒకరి మహలుకు వొకరు వచ్చి పోతూవుండేవారు. "ఆమె (ఏకవీర) రహస్యము (తన భర్తయొక్క ప్రణయిని అని) తనకు తెలిసియుండుటచేసి యేకవీర యనివరయొకవిధమైనశోకము... ఆరహస్యము తెలిసినమీనాక్షికి నేకవీరతో జనవు సహజముగా బుట్టినది. ఈ సంగతి తెలియని యేకవీర కావనవు భాగ మవగతము కాలేదు". మీనాక్షి ఆరహస్యాన్ని యెందుకు దాచి వుంచిందో. వీరభూపతితో గాని, ఏకవీరతో గాని చెప్పి వుంటే కుట్టాన్ తనమీది ప్రేమ నెలాగైతే సోదరప్రేమగా మార్చివేసేడో అలాగే వారిరువురూ కూడా తమ

ప్రేమను సోదరీ సోదరుల ప్రేమగా మార్చుకొని వుండేవారు. కాని మీనాక్షి రహస్యమున్నట్లే దాచివుంచింది. ఇందులో ఆమె ఉద్దేశమేమో? దుర్మార్గమయి వుండదు. అమాయికత్వమే కావాలి. ఈ రహస్యాన్ని వెలిబుచ్చక పోవడంవల్లే గ్రంథాంత మిట్లయింది. ఈ గ్రంథాంత మిట్లవడానికి కొంతవరకామె కూడ కారకురాలే అని మన మనుకోవలసి వస్తుంది. అమాయికత్వం వల్లే ఆమె దాచి వుంచితే వుండవచ్చు. అట్లు చెప్పకపోవడం చేత ఈమెను నేరస్థురాలుగా భావించవలసిందే.

ఒకమారు కుట్టాన్ ఏకవీరతో తనకు మీనాక్షి అను ఆమెయందు కల ప్రేమను గురించి చెప్పి, "ఆమెకు వివాహము కానున్నది. (వరుడు వీరభూపతి అని అతనికి తెలియదు.) ఆమెమీద నాకున్న ప్రేమ పూర్తిగా నాశనము చేసెదను. అప్పుడు నిన్ను ప్రేమించెదను" అను మాట యిచ్చి రెండేళ్లయింది. మీనాక్షిమీద కుట్టాన్‌కు గల ప్రేమ సోదర ప్రేమగా మారి పోయిన సంగతి ఆమెకు తెలియదు. ఈ విషయాన్ని గురించి కుట్టాన్ ఆమెకు చెప్పడానికి వీలు లేక పోయింది, వెంటనే రామనాథం పోవలసివచ్చింది. మీనాక్షి అయినా ఈ విషయాన్ని ఆమెకు చెప్పివుంటే మెరుగై వుండేది. అలాగుకూడా జరగ లేదు. కుట్టాన్ యిచ్చిన రెండేళ్ల గడువు దాటి పోయింది. అతని మాటలయందు ఏకవీరకు నమ్మకం పోయింది. అతని మీది అనురాగంకూడా క్షీణించి పోయింది. అంతట "ఆమె తొల్లింటి ప్రేమమూర్తి (వీరభూపతి) కనులకు కట్టినట్లుండెను." ఈ విధంగా ధర్మప్రేమ తగ్గి పోయి మధురప్రేమ పెరిగింది.

రామనాథంలో కుట్టాన్ సంగతి యిట్లున్న దంటే: తనరాజనీతి చేత, పరిపాలన దక్షతచేత అక్కడి తిరగ బాట్లను కుట్టాన్ తగ్గించి వేసేడు. తిరగ బడినవారిని తననిపుణత్వంచేత తనసైన్యంలో చేర్చుకొన్నాడు. అట్లు తాను స్వతంత్రించి చేసిన పనిని మహారాజు సమ్మతిస్తాడో లేదో అని సందేహపడుతున్నాడు. ఇట్లుండగా అతనికి యేకవీర జ్ఞాపకం వచ్చింది. ఆమె కొకవుత్తరం రాయబోయేడు. ఎన్నిమార్లు రాసినా నచ్చక పోవడం చేత వాటిని చింపివేసి తెల్లవార్లూ ఆమెనే ధ్యానిస్తూ కూచున్నాడు. కుట్టాన్ యేకవీరకు తన ప్రణయాన్ని గురించి ఉత్తరం రాసివుంటే బాగావుండేది. ఆవుత్తరంతో ఆమెకుగల అపోహలు తీరిపోయేవి కథతీరు మారిపోయేది.

జబ్బుతో వున్న ముసలిరాజు అస్తమించేడు. అతనికుమారుడు మధురరాజ్యానికి పట్టాభిషిక్తుడయేడు. ఈ కొత్తరాజు కుట్టాన్ రామనాథంలో తిరగబడిన వారిని సైన్యంలో చేర్చుకుని అల్లరులు లేకుండా చేసి నందుకు సమ్మతించి సంతోషించేడు.

ఏటేట మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణోత్సవం మధురలో జరుగుతుంది. ఆవుత్సవదినాల్లో కూచిపూడివారు భాగవతం కడతారు. ఆవిశేషాలు చూద్దామని మీనాక్షి యేకవీరను పిలిచింది. ఏకవీర ఒప్పుకుంది.

భాగవతం మొదలుపెట్టేరు. గొల్లకలాపం ప్రారంభమయింది. కొంతసేపటికి విరహిణి అయిన సత్యభామ తెర వీడి వచ్చి విప్రలంభ శృంగార మభినయించింది. ఏకవీర తాను కూడా అలాంటి స్థితిలోనే వుండడంవల్ల అదృశ్యాన్ని భరించలేక మీనాక్షి మహలులోకి వెళ్లిపోయింది. విధియేర్పాటుచేత అక్కడికే వీరభూపతి కూడా రావడం తటస్థించింది. ఇద్దరూ వర్తమాన స్థితిని మరచి తమ భూతస్థితిని జ్ఞప్తికి తెచ్చుకుని, పరిష్వంగ సుఖంలో పడిపోయేరు. ఏకవీర తనకోమలత్వంచేత చైతన్యహీనురాలైంది. ఏకవీరను వెతుకుతూ వచ్చిన మీనాక్షి ఆసమయమందే అక్కడికి వచ్చి, సంగతి తెలుసుకుని, వీరభూపతితో "ఆమె కుట్టాన్ భార్య" అని అంది. వీరభూపతి పిడుగు పడినట్లైపోయేడు. ఆమె తొలుత తాను ప్రేమించిన స్త్రీ అనే అనుకున్నాడు. కాని కుట్టాన్ ఆమెను వివాహమాడేనని యెరగడు. ఈ సంగతి యెరిగినతర్వాత క్షణమే అతడు కుట్టాన్‌కు కావించిన అపకారాలను భరించలేక విరాగియై ప్రపంచాన్ని త్యజించి సన్న్యాసి అయిపోయేడు.

ఏకవీరకు తెలివి వచ్చినతర్వాత మీనాక్షి యేకవీరతో "ఈయనయే నాపతి; కుట్టాన్ మహారాజు ప్రాణస్నేహితుడు." అని, తర్వాత కుట్టాన్ తనను ప్రేమించుట, పిమ్మట సోదరిగా చూచుట మొదలగునవి

కథ అంతా చెప్పి, "పాప మా కుట్టాన్ నాడుగా నీమీది ప్రేమచే పరిభ్రమించుచున్నాడు. కాని రాచ కార్యము అతనిని నీనుండి దూరము చేసినది. ప్రేమోద్వేగి యైన యతడు నేడు వచ్చునో రేపు వచ్చునో" అన్నది. ఈమాటలవసర మిప్పుడా? ఈకథ అంతా మొదటే ఏకవీరకు చెప్పకుండావుండడం మీనాక్షియొక్క తప్పు. ఇంకా "నీయంతఃపుర వర్తనము వీరభూపతికి నీవను కుట్టాన్ భార్యాత్వము తెలియనీయ లేదిన్ని సంవత్సరములు" అంటూంది. దీన్ని మీనాక్షియొక్క కుంటరితనంగా భావించవలెనా యేమి? ఈవిషయం తెలియనిస్తే తనభర్త గాని లేక ఏకవీర గాని చెడిపోదు రని భయపడిందా యేమి? కాదు; ఇది అమాయికత్వం వల్ల ఈమె చేసిన పొరపాటే అయివుండవచ్చు. ఏలన, ఈమె దుర్గుణాలు కలదిగా కథలో యెచ్చటను కనబడదు. కథ ఈరీతిగా పరిణమించడానికీ సంగతే ఆఖరు కారణం. ఏమైనా ఈమె అమాయికత్వమే ఈమెను నేరస్థురాలుగా చేసింది.

ఏకవీర తాను గావించిన ప్రమాదం తెలుసుకుంది. తనగృహానికి పోబోయింది. వీథిలోకి రాగానే యెదుట నున్న శ్రీసుందరేశ్వరు డీమె నావేశించేడు. అంతట ఆమె తత్త్వ ముపదేశించ మొదలుపెట్టింది. ఈవిషయ మెరిగి డి నోబిలీ అను క్రైస్తవ మతవ్యాపకుడు ఆమెను క్రైస్తవమతంలో చేర్చడానికి వచ్చేడు. కాని ఆమెతో వాదించలేక వోడిపోయి తర్వాత దేశం విడిచి పోయేడు. ఏకవీర 'ప్రణామ్యహం' అని విరుచుకు పడిపోయింది.

ఈమోస్తరుగా చొక్కనాథు డామెలో ప్రవేశించి క్షీణించుచున్న హిందూమతాన్ని పునరుద్ధారణ చేసేడు. ఏకవీరయొక్క చదువు ఈరీతిగా ఫలించింది. ఈమె కింతకు పూర్వం ఈశ్వరజ్ఞానం లేక పోయిం దనుకోరాదు. ఒకమారీమె ఎదురుగా గోడమీద మీనాక్షీ దేవి వస్త్రం శ్రీసుందరేశ్వరు డపహరిస్తూన్నట్లు చెక్కబడిన విగ్రహం చూసి, "ప్రభూ! సుందరేశ్వరా! నీవుకూడ నీ మోహపాశము విదలలేవా? తన మనస్సు సంతోషమునకై మనుష్యుడే నిన్నీ విధముగా వ్రాసినాడు" అంటూంది. ఇంతే కాదు. ఈమె ధర్మప్రవర్తన చూడండి. ఈమె మనస్సులో ఎప్పుడూ 'అరం శేవిరుంబు'(ధర్మం చెయ్యి); 'అరవదుశినం' (కోపపడవద్దు)—అనే ధర్మవాక్యాలు మారు మోగుతూవుండేవి. వీటిని ఆచరణలో పెట్టడానికామె చెయ్యగలిగినన్ని ప్రయత్నాలు చేసింది. కాని సహజంగా వుద్రేకం హెచ్చు. స్వర్ణగుణంలోని కోమలత్వమధికం. వీటిని వశపరచుకోలేకపోయింది. కాని వశపరచుకొను ప్రయత్నం మాత్రం విడువలేదు. అందుచేతే శ్రీసుందరేశ్వరుడికీమెయందు ప్రీతి గలిగి, ఆవేశించి, దేశోపకారం చేసేడు.

ఏకవీర పూర్వస్థితికి వచ్చింది. ఆమెను మీనాక్షి ఆమెగృహానికి తీసుకు వెళ్ళింది. కుట్టాన్ తండ్రి రామనాధానికి వెళ్ళడంచేత కుట్టాన్ తాను యింటికి వస్తూన్నట్టుగా వర్తమానం పంపేడు. కుట్టాన్ వచ్చేడు. ఏకవీరను చూడడాని కెంతో తొందరపడుతున్నాడు. కాని యేకవీర యెట్టుకు అతన్ని చూడడానికి భయపడుతూంది— వీరభూపతిని కౌగిలించుకోడంచేత. కుట్టాన్ దృష్టిలో పడకుండ యేకవీర తప్పించుకొంటూంది. కాని అత నామెను చూసేడు. ఏకవీర పరుగెత్తుకుపోయి వైగైనదివొద్దు చేరింది. తోవలో సన్యాసిఅయిన వీరభూపతి యెదురు పడ్డాడు. కుట్టాన్ భయపడ్డాడు. ఏకవీర జరిగినకథ అంతా కుట్టాన్‌కి చెప్పి, "మీరు నన్ను ప్రేమించరా" అంది. కుట్టాన్ ఆమెను కౌగిలించుకొన్నాడు. ఆమె హృదింద్రియం చైతన్యరహితమైంది. తన కౌగిలిలోని నిర్జీవ పదార్థాన్ని కుట్టాన్ వైగైకి తోసేసేడు.

కథ ఈమోస్తరుగా అంత మయింది. ఋషిఅయిన కుట్టాన్‌కు విచార మేమిటి? "నీవు ఋషివి. నే నింకను మనుష్యుడనే" అన్న వీరభూపతికూడా ఋషిఅయిపోయినాడు. మీనాక్షి తన తెలివితక్కువకు తగిన అనుభవం పొందింది.

## మానవాతీతం:—

కథలో నున్న మానవాతీతవిషయం, అనగా శ్రీసుందరేశ్వరుడు ఏకవీరను ఆవేశించి ధర్మోపదేశం చేయించడం, సమంజసంగానే వుంది. ఇది సాధారణంగా కవులు చేసేటట్లు అనవసరంగా కాని, అసందర్భంగా గాని, లేక విపరీతంగా గాని కల్పించబడిన విషయం కాదు. ఇది కథలో అతి సహజంగా వుండి ఏరకమైన సందేహాన్ని లే పెట్టడం లేదు.

ఈకథలో అన్ని విషయాలు అతిసహజంగా వర్ణించబడ్డాయి. పాత్రపోషణలో లోపాలు కానరావు. మీనాక్షి స్త్రీకదా. ఆమెదోషాలు స్త్రీజనానికి సహజమే. ఏకవీరలాంటిదోషిణి కాని అంతకంటె అధికం కాదు. ఇట్టిదోషాలు మనుష్య స్వభావాన్ని తెలియజేస్తాయి. మనుష్యుడు అమానుషుడు కాడుగదా. కనుకనే ఋషిఅయిన కుట్టాణ్ కూడా ప్రమాదాలు కావించి వున్నాడు.

ప్రేమ లేని దంపతులజీవితాలు కథలో గొప్ప భావనతో చిత్రించబడ్డాయి. ఇది కేవలం వూహించి రాసింది గాక కవి కంటితో చూసి రాసినాడా అన్నట్లు అతి స్వల్పమైనఅంశాలు కూడవిడిచివేయబడక పొందించబడ్డాయి. కుట్టాణ్ ఏకవీరలయొక్క మనఃకల్లోల వర్ణన అద్భుతంగా వుంది. అడుగడుగున పాత్రలయొక్క మానసిక తత్వం బాగా విశదమవుతూంది. ఈపాత్రలు కేవలం పాత్రలు గాక రక్త మాంసాలు కలవారని పిస్తూంది.

ఈకథలో హెచ్చు పాత్రలు లేవు. ముఖ్య పాత్రలు లెక్కకు నాలు గున్నాయి. చిల్లరపాత్రలవిషయాని కేమి. తక్కువ పాత్రలని కథా కల్పనలో జిగి లేక పోలేదు. కథ దట్టంగాను, అధికరసవంతంగాను, హృదయాకర్షకంగాను వుంది. ఏఘట్టంలోను కూడావుత్సాహం తగ్గదు.

దీనిలో సంభాషణ లతిదీర్ఘాలు కావు పాత్రలలో వాచాలత లేదు. అతిక్లిష్టంగాను మాటాడువారు కారు. సమయానికి అవసరమైనంత మాటాడి వూరుకుంటారు. కార్యశూరులు. వివేకులు జ్ఞానవంతులు

ఇది కేవలం ఒక్క కథగానే చూడదగింది కాదు. ప్రస్తుతకాలానికి ఈకథ బోధించే విషయా లున్నాయి. కథాకాలం నాటి సంఘస్థితి, ఇప్పటి సంఘస్థితి వైవాహికవిషయాల్లో భేదించడం లేదు. ఇట్టివివాహాలదుఃస్థితి కథలో విశదంకదా. కనుక నేటికాలపు వివాహాలలోను, ప్రణయాల్లోను అవసరమైన సంస్కరణ ఈకథ తెలియజేస్తూవుంది. ప్రణయవిషయాల్లో యువతీయువకులకు స్వాతంత్ర్య ముండాలి. తల్లిదండ్రులు లా విషయాల్లో జోరబడి తమ ఇష్టం వచ్చినట్లు చేయకూడదు. అలాగ చేసినందువలన కేయూరుని కథే చెప్తూంది. ఈకాలంలో వివాహవిషయం కొంతప్రాముఖ్యానికి వచ్చింది కదా. అది యెట్లు నడవాలో కథ బోధిస్తూంది. ఈరీతిగా ఈనవల ఇప్పటి సంఘాని కొక సందేశ మిస్తూంది. ఇంతే కాక హిందూమతంయొక్క ఔన్నత్యాన్ని తెలియజేసి మతాంతరంలోకి ప్రజలు పో నవసరం లేదని, ప్రజలకు యిక్కట్లు కలిగినప్పుడు శ్రీకృష్ణభగవానునిచే భగవద్గీతలో చెప్పబడినట్లు భగవంతు డవతరించి రక్షిస్తాడని కూడ చెప్తూంది. ఈరీతిగా మత విషయకమైన సందేశంకూడా గ్రంథంలో వుంది. ఇలాగ ఈగ్రంథం సందేశసహితమైనది.

ఈనవలలో ప్రకృతివర్ణన లతిరమ్యంగా వున్నాయి. ఒకప్పుడు ప్రాచీన ధోరణిని, మరొకప్పుడు ఆధునికరీతిని ప్రకృతి వర్ణించబడింది. ప్రాచీన ధోరణి అనగా సహజోక్తి లేని భావనా వర్ణనలు. ఆధునిక ధోరణి అనగా సహజ వర్ణనలు. ఈరెండూ కూడా గ్రంథమందలి ప్రకృతి వర్ణనలలో కన బడుతున్నాయి. ఉదా:— 39, 69 పుటలు.

గ్రంథంలో ఆకాలం నాటి దేశ సాంఘిక రాజకీయ విషయాలు బాగా నిరూపించ బడ్డాయి. గ్రంథకర్తకు తక్కిన లలిత కళల్లో గల అభిరుచి పుస్తకంలో గోచరమవుతూంది.

శైలి:—

గ్రాంథికం. భాష సామాన్యంగా సరళం. కాని ఒకొకప్పుడు సంస్కృతపదాలు, సమాసాలు కుప్పించి వేయబడతాయి. ఇదొక వింతే. అర్థగాంభీర్యం పోకుండా ఆవిషయాన్నే సాధారణ పదాలలో చెప్పవచ్చు. సంస్కృత సమాసాల అవసరం కనబడదు. వాక్యాలు సాధారణంగా చిన్నవి; నిరాడంబరమైనవి; భావగాంభీర్యానికి తగినవి.

ఈవిధంగా ఈనవల యెంతో మెచ్చదగింది. దీనిలోని అపారమౌలికత్వమే (originality) ఈఘనతకు

ముఖ్యకారణం. ఆధునికనవలావాఙ్మయంలో ఇది ఒక అద్వితీయనవల. ఈరకమైన గొప్పనవలలు శ్రీ సత్య నారాయణగారు మరికొన్ని రాస్తే ఆంధ్రభాషా దేవి యొక్క ఆనందం చెప్ప నలవి కాదు.

(ఈనవల పుస్తకంగా వేయబడేటప్పుడు గ్రంథ ముఖాన్ని దేశపటమును ముద్రింపించి చదువరులకు కథ లోని స్థల విషయాలను గురించినసౌకర్యం కలుగజేస్తా రను కొంటున్నాము)

---

# అనలా శ్రు షోడశి

ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు

(ప్రథమాష్టకము)

## స్వ ప్న భ ం గ ము

తలమున మూసి, గొళ్లె మిడి దాటిన విప్పటి కేండ్లు కొన్ని నా
తలపుల యంధకారమును; దాచిన పున్నెము జారగొన్న వీ
తలుపులు; నామనోనియతి దప్పి యెరుంగవు నేటి కైన సం
కులతయె రూపుగా మనసు కూలిన దీ పవన ప్రఘట్టనన్.

దాచితి నాదు చీకటిని; తప్పదు, దీనికి చీకటింటిలో
నే చనగావలెన్ బ్రతుకు; నే నిక వెల్గులరాజ నంచు సం
కోచము వీడి, భావములకూటమి నేరక శబ్దవాహినీ
వీచికలందు మున్క లిడు వెఱ్ఱి కవిత్వమనై చరించితిన్.

పవనపదాహతిం దగిలి భగ్నములై తలుపుల్ సహస్రధా
జవమున నంధకారములు సాచు కరమ్ములు లకులకులై
భువి దివి నేకమై, వెలుగుపూలు దివాంధములై భయంకరా
రవవికటాట్టహాస పరిరక్షితమౌ చెర నేను కైదినై.

కను లొకసారి విచ్చుటను గాంచితి, రక్తపు చిందులన్ మదీ
యనయనగోళముల్ మునుగ, నచ్చట నిచ్చట 'స్వప్నభంగ' మన్
కనకనలాడు నగ్నికణకల్పితమౌ నొక నక్షరంపుపం
క్తిని; నది నాదు చూపునను తేలి విలీనత నొందె దానిలో.

## చీకటి బ్రదుకు

భంగము భంగమన్న నొకపాటియు భీతిల గాని 'స్వప్న' మ
య్యెంగద యింతలోనె, యిటనే యనుభూతము సర్వ? మెట్లుగా
భంగము జెందకున్న దిది పాడు మొగమ్మున నాదుతోట, యు
త్తుంగదవాగ్నికీల కిటు దూరము గా నిలువంగ జాలెనో.

ఈవనమందె కాదె వసియించుదు నిన్ని దినమ్ము లేను? నా
జీవనపత్రశోభనత చీకటినిప్పుల బూడిదైన, ని
ర్జీవపుమ్రాకు లేల యిటు చేతులు మొండితనాన చాచి యే
దోవిధమైన జాలు, బ్రదు కుండుటె కావలె నంచు నేడ్చెడిన్.

మొదటనె చేర్చి పెంచితిని; మోడయి పోయిన పోవు గాక, నే
వదలను నాదు వృక్షముల; వాని వియోగపు శుష్కహానమే
బ్రదు కగు గాక నాకు నిక; భస్మపురాసులలోన నిల్చు మా
కదలని కౌగిలింతలు యుగాంతరసంధుల జీల్చు గావుతన్.

ఇదియైనన్ సహియింప నోపవె? కృపాహీనత్వమే కాక,యా
మది నేచక్కిలిగింతయే నెపుడు సంభావింపనే లేదొ? సం
పద నా పూర్వపు దింత యిమ్మనుచు నే ప్రార్థింపగా రాను! నా
వదన మ్మిట్టులె పైన నుంచుము, మహాభాగ్య మ్మదే చీకటీ!

(ద్వితీయాష్టకము)

## తిరస్కృతి

వ్రాయు నక్షరముల వంకర లవి నీవె-చదువు మాటలలో నపస్వరము లీవె
పాడు పాటలలో రాగభంగ మీవె-ఆడు నాటలలో నజయమ్ము నీవె.

నవ్వుచూపుల నశ్రుకణమ్ము లీవె-విడుచు నిట్టూర్పుగాడ్పుల వేడి నీవె
నడచు నడుగుల వడి తడబడుట లీవె-కుడుచు ముద్దగొంతున దిగబడమి నీవె.

నిదుర నిర్దయవీక్షణనిచయ మీవె-కూరుచుండిన ములు గ్రుచ్చుకొనుట నీవె
పడకపై దోచు మిట్టయు పల్ల మీవె-పిలుపు పలుకుల గర్జించు పిడుగు నీవె.

నా వినయశీలమును దుర్వినయి నొనర్చి-నా విచక్షణ నగ్నికణమ్ము వెట్టి
నాడు ప్రేమదీపిక వెల్గు నూది వైచి—ఓ తిరస్కృతి! నా కెటకో పయనము?

## అ శ్రు భి క్ష

చెల్లనికాని యయ్యొ నను చింతకు స్థానమె లేదు; దేహాభో
గోల్లసనప్రసక్తి మన సోపనె యోపదు; వెంట నున్న యీ
యెల్లభరంబు దీర్ప గతి యేదని కుంద, భరంబె సున్న; ఝుల్
ఝుల్లని గుండెపై వెరపు జల్లులు మాత్రము తాండవించెడున్.

వెఱపు క్షణక్షణంబునకు వెట్టిని వేయివిధాల బెంచగా
నరచి మనస్సులోన గల దంతయు గ్రుక్కకు మించకుండ నే
త్వరిత మొనర్ప నెంచి యొకసారి గళమ్మటు లూచి యెత్తినన్
తిరుగటబడ్డ గింజ లటు దీర్ఘములౌ తలపుల్ సహస్రధా.

చుక్కలపోయిలోని యొకచుక్కయు సాధ్యము కాదొ నా కటం
చెక్కిన చూడ్కినే మరల నెక్కగ ద్రోయుచు కన్ను మిన్న నే
నొక్కెడ కట్టివైచి చెయి యొగ్గిన, నింతటి యగ్నివాహినిన్
దక్కనె మాదు హాయి యని దవ్వున చుక్కలు లేచి పారెడున్.

దినములు మానము ల్దొరలె; తీరదు మీదహనప్రదాహ;మీ
వనజము రేకలన్ని యవె భస్మకణమ్ములు; మీకుగాన నే
వనసుఖ మెంచి యీగతి విభాగ మొనర్చితి; భిక్ష బెట్టి, నా
యనుగుదశ న్మిదొక్కటిని, నస్రువులార! యనుగ్రహింపుడీ.

# ద్రావిడభాషలు—సంధి

# (Euphonic Combination)

కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ.

భాషల పరస్పర సంబంధమును నిర్ణయించుపట్ల యందలి పదముల సాదృశ్యముకంటె, వాని నిష్పత్తిక్రమము, నందలి వాక్యసంఘటనారీతులు మొదలగు వ్యాకరణ విశేషములందలి సాదృశ్యమే యెక్కుడు సాహాయ్యకారి యగునని శబ్దశాస్త్రవేత్తల మతమైయున్నది. కావున దక్షిణ హిందూదేశ భాషలకు పరస్పరమును నితర భాషలతోడను గలసంబంధమును నిర్ణయించుటకు పూర్వమిందలి వ్యాకరణ విషయములను పరిపోల్చి పరిశీలింపవలసిన యావశ్యకత యెంతేనియు కలదు.

సామాన్యముగా పూర్వకాలమం దేభాషలోనైనను ప్రసిద్ధమగు కవిత, అనగా-లక్ష్యగ్రంథముల బయలుదేరిన పిదప గాని యాభాషకు లక్షణ మేర్పడి నట్లగపడదు. ఒకభాషకు లక్షణ మేర్పరచుట యద్దానిని వ్యాకరించుటచే సాధింపనగును. భాషను వ్యాకరించుట యనగా సంపూర్ణభావమును వ్యక్తీకరించెడి యందలి యఖండవాక్యములను గొన్నిటిని గ్రహించి వాని నొండొంటితో పోల్చిచూచి యా యా వాక్యములలో నే యే భాగముల కెంతెంత యర్థమో, ఏభాగ మెట్టి యుపయోగముకలదో, యొకభాగముతో మఱియొక భాగమునకు కల సంబంధమెట్టిదో, యను నిట్టి విషయములను పరిశీలించి, యా యఖండవాక్యమును భేదించి దానిలోనీ యీ భాగము, దాని పూర్ణభావములో నీయీ ఖండభావమును సూచించుచున్నదియని నిర్ధారణచేయుటయే యైయున్నది. సంపూర్ణార్థబోధకమగు నఖండవాక్యమే భాషకు ప్రధానమనియు, ప్రకృతి ప్రత్యయము మున్నగునవన్నియు కాల్పనికములే యనియు శబ్దశాస్త్రజ్ఞుల మతము. "వ్యాక్రియంతే వివిచ్య ప్రదర్శ్యంతే అనేన శబ్దాః ఇతి వ్యాకరణం" దీనియందు భాషలోని శబ్దములు విడగొట్టబడి దానిరూప నిష్పత్తిక్రమము చూపబడుచున్నది గావున నిది వ్యాకరణమగుచున్నది. అని వ్యాకరణశబ్దమును భాష్యకారుడు నిర్వచించియున్నాడు. ఇట్లాయా భాషలయందలి యఖండవాక్యములను భేదించి యందలి యవయవములను విడదీసి, యందేయవయవ మెట్లేర్పడి యెట్టిభావము కలదై యితరావయవములతో నెట్టి సంబంధముకలదో వ్యక్తముచేయుచు, తద్భాషాతత్త్వజ్ఞులు లక్షణ మేర్పఱచినచో, నాయా భాషాసంప్రదాయములను బోల్చిచూచి వానికి కల సంబంధమును నిర్ణయింప సుకరంబగును

ప్రపంచమునందలి భాషలన్నియు గూడ పుట్టుకలో సంకేతరూపములు, ధ్వన్యాత్మకములునై, అనుకరణము సుఖదుఃఖాది భావావిష్కరణము మొదలగు కారణములచే బయలుదేరినవే యగుటచేతను సహజమగు మానవప్రకృతి భూభాగమందంతటను సమానముగా నొక్కరీతి గలదై యుండుటచేతను, అతిదూరస్థములగు జనసంఘముల భాషలలో గూడ గొన్ని సామాన్య లక్షణములు కనబడిన కనబడవచ్చునుగాక, యా యా జనసంఘములు కేవల సంజ్ఞాత్మక భాషను (Gesture language) వదలి ధ్వన్యాత్మక భాష నవలంబించినప్పటినుండి క్రమక్రమముగా వృద్ధి నొందుచుండిన తమ భావములను వ్యక్తధ్వనిరూప భాషలో (Articulate Speech) చెప్పుటకుగా నవలంబించిన పద్ధతుల (Devices) యందలి సామ్యము భేదమును బట్టియే యా యా భాషల సాజాత్యము వైజాత్యము నిర్ణయింపబడుచున్నది. అనగా నొక సంపూర్ణభావమునందలి భాగములను ఒక సంపూర్ణవాక్యమునందలి యవయవములు వ్యక్తము చేయుటకుగా నావాక్యమందవి యెట్లుచేరి యున్నవి; భావభేదములను సూచించుటకుగా నెట్టిమార్పుల నొందుచున్నవి యను దానిని బట్టి నిర్ణయింపబడుచుండునట. దీనికొక చిన్న యుదాహరణమును గ్రహింతము. సెమిటిక్ భాషలలోనందలి ధాతువులలోని హల్మధ్యస్థములకు వచ్చులకు

గలుగు మార్పే యాభాషార్థభేదమును సూచించుచున్నది. ఇందలి ధాతువులు సామాన్యముగా మూడేసిహల్లులతో గూడియుండును. 'క్ ట్ ల్' (K t l) అను నదొక ధాతువు. దీనికి 'చంపు' అనునది సామాన్యార్థము. చంపుట—కోటెల్ (Kotêl) వాడు చంపెను = కాటల్ (Kâtal), చంపుటకు = క్టోల్ (K'tol), చంపబడెను = కాటూల్ (Katûl). ఇట్లాధాతువునకు సంబంధించిన కాలాది భేదములు హల్లులమధ్యను జేర్పబడు వివిధములగు నచ్చులమూలముగా వ్యక్తము చేయబడుచున్నవి. కాని ద్రావిడభాషలలో ధాతువులు సామాన్యముగా నేకాక్షరధాతువులై యుండుటయే గాక యందలి భావభేదములొక మూలధాతువుపై చేర్పబడు భిన్నధాతువుల సహాయముచే వ్యక్తము చేయబడుచున్నవి. ఉదా—'చా' ధాతువు= చా + (ఉ) తు = చచ్చు.

చా (ఉ) తు + ను = చచ్చును.

చచ్చు + ఉతు + ను = నచ్చుదును—సత్తును.

చా + అన్ + కల + (వా)డు = చావగలడు.

పో + ఉతు + ఉన్న + వాడు = పోవుచున్నాడు.

ఇట్లొకధాతువుపై మఱియొక ధాతువును జేర్చుటచే భిన్నార్థములను సూచించుభాషలు సంశ్లిష్టపద (Assentinative languages) రూపభాషలని చెప్పబడుచున్నవి.

కాని భాష యెల్లపుడు నొక్కరీతిగా నుండునది గాదు. సర్వజీవద్వస్తువులవలెనే యదియు ననవరతము మార్పులకు లోనగుచునేయుండును. నిత్యవ్యవహారమున భాషారూపములు జనులనోళ్లలో బడి నలుగుచుండుటచేత నాయా జనుల యుచ్చారణ వైఖరినిబట్టి యొక్క భాషయే యొకకాలమున నొకరూపము కలదై యున్నను, మఱి కొంతకాలమున మాఱు రూపు చెందుచుండును. ఒక కాలమునందలి యా భాషస్వరూపమెట్లుండెనో యట్లనే గ్రహించి దానిని వ్యాకరించి లక్షణము చెప్పినచో నది యాకాలమందలి భాషకు లక్షణమగును. మఱి కొంతకాలమునకు మార్పుచెందిన యా భాషనే గ్రహించి వ్యాకరించినచో నద్దానికే మఱియొక లక్షణ మేర్పడును. ఇట్టి లక్షణము లాభాషకు తాత్కాలిక లక్షణములు లేదా వ్యాకరణములు (Deseriptive Grammars) అని చెప్పబడును. దీనికి కాలభేదమును బట్టిగాని, యాయా కాలములం దన్యభాషలతో గలిగిన సంసర్గమువలన గాని, భాషారూపములలో గొంతమార్పు కలిగినను, సామాన్య సంప్రదాయములలో మాత్రము భేదమేర్పడుట కవకాశము లేదు. ఒక్క భాషకే కాలభేదమునుబట్టి యనేక వ్యాకరణములు బయలుదేరుచు నద్దాని తాత్కాలికావస్థను దెలుపుచుండును. ఇక నాయాకాలములం దాభాషకేర్పడిన భిన్నములగు లక్షణములను పరిపోల్చి చూచి యా భాషారూపములలో నేవి యేకారణములచే మాఱినవో, వానికి గల పరస్పర సంబంధ మెట్టిదోయను విషయములను పరిశీలించుచు నాభాషయొక్క పరిణామ క్రమమును మొదటినుండియు నిరూపించినచో నది తద్భాషా చరిత్ర మనియు లేదా చారిత్రక వ్యాకరణ (Historical Grammar) మనియు జెప్పబడును. ఒకభాషయొక్క లక్షణము నితరసన్నిహిత భాషల లక్షణముతో పోల్చి, వానికి గల పరస్పర సంబంధమును నిరూపించినచో నది 'తద్భాషావ్యాకరణ తత్త్వపరిశీలనము' (Comparative Grammar) అని చెప్పదగియుండును. సజాతీయము లయ్యును భిన్నరూపముల జెంది ప్రత్యేక భాషలుగ బరిగణింపబడుచున్న వీనియందలి వ్యాకరణ విశేషములను పరిపోల్చి చూచినచో నా ప్రత్యేకభాషారూపముల యొక్క పూర్వచరితము వెల్లడి యగుటయే గాక, వీనికి సహజములు సమానములునగు సంప్రదాయము లెట్టివో తెలియవచ్చుచుండును. అప్పుడివి యే యితర కుటుంబభాషలతో నెట్టి సంబంధము కలిగి యున్నవో కనుగొనుట కవకాశమేర్పడును. కావున ప్రస్తుతము దక్షిణదేశభాషలలో ముఖ్యములై యున్న గాంధ్ర తమిళ కన్నడ భాషలలోని సంధి లక్షణముల నించుక పరిశీలించి వీనికి సమానములగు సహజసంప్రదాయము లేవో తెలిసికొన యత్నింతము.

ప్రథమమునకే సంధి యనగా నేమి యను ప్రశ్న కలుగక మానదు. సంధియనగా కలయికయని సామాన్యార్థము. భాషలో నుచ్చారణ సౌలభ్యమునకై యొకశబ్దము మఱియొకదానితో గలియుటయే సంధియగును. అనగా చిరకాలము క్రిందటనే సంపూర్ణార్థబోధకమగు నఖండ వాక్యము విడగొట్టబడగా నేర్పడినవియు, నామాఖ్యాతాది సంజ్ఞలచే వ్యవహరింపబడుచుండినవియు నగు నాయఖండ వాక్యభాగములను, మరల నాయా కాలములందలి జనులు సంపూర్ణార్థబోధకమగు వాక్యముగా సమకూర్చునప్పు డుచ్చారణసౌకర్యమునకై యొకదానితో మఱియొకదానిని జేర్చి పలుకుపద్ధతియే సంధి విధానమగుచున్న దన్నమాట. అఖండవాక్యము విభాగింపబడి భాష కొకమాఱు లక్షణ మేర్పడినపిదప, నావిభాగింపబడినపదములు కాలక్రమమున ననేక రీతుల మార్పుచెందుట ఘటస్థించునుగావున, ప్రాచీనవాక్యమునకును దానిలక్షణమునకును, తరువాతికాలమందలి పదములతో గూర్చిన వాక్యమునకును దానిలక్షణమునకును గొంతభేద మేర్పడవచ్చును. ఇట్టి భేదమును గూర్చి తెలిసికొనుటకు దగిన యాధారముకూడ చాల స్వల్పమే గాని, సజాతీయభాషారూపముల నొండొంటితో బోల్చి చూచినపుడు ప్రాచీనభాషాలక్షణములు కొన్ని బయలుపడుచుండుననుటకు సందేహములేదు. ప్రాచీన భాషాఖండవాక్యములుకొన్ని జన్యభాషలలోనికి సంక్రమించియుండగా దరువాతికాలమున నాయాభాషలను వ్యాకరించినవైయాకరణులు, వారివారికిదోచిన రీతిని వానిని సమర్థించి లక్షణముకల్పింప యత్నింతురు. కావున నాయాభాషలలోని విశేషలక్షణములను సరిపోల్చి పరిశీలించినచో నాయాభాషలయందలి విశేషములు సమన్వయమగుటయు, ప్రాచీనస్థితి పొడగట్టుటయు ఘటస్థింపవచ్చును. దీనికొకటి రెండు నిదర్శనములను జూపెదను.

సంస్కృతభాష తక్కిన యిండోయూరపియన్ సోదరభాషలనుండి విడిపోయిన తరువాత నతిచిరకాలము నకుగాని పాణిన్యాదు లీభాషను వ్యాకరించి లక్షణ మేర్పఱచుటఘటస్థింపలేదు. వీరిలక్షణమునుబట్టి ద్వితీయా బహువచనమున తచ్ఛబ్దము 'తాన్'అను రూపముగలదై యున్నది. వ్యవహారమునందు నదియట్లేయున్నది కాని యొకవాక్యమునందు 'తాన్' శబ్దమునకు మఱియొక 'తాన్'శబ్దముగాని, లేదా 'తారయతి' యను క్రియాపదముగానిపరమైనపుడు,ఆవాక్యములు'తాన్ + తాన్-తాంస్తాన్అనియు, తాన్ + తారయతి=తాంస్తారయతి!' యనియు నాపదములు మధ్యనొక 'సకా' రమునుజేర్చి పలుకబడుచున్నవి. తాన్ + తాన్, అనుపదములకు కలయిక-(సంధి)కలిగినపుడవి "తాన్తాన్"అనిగాని, లేదా సరళానునాసికతోడిసంయోగముచే 'త'కారము సరళత్వమును జెందినచో "తాన్దాన్"అనిగానికావలసియుండగా, నాపదములమధ్య 'స' కారమువచ్చిచేరుట విలక్షణముగా గనబడకమానదు. అయినను ఆవాక్యమట్లే వ్యవహారమున గానవచ్చుచున్నది. ఈచిక్కును దొలగించుటకే పాణిని 'న'కారాంతశబ్దములకు చ ఛ, ట ఠ, త థ, వర్ణములాదియందు గల పదములతో గలయిక కలిగినచో మధ్యనొక సకారమువచ్చును అని 'నశ్ఛవ్య ప్రశాన్' అను సంధిసూత్రముచే 'స' కారమును విధించి యారూపమును సాధించినవాడైనాడు. పాణిని యిప్పట వ్యవహారములో గనబడుచున్న 'స' కార మా యా సందర్భములలో వచ్చును, అని చెప్పియున్నదానిని సాధించినాడేగాని 'స' కారమునకు 'త' కారముపరమైనపుడును, ఆరెంటిని కలిపి యుచ్చరించునపుడును సంధిలో నీరెంటికి నెట్టి దగ్గర సంబంధములేని 'స' కారము మధ్యవచ్చుటకు గారణమును దెలుపలేదు. అది యాతనిపనియుగాదు, కావున తాన్ + తాన్, తాన్ + తారయతి అను శబ్దముల కారూపములతో మాత్రమే కలయిక గలిగినచో, 'తాంస్తాన్, తాంస్తారయతి' యను వాక్యము లేర్పడుట కవకాశములేదు గావున, నిది ప్రాచీనభాషకు చెందిన యఖండవాక్యస్వరూపమునే సూచించు చున్నదని మన మూహింపవచ్చును. ఇట్లు నూతనముగా వచ్చిచేరినవని తలంపబడుచుండిన సుడాగమాదులు నిజముగా ప్రాచీన భాషకు చెందినవి గావుననే, శబ్దశాస్త్రజ్ఞులివి యాయా భాషల ప్రాచీనచరిత్రకు సంబంధించి వీనిలో నింకను మిగిలియున్న చారిత్రకచిహ్నము(Historic Survivals) లని తలంచుచున్నారు. ఈసకారము సంధివశమున వచ్చినదే యనరాదా? ఇది ప్రాచీనాఖండవాక్యమునకు

సంబంధించినదే యని యెట్లు చెప్పవగునను ప్రశ్న కలుగవచ్చును. ఈవిషయ మితరసజాతీయ భాషారూపములతో బోల్చిన మనకు తేటపడగలదు. సంస్కృతముతో సజాతీయములని తలంపబడుచుండిన గ్రీకులాటిన్ భాషలలోని తచ్ఛబ్దద్వితీయా బహువచనరూపములు 'తాన్స్' (tons) అని నకార సకార సంయోగమంతమందు గలవై వ్యవహరింపబడుచున్నవి. ఇచ్చట నివియు సంధివశమున వచ్చినవేయేమో యనియు, "తాంస్తారయతి" అనువాక్యమువారు 'తాన్స్ + తారయతి' యని విభాగించుటచే నట్లేర్పడియుండునవియు తలంచుటకవకాశము లేకపోలేదు గాని, సంస్కృతభాషలో సంయోగాంతశబ్దములు సామాన్యముగా లేకుండుటచేతను, ప్రక్రియాసందర్భమున పదాంతమందట్టి హల్సంయోగము వచ్చినచో "సంయోగాంతస్య లోపః=సంయోగాంతంయున్నపదంతస్య లోపః స్యాత్" అను సూత్రముచే తుదిహల్లును లేదా ఒక్కటికంటె మిగిలినహల్లుల నన్నిటిని లోపింపజేయుటయే వ్యాకరణపద్ధతియై యుండుటచేతను, ద్వితీయాంతతచ్ఛబ్దపదము ప్రాచీనభాషలో సంయోగాంతమే యైయుండ, సకారలోపమిటీవలి కాలమున జరిగినదనియు, గావున, "తాంస్తాన్, తాంస్తారయతి" యనునవి ప్రాచీనభాషకు జెందిన యఖండవాక్యములై యుండుననియు, సంస్కృతభాషలో 'స'కారము లోపించినరూపమె తచ్ఛబ్దద్వితీయాబహువచనముగా గనబడుచుండుటచే, 'స'కారము సంధివశమున వచ్చినదని పాణిన్యాదులద్దానిని విధించి, 'తాంస్తాన్' రూపమును సాధించిరనియు, మనము నిశ్చయింపవలసి యున్నది.

పాణిని సకారవిధానమును బోలినదే తెలుగున నున్నంతద్ధర్మార్థవిశేషణముల కచ్చు పరమగునపుడు 'ను' గాగమవిధాన మొకటి కలదు. చేయు + అతడు, అని యుండగా నీపదములమధ్య 'ను' గాగమ ముచ్చారణార్థముగా వచ్చినదేమోయని తలంచుట కవకాశమున్నను, నిజముగ నది యట్లువచ్చినదిగాక యనునితర విభాగము వలన నేర్పడినదేయని పరిశీలించిన తెలియగలదు. ఆంధ్రమున సామాన్యముగా విశేషణములు ద్రుతాంతములు కాకుండుటచే, చేయున్ + అతడు అను శబ్దముల సంయోగముచే నేర్పడిన 'చేయునాతడు' అను పదబంధమును చేయు + న్ + అతడు అని విడదీసి, చేయు అనునదే క్రియావిశేషణమనియు, నచ్చుపరమైనపుడు 'న్' ఆగమమనియు దెలిపిరి. చేయుచున్న, చేసిన అను వర్తమాన భూతకాలికరూపములవలె నకారాంతమైన భావిక్రియావిశేషణరూపము ప్రాచీనకాలమున భాషలో లేదు. ఇటీవలికాలమున 'చేయగల' అనునదేర్పడిన నేర్పడియుండుగాక. కావున నాకాలమున 'చేయును' అను తద్ధర్మార్థకరూపమే భావిక్రియారూపముగను, నదియె యొక నామమునకు బూర్వస్థాన మాక్రమించినపుడు విశేషణముగను వాడుకొనబడినది. భాషలో నిది యతిప్రాచీనంబగు రూపంబగుటచే నాకాలమున నిది క్రియారూపముగను, క్రియావిశేషణరూపముగను గూడ వాడుకలో నుండెడిది. దీని కజాదిశబ్దముపరమైనపుడు (చేయున్ + అతడు) నకారము తరువాతి యచ్చుతో గలసి 'చేయునాతడు' అని యగుటయు, హలాదిశబ్దము పరమగునపుడు (నీ భాషలలో సామాన్యముగా భిన్నహల్సంయోగము వారింపబడుచుండుట స్వాభావికమై యుండుటచే) నకారము జారిపోవుటయు దటస్థించి యుండును. తమిళమునగూడ సంపూర్ణక్రియారూపంబగు 'శెయ్యుం' అనునదే 'పేరెచ్చం' అనగా క్రియావిశేషణముగా గూడ వ్యవహరింపబడుచుండుటయే, యీపై వాదమున కుపబలకముగానున్నది. 'అదు శెయ్యుం'=అది చేయును, అనునప్పుడు సంపూర్ణక్రియగాను, 'శెయ్యుం మనిదన్=చేయుమనిషి' యన్నప్పుడు క్రియావిశేషణముగాను 'శెయ్యుం' అనుమకారాంతశబ్దమే వ్యవహరింపబడుచున్నది. "ఈ శెయ్యుమ్" అనునదే యందలి తుది 'మ'కారము 'న'కారముగామాఱుటచే 'చేయున్' అనియు, ఊతగా చివర నొక 'ఉ' కారమును జేర్చికొనుటచే 'చేయును' అనియు రెండురూపముల తెలుగునగానవచ్చుచున్నది. ప్రత్యేకార్థము నేమియు బోధింపక హలంతశబ్దములపై కేవలమూతగావచ్చిచేరిన యీ యుకారము, అచ్చుపరమైనపుడు నిత్యముగా లోపించుచుండును. కావుననే యీభాషలో నుత్తునకచ్చుపరమైనపుడు సంధి నిత్యముగా నగుటతటస్థించినది. ఇంతేకాదు, "పూర్వపర

స్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధియనం బడు”నని బాలవ్యాకరణకర్త పరస్వరైకాదేశమే సంధికి లక్షణముగా జెప్పుటకుగూడ నిదియే ముఖ్యకారణము. ఈ ఆంధ్రభాష చాలవఱకజంతభాష. అందు ముఖ్యముగాను కారాంత శబ్దములే మెండుగానుండును. ఇట్లగుటకును గారణము లేకపోలేదు. ప్రాచీనభాషలోని శబ్దములు పెక్కు హలంతములు. కావుననే తమిళ కన్నడాది యితర ద్రావిడభాషలలోగూడ హలంతపదములే విశేషముగా గనబడుచున్నవి. ఈ హలంతపదము లన్నియు ముఖ్యముగా దెలుగునను కొంతవఱకు కన్నడమునను గూడ నొకానొక కాలమున నుదిను కారమునూతిగా గొన్న వగుటచే నీభాషలలో నుకారాంతశబ్దము లైనవి. తమిళ మిప్పటికిని చాలవఱకు హలంతభాషయే యైయున్నది. హలకన్నడమున హలంతపదములే హెచ్చుగానున్నను హొసగన్నడమున నజంతపదములే హెచ్చుగ నుండును. తెలుగజంతభాషయే యని చెప్పఁగియున్నది. ఈభాషలలో ప్రాచీనహలంతపదములపై నూతగాజేరిన ఉకారమంతముంనుగల పదముల కజాదిపదములు పరమైనపుడా యూతగావచ్చిన 'ఉ' కారము మరల దానంతట నదే లోపించిపోయి ప్రాచీనపదస్వరూపము నప్పుట నిలుపుచుండును. అపుడు పూర్వపదాంత్యహల్లు పరపదాద్యచ్చుతో నెనయుట సంధివించుట తటస్థించును. ఇట్లు కారాంత సంధియనునది నిజముగా పూర్వమందు నిలచిన హల్లు పరమందున్న యచ్చుతో నెనయుచుండుటేగాని యేకాదేశసంధి కాదని దీనివలన స్పష్టమగుచున్నది. ఈ యేకాదేశముసంస్కృతసంధికి జెల్లినదిగాని తెనుగుసంధికి జెందినదికాదు. గంగ + ఉదకం అని యున్నపుడు “ఆద్గుణః—అవర్ణాదచిపరే పూర్వపరయోరేకోగుణాదేశస్స్యాత్” అని పూర్వపరస్వరంబులకు రెంటికిని గలిపి గుణాదేశమువచ్చినది. అనగా అ + ఉ = ఓ అయినదన్నమాట. నిజముగా అ + ఉ కలిసినచో అ ఉ అనియో లేదా 'అవు' అనియో కావలసియుండగా 'ఓ' కారము వచ్చుటగూడ నసందర్భముగానే కనబడును. దీనిసమన్వయమునకుగూడ నీభాషలప్రాచీనచరిత్రమునకు బోవలసినదే. ప్రాచీన ఇండో యూరపియన్ భాషలో నిపుడు సంస్కృతములో నిలిచియున్న సంధ్యక్షరముల కంటె నెక్కుడు సంధ్యక్షరములు (diphthongs) కలవు. అందు అ ఇ, ఎ ఇ, ఒ ఇ; అఉ, ఎఉ, ఒఉ, అను హ్రస్వాక్షరములును, ఆఇ, ఏఇ, ఓఇ, ఆఉ, ఏఉ, ఓఉ, అను దీర్ఘాక్షరములునుగలసి పండ్రెండు సంధ్యక్షరములుగలవు. అవికాలక్రమమున జనులయుచ్చారణవశమున మార్పుచెంది అఇ, ఎఇ, ఒఇ, అను మూడును సంస్కృత భాషలో “ఏ' కారముగను, అఉ, ఎఉ, ఒఉ, అనునవి 'ఓ'కారముగను, తక్కిన యారింటిలో మొదటి మూడు ఐకారముగను, తరువాతి మూడును 'ఔ'కారముగను, నిలిచినవి. కావుననె గంగ + ఉదకం—అనునది 'గంగవుదకం' అనియె కావలసియుండగా, ప్రాచీనకాలమునను 'అ ఉ' అనున దీభాషలో 'ఓ'గా మాఱుటచే నాపన సంయోగమున నోకారమె కనబడును 'గంగోదకం' అనియే వ్యవహరింపబడుచున్నది గాని, 'గంగఉదకం' అని యగుట లేదు. ఈ విషయము భాషలప్రాచీన చరిత్రకు సంబంధించినది గాని కేవల సంస్కృతమునకు సంబంధించినది మాత్రమే కాదు. తరువాతికాలమున భాషను వ్యాకరించిన పాణిని అకార ఉకారములకు సంధి గలిగినపుడు 'ఓ'కారము, అకార ఇకారములకు 'ఏ'కారము వచ్చుచుండుటను గనిపెట్టి—గుణైకాదేశమును సంధికార్యముగా విధించినాడు. ఇట్లాయా భాషల ప్రాచీనచరిత్రము పరిశీలించుటచే నూతన విషయములు బయలుపడుచుండుటేగాక, ఒక భాషయొక్క తాత్కాలికవ్యాకరణము (Descriptive grammar) న దెలుపబడిన విశేష సంధికార్యములు (తెలుగునందలి నుగాగమ టుగాగమరుగాగమాదులు) సమన్వయమగుటయు తటస్థించును. వీనినిగూర్చి మఱియొకమాఱు పరిశీలింతము.

---

## మానవ ప్రకృతి—౧.



# పంతులు-కొడుకు

డాక్టరు, గుళ్లపల్లి నారాయణమూర్తిగారు L.M.S.

## పాత్రలు

సుందరరావుపంతులు—వకీలు

వసంతరావు—అతనికొడుకు

జగన్నాధం—వకీలుగుమాస్తా

కామేశ్వరమ్మ— వకీలు తోబుట్టువు, పూర్వ సువాసిని;

రమణమ్మ—వకీలుకూతురు-బాలవితంతువు;

చంద్రకాంతం—వకీలుకోడలు

అంకమ్మ—దాసి.

### స్థలము-విశాఖపట్నము

### ౧ వ రంగము

[వకీలు ఇంట్లో విశాలమైన భోజనాలగది; గదిలో నుండి పెరట్లోకి, ముందటి వాకిట్లోకి ద్వారా లున్నాయి; కామేశ్వరమ్మ కాళ్లుచాపుకొని కూర్చుని వత్తులుచేస్తూంది. ౫౫ సం. వయస్సు; దృఢమైనశరీరం; మెళ్లో బంగారు కట్టుగల రుద్రాక్షతావళమున్నది. పెరట్లో, స్నానానికి నీళ్లుకాగబెట్టి, కుంపటితో నిప్పులుపట్టుకొని రమణమ్మ ప్రవేశించింది. ౨౧సంవత్సరాలవయస్సు; చామనిచాయ; తెల్లచీర, రవిక ధరించింది; చేతులకు మెళ్లోను స్వల్పంగా నగలున్నాయి; తలదువ్వుకొని జుట్టు ముడేసుకుంది. చాలా తెలుగు గ్రంథాలుచదివిన విద్యావతి;]

సమయం-ఏప్రిలు ౨వ తేది శనివారం ఉదయం ౧౦ గం.

---

రమ—ఇంకా ఇంటికి రాలేదూ?

కామే—ఎవరు? మీనాయనా?

రమ—ఇంకెవరు అనుకున్నావు?

కామే—ఏమో! నువ్వు ఊరూపేరూ లేకుండా మాట్లాడుతావు! ఎవరో ఏమితెలుస్తుంది!

రమ—(జవాబు చెప్పకుండా పెరట్లోకి వెళ్లబోతుంది)

కామే—మళ్లా వెళ్లిపోతావేమిటి? కుంపటిమీద నెయ్యిపెట్టి మరీవెళ్లు! ఎప్పుడూ సగంసగంపనే! అంత లోనే మరుపు!

రమ—జ్ఞాపకం ఉంది! మరచిపోలేదు! ఇప్పటి నుండీ కుంపటిమీదపెడితే గిన్నె కాలిపోదూ?

కామే—ఇక్కడనే నున్నా ననుకున్నావా? చచ్చేననుకున్నావా? ఇంకాకళ్లున్నాయమ్మా! గుడ్డితనంరాలేదు నీ ధర్మమా అని! మీ అందరికీ అలాంటి కోరికుందేమోకాని;—సరే! లే! నేనే చూసుకుంటాను వెళ్లు!

రమ—(నేతిగిన్నె తెచ్చి కుంపటిమీద పెట్టబోతూండగా కొంతనెయ్యి ఒలుకుతుంది.)

కామే— నేనుచూసుకుంటాను వెళ్లవే తల్లీ! అప సంతికి పనెక్కువా! లోభికి ఖర్చెక్కువాను.

రమ—(గుడ్డతెచ్చి నెయ్యి ఒలికినచోట బాగు చేస్తుంది)

కామే—నీళ్లుకాగే యేమో చూడు! అదేమిటి చినుకులుపడుతున్నా యేమిటి? నీళ్లుకాగకుండా నీళ్ల పొయ్యి ఆరిపోతుంది కాబోలు.

రమ—(తొందరగా పెరట్లోకివెళుతుంది.)

చంద్ర—(ప్రవేశం; చక్కని విగ్రహం; 18సంవత్సరాలు వయస్సు; తలదువ్వుకొని కాటుకబొట్టుపెట్టుకుంది. కొంత ఖరీదు గల చీర ధరించింది. వంటిని విస్తారం నగలు లేవు. కొడుక్కి పూలు టోపీ అల్లుతూవచ్చి) పెరట్లో బట్టలేమైనా తడిసిపోతున్నాయా?

కామే—(మాట్లాడదు) చంద్ర-పెరట్లోకి వెళు తుంది.

కామే—ఎలాగుందే నీళ్ల పొయ్యి?

చంద్ర—వాకిట్లోంచి తీసి వరండామీద పెడు తూంది వదినె.

కామే—మళ్లీ మొదటినుంచీ ప్రణుగుతున్నమా ?

రమ—(పెరట్లోనుండే) నీళ్లు చాలా మట్టుకు కాగేయి.

కామే—తొందరగాకాగబెట్టు వచ్చేవేళయింది.

రమ—(పెరట్లోనుండే) ఇక్కడ ఆడుకోలేదు నేను.

కామే—ఆఁ హాఁ! ఆడుకుం టున్నావను కున్నాను. మాటకు మాట చెప్పడం గుణం మాత్రం పోయిందికాదు.

రమ—(వినబడీవినబడకుండా) కాళ్లు చాపుకు కూర్చుని పాటలు పాడుకుంటూ వత్తులుచేసుకోడమను కుంది కాబోలు.

చంద్ర—(నవ్వుతుంది)

కామే—వచ్చినట్లు అన్నిపనులు నేనేచేసుకో వాలి. ఏమిపరిహాసాలుగా ఉంది వీళ్ల పని! (లోపలికి వస్తూన్న చంద్రమ్మనుచూచి) ఆనీళ్ల పొయ్యితో ఆలాగు తంటాలు పడుతూందికదా! ఈవిడగారు కాస్త సాయం చేస్తే అరిగిపోతుందా ?

చంద్ర—(కొంచెంతడిసిన పిల్లబట్టలు, తనబట్టలు తీసుకుని ప్రవేశించి)

నావల్లకాదమ్మా! నాకు పిల్లడిపనితోనే తీర కుండాఉంది!

కామే—అసహ్యం వేసుకుంటూ ఆ పిల్లడిగుడ్డ లన్నీ భోజనాలింట్లోంచే తీసుకురావాలా ?

చంద్ర—కని, పెంచేవాళ్లు అసహ్యపడితేఎలాగ?

కామే—ఆదేదెప్పే! ఎలాగయితేనేమి కన్నావు తొందరపిల్లలాగు ఒకపిల్లడిని!

(చంద్ర—సిమక్కిరిమిస్తుంది. వసంతం అప్పుడే వీధి లోనుంచి వచ్చి భోజనాలింట్లోకి వెళ్లబోతాడు. సన్నం గాపొడుగైన విగ్రహం! ౨౧ సం. వయస్సు! కొంచెము షోకిల్లా! చొక్కా—పంచెపట్టుత్తరీయం! కాళ్లకు టెన్నిసుజోడు. బుగ్గను కిల్లీ చేతిలో డ్రాయింగు పుస్తకం, పెనసలు.)

వసం—అత్తా! ఏంటయింది!

కామే—అ! అయింది; నా న్నింకారాలేదేమి కచేరీగదిలోంచి? అదేమిట్రా అదారుణం! జోళ్లతోనే భోజనాలింట్లోకి ?

వసం—మరచిపోయేనే! ఆకలేస్తూంది; (దూరం గావెళ్లి జోడువిప్పివచ్చి మేనత్తదగ్గరగా కూర్చుంటాడు).

కామే—వళ్ళో కూచుంటా వేమిటి? బాగానే ఉంది! ముట్టుకోకుమా! మళ్లాస్నానంచేయలేను !

వసం—రోజుకి అయిదారుస్నానాలు చేస్తావు! నీకూకష్టమే! తల ఆరాలని బాధలేదుకద!

కామే—నోరుముయ్యి!

వసం—నాకు ఆకలవుతూంది. అన్నంపెట్టు.

కామే—నాన్న రాకుండానే ?

వసం—నాన్న రాకపోతే పెట్టవేమిటి ?

కామే—ఊఁ-హుఁ! పెట్టను!

వసం—పెట్టకపోతే నేనే పెట్టుకుతినేస్తాను.

కామే—ఏమిట్రా మరీ పెంకితనం! నాన్నతో చెప్పాలేమిటి ?

వసం—చెప్పు! చెపితే ఏంచేస్తారు! నాలుగు తిట్టుకుంటారు? అంతేనా! గ్రాత్తేముందీ?

కామే—మొండి! సబబులేమిటి? అటుచూడు! నీపెళ్లాం నవ్వుతూంది! మరీచిన్నతనం వస్తూందేమి ఒక నాటికొకనాడు ?

వసం—ఎప్పుడూ చిన్నవాళ్లుగా ఉంటే మంచిది. కావలిస్తే నువ్వు చిన్నదానివయిపో.

కామే—అ, అవతాను ఇంకా చిన్నదాన్ని! పనీపాటు లేకుండా పడ్డలాగు తిరగడం! పెద్దవాళ్లతో హాస్యాలున్నూ.

౨ వ రంగం-వసంతంగది

(ఒకపట్టెమంచము, పరుపు, ఒక కుర్చీ, బొమ్మల బీరువా, ఉయ్యాలలోను నిద్రపోతూ నంటిపిల్లడు; వసం తం చొక్కా తుండువావిడిచి మంచంమీద విశ్రమిస్తాడు.

చంద్రమ్మ టోపీ అల్లుతూ పంచంమీద ఒక వార కూర్చుంటుంది.)

చంద్ర—మధ్య ఈవిడపోరు వచ్చి పడిందేమిటి మనకి?

వసం—పోనీలే, సరదాకిలే!

చంద్ర—సరదాకాదు; ఆవిడ నామీద కూడా అధికారం చలాయిస్తూంది.

వసం—డబ్బున్నాదని గర్వం!

చంద్ర—నువపని ఎప్పటికీ ఇంతేనా?

వసం—ఇంతేనేమి?

చంద్ర—ఇంతేకాక మరేమిటి? ఇప్పటికి నేను కాపరానికివచ్చి నాలుగేళ్లయింది; ఒక్కలాగుంది; ఒక పనీ, పాటు, ఉద్యోగం, ఏమీ కనపడదు. మీమామగారిన మీరూరుకుంటారు; మీ నాన్నగారికి ఆయనప్రాక్టీసు, ఆయనడబ్బు—అప్పులు చేసయినా భూములు కొనడం, ఆయనగొడవ ఆయనదే! ఇంట్లో బ్రతికేరో చచ్చేరో ఆలోచనేమీ అక్కర లేదు ఆయనికి!

వసం—ఆయన కూడబెడుతూన్న ఆస్తంతా మనది కాదూ?

చంద్ర—ఏమో ఆయన ఏంచేసుకుంటారో? మీ యిద్దరికీ పొత్తుంటేనా? ఆయనికి మీమీద అభిమానం, మీకు ఆయనమీద భక్తి ఉంటేనా? మీకాళ్లమీద మీరు నిలబడే ప్రయత్నంచేసుకొన్న పాటి వస్తుందా?

వసం—భేష, మంచి మాటన్నావు? (డ్రాయింగు పుస్తకంతీసి ఒకచిత్రంచూపి) ఇదిచూశావా? భార్యను విడిచిపెట్టి సన్యాసంపుచ్చుకోడానికి వెళుతూన్న సిద్ధార్థుడు! ఆభార్యముఖంలో అమాయికత్వం! అతనిముఖం లో కనబడుతూన్న మనస్తాపం చూసేవా? భార్యను విడిచిపెట్టవద్దనే ఇంద్రియాలకీ, సన్యసించి స్వేచ్ఛా స్వతంత్రత అనుభవించమని ప్రబోధిస్తూన్న ఆత్మకీ జరుగుతూన్న యుద్ధం అతనిముఖంలో కనబడ లేదు? (ఇంకొకటిచూపి) ఇది సారనాద్‌లో బుద్ధుని ప్రథమోపన్యాసం. ఆముఖానికీ, ఈముఖానికీ తేడా చూడు! అప్పటికి ఇంద్రియాలని జయించేడు! ఈదివ్యబృందాన్ని చూసేవా?

చంద్ర—బాగానే ఉన్నాయికాని, వీటివల్ల డబ్బు రావడ మేలాగ?

వసం—అదీ పెద్దప్రశ్నేనా? ఇంతప్రయత్నము వ్యర్థమేఅనుకుంటున్నావేమిటి? క్రొత్తఢిల్లీలో ఇలాగే ఫ్రెస్కోలు (Frescoes) తయారుచేసేనంటే ఒక్కొక్కదానికి వేయిరూపాయలకి తక్కువ ఇవ్వరు! చిత్రలేఖనం అంటే తమాషా అనుకుంటున్నావేమిటి? సరుకుకొని లాభానికమ్ముకొనే వర్తకంకాదిది; కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం, ఇలాంటి కళలలో బుద్ధివికాసానికే విలువ.

చంద్ర—ఏమో నాకేమీ నమ్మకంలేదు. స్వంత ఖర్చులకేనా పనికివచ్చేలాగు ఏ ఉద్యోగమోచేసుకుంటూ సరదాకి ఇలాగ బొమ్మలు వ్రాసుకున్నా ఫరవాలేదు. మొన్న చూడండి! ఈ టోపీకోసం ఊలుకొనడానికి మూడుపావలాలకోసం మూడురోజులు రమణమ్మ నాశ్రయించి అడిగింనాలసివచ్చింది.

వసం—నాజ్ఞానశక్తివినియోగించి స్వతంత్రజీవనం చేసుకునేవాడిని, నాఖర్మం కాలితే మరొకడిదగ్గర నౌకరీచేయమంటావేమిటి? నాకుమాత్రం ఎల్లకాలం అస్వతంత్రంగా వీళ్లమీదఆధారపడి కాలక్షేపంచేయాలని ఉన్నాదనుకొన్నావా? రెండునెలలు ఓపికపట్టలేవు?

చంద్ర—అప్పుడేదేనా రాజ్యానికి పట్టాభిషేకం చేస్తారా?

వసం—మరేం నువ్వుతప్పకుండా రాణీవవుతావు "పేరయ్యరాజంట పేరెల్లి రాణంట (పాడుతాడు)?"—

చంద్ర—(నవ్వుతూ) ఎప్పుడూ వెటకారం, వేళాకోళమే!

వసం—ఉద్యోగంతో సంబంధం లేకుండా, హాయిగా కాలుమీద కాలువేసుకొని, దర్జాగా—

చంద్ర—ఆహాహా! ఏభగవంతుడుపుట్టించేడో కాని మిమ్మలని—ఆలోచింత, అనిర్వచాంం, అధైర్యస్థైర్యాలు, శభాష్—ఇవాళ కిల్లీ ఎవరిచ్చారు!

వసం—నామాట అబద్ధమనుకుంటున్నావేమిటి?

చంద్ర—మీమాటలకి అబద్ధం నిజం అంటూ రెండు రకాలు లేవే!

వసం—చెయ్యి ఇలాగు తే! ఇంకా ఇంత వేగం చెప్పకలచుకోలేదు కాని, అయినా చెబుతాను! (చేతిలో చెయివేసి ఒట్టుపెట్టుకొని, చెవిలో రహస్యం చెబతాడు)

చంద్ర—నిజంగా ఎంత డబ్బువస్తుంది?

వసం—ఎంతో తెలియదు! అయిదువేలు మొదలుకొని లక్షరూపాయలికిలోగా ఎంతయినా రావచ్చును.

చంద్ర—ఎక్కడనుంచి?

వసం—లాటరీ! ముప్పదిరూపాయలిచ్చి దర్బీస్వీపుకు మూడుటిక్కట్లు కొన్నాను.

రమణమ్మ—(ప్రవేశించి) ఏమిట్రా అన్నయ్యా?

వసం—ఇంకొక రెండునెలలలో మనకి లాటరీలో డబ్బువస్తుంది; మనకంటే నాకేసుమా!

రమ—నాకేమిస్తావు?

వసం—నీకేమిటి నాకేమిటి! దర్జాగా ముందు మోటరుకారు కొనేయడమే. ముళ్లేసి మూటకడతా నను కొన్నావేమిటి నాన్నలాగు?

రమ—ఇప్పటి నుంచీ గాలిమేడలు కడతాడు అన్నయ్య!

చంద్ర—లాటరీలో డబ్బు రావడమేమిటి పోనిద్దురూ!

వసం—విధిగా రెండునెలలలో నాకు ధనయోగం ఉంది; అనవుమ్మకంమీదే కట్టేను.

చంద్ర—ఎవరన్నారు?

వసం—జగన్నాథం జ్యోతిషం చెప్పేడు.

రమ—ఎవరూ! (పరధ్యానంగా విన్నట్టునటించి)

చంద్ర—మీ—(పెదవికరచుకొని నవ్వు ఆపుకుంటుంది. రమణమ్మ చంద్రమ్మవైపు తీక్షణంగా చూస్తుంది. వసంతం చూడనట్టు నటిస్తాడు.)

చంద్ర—జగన్నాథానికి జ్యోతిషం కూడా వచ్చునా?

వసం—చాలాగట్టివాడు తెలుసునా?

చంద్ర—రూపాయలెక్కడివి?

వసం—జగన్నాథమే ఇచ్చేడు- అతనిద్వారానే కట్టించేను. అంటే నాపేరనేసుమా! వచ్చినదానిలో అయిదోవంతు అతనికివ్వడానికి ఒప్పందం.

చంద్ర—జ్యోతిషం చెప్పినందుకూ పెట్టుబడిపెట్టినందుకూనా?

వసం—(అంగీకారసూచకంగా తల ఊపుతాడు)

చంద్ర—అతని కింకా పెళ్లి కాలేదేమండీ?

వసం—ఈలాటరీలో డబ్బు వస్తే పెళ్లాడుదామనుకుంటున్నాడు

(చంద్రమ్మ రమణమ్మవైపు చూస్తుంది; రమణమ్మ తలవంచుకొంటుంది. జోడుచప్పుడు వినబడుతుంది)

చంద్ర—మామగారు వచ్చేసేరు.

రమ—(తొందరగా పైకి వెళుతుంది)

(తెరపడును.)

## 3 వ రంగము

(తిరిగి భోజనాలగది—పీటలు విస్తళ్లువేసి వడ్డనతరనాయిగా సిద్ధంగా ఉన్నాయి. పంతులుపీటదగ్గర వెండిచెంబు పళ్లెం జపంకోసం పెట్టిఉన్నాయి.)

పంతు—(పీటమీద జపానికి సిద్ధంగా కూర్చొని) ఇక్కడ ఉద్ధరిణ ఏదీ?

కామే—అమ్మాయి ఎక్కడో పెట్టింది కాబోలు!

పంతులు—ఎప్పుడేచ్చినా ఎక్కడో అనీ, కాబోలు అనే ఏడ్చారు—ఎక్కడివస్తువ అక్కడ ఉంచమని ఎన్నిసార్లు చెప్పేను దీనికి?

రమ—(తొందరగా వెండిఉద్ధరిణ తెచ్చి ఇస్తుంది)

పంతులు—పొడుంకాయ ఎక్కడుందో చూసి ఇలాగతగలేయి.

రమ—(పొడుంకాయ తెచ్చి ఇస్తుంది. పంతులు చేతిలో పొడుంవేసుకోబోగా దానిలో పొడుంలేదు.)

పంతులు—సీసాలో పాడుం కాస్త దీనిలో పోసి తేవాలని తెలియదూ? దీనికి ఏళ్లువచ్చిన కొద్దీ బుద్ధి పెన కాడుతూంది!

రమణ—పొడుముందనుకొని తొందరగా తెచ్చేను.

కామే—ఎప్పుడూ చీవాట్లబ్రతుకే అయింది దీని బ్రతుకు!

రమ—(పొడుంకాయతీసుకొనివెళ్లి నింపి తెచ్చి ఇచ్చి తిరిగి వెళ్లిపోతుంది).

(కొంతజప మయేక)

కామే—ఇవాళ కోర్టుకు వేళమించిందికాబోలు?

పంతులు—ఇవాళ మూడోశనివారం; కోర్టులేదు.

కామే—ఆమాట నాకు గుర్తేలేదు సుమీ! ఏమిచెప్మా ఇంతఆలస్యమయిం దనుకున్నాను.

పంతులు—వెంకట్రాజుగారిభూములు కొనాలని కాదూ ప్రయత్నం! ఆగొడవలో ఆలస్యమయింది.

కామే—కుదిరినట్లేనా?

పంతులు—అంతా పరిష్కారమైనట్లే! ఇరవై వేలు క్రయం! నిన్ననే బ్యాంకులో ఉన్న పదివేలూ తెచ్చేను. ఇంకొక పదివేలకి అప్పుమాట్లాడేను. వడ్డీదగ్గర తగాయిదాగా ఉందికాని, కుదిరినట్లే! ఈరాత్రి రాజుగారిఊరువెళ్లి పురోణీ కట్టుకోవాలి.

కామే—భూ మేపాటిది?

పంతులు—వెయ్యో, పన్నెండువందలో వస్తుంది, సాలీనారాబడి అమరకంచేస్తే!

కామే—అన్నట్టు చిన్నవాడేమిటి ముప్పయి వేలో నలభైవేలో వస్తాయని గెంతుతున్నాడట?

పంతులు—అదెక్కడనుంచి?

కామే—నీకు తెలియదూ! ఎక్కడో లాటరీ వేసేడట!ముప్పయిరూపాయలిచ్చి టిక్కట్టుకొన్నాడట!

పంతులు—వాడిమొహంలాగుంది; కాగితాలకనీ, రంగులకనీ పుచ్చుకొన్నడబ్బిలాగు తగలేస్తున్నాడేమిటి?

కామే—అదేమో అమ్మాయి నాతో చెప్పింది. జగన్నాథంజోస్యులవం చెప్పేడట తప్పకుండా వస్తుందని.

పంతులు—జగన్నాథమే చెప్పేడా? అదే నిజమయితే విధిగానమ్మవలసినదే! జగన్నాథం జోస్యులవం చాలాదాఖలా సుమా!ప్రశ్న భాగంలో చాలా ఘట్టివాడు!

కామే—దానికేంగాని, జగన్నాథాన్ని మాత్రం ఇంట్లోకి రానీకు.

పంతులు—ఏమీ?

కామే—అలాగ!

పంతులు—అంటే?

కామే—ఎందుకు, నలుగురు నాలుగు మాటలూ అనడానికి? కావలస్తే కచేరీగదిలో కూర్చోపెట్టి పని చేయించుకో గాని ఇంట్లోమాత్రం అడుగుపెట్టనీకు.

పంతులు—ఏమిటో చెప్పకూడదు?

కామే—ఏముంది చెప్పడానికి! (నలుదిక్కులా చూచి) ప్రొద్దున్న కొళాయిదగ్గరకు వెళుతూంటే, ఇద్దరు అమ్మలక్కలున్నారు. ప్లీడరు గుమాస్తాలగురించి సంభాషిస్తూ ఎవరే అంటే ఎవరే అనుకొని కొంతసేపటికి కామేశ్వరమ్మ మేనకోడలు రమణమ్మమాటే అంది ఒకావిడ–నాఒళ్లు చచ్చిపోయిందంటే నమ్మ! ఇంతట్లో నన్నుచూసి ఎంచక్కా సంభాషణ మార్చేసేరు. ఎంత పనిమంతురాలమ్మా రమణమ్మ! మేనత్తను కూర్చోపెట్టి పనిపాట్లు చక్కగా చేసుకుంటుంది! అని స్తోత్రపాఠాలు ఆరంభించేరు. నేనువినిపించుకోనట్లు రెండుచెంబుల మడి నీళ్లు తీసుకొని చక్కావచ్చాను.

పంతులు— పాలసముద్రములో హాలాహలం పుట్టిందీ! ఏమిచెప్మా దీనికొచ్చిన వినాశకాలం!

కామే—ఇప్పుడట్లే తరవకు. అబ్బాయీ! మడి కట్టుకురా!

(కామే—వడ్డిస్తూందగా రమణమ్మ నేయి వడ్డిస్తుంది. పంతులు ఒక్కసారి తీక్ష్ణంగా రమణమ్మవైపు చూసి ఊరుకొంటాడు. వసంతంకూడా భోజనానికి వస్తాడు. కొంత భోజన మయేక)

పంతులు—ఏమోయి! నీ బొమ్మలేమేనా కుదిరాయి?

వసం—ఇంకా అవుతున్నాయి.

పంతులు—కాగితాలకీ రంగులకీ నెలకి పదిరూపాయలుఖర్చు కనబడుతూంది. పాతికేళ్లు వంటిమీద కొచ్చేయి. ఒక్క—కానీ సంపాదించడానికి ప్రయోజకత్వం లేదు. నీ యీడుకు నాకు నెలకు రెండువందల రూపాయల ప్రాక్టీసు వచ్చేది తెలుసునా?

వసం—(జవాబు చెప్పడు)

పంతులు—కాస్త శ్రద్ధగా చదివి ఆ బియే పరీక్షయినా ప్యాసవు!

వసం—(మాట్లాడడు.)

పంతులు—ఇప్పటికి మూడుసార్లు ఫేలయేవు. ఆపాటిదానికి రేపేటాపరీక్షకు దరఖాస్తుకూడా ఎందుకు కట్టడం. చిన్ననాయన కొడుకు చూడు, అన్నిపరీక్షలూ ఎక్కడా ఫేలుకాకుండా ఎలాగ ప్యాసవుతున్నాడో?

వసం—అదృష్టవంతుడు.

పంతులు—నీ దురదృష్ట మనుకో కూడదు!

వసం—నాకేమీ దురదృష్టానికి? ఎల్లకాలం ఇక్కడ చీవాట్లుతింటూ డబ్బుకీ ఏగానికీ మీమీద ఆధారపడి కూర్చుంటా ననుకున్నారేమిటి?

పంతు—ఆమాత్రం పౌరుషముంటే మంచిదేకాని ఏమిటిచెప్మా ఆచేసే ఉద్యోగం?

వసం—నా యేర్పాట్లు నాకూ ఉన్నాయి.

పంతు—ఏమిటో కాస్త చెప్పుదూ, విని సంతోషిస్తాను.

వసం—చెప్పేదేమిటి?

పంతులు—క్రొత్తఢిల్లీకి Fresco వేస్తే వెయ్యి రూపాయ లొస్తాయి. అదేనా ఆశ?

వసం—వెధవవెయ్యి ఒక వెయ్యేనా?

పంతు—"బోృ! వెధవవెయ్యి అనేదాకా వచ్చిందీ?

రమ—అన్నయ్యకి చాలా డబ్బువస్తుందట లాటరీలో?

పంతు—అదేమిటోయి?

వసం—అదుగో అమ్మాయి చెపుతూందికాదూ?

పంతు—ఏలాటరీకి వేసేవు?

వసం—డర్బీస్వీపు.

పంతు—డబ్బెక్కడిదీ?

వసం—జగన్నాథం ఇచ్చేడు.

పంతు—జగన్నాథానికి పెట్టుబడి పెట్టడానికి కూడా డబ్బుందీ?

వసం—తప్పకుండా వస్తుందని జాతకరీత్యా అతనికి నమ్మకం కలిగింది. పెట్టుబడి పెట్టేడు.

పంతులు—ఎవరిపేర వేసేవు?

వసం—నాపేర నే వేసేను.

పంతు—టిక్కట్లేవీ?

వసం—ఉన్నాయి.

పంతు—తే! నాదగ్గర దాస్తాను.

వసం—అక్కర లేదు. జగన్నాథందగ్గర దాచేను.

పంతు—అక్కర లే దేమిటి? నాదగ్గర దాస్తానిమ్మంటూంటే?

వసం—అక్కర లేదు; జగన్నాథం దగ్గర జాగ్రత్తగానే ఉంటాయి!

పంతులు—నే నిమ్మంటే అక్కర లేదంటావు? నాకంటె గుమస్తాగాడిమీద ఎక్కువ నమ్మకమా? ఇదేకాదూ నీపద్ధతీ? నేనెవరో? నీకూ నాకూ ఉన్న సంబంధమేమిటో, నావల్ల నీకుండే లాభమేమిటో ఏమయినా గుర్తుండే మాట్లాడుతున్నావా?

వసం—ఆమాత్రం గుర్తు లేకుండా మాట్లాడలేదు.

కామే—ఏమిట్రా అలా వాదిస్తావు? పిన్నాపెద్దా లేకుండాను.

పంతు—ఆ గుర్తున్నవాడవయితే టిక్కట్లియ్యవేమి?

వసం—ముందుగా ఇరవైవేలు ఎవరిస్తే వారికమ్మేస్తాను.

పంతు—ఏమిటీ! అమ్మతావు? నాకేనా? అంతేనా?

# శ్రీశైల చిత్రములు*



౧. శ్రీ మల్లికార్జున దేవాలయ ప్రాగ్ద్వారము

ఎడమప్రక్క శ్రీ కృష్ణదేవరాయ నిర్మిత మగు మంటపశ్రేణి. (శిథిలము)

---

* కర్నూలు మునిసిపలువైద్యాలయములో డాక్టరుగనుండిన యన్. యస్. కుప్పుస్వామయ్యరుగారు తీసిన ఛాయాచిత్రమునుండి.



౨. శ్రీ మల్లికార్జున దేవాలయోత్తరద్వారము
శివాజీ చక్రవర్తి నిర్మింపజేసినది. (దేవాలయము లోపలనుండి.)
ఇందు భ్రమరాంబాదేవాలయు ద్వారగోపురముయొక్కయు, ౧౪౦౫ సంవత్సరమున
రెండవ హరిహరరాయలు కట్టించిన ముఖమంటపముయొక్కయు ఉపరిభాగములు కానవగును.

వసం—ఆఁ, ఎవరికైనా అంతే!

పంతులు—ఇదేకాదూ నీపద్ధతి! నిన్ను కని పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు ఇదా ప్రతిఫలం!

వసం—నన్ను కనవలసినదని నేనేమీ ప్రార్థించ లేదు.

పంతు—నీకు పుట్టిన కొడుకు నిన్ను ప్రార్థిస్తేనే కన్నావేమిటి?

వసం—మీరు చెప్పించిన చదువు నాకేమీ ఉప యోగించలేదు.

పంతు—నీ దురదృష్టం; నేనేం చెయ్యను?

వసం—అందుకే నా అదృష్టం బాగుపడే మార్గం చూసుకుంటున్నాను.

(కొంత నిశ్శబ్దం)

పంతు—అయితే ఇదే నీపంథా! ఇన్నాళ్లూ కష్టపడి డబ్బు పోగుచేసి, భూములూ తోటలూ దొడ్లూ సంపాదించినదంతా ఎవరికో తెలుసునా?

వసం—మీదృష్టిలో జీవితపరమావధి ఇంతే కాబోలు.

పంతు—ఆఁ, నాకు జీవిత మంటే ఇంతే బోధ పడింది. కడుపునిండా తినడం! పిల్లలని కనడం! చేత వయినకాడికి డబ్బు పోగుచేయడం. వచ్చేటప్పుడు నీలాంటివాళ్లకు అప్పచెపితే, శ్మశానంలో అరడుగుల నేల ఇనాము వస్తుంది.

వసం—ఇంతేనా?

పంతు—ఆఁ. ఇంతే! నువ్వుకూడా నా కొడుకు వైనందుకు ఈమార్గమే అవలంబించాలి. లేకపోతే బ్రతికి నన్నాళ్లయినా సుఖంలేకండా దరిద్రమోడుతూ అడుక్కు తినిపోవాలి.

వసం—నాకలాగు బోధపడలేదు. జీవితమంటే, మీ రీలాగు శ్రమపడి సంపాదించిన డబ్బు వినియోగించి ప్రకృతిసౌందర్యం, కళ, అందులో ఉన్న ఈశ్వరలీల, ఇవన్నీ శోధిస్తూ, వాటిని అభివృద్ధిలోకి తెచ్చి మేధా శక్తి కల మానవత్వం సార్థకపరచుకోవడం నా ఉద్దేశం.

పంతులు—నా ఆస్తిఅంతా స్వార్జితమని తెలుసునా? అందులో ఒక్కదమ్మిడీ నీకు పుట్టకుండా చేయడానికి వీలుందని తెలుసునా?

వసం—ఆ భయంచేతనే టిక్కెట్లైనరికైనా ఇరవై వేల కమ్ముతానన్నాను.

పంతు—ఓరి దౌర్భాగ్యుడా! నీ తండ్రికేనా నువ్వు అమ్మతావుకాదూ? టిక్కెట్లు ఇస్తావా ఇవ్వవా? ఆఖరుమాట చెప్పు. మంచీ చెడ్డా ఆలోచించుకో.

వసం—మీరు బలవంతాన్ని తీసుకుందామను కొన్నా నాదగ్గర లేవుగా!

పంతులు—సరే! అవి రానప్పుడు చూస్తాను కాదు? (భోజనం ముగించి లేస్తాడు.)

వసం—అవి వచ్చినప్పుడు చూస్తాను.

(తెరపడును.)

---

## ర వ రంగము

(మేడమీద పంతులు గది—గడియారం మూడు గంటలు కొట్టింది; పంతులు ఏవో కాగితాలు చూసు కుంటూ పడకకుర్చీలో కూర్చొని, మధ్యమధ్య పచ్చి ద్రాక్షపళ్లు ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూఉంటాడు. గింజలు ఉమ్మడానికి ఒకచిన్నపళ్లెం క్రింద ఉన్నది. కామేశ్వరమ్మ ఏదో పెట్టి సవిరిస్తూ గదిలో ఉంటుంది. క్రిందనుంచి "అయ్యున్నారా అమ్మ!" అని కేక.)

పంతు—ఎవరది?

కామే—అంకి కాబోలు! దాని కొడుకుని పని లోంచి మానిపించేసేవని ఏడుస్తూంది.

పంతు—విధవ, నావాచీ కాజేసి ఎవరికో రెండు రూపాయల కమ్ముకుని తాగేసేడట!

అంకమ్మ—(మేడమీదకువచ్చి గుమ్మందగ్గర నిల బడి) ఏటిబాబూ! నా కొడుకుని పనిలోకి రావద్దన్నారట!

పంతు—అలాగ వదలిపెట్టినందుకు సంతోషించ వేమి ?

రమణ—(మేడెక్కి వారికి కనబడకుండా మెట్లచాటున నిలబడి సంభాషణ వింటుంది.)

అంక—ఏంచేసేదు బాబు ?

పంతు—ఇంకా తెలియనట్లు మాట్లాడుతావేమి ? ఏభయిరూపాయలవాచీ కాజేసి, రెండురూపాయిల కమ్మీకొని తాగేసిన వెధవని ఇంకా పనిలో ఉంచ మంటావా ?

అంక—ఎవరన్నారు! ఏటిబాబు! ఇలాటి మాటలు; మాసిన మొగా డేశిబాబు! ఇంత గుంటకాడ నుండీ మీయింట్లో ఉండి మీపిల్లలనందరినీ సంకనెత్తుకు తిప్పి ఇన్నాళ్లున్నాను గదా! ఎప్పుడేరా ఉంది బాబూ ఇలాటిమాట! మాయింటావంటా లేదు ?

కామే—నువ్వు మంచిదానవేనే! నీ కొడుకు మాట చెప్పు!

అంకి—ఆడుమాత్ర మేటమ్మా! మాసిన మొగా డేడీ అంటా!

పంతు—మాగుమాస్తా చెప్పేడుకాదూ!

అంకి—ఆ అయ్యా చూసేడట బాబూ ? మామంచి గుమాస్తాను సంపాదించినారు (కామే–పంతులు–తెల్ల బోతారు)

పంతు—చూసిన మనిషి అతనితో చెప్పేడట!

అంక—ఏదీ రుజు విప్పించండి! మ ా డేనా ఉండాలి, సాసేనా ఉండా లీదెబ్బతోటి!

పంతు—నీకు రుజువుకూడా కావాలి ? వెధవ వేషాలు! తాగుబోతు వెధవని వెనకేసుకుని మాట్లాడు తావేమిటి ? నీ కొడుకు తాగివస్తే ఒకనాడు సేనుపట్టు కొని చూపించానుకానూ ?

అంకి—తాగుబోతేటి బాబు ? పండుగకీ పబ్బా నికీ ఒకచుక్కేసుకొంటారు మా కులంవోళ్లు. మాటిమాటికీ తాగుబో తంటారేటి ?

పంతు—నాతో వాదించడాని కొచ్చేవేమిటి ? పో ? అవతలకిపో ? నువ్వుకూడా పనిలోకిరాకు. ఇవాళ నుంచి; తెలిసిందా ? ప్రతిపుండాకోరుకీ నోరు ఎగు స్తూందేమీవాళ ? పాములన్నీ తలెత్తితే వానపామూ తలెత్తిందని!

కామే—ఇవాళ వాడిమనసు చికాకుగాఉంది అల్లరి పెట్టకపో!

అంకి—నామనసూ చికాకుగానే ఉంది. పని లేక పోతే పోయింది, ప్యాక్టరీలోకిపోతే వెల్లమారేనపని! దొంగతవంకడితే ఊరుకుంటారేటి ?

కామే—ఊరుకోక ఏంచేస్తావే ? రంకుముండా! మహా తెగులుగా ఉంది ?

అంకి—ఏటమ్మా రంకుముండా అంటావు ? ఎ ర్తమ్మా రంకుది? రంకులన్నీ మీయింట్లోనే ఉన్నాయి. గొప్పోరింట్లో రంకులు రంకులు కావు ?

కామే—ఏమే నీకొచ్చిన రోగం ? మా యింట రంకేమిటే ? నోటి కొచ్చినట్లు పేలుతున్నావు!

అంకి—ఆఁ! ఎరికి లేదు ఎవరికిగ్నీ ? మామంచి గుమాస్తాను సంపాదించినారు లెండి. ఇలాటాటికే పని కొస్తా డాయన ?

పంతు—అట్టే ప్రేలక పోతావా ? తన్న మన్నావా?

అంకి—ఏటయ్యా తంతావు ? ఒంటిమీద పెయ్యొయ్యి మరి! అబోరుంటాదేమో ? నీపనీ, వాకాలి మీదగోరూ ఒకటి. (కోపంగా మెట్లుదిగి పోతుంది.)

కామే—ఓరా! చూసేవా? అందరికీ తెలుసును. మనమే గుడ్డివాళ్లము. ఇంకిది ఊరంతా చాటుతుంది!

పంతు—ఒక్కసారి తలపట్టుకో- కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. (కామే–అట్లుచేస్తుంది)

పంతు—(కొంతనిశ్శబ్దం) నాకొంపకి నిప్పంటిం చిందీ ? నాకీర్తి, ప్రతిష్ఠా మంట కలిపేసిందీ! ఇంక తలె త్తుకు తిరగనివ్వదూ ? నాదగ్గర నౌకరీవున్న గుమాస్తా తోనే! రొమ్ముమీద కుంపటిని ఎలాగ భరించడం ?

కామే—నేను క్రిందికి పోతాను. రాత్రి ప్రయాణ ముంది కాదూ?

పంతు—(అవుననితలఊపుతాడు. కామేశ్వరమ్మ మేడదిగిపోతుంది. పదినిమిషాలు పంతులు కళ్లు మూసుకొని కూర్చున్నాక, జగన్నాథంవస్తాడు. 30 సంవత్సరముల వయస్సు; సాధారణమైన వేషం; అందమైన విగ్రహం.)

పంతు—(కళ్లు తెరచి, జగన్నాథంతో) కూర్చో'

జగ—పురోణీ మనోయిదా వ్రాసి తెచ్చేను' (ఇస్తాడు)

పంతు—(తీసుకొని చూస్తూఉంటాడు)

జగ—రాత్రి తమప్రయాణ మందా?

పంతు—(తలఊపుతాడు.)

జగ—సెలవుతీసుకుంటాను.

పంతు—కూర్చో, చిన్న సంగతి మాట్లాడాలి.

జగ—(వినయంగా క్రిందకూర్చుంటాడు)

పంతు—మావాడు లాటరీవేసేడటేమిటి?

జగ—చిత్తం.

పంతు—నిజంగా వస్తుందా ఏమిటి?

జగ—విధిగా వచ్చితీరుతుం దని నానమ్మకం.

పంతు—ఆ టిక్కెట్లు నీ దగ్గరే ఉన్నాయట కాదూ?

జగ—చిత్తం!

పంతు—ఆ టిక్కెట్లు అడుగుదామనే ఉండ మన్నాను.

జగ—అవి అబ్బాయిగారి వండి!

పంతు—అవును! అబ్బాయిగారివని తెలిసే అడుగుతున్నాను.

జగ—ఆయనసెలవుకానిదే నే నెలా గిచ్చేదండి!

పంతు—ఏమిటోయి! మహా శాస్త్రోక్తముగా మాట్లాడుతున్నావు? నాకొడుకుటిక్కెట్లు నే నడగ కూడదు?

జగ—అడగవచ్చును కానండి, ఒక్కగంట క్రిందటే ఆయన వచ్చి టిక్కెట్లు ఎవరడిగినా ఇవ్వవద్దని మరీమరీ చెప్పినారు.

పంతు—పెట్టుబడి నువ్వే పెట్టేవట! నే నుండగా నాకొడుక్కి నువ్వు పెట్టుబడిపెట్టడము నా కమర్యాదా కాదు!

జగ—స్నేహితుడుకదా అని సహాయంచేసేను.

పంతు—నాకొడుకు నీకు స్నేహితుడా? యజమానికొడుకుతో స్నేహం చేసి ఇలాంటి పనులు చేస్తున్నావా? నీభూతదశ ఒక్కసారిమూసుకో! వెనక్కి ఒకసారి దృష్టిపోనీ! నీతండ్రినాదగ్గర వంటబ్రాహ్మడుగా ఉండేవాడా? ఆ అభిమానం చేత నిన్ను ఇరవైయో ఏట నుండీ చేరదీసి తరిఫీదుచేసి ఉద్యోగమిచ్చి బాగుచేసి నందుకు ఇదా నువ్వు చేసే ఉపకారం?

జగ—తమ రలాగు మాట్లాడడం భావ్యంగాదు. ఇందులో ఉపకారాని కేముందండి? అబ్బాయిగా రిమ్మంటే ఈక్షణ మిచ్చేస్తాను.

పంతు—ఇప్పుడు కొనేభూమికి పదివేలు అప్పు చేస్తున్నానుకదా! ఆ అప్పు తీరడ మేలాగో చెప్పు!

జగ—ఆసంగతి తమరూ అబ్బాయిగారూ పరిష్కరించుకోవాలి.

పంతు—అదనంగా ఇరవైవేలిచ్చినవాడి కమ్మ తాడట దౌర్భాగ్యుడు! నా కెదురు తిరుగుతాడూ! తండ్రికి కొడుకు అమ్మడమా? ఈ ఆదాచేసే ఆస్తి అంతా ఎవరికోసమో అనే జ్ఞానంలేదేమి?

జగ—ఆసంగతి తమ రతనికి నచ్చచెప్పాలి.

పంతు—వాడు పట్టి తెలివి తక్కువ దద్దమ్మ. పుర్రెలో ఏమీలేనిదే?

జగ—అతను చాలా తెలివైనవాడని నా అభిప్రాయం.

పంతు—ఈవిషయంమాత్రం వాడిబుర్ర కెక్కదు. నీవూ వ్యవహారజ్ఞాన మున్నవాడవు కదా? ఒక్క సంగతాలోచించు. అటిక్కెట్లు, ఏకాడికో ఏప్రుల్లయ్యాకో

చంద్ర—(గదిగుమ్మములో నిలబడి) భోజనంచేసి వీధిలోకి వెళ్లేరు. వచ్చేవేళయింది.

జగ—ఆయనతో అత్యవసరంగా మాట్లాడాలి.

చంద్ర—చెప్పమంటే ఇంటికిరాగానే చెపతాను.

జగ—ఆయనతో స్వయంగాచెప్పవలసిన విషయం.

రమ—(జగన్నాథం చేలుపట్టుకొని) నాతో చెప్పవలసిన దేదీలేదు?

జగ—మనం చెప్పుకొనేవి నేన్నాళ్లక్రిందటే చెప్పుకున్నాము.

రమ—నీకు పని తీసేసారటకాదూ?

జగ—పనిలోంచి లగిలేసారను. పదేళ్లనుండి చేస్తూన్న సేవ! ఒక్కక్షణంలో ముగిసిపోయింది.

రమ—లేదు, మళ్లాపిలుస్తారు. నువ్వులేనిదే ఆయన పనిసాగదే?

జగ—నట్టిమాట! ఆలోచించి నిశ్చితాభిప్రాయంతో చేసినపనే. ఆయనచేసినది న్యాయమైనదని కూడా నమ్మకం.

రమ—మనిద్దరికీ అయాచితంగా స్వేచ్ఛాదానం చేసారు

జగ—అంటే.

రమ—ఉదయంలోగా నన్నుకూడా ఇంట్లోంచి పొమ్మన్నారు. మనసంగతి ఆయనకి తెలిసింది.

జగ—అనుమానం వదిలిపోయిందీ? అయినా నన్నొక్కడినే పొమ్మనవలసినదే?

రమ—అదే ఆయనచేసిన ఉపకారం ఇకమీద ఏజంకూ లేకుండా స్వేచ్ఛగా బ్రతకమన్నారు.

జగ—దైవానుగ్రహ మది. పదిసంవత్సరాలనుండి చేస్తూన్న సేవ. చూసేవా, ఒక్కక్షణంలో.

రమ—ఏ ప్లీడరునా నెత్తిమీదపెట్టి తీసుకొంటాడు. చేతిలో పని ఉన్నవాడవు నీకేమిభయం?

జగ—ఈసేవ ఇంకచెయ్యను. పనిమానిపించినా ఆయనే నాకు యజమాని. అంధ్రాఇన్సూరెన్సుకంపెనీలో ఏజంటుగా ప్రవేశిస్తాను. అందాకా దగ్గర రెండువందలున్నాయికదా, కాలక్షేపానికి? ఆరునెలలగ్రాసం.

(సంతంరాగా రమణమ్మ గదిలోకి వెళ్లిపోతుంది)

వసం—ఏమోయి, ఇలాంటప్పుడు వచ్చేవు?

జగ—తొందరగా మాట్లాడాలని. (కొంచెందూరం వెళ్లి) మీనాన్నగారికి టిక్కట్లు ఇచ్చేసాను.

వసం—నిజంగా?

జగ—నిజంగానే.

వసం—పోవోయి! నీహాస్యాల కెక్కడికి?

జగ—హాస్యం కాదు, నిజమే.

వసం—నువ్విచ్చేవంటే నేను నమ్ముతాను?

జగ—ఈశ్వరసాక్షిగా చెబుతున్నాను. ఇవాళ సాయంత్రమే ఇచ్చేసాను.

వసం—ఆయన బలవంత పెట్టేడా, నువ్వే ఇచ్చేసావా?

జగ—నేనే ఇచ్చేసాను—ఇవ్వడమే మంచిదని తోచి.

వసం—ఏమిటీ?

జగ—మీ మేలుకోసమే.

వసం—పోవోయి—ఇంకా మాట్లాడుతా వేమిటి?

(రమణమ్మ—నదినెగారికి నమస్కరించి, చిన్న పెట్టె చేతిలోపట్టుకొని సన్నసన్నంగా వీధిలోకి నడుస్తుంది. జగన్నాథం కనిపెడతాడు)

వసం—మిత్రద్రోహం చేస్తావు కాదూ? నువ్వూ, ఆయనా కలసి నన్ను మోసంచేసి ఆ డబ్బు పంచుకు తింటారా? నీ కొక్క దమ్మిడీ ముట్టదుసుమా!

జగ—నా స్వలాభంకోసం కాదు. కేవలం నీ మేలుకోసి, అపకారం చేయకపోవడం పాపమనితోచి.

వసం—ఛీ! నీమొగం చూడకూడదు. పెద్దపెద్ద సంజాయిషీ లిస్తా వేమిటి? పో నాయెదుటనుంచి పో! ఇంక నీతో మాట్లాడను.

జగ—నాసమాధానం విన్నారు కారు. నిజం తెలిసీక మీరే విచారిస్తారు. (నిష్క్రమిస్తాడు.)

---

### ౭ వ రంగం

(వసంతం తొందరగా మేడమెట్లెక్కి తండ్రి గదిలోకి వెళతాడు. చంద్రమ్మ వెంటబడుతుంది. వసంతం తండ్రిటేబిలుసొరుగు బలవంతంగా ఊడలాగి, తాళాలు తీసి ఇనపపెట్టి తీస్తాడు.)

చంద్ర—వద్దుసుమండీ! ఆయనడబ్బు ముట్టుకోవద్దు.

వసం—నీకు తెలియకపోతే ఊరుకో. నాకు వచ్చేడబ్బు ఆయన కాజేసాడు కాదూ? (నోట్లకట్ట తీసి, లెక్కపెట్టి) సరిగ్గా పదివేలరూపాయ లున్నాయి. నా టిక్కట్ల ఖరీదులో సగం వచ్చింది. పోనీ, ఎక్కడికక్కడే లాభం.

చంద్ర—నామాట వినరూ? ఉంచేయండి

వసం—(ఉత్తరం వ్రాస్తూ, నా డ్రాయింగు పుస్తకాలూ బొమ్మలూ ఉన్న చిన్నపెట్టె తీసుకురా.

(చంద్రమ్మ తొందరగా క్రిందికి వెళ్లి పెట్టె తెచ్చి)

చంద్ర—నే నెప్పుడూ మిమ్మల నేదీ కోరలేదు. ఈ ఒక్కమాటా వినరూ?

వసం—నువ్వు నోరు మూసుకుంటావా లేదా?

చంద్ర—ఎలాగ నోరు మూసుకుంటాను? మన పిల్లాడిమొహం చూడండి; అల్లరిపడకండి.

వసం—ఈ డబ్బు నాది. నా టిక్కట్లఖరీదు అతనివల్ల ఈవిధంగా రాబట్టమని భగవంతుడు చెప్పేడు. ఇది దొంగతనం కాదు. నాహక్కు. తనకు హక్కులేని నా టిక్కట్లు అపహరించడ చేత ఆయన చేసినదే దొంగపని. తెలిసిందా?

చంద్ర—అయితే నామాట వినరూ? అల్లరి పడతారా?

వసం—ఈరాత్రి ఒంటిగంటరైలులో ప్రయాణం. ఈ అస్వతంత్రజీవనం ఇవాళతో సరి. ఇకమీద స్వేచ్ఛా, స్వతంత్రతాను.

చంద్ర—వద్దుసుమండీ! చాలాచిక్కులు సంభవిస్తాయి. వాళ్లతోపాటు మనమూ నలుగురి నోళ్లలోనూ పడతాము. ఆబ్రాహ్మడికి గుండె జారిపోతుంది, ఈదెబ్బ కూడా తగిల్తే.

వసం—నీకు బోధపడకపోతే నోరు మూసుకు ఊరుకో. పదివేలరూపాయలూ, స్వతంత్రజీవనం: ఇంకా బోధపడదూ?

చంద్ర—ఇక్కడే కనిపెట్టుకుంటే అంతకు పదింతలు లాభిస్తుందే!

వసం—అస్వతంత్రతతో లక్షరూపాయలకంటె, స్వతంత్రతతో పదివేలు నయం.

చంద్ర—జగన్నాథాన్ని పనిలోంచి తీసేసేరు. రమణమ్మను ఇంట్లోంచి పొమ్మన్నారు. మీరుకూడా వెళ్లిపోతే ఇంకా ఆయన బ్రతకడ మెలాగ?

వసం—నువ్వుకూడా నాతో వచ్చేస్తే మరీస్వేచ్ఛగా ఉంటాడు.

చంద్ర—ఆపసిగుడ్డును తీసుకొని రమ్మంటారా?

వసం—అయితే నీ యిష్టము వచ్చినప్పుడు రా. ఈలోగా తగిలేస్తే నీపుట్టింటికి వెళ్లు (ఉత్తరం టేబిలు మీదనుంచి, చిన్నపెట్టె పట్టుకొని బయలుదేరుతాడు.)

చంద్ర—ఇప్పుడే వెళ్ళడం? సామానో?

వసం—త్రోవలో కావలసినంత సామాను కొనుక్కోవచ్చును. ఉత్తరాలుమాత్రం వ్రాస్తూవుండు.

చంద్ర—డబ్బు బహుజాగ్రత్త సుమండీ! మీకు చాలా అశ్రద్ధ. (చంద్రమ్మ వీధి గుమ్మందాకా వెళ్లి దిగబెట్టగా వసంతం వెళతాడు).

## ౮ వ రంగము

(మరునాటి ఉదయం ౮ గంటలకి. పంతులు. ఊరినుండి వచ్చి మేడమీదకి వెళతాడు. చంద్రమ్మ, కామేశ్వరమ్మ మేడెక్కి గదిగుమ్మంలో నిలబడతారు.)

పంతు—(టేబిలుమీద ఉత్తరం చదువుకొని) ఇంట్లోంచి లేచి వెళ్లి పోయేడూ?

చంద్ర—రాత్రి వెళ్లి పోయేరు.

పంతు—ఎక్కడికి?

చంద్ర—ఏమో, చెప్ప లేదు.

పంతు—ఇదేమిటి, ఇనపపెట్టె తీసున్నాది?

చంద్ర—ఇనపపెట్టెలో రూపాయలు తీసుకున్నారు.

పంతు—ఎన్ని?

చంద్ర—పదివేలు.

పంతు—ఆఁ! పదివేలానా? ఓరిదౌర్భాగ్యుడా? నువ్వుకూడా పోలేక పోయేవూ, వాడితోపాటు? పిశాచంలాగు నువ్వెందు కున్నావు?

చంద్ర—నేను వెళ్లదలచుకో లేదు.

పంతు—ఏమిటి చేయడం? పోలీసు వాళ్లకు చెపదామనుకున్నా ఎక్కడికి వెళ్లాడో తెలియదు. ఎన్ని ఊళ్లకని టెలిగ్రాము లివ్వడం?

కామే—దారుణం. రాత్రికి రాత్రే రూపాయలు తీసుకొని ఇంట్లోంచి వెళ్లిపోయేడట. నాకూ తెలియ లేదు:

పంతు—మొగుడూ, పెళ్లాం కలిసే చేసారు; ఎందుకు తెలియనిస్తారు?

చంద్ర—నేను వద్దని చాలా బ్రతిమాలేను.

పంతు—బుద్ధిమంతురాలవనీ! ఇక ఆ భూమి ఎలాగు కొనడం? పురోణీకూడా ఏడ్చాము, అయిదు వందలు అడ్వాన్సు ఇచ్చి. (కొంతసేపాలోచించి)

పోనీలే! కాగలకార్యం గంధర్వులే తీర్చేరు. స్వార్జితంలో హక్కు లేకుండా చేయాలని తలుచుకున్నాను. ఆ అభిప్రాయం వాడే బలపరుచుకున్నాడు, నేనుమాత్రం సుఖపడలేనూ? నేనూ అప్పులుచేసి తగలేస్తాను. ఈఆస్తంతా ఎవడో కొనుక్కొని అనుభవిస్తాడు.

చంద్ర—నే నొక్కమాట చెప్పేదా? ఇంతకాలం ఎప్పుడూ మీయెదుటబడి మాట్లాడలేదు. ఇవాళ చెప్ప తలుచుకొన్నాను.

పంతు—అయితే ఏదో కొంప మునిగింది.

చంద్ర—(మాట్లాడదు.)

పంతు—చెప్పేదో! పెద్దదిక్కుని చెపతానంటున్నావు.

చంద్ర—ఇన్నాళ్ళూ మీ కాలము సుఖంగా గడిచిపోయింది. ఇప్పు డాదశ మారిపోయింది. రమణమ్మ ఇంటిలోనుంచి వెళ్లిపోయింది. మరి రాదుకదా! మీ కొడుకు వెళ్లిపోయేరు; మరి రారుకదా! మీకు కుటుంబసౌఖ్య మేముంది?

పంతు—కుటుంబసౌఖ్యం భార్యతో నేపోయింది.

చంద్ర—మీరు కష్టపడి పోగుచేసిన ఆస్తి మీరనుకొన్నట్లూ ఖర్చుచేసినా, ఇంకెవరు కొనుక్కున్నా మరొకడి పేరు మోసుకొంటుంది కాని మీ పేరూ ఊరూ ఉండదుకదా! వంశాంకురం మీ మనుమ డొక్కడున్నాడు. వాడిమొగం చూసి ఆలోచించుకోండి, ఒక్కపదేళ్లపాటు నేను సంరక్షించి, అటుపైని మీయిష్టము వచ్చినట్లు చేసుకోడానికి మీకు ఒప్పచెపతాను.

పంతులు—నీకుకూడా లోటు లేకుండా కాలక్షేప మవుతుంది.

చంద్ర—ఇంట్లో చాకిరీచేసే మనిషి మీకు లభిస్తుంది కాదు—నా చాకిరీని, నా కొడుకుని మీ ఆస్తికోసం అమ్ముతున్నా ననుకోండి.

పంతు—ఇదొక బేరమా? నీకూ ఖరీదు పుచ్చుకోడపు దురుద్దేశమే కలిగింది? సరే, బాగుంది వెళ్లు.

---



3. శ్రీ మల్లికార్జున దేవాలయ దక్షిణద్వారము. (శిథిలము)

వెనుక పదునారవశతాబ్దియందు దీని నొకమారు 'శాంతలింగరాజు' అను నొక సామంతరాజు మరమ్మతుచేయించెను.



౮. శ్రీ మల్లికార్జునస్వామి గర్భాలయ గోపురము. పంచపాండవుల గుళ్లు

క్రీ. పదునారవశతాబ్దియందు 'శాంతలింగరాజు' అను సామంతరాజు గర్భాలయమునకు బంగారురేకులను తాపించెను. బంగారుచే మిల మిల మెఱయుచున్న గర్భాలయగోపురము 'శిఖరేశ్వరమున' నుండు తైర్థికులకు కానవచ్చెడిది. బంగారు తాపడ మంతయు శిథిలమైపోయినందున ఇపుడు కానరాదు.

## ౯ వ రంగము

(జూన్ ౧౦ వ తేది మధ్యాహ్నం 3 గం. మేడమీద లాటరీటిక్కెట్లు చూస్తూ పంతులు పడక కుర్చీలో కూర్చుంటాడు. కామేశ్వరమ్మ నపంకం కొడుకుని ఒడిలో కూర్చోపెట్టుకొని ఆడిస్తూ కూర్చుంటుంది.)

పంతులు—Draws—June 7th. Races on 9th. Results to be published on 10th—ఇవాళ పదో తారీఖే?

(నౌఖరొకడు పరుగెత్తి వచ్చి వార్తాపత్రిక ఇస్తాడు.)

(పంతులు ఆత్రముతో కాగితాలు తిరగేస్తాడు' వేళ్లు వణుకుతూ ఉంటాయి.)

పంతు—గెల్చినసుద్ది మిదా? బొమ్మలో బాగానే ఉంది! (చూసినకాగితమే చూస్తూఉంటాడు. మొగం క్రమంగా తెల్లబారతూ ఉంటుంది.)

కామే—ఏమయింది చెప్మా!

పంతు—జ్యోతిషం కొంప ముంచింది.

కామే—ఆఁ!

పంతు—ఎంత మోసపోయేను, వీడిజ్యోతిషాన్ని నమ్మి!

(నౌఖరు టెలిగ్రాము ఇవ్వగా పంతులు చదువుతాడు.)

Safe. Lottery failed; condolences.
Vasantam.

కామే—అ దెక్కడ నుంచి?

పంతు—అబ్బాయిగారు ఢిల్లీలో కులాసాగా ఉన్నారట! లాటరీ తప్పినందుకు విచారిస్తున్నానని నన్ను పలకరించేస్తూ టెలిగ్రాము.

కామే—ఏమి వీడిదారుణం?

పంతు—(కుర్చీలోనుండి లేచి) వీడి పెళ్లాన్ని కూడా ఇంట్లోంచి తగిలేస్తేగాని వీడికి తెలుసిరాగదు. లేకపోతే ఆడబ్బుకూడా తగలేసి మళ్లా ఇంటిమీదవచ్చి పడతాడు.

కామే—వద్దు, వద్దు. నామాట వినుు. అయిందేదో అయింది. తిన్నవాడు పరాయివాడు కాడుగదా? వీడిమొహం చూడండి! నీ మనుమణ్ణి చూడండి! వీడిని తగిలేయడానికి నీచేతు లెలాగ వస్తాయి.

పంతు—(తిరస్కృతితో మనుమడిపైపు చూసి) ఇంత బ్రతుకూ బ్రతికి ఆఖరికి వీడికి లొంగవలసివచ్చిందా?

(కుర్చీలో కూలబడతాడు. కామేశ్వరమ్మ మనుమడిని పంతులు ఒడిలో కూర్చోబెడుతుంది.)

(తెర దిగును.)

సమాప్తము

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'

# మాతరో*

దువ్వూరి రామిరెడ్డి గారు

గమనాయాసమునన్ హయంబు లొరగెం; గంపించెఁ జక్రంబు; క
ర్దమనిర్మగ్నము లాయెఁ జక్రములు; చేరన్ లేదు గమ్యస్థలం
బు; మహిం జుట్టెను జీఁకటుల్; రథము వో మూఁ పొత్తి పై కెత్తఁగన్
గుమిగూడించవె పుత్రరత్నములఁ, మోకుల్ పట్టఁగన్ మాతరో.

తలుపుం దీయుమ, బాలభానురుచి నిద్రాశయ్య వెళ్గించి నీ
తెలఁపుల్ ఫుల్లజలేజపుంజకళలన్ దర్శింపఁ జేయంగ; రా
త్రుల వర్షాగమలక్ష్మి దీర్ఘములుగాఁ దోఁపించునే కాని, యు
జ్జ్వలచండార్కకరప్రచారముల నాఁపంజాలునే మాతరో.

తరుణార్కుం డిదె వచ్చువాఁడు; తమముల్ తగ్గెండి; పోల్పేదె మీ
హారువుల్ నాఁగ వచించు శుక్రునటు దివ్యాదేశహోమాగ్ని యీ
తరుణారంబునఁ ద్వదీయపుత్రహృదయాంతర్వర్తియై శోభిలెన్;
సరగన్ స్వాప్నికబంధముల్ వొలఁగి స్వేచ్ఛన్ మేలుకో మాతరో.

ఆకల్ గ్రుంచియుఁ, దీవలం జదపి, యా యావాసముం బూడ్చి, పై
పోకల్ వ్యాపఁగ నల్లుడించియు, నెటుల్ పొక్కించియుం, గ్రొంబువుల్
రాకల్ మాపుచె మోకలం దెవఁడుఁ జైత్రశ్రీ విశేషింప, నా
యాకాలంబున కవ్వి గూడు ననివార్యప్రాప్తమై మాతరో.

ప్రిదఁలన్ ఘూమయుతాగ్నిపర్వతము, దగ్వేదంపకర్ణోత్థ భీ
ప్రద ఝంఝానిల మట్టి వీవఁ, దటఘూర్ణస్ఫూర్తి నంభోధి శుం
భదనంతోర్మికరాళదంష్ట్రిం ధరన్ భక్షింప నెవ్వారు కా
పాద యానం చెదు రొడ్డు వారు విలయంబే కోరుచున్ మాతరో.

---

* ఈ పద్యములు [illegible] వ సంవత్సరము ప్రాంతమున వ్రాయఁబడినవి.

# ఏకలవ్యుడు

విద్వాన్ నారసింహశాస్త్రి గారు

పూర్వకాలంలో హిరణ్యకుడనే యెఱుకల రాజుండేవాడు. అతనికి ఏకలవ్యుడను ముద్దులకొడుకు ఒకడు ఉన్నాడు. ఆకుఱ్ఱవాడికి విద్యలంటే చాలా యిష్టం. అందులోను విలువిద్యంటే మరీ యిష్టం.

ఆ కాలంలో కౌరవపాండవులకు ద్రోణుడు చదువు చెప్పుచున్నాడని యీ బాలుడు విని, తండ్రితో గూడి పయనమై వెళ్లి తనకు విలువిద్య నేర్పుడని చిన్ని చేతులు జోడించి ఆ గురువుగార్ని కోరెను. గురువు ఆబాలుని కోర్కె దీర్పలేదు. మేము క్షత్రియులపిల్లలకే గాని మీవంటి యెఱుకలకు మొరకులకు జదువు చెప్పేవారం గాము — అని యేమేమో నిష్ఠురంగా పోట్లాడినట్లు మాట్లాడి పొమ్మన్నాడు. దానితో, పాపం, తండ్రీ కొడుకులు సిగ్గుపడి యింటికి వచ్చేశారు.




తర్వాత ఏకలవ్యుడు మాత్రం నిరుత్సాహంపడక ఏవిధంగానైనా విలువిద్య సాధించాలని గట్టిపట్టు పట్టాడు. చెప్పేవారు లేరు, ఎలా వస్తుంది? పిమ్మట ఆచిన్న బాలుడు ఒక వుపాయం పన్నుకొన్నాడు. గురువు మనకు లేకపోవడం ఎందుకు? గురువును మనమే చేసికొందాం - అని రేగటి మట్టితో తల, కాళ్లు, చేతులు మొదలయిన అవయవాలు పెట్టి ద్రోణుని విగ్రహం తయారు చేసి దాన్ని ద్రోణునిగానే భావిస్తూ విలువిద్య ఆరంభం చేసేప్పడికి అతని కందులో గొప్పశక్తి కుదిరింది. యీ సాధన దినముల్లోనే ద్రోణశిష్యులకు అతనికి సమావేశం




ఆశ్చర్యపడి అర్జునుడు నగయిరా కొందరు విద్యార్థులతో ఆ బాలుని చూడ వచ్చాడు. అది తెలిసి యేకలవ్యుడు ఎదురుగుండా వెళ్లి తనవూరూ పేరూ జెప్పి మీకు శిష్యుడనని చెప్పి దణ్ణంపెట్టాడు. అందుపయి ద్రోణాచార్యుడు నాకు గురుదక్షిణ యివ్వా లంటూ ఆరంభించాడు. "మొదట చదువు చెప్పమన్నప్పుడు వల్లగాదని తోసేశాము; తెలివితేటలచేత తనంతట తాను పైకి వచ్చి మన పేరు చెప్పుకుంటోంటే విశ్వాసానికి సంతోషించాలిగాని యిది తగునా?" అని ఆయన ఆలోచించలేదు. ఏలాగైనా ఆ కుఱ్ఱవాణ్ణి అడుక్కు దొక్కాలనే ఆలోచించాడు. యీా

కూడా ఆ అడవిలోనే జరిగింది. అసలు ద్రోణాచార్యునిదగ్గర చదివే విద్యార్థులు పుట్టి ద్రోణాచార్లదగ్గర చదవే మన ఏకలవ్యునికి ఉప్పుకు ఊరగాయికి కూడా కాకుండా పోయారు. అప్పుడందులో అర్జును డనేవాడు మన యెరుక బాలుని ఊరు, పేరు, గుట్టు, మట్టు అన్ని తెలిసికొని ఆచార్యునిదగ్గర కెళ్లి గోలయెత్తాడు.

ఎవరు నేర్పందేనే శబ్దవేధి బాణాలు వేయడం నేర్చుకొన్నా ననే గర్వం గురువు లేకుండానే విలువిద్య నేర్చుకున్న యెఱుకపిల్లవాని చూచేప్పడికి వానికి ఎక్కడి దక్కడ ఎగిరి పోయింది. అప్పు డాచార్యులవారు కూడా

యన ఆలోచన ఇది గాని బాలుడు నిర్మల భావంతోనేవుండి, "బాబూ, మీకు గురుదక్షిణ యివ్వడమంటే నాకు చాలా యిష్టం. నాకు రాజ్యం వుంది, భూములున్నాయి, బుట్రలున్నాయి, పరిచారకులున్నారు; ఇంకా యేమేమో వున్నాయి. మీ కేమి కావాలో కోరుకోండి. కావా లన్న దిస్తా" నని కుఱ్ఱవాడు నవ్వుమొగంతో చెప్పేసరికి ఆచార్యుడు తగుదునమ్మా అని మరేమీ అడుగక ఆ బాలుని కుడిచేతి బొటనవ్రేలు కోరెను. మరెవడేనా అయితే అతనిని అప్పు డేమన్నా అనవలసిం దే కాని ఏకలవ్యుడు ఏమీ అనలేదు. తీసికొమ్మని



వ్రేలుమాత్రం ముందర పెట్టాడు. గురువు ఆ వ్రేలు నరికి తీసికొన్నాడు.

దానితో ఏకలవ్యుడు విలుకాండ్రలో ముందరకు రాలేదు. ఆచార్యుడు మంచివారిలో ముందరకు రాలేదు.

---

# శివసముద్రము

శర్మ

౧

అనేక వందల సంవత్సరాలకి పూర్వం ఒక రాజు వుండేవాడు. అతని పేరు గంగరాజు. అతను శివసముద్రము (ద్వీపము) లో కావేరీజలపాతమువద్ద ఒక నగరాన్ని నిర్మించి దాన్ని రాజధానిగా చేసికోవాలనుకొన్నాడు. స్థలదేవతను అనుజ్ఞకోసం ఆరాధించాడు. దేవత కలలో కనపడి యిట్లా అంది: 'ఓ రాజా! రేపు మీరు అంతా తయారుచేసుకొని సిద్ధంగా వుండండి. అప్పుడు ఒక శంఖధ్వని వినపడుతుంది. వెంటనే శంఖుస్థాపన చెయ్యండి' అని. మర్నాడంతా తయారు చేసుకొని రాజు సిద్ధంగా వున్నాడు. దారేపోతున్న బిచ్చగాడొకడు తన శంఖాన్ని పూరించాడు. అదే అనుజ్ఞాసూచకమైన ధ్వని అనుకొని శంఖుస్థాపన చేసారు. స్థలదేవతకు కోపం వచ్చింది. కట్టబోయే నగరు స్థలదేవత యొక్క ఆగ్రహానికి గురి అయింది.

తరువాత అనుజ్ఞాసూచకమైన శంఖధ్వని అయింది. రాజుగారు భయపడ్డాడు. మళ్లా

స్థలదేవతను ఆరాధించాడు. ప్రత్యక్షమయింది. తప్పు క్షమించమని మొత్తుకున్నాడు. దేవత మనస్సు కొద్దిగా కరిగింది. 'మూడు తరాల వరకూ బాగానే వుంటుంది. తర్వాత పాడు పడుతుంది' అని చెప్పి అంతర్హితురాలయింది. గంగరాజు హాయిగా పరిపాలించాడు తన రాజ్యాన్ని. అతనిమరణానంతరం అతనికొడుకు నందిరాజు రాజ్యానికి వచ్చాడు.

౨

కొత్తరాజు చాలా రాజ్యాలు సంపాదించాడు. రాజ్యాన్ని తన కొడుక్కి అప్పగించాడు. తాను అలంకరించుకొని తన గుఱ్ఱాన్నెక్కి బయలుదేరాడు, జలపాతం వైపుకు. భార్యకూడా వస్తానని వెంటపడింది. భార్యను కూడా అలంకరించుకొని రమ్మన్నాడు, పెళ్ళికి వెడుతున్నట్టు. భార్య అలంకరించుకొని వచ్చిన తర్వాత ఇద్దరూ కలసి బయలుదేరారు. అశ్వానికి గంతలు కట్టి, జలపాతం వైపుకు పరుగెత్తించారు.

* * * *

౩

తర్వాత నందిరాజు కొడుకు రెండవ గంగరాజు రాజ్యానికి వచ్చాడు. శివధనుస్సును ఎవ్వరూ సంధించ లేక పోయేవా రట. అట్లాగే రెండవ గంగరాజు యొక్క ధనువును కూడా యెవ్వరూ వంచలేక పోయేవారు— అని చెప్పితే చాలు అతనికీర్తి విషయంలో. నగరానికి చాలా మాన్యతని ప్రసాదించాడు. వైభవోపేతంగా రాజ్యాన్ని పాలించాడు. తన చేతికింద వున్న యిద్దరు రాజులకు తనయిద్దరు కూతుళ్లనూ ఇచ్చి పెళ్లిచేశాడు. ఈపిల్లలికి గర్వం ఎక్కువ. వారు తమ నాయనగారి వైభవమంతా వర్ణించి చెప్పి తమ భర్తల్ని కూడా అంత వైభవాన్ని సంపాదించుకోమని చెప్పి బాధించేవాళ్లు.

ఆ రాజు లిద్దరూ కలసి తమ మామగార్ని చంపి వెయ్యాలని ఆలోచించుకొన్నారు.

వాళ్ల సైన్యమంతా పోగు చేసుకొని బయలుదేరారు శివసముద్రానికి. పన్నెండేళ్లు కాచారు. కోటలో ప్రవేశించటానికి సాధ్యం కాలేదు. చివరికి విసిగి వేసరిల్లి ప్రధానమంత్రికి లంచ మిచ్చారు. ఆ విశ్వాసఘాతకుడు కోట వద్ద ఉండే కాపలావార్ని తొలగించాడు. దివాణంలోకి వెళ్లి రాజుగారితో చదరంగం ఆడటం మొదలు పెట్టాడు. కొంతసేపటికి వాకిట్లో వివిధములయిన ధ్వనులు వినిపించాయి. రాజుగారు 'అదేమిటి?' అని ప్రశ్నించారు. 'పిల్లలు ఆడుకొంటున్నారు' అని ఆ విశ్వాసఘాతకుడు జవా బిచ్చాడు. వెంటనే ద్వారానికి కట్టి ఉన్న తెరగుడ్డలు తొలగింపబడ్డాయి. ఆయుధపాణులయిన సైనికులు లోపల ప్రవేశించారు. వెంటనే ఒరలోంచి కత్తి తీసి చేత బట్టుకొని అంతఃపురంలోకి పరిగెత్తుకొని వెళ్ళాడు. భార్యల్ని పిల్లల్ని చంపి మళ్ళా వచ్చాడు శత్రువుల్ని ఎదిరించటానికి. వారితో పోట్లాడి వీరస్వర్గమునకు దారి పట్టాడు. కూతుళ్లు వచ్చి తండ్రిశవాన్ని చూశారు. నిలవలేకపోయారు. జలపాతం వైపుకు దారితీసారు. తమ తాత చేసినపనే చేశారు; జలపాతం దగ్గర కెళ్లి, అగాధమైన జలపాతంలో పడి ప్రాణాలు వదిలేసారు.

ఇదంతా చూసి ప్రజలు మూటా ముల్లె కట్టి బయలుదేరారు, ధనమంతా తీసికొని, ఆ ప్రదేశాన్ని విడిచేసి.

ఇట్లా ఆ పట్టణం అప్రతిహతమైన స్థల దేవతశాపానికి గురిఅయి పాడుపడిపోయింది.

## (శ్రుతివీథి) — ప్రణయతరంగము

౧

చపలవిలోలలోచనలఁ జంపఁ దలంచిన మృత్యుమూర్తులో
విపులకృపాంబురాశి యగు వెన్నుని తిన్నని సోగ కన్నులో
యపుడె వికాస మందిన నవాంబురుహంబులఁబోలెఁ దోఁచి న
న్నపు డడలించుచున్నవి కదే సఖులార! యిఁకేమి సేయుదున్.

౨

నెచ్చెలులార! నన్నిటులు నింద యొనర్చుచు బాధ పెట్టఁగా
వచ్చిన దేమి మీకు! సురవల్లియొ కాక తదంకురాగ్రమో
మ్రుచ్చిలి వెన్న దన్న యల ముద్దులకృష్ణుని దివ్యనాసయో
యిచ్చను దోఁచి దీపశిఖ యేపున నన్నుడికించుచుండఁగాన్.

౩

పగడమో వింతఫలమొ నాపాలిఫలమొ, తెలియకున్నది; మోహనజలదమూర్తి
యధరబింబమెల్లెడలఁ బ్రత్యక్షమగుచుఁ బ్రాణముల నేచుచున్నదో పడఁతులార!

౪

అనదల నదల్చు నీలశరాసనములో, అలరు విల్తుని యిక్షుశరాసనములో
స్మరగురుని భ్రూలతావిలాసము లదేమొ, కాని నన్నేచుచున్న వోకాంతలార!

౫

కొనగోటన్ గిరిఁ దాల్చి పొల్చు మురళీగోపాలు చిర్నవ్వులో
నునుముత్యాలసరంబులో, విశదకాంతుల్ దోఁపఁగా నిల్కడం
గని చూపట్టు మెఱుంగులో మెఱుఁగ; నన్ బాధించి వేధించెడిన్
మనఁగాఁ జాలను తల్లులార! యిఁక నన్ మన్నించి వీడ్కొల్పరే!

౬

ఎలమిని గోరుకాంతలకు, నీసున దూరుఖలాళికిన్ భ్రమం
గొలిపెఁ వెలుంగుచున్ మకరకుండలలీలలఁ గ్రాలుపల్లవం
బులొ? ఫణిరాజతల్పునవమోహనకుండలకాంతులీనుచే
నులొ? కనుదోయి నాఁగి మద నొవ్వఁగ నెవ్వగఁ గూర్చుచుండెనే!

౭

అదె కన్గొమ్మనఁజాలఁ గాని చెలువా! యర్ధేందురుగ్జాలమో?
హృది నాసించెడివారి పాలిటి విషోద్రిక్తౌషధీమూలమో?
సుదతీమోహనుఁ డౌ చతుర్భుజుని కస్తూరీస్ఫురత్ఫాలమో?
మదిలోఁ దోఁచి, విరాళి నేచి యలయింపం జూచు నేమందునే!

౮

చెలువమ్మౌ తమసొమ్ముగా వెలయు రాజీవమ్ము, చాపమ్ము, క్రొం
దలిరుం దీవియు విద్రుమం బలరు ముత్యంబున్ సుధాబింబమున్
జెలువందంగల కాంతిమండలము లక్ష్మీజాని దివ్యాస్యమం
డలమై మిన్నులఁ దోఁచి పాపములకొండన్ నన్ను మండించునే!

౯

ఎససి జగత్త్రయంబు గ్రసియించు గభీరతమిస్రగోళగ
ర్భనిభవిశాలతంతునికరంబులు గావవి శ్యామసుందరాం
గుని వారినీల సిలమృదుకుంతలవల్లులు గాని; పుష్పవా
సనఁ గని మైనఁ బోల్చుకొనఁ జాలక నన్నలయింతు రేటికే!

౧౦

'ఇలువడి మేర మీఱి నగు నే! కులకాంతలు వీథి కెక్కఁగనే
నలుగురు నవ్వపోరె?' యని నన్నరికట్టెద రమ్మలార! యు
జ్జ్వలమణికాంతులన్ భువన జాలము రంజిలఁ జేయు శౌరిని
ర్మలమకుటంబుపైఁ దవిలి రాదు మనం బిఁక నేమి చేయుదునే?.

---

౧

"ఏం చేస్తున్నావు?"

"ఏం?"

"కాస్త సున్నం కావాలి."

"దొడ్లో కుండలో వుంది కాదూ?"

"నా కా సంగతి తెలుసును. కాస్త తెచ్చి పెట్టమన్న మాట."

"నే నిప్పుడు కుంక ముట్టుకోనన్న మాట కాదూ?"

"ఏమీ?"

"మడి కట్టుకున్నాను."

"ఎందుకూ?"

"దాసీదానికి అంట్లు పడెయ్యాలి."

"తరవాతా?"

"పొయ్యి అలుక్కోవాలి."

"ఆ తరవాతా."

"వంటిల్లు అలకాలి"

"అలికి?"

"ముగ్గు—"

"పెట్టి?"

"నడే. నీళ్లు పోసుకోవాలి."

"పోసుకుని?"

"ఎసరు—"

"పెట్టి?"

"కుంభం వుడకెయ్యాలి కాదూ మరీ? ఏది తప్పినా అది తప్పదు మనకి. మూడు పూట్లా ఆరగింపయితే గాని తిరువీథులు వేం చెయ్యడానికి స్వామికి శక్తి వుండొద్దూ?"

"........"

"నేను పెడుతున్నాను మరి. అచ్చాలు కనిపెట్టుకుంది."

"కాస్త సున్నం కావాలంటే అంత దండకం విడెయ్యడం యెందుకూ?"

"వొక్క అడుగు దొడ్లోకి వేస్తే సున్నం వచ్చేదానికి నా దండకాన్ని మీ రింత సాగ తియ్యడం యెందుకూ?"

"........"

"పొద్దెక్కిపోతోంది. మీ కేం, చెబుతారు కబుర్లు. సున్నం అవసరమో, అక్కర్లేక పోవడమో తేల్చుకుంటే తలుపు వేసుకోవాలి."

"ఇంకా బారెడు పొద్దైనా యెక్కలేదు కదా, అప్పుడే మడేం నీకూ?"

"ఇంకా మొగమేనా కడుక్కోలేదు కదా అప్పుడే సున్నమేం మీకూ?"

"నా సున్నాని కివాళ కొత్తా యేమిటి?"

"నా మడికి మాత్రం కొత్తా యేమిటి?"

"................."

"తొరగా తెమల్చాలి. చెప్ప పెయ్యకుండా చూస్తూ కూచుంటే కాదు."

"పెంకి జవాటులు చెబితే మాత్రం అవుతుందాయేమిటి? సున్నం పట్టుకురా ముందు."

"కూచోండి అలాగేను."

"వెదతావు కాదూ? సున్నం తేవూ?"

"లేవరు కాదూ? సున్నం తెచ్చుకోరూ?"

"ఇదిగో చూడూ, తీరా కూచున్నాను."

"ఇదిగో వినండీ, తీరా మడికట్టుకున్నాను."

"చెప్పిన మాట వినవు కాదూ?"

"విన్న మాట చెప్పరు కాదూ?"

"................"

"................"

"నాకే వెల్లు."

"పోనీ కూచోండి."

"నా అవసరం రాకపోతే చూస్తాను కానియ్యి."

"నా పని లేకపోతే మాట్లాడతాను పోనియ్యండి."

"................"

"ఉ! పోసుకోటు కభుర్లు నా చేత కాదు. పట్టికోసమే కదా యీ రాయన మంతాను?"

"........"

"సావకాశంగా చూసుకోండి."

"........"

"........"

"వెళ్లిపోయింది. దీనిచేత సున్నం తెప్పించలేకపోయాను...... మొదటే నేను తెచ్చుకుంటే యీపాటికి మాలపిల్లి దాటుదును."

౨

"వో మా టింటోకి రావాలి."

"........"

"మిమ్మల్నే."

"........"

"వినపడదూ?"

"ఏం?"

"తొరగా వస్తే చద్దన్నం పెడతాను. లేకపోతే నావల్ల కాదు."

"అంటే?"

"ఆలస్యం చేస్తే మీరు పెట్టుకోవాలి."

"ఇంతకంటే అదే నయం. వెళ్లి నీపని నువ్వు చూసుకో."

"కంచం కూడా మీరే కడిగేస్తారా యేమిటండీ?"

"అదేమిటి?"

"పొయిలో నిప్పు పడేశాను. అది రాజిందంటే నీళ్లు పోసుకుని మడి కట్టుకుంటాను. ఇక చద్దికుండ ముట్టుకోను. కంచం కేసి చూడనేనా చూడనూ."

"పోనీ, మధ్యాహ్నం కడుగుదువు గాని లే నువ్వు."

"అంతే గాని మీ రిప్పుడన్నానికి లేవరన్న మాట."

"................"

"లోకంలో తీరి కూచుని అన్నానికి పొద్దు పోగొట్టుకోవడం యెక్కడా చూడలేదమ్మా, యిదేం సరసమో కానీ."

"................"

"భూమ్మీద మాఅమ్మా, మాపిన్నీ—ఇద్దరే పెట్టిపుట్టారు."

"ఎంచేతో?"

"మా పిన్ని అల్లుడు అనాచారం కలిసి పోతుం దేమో అని మా రత్తిని కూచోపెట్టి స్వయంగా వండుకుంటాడు అన్నం. మా అమ్మ పెద్దల్లుడు కభుర్లు మించిపోతా యని పొద్దెక్కే దాకా కూచుని అన్నం తిన్న కంచం స్వయంగానే కడిగేసుకుం—"

"నోరు ముయ్యి."

"నాది మడిబట్టండీ."

"టాట్!"

"అబ్బో! దర్జుఫారానికే యింత యింగ్లీ షయితే బి. యే. అయితే యిక భూమే కన పడకపోవునేమో?"

"........"

"........"

"గిల్లి కజ్జా పెడుతుంది భడవ. నాలుగు వాయిస్తే బుద్ధి వచ్చును; గాని—అయినా—యికముందు ప్రతి పనీ సకాలంలో స్వయంగా చేసేసుకునేపద్ధతి ఆలోచించుకోవాలి."

3

"ఏమిటి వంట యివాళ?"

"అన్నం వార్చాను."

"ఆధారం యేమిటని అడుగుతున్నాను."

"మూడు సోలల గిన్ని."

"........"

"దాని కేమో పొయ్యి."

"........"

"దానికి పుడకలూ, పిడకలూనూ."

"................"

"దానికి అగ్గిపెట్టి."

"మాట్లాడితే గరిగమ్మ వాటం, సిగ్గు లేక పోతే సరి."

"సిగ్గెందు కుండాలీ నాకూ? మీరు తెచ్చిన కూర్లన్నీ కుళ్లిపోతున్నా యనా?"

"అచ్చాలిని పంపమన్నాను కాదూ సంతకి?"

"నేను మిమ్మల్ని వెళ్లమన లేదూ?"

"అదై తేం?"

"మీా రైతే యేమీా?"

"సంతలోనుంచి కూరలు నేను మోసుకు రానా?"

"పొయి దగ్గిర కూచుని వంట నేను స్వయంగా చెయ్యనా?"

"................"

"మీారు వీధిలో చీట్లపేకా, నే నింట్లో గవ్వలూ ఆడుతూ కూచుంటే యెంత దర్జాగా వుంటుందో యెప్పు డేనా ఆలోచించారా?"

"మాట్లాడిస్తే నువ్వు హద్దులో వుండవు. ఛీ."

"వెళ్లిపోతా రేమండీ?"

౪

"వంట అయింది."

"మా ఆట కూడా అయిపోయిం దన్న మాటే. ఇక రెండెత్తుల్లో విస్సిగాడిఆట కట్టూ. నువ్వు వడ్డనప్రయత్నంలో వుండవచ్చు."

*　*　*　*

"వంట అయింది."

"అయిందా? వొస్తున్నాను. వొక్క క్షణం— యీ వెధవ గుర్రం అడ్డు వచ్చింది; గాని లేకపోతే యీపాటికి సగంభోజన మైపో యివుండును"

*　*　*　*

"వంట అయింద."

"వొక్క పదనిమిషాలు వోపిక పట్టు. ఈ లోపుగా నాకు కంగారు పుట్టించకు. వీడి ఆట యీమాటు తప్పకుండా కట్టితీరాలి."

*　*　*　*

"వంట అయింది."

"వేపుకుని తినేస్తున్నా వేమిటి, మంచి రస కందాయపట్టులో వచ్చీ? కాస్సేపు వూరుకో లేవూ? ఇప్పుడేనా చద్దన్నం తిన్నానూ?"

*　*　*　*

౫

"వడ్డించవచ్చు."

"ఉక్కమాలిన భోజనం యెప్పుడూ వుండేదే. ఈమాత్రం మహాభాగ్యానికి ఆటకట్టి పెట్టుకుని వచ్చారా యేమిటి పాపం?"

"........"

"మీ రిలా రావడంచేత విన్నన్న చిన్న పుచ్చుకున్నాడో యేమిటో. తొరగా వెళ్లి పిలుచుకు రండి."

"........"

"మీకోసమే చెబితే అలా తళుకుబెళుకు లన్నీ చూపిస్తా రేమి టండీ చూపుల్లోనూ?"

"వడ్డించ మంటే యీ వుపన్యాసం యే మిటీ?"

"నుంచున్న పళంగానే వడ్డించాలి కాబోలు. అవునా? అంతతొందరగా వుందా?"

"తీరి కూచుని పొద్దు పోగొట్టుకోవడం యెందుకూ?"

"పోయిన పొద్దెలాగా పోయింది. ఇంకో ఆట—"

"ప్రాణాలు కొరికి కొర్కిక నన్నిలా బతక నివ్వు. విస్తట్లో నాలుగు మెతుకులు పడేశా వంటే నువ్వింక కాళీ వెళ్లక్కర్లేదు."

"మీ మాటో మరీ?"

౬

"నీళ్లు పోసుకోరా యేమిటి?"

"శీతాకాలంలో రోజూ పోసుకోకపోతే మునిగిపోదులే."

"అక్కడికి నిన్న పోసుకున్నట్లు."

"రేపు తప్పకుండా పోసుకుంటాను, నీళ్లు కాచు."

"అయితే నీళ్లపొయిలో నిప్పేసి వస్తాను, వొక్క క్షణం కూచోండి పీటమీద."

*　*　*　*

"పప్పేదీ?"

"కూరలో వుంది చూసుకోండి."

"దేని కది వేరే వండకూడదూ?"

"ఆ రాద్ధాంత సిద్ధాంతా లన్నీ యిందా కానే అయిపోయాయి. ఇక వండింది నేను వడ్డించడమూ, వడ్డించింది మీరు తినడమూనే తరవాయి."

*　*　*　*

"అబ్బా! పెరుగు పులుపు రొడ్డూ నాలిక చిల్లడిపోతోంది."

"నిన్న చప్పగా వుం దని వంకలు పెట్టారు కాదూ మరీ?"

"కమ్మగా వుండేలాగ తోడు పెట్ట గూడదూ?"

"చప్పనకి ప్రతిమాట పుల్లన కాని కమ్మన కాదు."

2

"ఎక్కడికో ప్రయాణం?"

"ఏం?"

"ఏ నుంది."

"ఏ దేనా పురమాయిస్తావా యేమిటి?"

"పాలమూరు వెళ్లి మక్తాధాన్యం పట్టించుకు రావాలి."

"చంపేశావు."

"వచ్చాక చీట్లో, చదరంగమో ఆడితే సరీ, మళ్లీ బతికవచ్చు."

"........"

"ఇవాళ తప్పదు మీ కిది."

"........"

"వెళ్లి తీరాలి."

"........"

"ఈ నెల్లాళ్లూ కష్టపడితిరా పదిపుట్ల ధాన్యమూ, అయిదువందల రూపాయలూ చేతికి వస్తాయి. మళ్లీ సంవత్సరందాకా మీకు స్వేచ్ఛ. అదృష్టజాతకం. పెట్టి పుట్టారు. వుందనా, లే దనా?"

"........"

"కొత్త శిస్తులు వస్తే గాని యిక అమావాస్య వెళ్లదు. యాభై రూపాయలికి పైగా మీ పాగాకే తగలేసింది."

"అన్నట్టు పాగాకు అయిపోయింది. ఇవాళ వొక రూపాయ యివ్వాలి."

"ముందు పాలమూరు వెళ్లి వచ్చి తరవాత అడగడం."

"రైతు లిప్పుడు కనపడతారా?"

"ఏం కనపడకా?"

"పొలాలు వెళ్లరూ?"

"మీరూ పొలాలే వెళ్లండి. వద్దన్నవా రెవరు?"

"........"

"చెయ్యి చాపనక్కర్లేదు. ఇస్తా నంటే నే నివ్వడమే. అయితే తొరగా వెడితేనే రూపాయి. ఆలస్యం చేస్తే అర్థరూపాయే. వెడుతూ వెడుతూ యెక్కడేనా చీట్లు ముట్టుకున్నా రంటే మాత్రం పావలే. తెలిసిందా?"

3

"దిక్కు మాలిన శిస్తులు గానీ——"

"అదేం కర్మ మండీ?"

"వడగొట్టేసింది."

"చలిచేత. కదూ?"

"చచ్చి వస్తే—"

"ఎలా వచ్చారండీ పాపం?"

"........"

"మీ ఆపసోపాలకేం గాని వసూళ్లే మాత్రమో చెబుదురూ."

"కసిన్ని మంచినీళ్లేనాయిస్తూముందూ."

"ఏనా అంటే?"

"ఇలాంటప్పుడేనా కాస్త కాఫీ చేసి యివ్వగూడదూ?"

"కాస్త మినపరొట్టి కూడా చేసిపెట్టనా?"

* * * *

"నా కక్కర్లేదు."

"ఏం?"

"ఇందాకానే పులుపు చిచ్చుగా వుంది. ఈపాటికి బురబుర మొత్తే వుంటుంద."

"అయినా కాస్త పుచ్చుకు చూడండి."

"ఉప్పు వేసి తెచ్చావా యేమిటి?"

"అబ్బే."

"మరేం చేశావూ?"

"నిమ్మకాయ పిడిచాను."

* * * *

"మూడు బొత్తులు. డబ్బయి అయిదు రూపాయలు."

"........"

"ఇది నూరురూపాయల నోటూ."

"........"

"ఇది యాభై"

"........"

"ఇవి నాలుగు పదులు."

"........"

"మూ డైదులు."

"........"

"రెండువందల యెనభై రూపాయ లన్న మాట. ఏ బాప తిది?"

"ఇది అరటితోట శిస్తు. చెరుకుతోట శిస్తు అమావాస్య వెళ్లాక వస్తుంది."

"ధాన్యమో?"

"తెల్లారేటప్పటికి వస్తాయి బళ్లు."

"రూపాయ వెనక్కి తీశా రెందుకూ?"

"ఇందాకా—"

"ఇలా యివ్వండి చెబుతాను."

"................"

"ఇవ్వండి ముందు."

"నా చేతిలోనుంచి నీచేతిలోకీ, నీ చేతిలోనుంచి నా చేతిలోకీ—ఎందుకూ యీ గుంట తిరుగుళ్లూ?"

"మాట్లాడ వద్దు. ఇవ్వండి."

"................"

"ఇప్పు డాలస్యం చేసినా యిందాకటి మాటే."

"అబ్బా! చంపుతావు నువ్వు. మరి పుచ్చుకో."

"ఇదిగో పట్టుకు వెళ్లండి."

"దాని సి గ్గోసిన పట్టుదల. నీ చేత్తో యివ్వా లనీ."

"నా చేత్తో కాకపోతే—? చేతిలోది చేతిలోంచే యెగరేద్దా మనుకున్నారు కామోసు పాపం. దిగండి గుర్రం."

౬

"మిమ్మల్ని దయ తలచ కూడ దండీ."

"ఏం అపరాధం చేశానూ?"

"వూ రంతా తిరిగితే గాని దొరికేదే కాదుట."

"ఎందుకోసము?"

"అవునా కాదా?"

"ఇవాళ బరిసావిట్లో వేశారు మకాం కుర్రాళ్లంతానూ."

"ఇప్పుడు రావడానికి వీల్లే దని కూడా అన్నారుట కాదూ?"

"అన్న మాట నిజమే. కానీ—"

"ఇక కానీ యెందుకూ? వెళ్లండి పాపం. ఎంత కష్టంగా వుదో యింటికి రావడం అంటే మీకు."

"ఇంతకీ ప నేమిటో చెప్పావు కాదు".

"చెబితే మాత్రం వస్తుందా యేమిటి యింతకంటే నరసం?"

"..................!"

"ఎండపడి రావడమే కాకుండా నోరు చేసుకుని అడిగారు కూడానూ అని—వొక్క తుణ మేనా యిల్లు పట్ట రమ్మా, యేం పాపమో కానీ!"

"................"

"పోనీ అని చేసి యిస్తే మాత్రం? మళ్లీ యెప్ప టాటే. చెయ్యి కడుక్కోవడం తరవాయి."

"ఏమైనా ఫలహారం తయారు చేశావా యేమిటోయ్!"

"ఫలహారం కాదు, బండలు."

"ఏదీ తొరగా పట్టుకురా."

"అవకల మించిపోతోందా యేమిటి?"

"మించి పోతోందా అంటే వాయువేగ మనోవేగాలమీదే. మహా నిక్కచ్చిగా నడుస్తోంది దశావతారి. అసలు రావడానికే మనస్సు వొప్పింది కాదు. ఇక నువ్వు తరవాయి అట్టేపెట్ట వని—"

"మీ కివ్వకుండా అంతా మింగేస్తా ననుకున్నా రా యేమిటండీ?"

"........"

"........"

"కాఫీ చేశావా? దీనికి సాయం రెండు పకోడీలు కూడా వుంటేనా?"

"నో రూరుతోందా?"

"మెల్లిగా అడుగుతున్నావా?"

"తింటూన్నట్టే వుంది కామోసు."

"వొక్క దెబ్బని."

"ఇక చెయ్యడం యెందుకూ పని చెడీ?"

*      *      *      *

"పోనీ వెళ్లండి నా కేం?"

"ఇంకా యేవో తరవాయి అట్టే పెట్టావా?"

"వెళ్లండి."

"వెళ్లను. రా మరి."

"మీా రిక్కడ ఆలస్యం చేశా రంటే వాళ్లు గెంటేస్తారు సుమండీ."

"వాళ్ల మొహం! నా సరదా కోసం నేను వెడతాను కానీ—వోహో! అదా? తాంబూలదానంబు తప్పక—"

"ఆడా మొగా భేదం తెలియదా యేమిటండీ మీాకూ?"

"పద్యం దిద్దెయ్యనూ? అలాగే వుండనిస్తా ననుకున్నావా? వా! తమలపాకులు కావివి. వెన్నాకులు."

"......పోకచెక్క లేమిటో?"

"కలకండ పలుకులే. అయితే తాంబూలం తరవాత యేమిటో జ్ఞాపకం వుందా?..."

"దీని తరవాత యేమిటో యెరుగుదురా?........"

"అంతే, అంతే. ముక్తాయింపు బులబులాగ్గా తేలిపోవాలి గానీ—మరి సెలవ్లా."

"దీల్లో మాత్రం పండితులే — ఇదిగో! దీపాలు పెట్టేటప్పటికి రావాలి యింటికి."

౧౦

"అన్నకాడికి ఆలస్యం అయినట్టా లేనట్టా? అరిగో, గుడిదగ్గర మనుష్యులు కనపడుతూనే వున్నారు. వేళ తప్పలేదు. అయితే దీపాలు పెట్టడం అంటే పొద్దు గూకడమా? చీకటి పడడమా?........అట్నుంచి నరుక్కువద్దాం......"

"................"

"వినపడలేదు. మళ్లీ........"

"................"

"చిటపటచినుకులు దుప్పటి—"

"................"

"ఇదిగో. ఇక్కడ యింతసేపు నుంచో పెట్టి ఆలస్యం అయిం దని పేచీ పెడితే నేను వొప్పుకోను."

"రేచీక టనా పెట్టాడు కా దమ్మా దేముడూ."

"నా కళ్లు పోవా లని వుందా?"

"నే నడిలిపోయి మంచం పట్టా లని వుందా?"

"ఇంతట్లోకే?"

"ఇంకాస్త పెందరాడే వస్తే యేం?"

"రేపట్నుంచి సరిగ్గా వస్తాను రిస్టువాచీ కొని ఇయ్యి మరి."

"రిస్టువాచీలు అమ్మేవాళ్లు బుద్ధికూడా అమ్ముతారా?"

౧౧

"ఆకు ల్లేవు."

"కంచం పెట్టు."

"చీకట్లో నేను కడగలేను బాబూ."

"నాకు మాత్రం చీకటి కాదూ ఆకులు కొయ్యడానికీ?"



౫. శ్రీ మల్లికార్జున దేవాలయ పశ్చిమద్వారము (శిథిలము)
ఈ ద్వారముననుండి భ్రమరాంబాలయమునకు పోవలయును,



౬. భీమునికొలనినుండి కైలాసద్వారమున కెక్కుత్రోవ

"మరి పగ లంతా యేం చేశారూ?"

"ఇప్పుడు చెప్పిన మాట ను వ్వప్పుడే యెందుకు చెప్పావు కాదూ?"

"ఇంట్లో యేం వుందో యేం లేదో కాస్త చూసుకోనక్కర్లేదూ మీరూ?"

"నువ్వు చెప్పింది తేవడమే నా పూచీ."

"అయితే ఆకు లుంటేనే వడ్డించడం నా పూచీ."

*　　*　　*　　*

"కూర లే దన్న మాట."

"ఇద కొబ్బరికాయ పచ్చడండీ."

"చారు కాచావా?"

"మిరియా లయిపోయాయి."

"మజ్జిగేనా పోగిచావా?"

"మీరు పాము తెచ్చారా?"

"అయితే పొడిపిడచలు మింగ మం టావా?"

"పోనీ పప్పుపులుసుతో తడుపుకోండి."

*　　*　　*　　*

"నెయ్యి బాగా కాగలేదు."

"రేపట్నుంచి మీామట్టుకు బజారు నెయ్యి తెప్పించుతాను లెండి."

*　　*　　*　　*

"ఇది మజ్జిగా పానకమా?"

"అదీ కాదు యిదీ కాదూ."

"మ రేమిటీ?"

"మాణికం."

"అంటే?"

"రెండూ కలిశా యన్న మాట."

"ఎవ రేనా మజ్జిగలో పంచదార వేసు కుంటారా?"

"ఎవ రేనా నిక్షేపం లాంటి పెరుక్కి ఇలాగ వంకలు పన్నుతారా?"

"ఏం?"

"ఏ మంటే? ఎప్పు డేనా యింటి మజ్జిగ తాగిన పాపాన్ని పోతేనా?"

*　　*　　*　　*

"ఇక లేవ మంటావా?"

"ఇం కా కూ చో మని మాత్రం అన్నానా యేమిటి నేను?"

## ౧౨

"అదృష్టవంతు డైన మొగాడికి, భోజనం చేసి లేచాటప్పటికే తమలపాకుల చిలక లందించే పెళ్లాం దొరుకుతుంది."

"పెట్టి పుట్టిన ఆడదానికి తినతోటే తాంబూలం వేసుకునే మొగుడు దొరుకు తాడు."

*　　*　　*　　*

"పక్క దులుపుతావా?"

"అప్పుడే తొక్కేశారా యేమి టండీ?"

*　　*　　*　　*

"కళ్లు మూసుకుపోతున్నాయి."

"అంత అతిశయం అయితే యెలా గండీ?"

౧౩

"చలి వొణికించేస్తోంది."

"శాలువమీద బూర్నీసు కూడా కప్పనా యేమిటి?"

"అలా పోయాది కాదిది."

"కుంపటి యెత్తుకొస్తా నుండండి."

"................"

"................"

"పోనీ నా కొక్కడి కేనా యేమిటి?"

"ఆమాటమీద నిలవండి."

---

## దుర్యోధనునకై సహదేవవాక్యము

మాగంటి రామకృష్ణశాస్త్రి గారు

చెలిమిన్ బాండవకౌరవుల్ మనుటయే శ్రేయమ్ము; ము న్నాడిన
ట్లిలలో సా మిడి రాజ్యము న్నిలిపికొ మ్మొక్కరీతి గాదేని సం
కులసంగ్రామమునన్ సగర్భ్యసుతసంక్షోభంబు చేకూరెడిం
గులనాశమ్మున కర్థనాశమున కీ కో నేల దుర్యోధనా!

క్రొత్తడికట్టుఁబట్టములఁ గ్రూరత విప్పుట గాదు, ఈరసం
బెత్తి విషాశనం బొసఁగి, యింట శిఖిం బరికొల్పి, దాయలన్
మిత్తి కొసంగఁ జూచు నవినీతియుఁ గాదు, కిరీటి గాండివం
బెత్తి శిరంబు నాటుతఱి నీవ యెఱుంగుదు తత్ప్రభావముల్.

కపటమునం జయంబుఁ గొను కౌతుక మింతటఁ గట్టిపెట్టు, మా
ద్రుపదతనూజఁ గీడ్వఱుప ధూర్తతఁ జూపిన క్రొవ్వు, నాఁటినే
రువుఁ గొనసాగ వింక, కల రూపు వచించితి మేలుకొమ్ము, జూ
దపుకిటుకుల్ రహింప విఁక ధర్మవిరోధము హానిఁ గూర్పదే?

మునుపటిరీతి గాదు మొగమోటమి యుద్ధమునందు లేదు, ఏ
మనవులు చెల్లనీదు పగ, మక్కువ లెక్కడ సాగి రావు, ఈ
చనవులు కాన రా వచట, జాతియు భూతియు కాఁపు గావు సు
మ్మనిఁ దలపడ్డఁ బాండుసుతు లన్నలు, దమ్ములు నంట సాగునే?

తీఁపురముల్ ఘటింపఁ దగు దేబెలుఁ గాలము ప్రాపుగల్గ, నీ
వ్రాఁ పటు చెల్లెఁ గాక! మగపోఁడిమియే, కను ద్రిమ్మరి సంపదం
దోఁచిడిసేఁత; సాధుగురు దూషణ మూరక చన్నె? కష్టముల్
గాఁపురముండునే? పగలు గల్గదె? రాతిరి యట్టె యుండునే?

భండన మన్న భానుసుతుబాహుబలం బొకకొండఁ జేసి యా
తండు గలం డటంచు బలదర్పమునం గడు విఱ్ఱవీఁగె దా
ఖండలసూతికిన్ హరునిఁ గా దనిపించి వరంబుఁ గొన్న శ్రీ
గాండివ ధన్వికిన్ నరకఖండను నెచ్చెలి కడ్డు గల్గునే?

తులువతనానఁ బెన్గొఁ అవితోఁ దల గోఁకికొనం దలంచె దా
బలరిపుసూతి విక్రమవిపాకము గోగ్రహణంబునాఁ డవే
తెలిసియుఁ, బాండవేయబలదీప్తదవానలకీలలం గటా
శలభముభంగిఁ బిట్టుఱుక జాల్మ్రఁడ వందురు కౌరవేశ్వరా.

అగ్గాండీవి యొకండ నిష్ఠురరణవ్యాపారపారీణుఁడై
పగ్గె ల్వాల్చు సుయోధనున్ ఘనచమూప్రాగ్రేసరుం బోరిలోఁ
బెగ్గిల్లం దురపిల్లఁజేసె నిదె, రేపే క్రీడిపై నెత్తిపో
సిగ్గేలా యిసుమంత లే దనుచు నిన్ జీకొట్టరే భూజనుల్.

ధర్మసంభవుక్రోధదావాగ్ని దరికొని యేఁచి నీసేన దహించునపుడు
భీముగదాభీలపృథుశరప్రహతి నీ వక్షఃస్థలము బీఁటవాఱునపుడు
గాండీవనిర్ముక్త ఘనశిలీముఖపంక్తి నీదుమర్మము లంటి నెగడునపుడు
మాద్రేయభుజ విక్రమాభీలశక్తి విజృంభించి నిన్నుఁ గారించునపుడు
పాండవకృపాణ దారుణ పన్నగాళి-చెలఁగి నీప్రాణవాయు వాసించునపుడు
తెలిసెదవు నాదు విహితోపదేశఫలము-నేఁడు రుచియించునే నీకు నాఁడు గాక.

---



## పేరంటం

సూరి అరుగు చివర కూర్చుని కాళ్లు వేళ్లాడవేసుకొని ఊపుతూ, ఎదురుగుండా గడ్డి మేస్తున్న మేకపిల్లల కేసి చూస్తూ పాడుకుంటోంది.

"అమ్మా నాకు తల దువ్వే
కాళ్లకు గజ్జెలు కట్టవు కే
పేరంటానికి వెడతాను
కాళ్లకు పసుపూ పూస్తారు
చుట్టూ పారాణి పెడతారు
శనగల వాయనం ఇస్తారు
అప్పుడు ఇంటికి వస్తాను;
పశువులు ఇంటికి వచ్చాక
పాలూ బువ్వా తింటాను."

సూరి తెల్ల పువ్వుల ఎఱ్ఱ పరికిణీ కట్టుకొంది. తెల్ల జుబ్బా తొడుక్కుంది. మెడలో ఒక చిన్న కాసులపేరు ఉంది. కాళ్లకు వెండికడియాలు పెట్టుకుంది. చేతులకి బంగారం మురుగులున్నాయి. అప్పుడే తల దువ్వుకొని కాటుకా బొట్టూ పెట్టుకొంది.

ఇంట్లో వాళ్లమ్మ వాళ్ల చెల్లాయిలిద్దరికీ తల దువ్వుతోంది. సూరికి ఎనిమిదేళ్ల వయస్సు. చామనచాయగా, బక్కపలచగా ఉంటుంది.

అసలు సూరిపేరు సూర్యకాంతం. తను బళ్లో చదివే రెండోవాచకపుస్తకం మీద 'సూర్యకాంతం' అని తన పేరు వ్రాసుకొంది. అసలు పేరు సూర్యకాంతం అయినప్పటికీ వాళ్లమ్మ దాన్ని ఎప్పటికీ 'సూరి' 'సూరి' అని పిలుస్తూవుంటుంది. వాళ్లమ్మ పిలవడం చూచి వాళ్ల నాన్న కూడా సూరి సూరి అనే పిలుస్తూఉంటాడు.

వాళ్లమ్మ వంట చేసుకొనే టప్పుడూ, నీళ్లకు వెళ్లినప్పుడూ సూరి తన చెల్లెళ్లనిద్దరినీ ఆడిస్తూ ఉంటుంది.

ఆవేళ పేరంటానికని అందరూ ముస్తాబు అవుతున్నారు. ముందుగా సూరి ముస్తాబై అరుగు మీద కూర్చుని పాట పాడుకొంటూ ఉంది.

ఇంతట్లోకే గుమ్మంలో నిలబడి ఒకపిల్ల

"సూరీ సూరీ చుం చెలక
మా ఇంటి కొస్తే మంచెలక
సూరీ సూరీ చుంచెలక
మా ఇంటి కొస్తే మంచెలక"

అని పాడుతూ చేతులు తట్టుతూ నవ్వుతూ సూరిని ఉడికించింది.

ఈ పిల్ల సీతి.

సీతి అసలు పేరు సీతారాముడు. వాళ్ల నాన్నా అమ్మా ముద్దుకోసం సీతి అని పిలుస్తూ ఉంటారు. సీతికి ఆరేళ్ల వయస్సు. తీరైనముఖము. చేరెడేసి కళ్లు. ఎర్రగా ఉంటుంది. కొత్త తెల్లపరికిణీ కట్టుకొని, పువ్వుల చొక్కా తొడుక్కొని, గళ్లరుమాలు చేత్తో పట్టుకొని పేరంటానికి సిద్ధంగా ఉంది.

సీతికి మెళ్ళో చిన్న కంటే, చేతులకు గాజులూ, కాళ్లకు కడియాలూ ఉన్నవి. అందాకా వాళ్లమ్మ కాసులపేరు మెళ్ళో వేసుకొంది.

"సూరీ సూరీ చుంచెలక
మా ఇంటి కొస్తే మంచెలక"

అని సీతి సూరిని చూచి అనడం సూరి విని మూతి ముడిచి, "అమ్మతో చెప్పనా" అంది.

"చెప్పు నాకేం భయమా ఏమిటి ?"

"సరే లే జ్ఞాపకం ఉంచుకో; నిన్ను పేరంటానికి తీసుకొని వెళ్లుతానేమో ఉండు" అంది సూరి.

"నేను అమ్మతోనే వెళతాను" అంది సీతి.

సూరి నవ్వి "నేనుమాత్రం అనలే ననుకున్నావా ఏమిటి" అని,

"సీత పీత
ముంజకాయ మూత
కొడవ లెట్టి కోత
సీత పీత
ముంజకాయ మూత
కొడవ లెట్టి కోత"

అని సీతిని ఉడికించడం మొదలుపెట్టింది. సీతికి ఉడుకుబోత్తనం వచ్చి, "అమ్మా, చూడవే, అక్కయ్యా" అంది.

"నన్నెందు కనాలి ముందు" అంది సూరి.

"నన్నెందుకు పేరంటానికి తీసుకెళ్ల నన్నావు?" అంది సీతి.

"చూశావా, చూశావా అబద్ధాలు. ముందు నేను తీసుకెళ్ల నన్నానా?"

సీతి నవ్వి పారిపోయింది. ఇంతట్లోకే ఇంట్లోంచి మూడేళ్లి చిన్నపిల్ల వచ్చి సూరి వెనక్కాల నిలబడింది. దీనిపేరు వెంకి. అసలుపేరు వెంకటరమణ. వాళ్ల అమ్మా నాన్నా వెంకి అని పిలుస్తారు. అంచేత అందరు వెంకి అని పిలుస్తారు. వెంకి పొట్టిగా ఉంటుంది. ఎర్రగా ఉంటుంది. మెళ్లోచిన్నికంటెపెట్టుకుంది. చేతులికిగాజులూ, కాళ్లకు కడియాలూ ఉన్నవి. ఎర్రపువ్వుల తెల్ల పరికిణీ కట్టుకొంది. పట్టుజుబ్బా తొడుక్కొంది.

బొట్టూ కాటుకా పెట్టుకొని పేరంటానికని గళ్లరుమాలు చేత్తో పట్టుకొని వచ్చింది.

"రావే, వెంకీ, ఇక్కడ కూచో" అని సూరి తన పక్కను వెంకిని కూచోబెట్టుకుంది. వెంకి పరికిణీ మాసిపోకుండా పొందికగా ఎత్తి పట్టుకొని సూరి పక్కని కూర్చుంది.

ఇంతట్లోకే సీతి మళ్లీవచ్చి గుమ్మంలో నిలబడి, వెంకిని చూచి:

"వెంకి డొంకి
ఏడు మూళ్ల దుప్పటి
కప్పుకుంటె చాలదు
కందిపప్పు పచ్చడి
వెంకి డొంకి
ఏడుమూళ్ల దుప్పటి
కప్పుకుంటె చాలదు
కందిపప్పు పచ్చడి."

వెంకికి పాపం ఉడుకోవడం తెలియదు.

"ఎందుకే, గయ్యాళి, దాన్నంటావూ? అమ్మతో చెపుతా నుండు" అంది సూరి.

"చెప్పు, చెప్పు, నాకాళ్లకు బంగారు చెప్పులు కుట్టించు" అంది సీతి.

"అలాగే ఉండు. అమ్మ రానీ" అంది సూరి.

"సూరి సూరి చుంచెలక
మాఇంటి కొస్తె మంచెలక"
అంది సీతి.

"సీత పీత
ముంజకాయ మూత
కొడవ లెట్టి కోత"
అంది సూరి.

"వెంకి డొంకి
ఏడుమూళ్ల దుప్పటి
కప్పుకుంటె చాలదు
కందపప్పు పచ్చడి"
అంది సీతి.

"సీత పీత
ముంజాయ మూత" అంది వెంకి.

ముగ్గురూ కలిసి ఒకళ్ల కంటె ఒకళ్లు గట్టిగా అనడం మొదలుపెట్టారు.

"అన్నా, అన్నా, ఏమిటర్రా ఆ అల్లరి" అంది, లోపలనుంచి వాళ్లమ్మ.

"చూడవే అమ్మా మరి. నేనూ వెంకీ ఇక్కడ కూచుంటే ఈసీతి" అంది సూరి.

"అవునే సీతీ" అంది వాళ్లమ్మ.

"కాదే, అమ్మా. నన్నే ముందస్తిగా అందే సూరి" అని సీతి నవ్వింది.

"సూరీ, నువ్వుకూడా అల్లరి చేస్తున్నావా" అంది వాళ్లమ్మ.

"కాదే అమ్మా. సీతి, అన్నీ అబద్ధాలే. నేను ఇక్కడ కూచుంటేను, తనొచ్చి నన్ను సూరీ సూరీ అందే" అంది సూరి.

"లేదే అమ్మా అన్నీ ఉత్తమాటలే" అంది సీతి.

"మరి వెంకి నెందుకన్నావు" అంది సూరి.

"వెంకి నన్నెందు కంది, మణి" అంది సీతి.

"పాపం. అదంటా, ముందర నువ్వన్నావా. అబద్ధా లాడితే ఆడపిల్లలూ పుడతారు లే" అంది సూరి.

"నీకే అందరూ ఆడపిల్లలు పుడతారు" అంది సీతి.

"ఊరుకోరు గాదూ, వస్తున్నా ఉండండి" అని వాళ్లమ్మ కేకేసింది.

అందరూ ఊరుకొన్నారు. వాళ్లమ్మకూడా ముస్తాబై వచ్చింది. సీతి మెళ్ళో కాసులపేరు తన మెళ్ళో వేసుకొంది.

"అబ్బాయీ, మే మొచ్చిందాకా ఇంటి దగ్గిర ఉంటావు కాదూ" అని వాళ్లమ్మ వాళ్లన్నతో చెప్పి పేరంటానికి బయలు దేరింది.



వాళ్లమ్మ ముందు నడుస్తోంది. ఆవిడ వెనకే సూరి నడుస్తోంది. సూరి కుడిచెయ్యి సీతి పట్టుకుంది. ఎడమ చెయ్యి వెంకి పట్టుకొంది. "ఎత్తుకోనా వెంకీ" అంది వాళ్లమ్మ. "నే నడుత్తా" నంది వెంకి. అందరూ కలిసి అవతల వీథిలో ఇంటికి వెళ్లారు. వాళ్లింట్లో వాళ్లమ్మాయి పుట్టిన రోజు. ఆ అమ్మాయికి రెండోఏడు. తలంటి నీళ్ళోసి పట్టు చొక్కా తొడిగి ముస్తాబు చేసి కుర్చీలో కూచోబెట్టారు. పేరంటాళ్లందరూ వచ్చారు. సూరీ, సీతీ, వెంకీ ఆ అమ్మాయికేసి చూస్తూ నిలబడ్డారు.

ఆ అమ్మాయి తల్లి పేరంటాళ్లందరికీ పసుపూ పారాణీ రాసింది. సూరికీ సీతికీకూడా రాసింది. వెంకికి చిన్నపిల్లని రాయకపోతే సూరితో చెప్పి రాయించుకొంది.

తరవాత ఆ అమ్మాయికి అందరూ కలిసి హారతి ఇచ్చారు. హారతిపళ్లెం సీతి వెంకీ కూడా పట్టుకుంటామని పట్టుకొన్నారు. పేరంటాళ్లు మంగళారతిపాటలు పాడారు. సూరినికూడా పాడమన్నారు గాని సూరి సిగ్గుపడి పాడింది కాదు. తరవాత అందరికీ శనగల వాయనం, తాంబూలం ఇచ్చారు. సీతికీ వెంకికీ కూడా ఇచ్చారు. సీతి శనగలూ, వెంకి శనగలూ సూరి మూటలు కట్టిపెట్టింది. తన శనగలు కూడా మూట కట్టుకొంది. తరవాత వాళ్లందరూ ఇంటికి ప్రయాణమయ్యారు.

"అమ్మా, మన వెంకి కెప్పుడే పుట్టిన రోజు" అంది సీతి.

"శ్రావణమాసం" అంది వాళ్లమ్మ.

"అమ్మా, వాళ్లమ్మాయి మరి మన వెంకిలాగ నడవలే దేమే" అంది సూరి.

"వాళ్లమ్మాయి మన వెంకి కన్న చిన్నది కాదులే" అంది వాళ్ళమ్మ.

"అమ్మా, నన్నెత్తుకోవూ" అంది వెంకి.

"రా, అమ్మా, రా. ఎత్తుకుంటాను రా. ఎంత దూరం నడిచిందో నా చిట్టితల్లి" అంది వాళ్లమ్మ.

"అమ్మా నన్ను కూడా ఎత్తుకోవూ" అంది నవ్వుతూ సీతి.

"నిన్ను కూడా ఎలా ఎత్తుకోనే? ఆ మాత్రం నడవలేవులే" అంది వాళ్లమ్మ.

అందరూ వాళ్లింటికి చేరారు. వాళ్ల నాన్న గారుకూడా అప్పుడే కచేరీ నుంచి ఇంటికి వచ్చారు.

"నాన్న గారికి కాళ్లు కడుక్కోడానికి నీళ్లియ్యవే సూరీ" అంది వాళ్ళమ్మ.

సూరికంటె ముందుగానే సీతి పరుగెత్తుకు వెళ్లి వాళ్ల నాన్న గారికి నీళ్లు తీసుకువచ్చి ఇచ్చింది. వెంకికూడా చిన్ని చెంబుతో వాళ్ల నాన్న గారికి నీళ్లు తెచ్చిపెట్టింది.

"వెంకి మీకు కాళ్లు కడుక్కోవడానికి నీళ్లు తెచ్చింది చూశారా" అంది వాళ్లమ్మ.

వాళ్లనాన్న గారు "నువ్వా తెచ్చావులే వెంకీ" అని వెంకిని ఎత్తుకొని ముద్దెట్టుకొన్నారు.

"నాన్నా, నాన్నా, మేమేం, పేరంటానికి వెళ్ళి శనగలు తెచ్చాం" అంది సూరి.

"మీ అమ్మ అన్నం వండుతుంది గాని నువ్వ శనగలు నేతిలో వేయించి ఉప్పూ కారం చల్ల గలవా" అన్నాడు వాళ్ల నాన్న.

"వేయిస్తా వేయిస్తా" అని సూరి సంతోషాన్ని గంతులేసింది.

"అదెందుకూ? చెయ్యి కాల్చుకొంటుంది. నే వేయిస్తాను లెండి" అంది వాళ్లమ్మ.

"చెయ్యి కాల్చుకోను, నాన్నా, నే వేయిం చొద్దూ" అంది సూరి.

"దాన్ని వేయించనియ్యవే, పాపం" అన్నాడు వాళ్ల నాన్న.

"సరే మీ ఇష్టం" అంది వాళ్లమ్మ.

సీతి వెంకీ పక్కనే కూచున్నారు. సూరి కుంపటి మీద శనగలు వేయించింది. అందరూ అన్నాలు తిన్నాక సూరి వేయించిన శనగలు ఫలారం చేశారు. ఎంత నిద్ర వచ్చినా వెంకి నిద్ర పోకుండా ఆగి శనగలు తిని మరీ నిద్ర పోయింది. సూరీ సీతీ ఒక మంచంమీదే పడుకొన్నారు. కథలు చెప్పుకుంటూ నిద్రపోయారు. వెంకి వాళ్లమ్మ దగ్గిర నిద్దరోయింది.

---

# శ్రీశైలచిత్రములు



౭. పాతాళగంగనుండి మల్లికార్జున దేవాలయమునకు ఎక్కు మార్గము



౮. పాతాళగంగ-తైర్థికుల నీరాటము

ఒకటవ దృశ్యము



౯. పాతాళగంగ-యాత్రికుల నీరాటము
రెండవ దృశ్యము



౧౦. పాతాళగంగ-యాత్రికుల నీరాటము
మూడవ దృశ్యము




## రుబ్బుగుండు

అనంగనంగా ఒకవూరు. ఆవూళ్లో ఒక్కటే బ్రాహ్మణ్ణిల్లు. ఆయింటాయన చాలా మంచివాడు. ఆయన పెండ్లాము చాలా కఠినురాలు. ఊపిరిపోతూన్నా కూడా ఎవరికీ ఇన్ని మంచినీళ్లైనా పోసేది కాదు.

ఒకనాడు ఝామంపొద్దు అయింది. అప్పుడో ముసలాయన ఎక్కణ్ణుంచో ఎక్కడికో పోతూ ఎండెక్కినందువల్ల యింక పోలేక ఆవూళ్లో నిలిచి భోంచేసిపోదామని వాళ్లింటికివచ్చి వాకిటితిన్నెపైన 'ఇశ్శబ్బా' అని కూచున్నాడు. ఇంటాయన వాకిట్లోకివచ్చి ఈ ముసలాయన్ను చూచి మర్యాదచేసి 'అయ్యా, లేచి స్నానం చేయండి. భోంచేదాము' అనిచెప్పి తాను స్నానానికి పోయినాడు

ఇంటామె యీసంగతంతా తలుపు మరుగున నిలుచుకొని వినింది. ఎట్లయినా ముసలాయన్ను అన్నంపెట్టకుండా పంపివేయాలనిచూచింది. ఇంటిముంగిట్లో వుండే రుబ్బురోలుకు రుబ్బుగుండుకు పసుపుపూసి కుంకంబొట్లుపెట్టి అక్షంతలూ పూలూ పెట్టింది. రోట్లో నానబోసిన మినపపప్పుపోసి రుబ్బుతూ ఉన్నది.



'అయ్యా లేచిస్నానంచేయండి. భోంచేదాము'

ఇంతట్లో ముసలాయన స్నానం చేసివచ్చాడు. ఇదంతా చూచాడు. ఏమిటని ఆమెను అడిగాడు. 'అయ్యా, ఏంచెబుదాను! మాయింటాయన ఎప్పుడూ ఏవో మంత్రాలు చెప్పుకుంటూవుంటాడు. ఇట్లా ఎవరయినా

మీవంటివాళ్లువస్తే భోజనానికి నిలవమంటాడు. నన్ను ఇట్లా చేయమంటాడు. తర్వాత తాను



ఏమిటని ఆమెను అడిగాడు.

వచ్చి యీ రుబ్బుగుండును తీసుకొని తలపగల గొట్టావుంటాడు. ఎన్నో ఇట్లా అయినాయి. ఇదేరహస్యం. తాతయ్యా! పెద్దవాడవు. నీపైన నాకు జాలివేస్తూంది' అని ఆమె అన్నది.



మడిసంచి చంకలో పెట్టుకొని పరుగెత్తిపోయినాడు.

ఆమాట వినేటప్పటికి ముసలాయనకు తారు పుట్టింది. భోజనం లేకపోతే పోయింది, బతికి పోతే చాలనుకొని మడిసంచి చంకలో పెట్టుకొని పరిగెత్తిపోయినాడు. ఆమె పిండిరుబ్బుకుంటూ వుణ్ణింది.

కొంతసేపటికి ఇంటాయనవచ్చి 'ముసలాయన ఇంకారాలేదా' అని ఆమె నడిగాడు.

'చాల్లెండి! మహా మంచిబ్రాహ్మణ్ణి సంపాయించారు. నేనేదో ముక్కుబడికోసం పూజచేసి పిండిరుబ్బుకొంటూవుంటే రుబ్బుగుండు నాకిస్తేనే కాని భోజనానికివుండనన్నాడు. నే నివ్వనన్నాను. ఆయనపోయినాడు. ఎవరయినా భోజనం పెడతారుగాని ఇంట్లో వస్తువులు గూడా ఇచ్చేస్తారా' అని ఆమెచెప్పింది.

'అయ్యో వెర్రిదానా, ఆ ముసలాయన ఇంతయెండలో పస్తుపోయి బతుకుతాడా? ఆయనచస్తే ఎంతపాపం! రుబ్బుగుండు ఇచ్చేస్తే ఏంపోయింది!' అని రుబ్బుగుండును తీసుకొని ముసలాయనకిచ్చి భోజనానికి పిలుచుకొద్దామని బయలుదేరి వాకిట్లోకి పరుగెత్తుకొచ్చాడు. దూరాన ముసలాయన కనపడ్డాడు. 'ఇదుగోనయ్యా రుబ్బుగుండూ' అని అరుస్తూ వెంట బయలుదేరాడు. ఈఅరుపును ముసలాయన విన్ని 'ఓయమ్మో తరుముకొస్తున్నాడురా చంపడానికి, పీడశిగతరగా' అని మరింతవడిగా పరి



గెత్తాడు అదిచూచి ఇంటాయన కూడాపరిగెత్తాడు. మునలాయన మరీ పరిగెత్తాడు. ఇంటాయన ఇంకాపరిగెత్తాడు. ఇట్లా ముందు ఆయనా. వెనక ఈయనా ఇంకా పరుగెత్తుతూనేవున్నారు మనం ఇంట్లోనే ఉండిపోదాం.

'మనోహరం'

---

## పిల్లల పాటలు

గోపరాజు రాజన్నగారు

౧

ఉఱుములు మెఱుములు - ఉటాపులీగాలు
గాలీకొయ్యలు - గంధపు చెక్కలు



మేలీమొగ్గలు - మెల్లనిచూపులు
చల్లని సూర్యుడు - చక్కగ కదలెన్.

౨

కాకీకాకీ కలవలకాకి
కాకినిపట్టుకెళ్లి గంగలో ముంచి



గంగా నాకు గంధమిచ్చి
గంధం పట్టుకెళ్లి ఆవుకు రాసి
ఆవు నాకు పాలు యిచ్చి
పాలు పట్టుకెళ్లి అమ్మ కిచ్చి
అమ్మ నాకు జున్ను పెట్టి
జున్ను పట్టుకెళ్లి అయ్యవారికిచ్చి
అయ్యవారు నాకు చదువుచెప్పి
చదువు పట్టుకెళ్లి మామకిచ్చి
మామ నాకు పిల్ల నిచ్చి.



3

ఉడత ఉడత హూత్
ఎక్కడ కెళ్లావు హూత్
సంత కెళ్లాను హూత్
ఏమిటి దెచ్చావు హూత్
కజ్జం దెచ్చాను హూత్
ఎవళ్ల కిచ్చావు హూత్
అమ్మ కిచ్చాను హూత్
ఎక్కడ తన్నింది హూత్
పక్కలో తన్నింది హూత్
ఎక్కడ పడ్డావు హూత్
పొయ్యిలో పడ్డాను హూత్
ఎక్కడ కాలింద హూత్
మీసం కాలింది హూత్.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విశదాక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ మా కొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

---



## బొమ్మ సామానులు

కొ. నరసింహాచారి గారు

అట్టలతో ననేకవిధములగు బొమ్మసామానుల (Toy Furniture)ను చేయవచ్చును. ఇప్పుడిచ్చట చెప్పబడు సామానులను తెల్లటి యట్టతో చేసిన యెడల అందముగా నుండును. తెల్లటియట్ట బ్రౌను అట్టకన్న నునుపుగను, సులభముగా విరుగునది కాకయు నుండును. ఏ యట్టతో చేసినను, సామానులు పూర్తి యయిన వెంటనే మూలలందు ఇతరవిధములగు రంగుకాగితముల నతికించిన యెడల మఱింత యందముగా నుండును. 'టీపాయి' అను చిన్నబల్ల (Tea poy) బీరువ మొదలగు సామానులను చేయువిధము ఈవ్యాసమున చెప్పబడును.

సామానులను చేయుటకు పూర్వము, వాటిని చేయుటకు అనుకూలించు భూమిక (plans) లు, సమచతురముల (Squares) పై నాధారపడి యుండునటుల వ్రాయబడి యున్నవి. ప్రతివస్తువుయొక్క భూమిక (Plan) యు కొన్ని చతురములవలన నేర్పడియున్నది. ఈ చతురములన్ని సమపరిమాణము గలవియై యున్నవి.

### టీపాయి అను బల్ల (Tea poy)

ఇది రెండు అట్టముక్కలతో చేయబడుచున్నది. ఒకటి పైపలకగాను, (చిత్రము 1. కఖగఘ), రెండవది స్తంభముగాను (చిత్రము 2. తథదధ) ఏర్పడుచున్నవి.

### పై పలక

8" × 8" వైశాల్యముగల అట్టను దీసికొని, దాని, నిడివి వెడల్పులను నాలుగు సమభాగములుగా భాగించి ఆభాగములనుండి నిలువుగను, అడ్డముగను రేఖలను వేసినయెడల 2" × 2" వైశాల్యముగల చిన్న సమచతురములు (Squares) పదునాఱేర్పడును. (చిత్రము 1 యందు చుక్కలగీతలతో విభజింపబడిన చతురములను చూడుడు). పిమ్మట క ఖ గ ఘ అను అట్టయొక్క మూలలందు గల నాలుగు చిన్న చతురములందును చ ఛ వలె వ్యాసముల (diagonals) ను వ్రాసి, నల్లనిపూతతో చూప

బడిన భాగములను కత్తిరించి తీసివేయవలెను. పిమ్మట మిగిలెడి యట్ట ఎనిమిదిప్రక్కలు గల దైయుండును. ఇదియే బల్లయొక్క పైభాగ మగును.

పాదము లేక స్తంభము

మఱియొక యట్టను దీసికొని దానిపై 8" × 4" వైశాల్యము గల దీర్ఘచతురము పిమ్మట దధ అను వెడల్పు ప్రక్కయందును అర యంగుళము వెడల్పుగాగల భాగమును గుర్తించవలెను. ఈభాగముననే అతికించుట కుపయోగ మగు తునుకలను (Flaps) కత్తిరించవచ్చును. (చిత్రము 2. అ,అ,అ,అ, అను భాగములను చూడుడు.) ఈఅట్టయందు తమథన అనునది స్తంభముయొక్క యొకప్రక్క యగును.



(Rectangle) ను వేయవలెను. దాని నిడివిని నాలుగు సమభాగములుగను భాగించి రేఖలు వేసినయెడల 2" × 2" వైశాల్యము గల చతురములు 8 వచ్చును. (చిత్రము 2, తథదధ). పిమ్మట థధ అను నిడివిప్రక్కయందును ఇట్టివి నాలుగుప్రక్కలు కలవు. ఈ ప్రక్కలన్నియు ఒకేప్రక్కగా మడువవలసినవి గాన, అట్టయొక్క యొక ముఖముననే మన వంటి గొలుసు గీతల (Chain lines) వెంబడి సగము లోతునకు అట్టను కోయవలెను. అనగా అను

గంట కోయరాదు. క్రిందనుండు నాలుగుఅతుకు ముక్కలును వెనుకప్రక్కకు మడువవలసినవి కాన అట్టయొక్క వెనుకముఖమున (Reverse) అడుగంట కోయవలెను. ఇట్లు కోసి మడిచిన యెడల చిత్రము 3 నందు చూపిన రీతిని స్తంభ మేర్పడవలెను. ప్రక్కలన్నియు లోపైపునకును, అతుకు తునకలన్నియు వెలిప్రక్కకును మడువబడి యున్నవి. పిమ్మట స్తంభమును, చిత్రము 1 యందుగల పలకపై ట ఠ డ ఢ అను మధ్య చతురముపై నుంచి అతుకుతునుకల మూలమున రెంటిని అతికించవలెను. అప్పుడు చిత్రము 4 నందు చూపబడినరీతి బల్ల పూర్తి యగును.

## బీరువ

12″ × 12″ వైశాల్యముగల అట్టను దీసికొని దానిపై చిత్రము 5 నందువలె 36 చతురములను వేయవలెను. ఒక్కొక్కప్రక్కను ఆఱుభాగములు చేసి గీతలు వేసినయెడల ఈ చదరము లేర్పడును. ఇందు నల్లని పూత (Shaded) పూసిన భాగములను కత్తిరించి తీసి వేయవలెను. ఇ ఈ ఉ ఊ పై భాగమును, ౠ ౡ ఎ ఏ అడుగుభాగమును అగును. వాటి కిరుప్రక్కలను అ, అ, అను అతుకు తునుక లుండవలెను. ఉ ఊ ౠ ౡ అనునది వెనుక ప్రక్క లేక వీపు అగును. దీనియందు 8 చదరములు కలవు. తక్కిన భాగములందు చిత్రమున జూపిన రీతిని ప్రక్కతలుపు వీటెసి గుర్తించి వీటెసి వేరుపఱచు గొలుసురేఖలవెంబడి నగము లోతునకు గోయవలెను. గొలుసు రేఖలుండెడి తక్కిన భాగములనుగూడ నగము లోతునకే కోయవలెను. పిమ్మట చిత్రము 7 నందు జూపబడిన రీతిని బీరువకు పీటయును, చిత్రము 8 నందు జూపబడినరీతిని శిరము (top) ను చేయవలెను. పీటకును, శిరమునకును గల చతురములు, కొంచెము పెద్దవిగా నున్న యెడల నవి బీరువయొక్క పైభాగము క్రింది భాగములకన్న కొంత విశాలములై యుండును. చిత్రము 5 నందలి ప్రతి చిన్నచదరమును 2″ × 2″ అయినయెడల చిత్రము 7,8 లందు గల చిన్న చదరములు 2⅛″ × 2⅛″ అయి యుండవలెను. పీటయొక్క ప్రక్కలను వంచి అతుకు తునుకల సహాయమున నతికించిన యెడల నొకతొట్టిగా నేర్పడును. దానిని బోరగిలవేసి దానిపై బీరువను నిలువబెట్టవలెను. శిరముయొక్క ప్రక్కలను పైకివంచి మూలలందు ప్రత్యేకముగా కాగితపుముక్కలతో నతికించి చిత్రము 9 యందు జూపినరీతిని బీరువ పైభాగమునందు అమర్చినయెడల బీరువ పూర్తి యగును

## అలమారు

చిత్రము 5 నందు గల చిన్నచదరములు (ఒక్కొక్కటి 2″ × 2″) రెండుగల అట్టముక్కలను మూటిని కత్తిరించవలెను. వాటికి రెండు కొనలయందును అతుకు తునుకలను మఱువ కూడదు. ఈమూడు అట్టలను బీరువయందు మూడు అలమారులుగా నమర్చి యతికించవలెను.

## గగనభరద్వాజము

సెట్టి లక్ష్మీనరసింహముగారు (కవితానమితి)

(Wordsworth's "To the Skylark".)

స్వర్గగాయకా, గగనసంచారి, నీవు
ధరను నిరసింతువే, దుఃఖభరిత మగుట?
లేక, నిను నీదు ఱెక్కలు పైకిఁ బఱప,
మానసంబును దృష్టియు మంచు పడిన
నేలమీఁది నీ గూఁటిపై నిలిచియున్నె?
కదలుచున్నట్టి ఱెక్కలు కుదురుపఱిచి,
పాట చాలించి, నీ వల గూఁటియందుఁ
బడుచునుందువు గద కోర్కి పొడమినపుడు!
తెగువ గల యోయి గాయకా, యెగురుము కను
మేర కొనకెగా, కింకను మీఁది కెగురు!
ప్రీతిజనిత మైనట్టి నీ గీతరవము
నీదు ప్రేమాస్పదులకును నీకు నడుమఁ

దెగని బంధమై, భువికిని మిగుల రక్తిఁ
గూర్చు; నట్లయ్యుఁ జిగురుటాకుల నొసఁగు వ-
సంతు తోడ్పాటు లేకుండ స్వయముగాన
పాడుచుందువు, నీ దెంతభాగ్యము కద!
వదలుము పికాదులకు గుజ్జు వనుల మఱుఁగు;
మహితదివ్యప్రకాశంబె మఱుఁగు నీకు!
అచటినుండి యంతకు మించినట్టి దివ్య-
మైన మధురస్వరప్రవాహమును గ్రుమ్మ-
రించుచుందువు నీవు ధరిత్రిమీఁద;
జ్ఞాని పగిదిఁ బై కెగురులే కాని, ప్రక్క-
ప్రక్కలకుఁ బోవు; స్వర్గప్రపంచములను
నిక్కమగు ప్రేమఁ జూతు వీ వొక్కరీతి!

---

## "ఈవు చింతామణివి గదే పూవుఁబోణి!"

పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

పాలఁతి! నీనెమ్మోముపూర్ణచంద్రోదయ
మ్మతివ! నీ మోవి సుధాకరమ్మ
రమణి! నీ చూపులు రామబాణమ్ములు
భామామణిరో! శశిప్రభయె నగవు
క్రొవ్వెద మాలతీకుసుమాకరమ్మ నీ
కురులనంపద కాలకూట మబల!
కలికి! నీ గళము శంఖద్రావకమ్మ కిం
నరకంఠ ముఖిద! నీ సారముసాబగు
ముదిత! కామేశ్వర మోదకమ్ములు కుచ
మ్ములు. నాసిక వసంతతిలకము చెలి!

నూఁగారుపస చూడ నాగేశ్వరమ్ము నె
న్నడు మెన్న గగనసుందరము తరుణి!
వనిత! నీమైచాయ కనకసుందరము కా
మాగ్నిసందీపన మ్మగు విరహము
లలన! నీ పాదముల్ లక్ష్మీవిలాస మా
నందోదయమ్ము నీ,యంద మపుర!
ఔషధమ్ములపేటికయనువు గాఁగ
నిన్ను ధన్వంతరి సృజించె నిన్ని యేల?
అతనుతాపపరీతాత్ము లైనవారి
కీవు చింతామణివి గదే పూవుఁబోణి

---



రాధా కృష్ణులు

చిత్రకారుడు: శ్రీ అమ్యకోనుగారు.

# ఫెడరల్ విధానము
(FEDERAL CONSTITUTION)

మామిడిపూడి వెంకటరంగయ్యగారు, యం. ఏ.

మన దేశమందలి ప్రస్తుతపు రాజకీయ పరిస్థితుల గమనించుచుండువా రందరు "ఫెడరల్" విధానమన నేమియో తెలిసికొనుట కుత్సాహపడుచున్నారు. దీనికి కారణము లేక పోలేదు. మహాత్ముని నాయకత్వమున కాంగ్రెసువారు ప్రారంభించి నడుపుచుండు ఉద్యమము స్వరాజ్యసంస్థాపనమునకని అందరు ఎరిగి యున్నారు. కాంగ్రెసుతో నేకీభవించనివారు కూడ "డుమినియన్" విధానమునైన మన దేశమందు నెలకొల్పవలయునని చెప్పుచుండిరి. రౌండుటేబిల్ సభకు ఇచటనుండి వెళ్లిన ప్రతినిధులందరు "డుమినియన్" విధానమును ఏకగ్రీవముగ కోరుటయేగాక అందుకై పాటుబడుట తమ విధి యని గొంతెత్తిపలుకుచుండిరి. ఇట్టి సందర్భములో "స్వరాజ్య" విధానము, "డుమినియన్" విధానము మొదలగువాటిని గురించి ప్రశంసింపక, "ఫెడరల్" విధాన మను నొక నూతనవిషయమును గురించి రౌండుటేబిల్ సభ వా రాలోచింపబూనుకొనుటయు, అందుకై వారొక ప్రణాళికను తయారు చేయుచుండుటయు అనేకులకు వింతగను దుర్గ్రాహ్యము గను ఉన్నది. "డుమినియన్" విధానమునకును "ఫెడరల్" విధానమునకును సంబంధ మేమైన కలదా, ఏకారణముచేత "ఫెడరల్" విధానమున కిప్పు డింతటి ప్రాముఖ్యము కలిగినది అని చాలమంది ఆలోచించుచున్నారు. "డుమినియన్" విధానము నేర్పరచుటకై వెళ్లినప్రతినిధులు దానికై పాటుపడక "ఫెడరల్" విధానమను నేదియో ఒక క్రొత్త పరిపాలన క్రమమును తెచ్చిపెట్టి దానిమూలముగ మరికొన్ని చిక్కులేమైన కల్పింతురేమో యని భయపడువారుకూడ కొందరు కలరు. కావున "ఫెడరల్" విధానముయొక్క ముఖ్యలక్షణము లేవియో తెలిసికొనుట దేశక్షేమమును కోరువారందరి కీ అత్యావశ్యకము.

## "డుమినియన్" విధానము

"డుమినియన్" విధానమునకును "ఫెడరల్" విధానమునకును ఉద్దేశమందు భేద మున్నది. ఇంగ్లండు దేశమునకును, మన దేశమునకును ఉండవలసిన సంబంధమును నిర్ణయించుటయే "డుమినియన్" విధానముయొక్క యుద్దేశము. అట్లుగాక మన దేశమందలి "కేంద్ర" ప్రభుత్వమునకును (Central Government) రాష్ట్ర ప్రభుత్వములకును (Provincial Governments) ఉండవలసిన సంబంధమును నిర్ణయించుట "ఫెడరల్" విధానముయొక్క ముఖ్యోద్దేశము. ఇప్పుడు ఇంగ్లీషువారు మన దేశముపై సర్వ స్వాతంత్ర్యము కలిగి యున్నారు. మన దేశపు ప్రభుత్వము

వారి చేత జరుపబడుచున్నది. ఆంగ్లేయ స్వామ్రాజ్యములో చేరిన మరికొన్ని దేశముల స్థితి ఇట్టిది కాదు. కనడా, న్యూఫౌండ్లాండు, ఆస్ట్రేలియా, న్యూజీలండు, దక్షిణఆఫ్రికాలు ఈ సామ్రాజ్యములోనివే; కాని, చాలవరకు ఈ దేశములను వానిలోని ప్రజలే పాలించుకొనుచున్నారు. ఐర్లెండుకూడ ఇట్టి స్థితియందే ఉన్నది. పేరునకు సామ్రాజ్యమందున్నను నిజముగ తమతమ వ్యవహారములను తామే చక్కబెట్టుకొను హక్కును ఈ దేశముల వారనుభవించుచున్నారు. ఈ అర్థము స్ఫురించుటకై ఈ దేశములకు "డుమినియన్" లను పేరు వాడుకలోనికి వచ్చియున్నది. డుమినియన్ విధానమనగా కనడా మొదలగు దేశములు ఆంగ్లేయ సామ్రాజ్యమం దెట్టి స్థితియందున్నవో, వాటికిని ఇంగ్లండునకును ఎట్టి సంబంధమున్నదో తెలుపు విధానము. ఆవిధానము గల ఈ దేశములన్నియు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచుండకపోయినను చాలమట్టుకు స్వాతంత్ర్యమును కలిగియున్నవి. అట్టి స్వాతంత్ర్యము మన దేశమునకుండవలెననియు, ఇప్పటి ఆంగ్లేయ సర్కారు శాధికారము పోవలెననియు చెప్పుట "డుమినియన్" విధానమును కోరుటయే.

## ఫెడరల్ విధానము

ఫెడరల్ విధానమున చర్చనీయ మగు విషయ మిది కాదు. ఇంగ్లండునకును మన దేశమునకును ఉండవలసిన సంబంధమును నిర్ణయించుట దానియొక్క ఉద్దేశము కాదు. మన దేశములోని కేంద్ర ప్రభుత్వమునకును రాష్ట్ర ప్రభుత్వములకును ఉండవలసిన సంబంధములను నిర్ణయించుటయే దానియొక్క ఉద్దేశము. ఇది దేశముయొక్క అంతరంగిక వ్యవహారములకు సంబంధించినది. డుమినియన్ విధానము దేశముయొక్క బాహ్యావ్యవహారములకు సంబంధించినది.

## ప్రస్తుతపు విధానము

రాజకీయముగ మన దేశమిప్పుడు రెండు భాగములుగ విభజింపబడియున్న దనుమాట అందరు ఎరిగినదే. ఒకభాగము ఇంగ్లీషువారి సొంతపరిపాలనక్రింద ఉన్నది. దానినే బ్రిటిషు ఇండియా అని వ్యవహరించుచుందురు. రెండవ భాగము సంస్థానాధీశుల అధీనమందున్నది. బ్రిటిష్ఇండియాను పరిపాలన సౌకర్యమునకై (1) మద్రాసు (2) బొంబాయి (3) పంజాబు (4) సంయుక్తరాష్ట్రములు (5) బీహారు - ఒరిస్సా (6) బంగాళము (7) ఆసాం (8) మధ్యరాష్ట్రములు అని ఎనిమిది గొప్ప రాష్ట్రములుగ విభజించియున్నారు. వీటిలో ఒక్కొక రాష్ట్రముపై ఒక ప్రభుత్వమున్నది; ఆ ప్రభుత్వమందు "గవర్నరు" ముఖ్యస్థానమును వహించి యున్నాడు ఈ ప్రభుత్వములకు "రాష్ట్రప్రభుత్వము" లనిపేరు. ఇవిగాక దేశమంతటిపై మరియొక ప్రభుత్వమున్నది. అందు వైస్రాయ్ - గవర్నరు జనరలు ముఖ్యస్థానమును వహించియున్నాడు. దీనికే కేంద్ర

(Central) ప్రభుత్వమని పేరు. బ్రిటిషు ఇండియాలోని ప్రతి మనుష్యుడును ఈ రెండు ప్రభుత్వములకు లోబడి యున్నాడు. దేశములోని ప్రభుత్వమును (1) కేంద్రప్రభుత్వము (Central Government) (2) రాష్ట్రప్రభుత్వములు (Provincial Governments) అని విభజించు ఆచారము అన్ని దేశములయందు కనబడుచున్నది. ఇందులో విశేషమేమియు లేదు.

కేంద్రప్రభుత్వముగాని రాష్ట్రప్రభుత్వముగాని చేయుపని ఎట్టిదో అందరికి తెలిసియున్నది. ఏవియో కొన్ని విషయముల గురించి చట్టములను చేయుట, ఆ చట్టములను అమలులోనుంచుట—ఇదియే ప్రతిప్రభుత్వము యొక్క కార్యము. రెండువిధములగు ప్రభుత్వములు దేశమందున్నప్పుడు ఏ ప్రభుత్వమువారు ఎట్టివిషయముల గురించి చట్టముచేయవచ్చునో నిర్ణయించుట అత్యావశ్యకము. అట్టి నిర్ధారణ లేనియెడల ఒకేవిషయమును గురించి కేంద్రప్రభుత్వమువారొకచట్టమును నిర్మించుటయు రాష్ట్రప్రభుత్వమువారు దానికి భిన్నముగ మరియొక చట్టమును నిర్మించుటయును, ఈ రెంటికిని పరస్పర విరోధముండుటయును, అందుచే ప్రజలకు ఇబ్బందులు కలుగుటయు సంభవించును. ఎవరెవరు ఏయేపనుల చేయవలెనో తీర్మానించుట చాల అవసరము. అందుచేతనే మన దేశములో ఇప్పుడు అట్టి విభజనయున్నది. దేశరక్షణ, సైన్యము, నౌకాదళము, ఆకాశవిమానములు, విదేశవ్యవహారములు, ఇనుపదారులు, పోస్టు, టెలిగ్రాఫ్ వ్యాపారములు, వ్యాపారపు సుంకములు, బ్యాంకీలు, చెలామణి (Currency) లోనగు విషయముల గురించి కేంద్రప్రభుత్వమువారు మాత్రమే చట్టముల చేయవచ్చును. వీటిపై రాష్ట్రప్రభుత్వమువారి కెట్టి అధికారములేదు. మునిసిపాలిటీలు, లోకల్ బోర్డ్లు, ఆసుపత్రులు, విద్య, వ్యవసాయము, సహకారము, త్రాగుడు, భూమిపన్ను, రిజస్ట్రేషన్, పోలీసు, సామాన్యపు కోర్టులు—లోనగు విషయముల గురించి మాత్రము రాష్ట్రప్రభుత్వములవారు శాసనముల గావింపవచ్చును. ఈ విధముగా రాజకీయ విషయము లన్నిటిని (1) కేంద్రవిషయములనియు (2) రాష్ట్రవిషయములనియు విభజించియున్నారు. రాష్ట్రప్రభుత్వముల వారు తమకై నిర్ణయింపబడిన విషయములందు మాత్రము జోక్యముకలిగి యుందురు. తక్కిన విషయము లన్నియు కేంద్రప్రభుత్వమువారి అధీనమందున్నవి.

కాని ఈవిభజనయందు మరియొక సూక్ష్మమున్నది. ఈవిభజనను చేయువారు కేంద్రప్రభుత్వమువారు. అందుచేత వారేదైన మార్పు చేయగోరినయెడల, అట్టిమార్పు చేయకూడదని రాష్ట్రప్రభుత్వమువారు వారిని అడ్డుపెట్టుటకు వీలులేదు. ప్రస్తుతమున "విద్య" రాష్ట్రవిషయములలో చేర్చబడి యున్నది. కాని కేంద్రప్రభుత్వమువారు దానిని అట్టి విషయములందుండి తీసి తమ అధీనమందే

ఉంచుకొనవచ్చును. ఇదిగాక, రాష్ట్రవిషయములలో చేర్చబడిన వాటినిగురించి శాసనములను చేయు అధికారము కేంద్రప్రభుత్వమువారికి లేకపోలేదు. కార్యసౌకర్యమునకై వారాపనులను రాష్ట్రప్రభుత్వములకు వదలియున్నారే గాని వారికా విషయములపై అధికారము లేకపోవుటచేత కాదు. రాష్ట్రప్రభుత్వములకు మాత్రము కేంద్రవిషయములలో ఎట్టి హక్కును, అధికారమును లేవు. మరియొక విశేషముకూడ ఈ సందర్భమున గమనింపవలెను. తమకై నిర్ణయింపబడిన విషయముల గురించి చట్టములను చేయవలసివచ్చినపుడు కూడ రాష్ట్రప్రభుత్వములవారు కేంద్రప్రభుత్వమువారి అంగీకారమును పొందవలసియున్నది. భూమిశిస్తు విషయము రాష్ట్రప్రభుత్వములకు చెందియున్నను మద్రాసు ప్రభుత్వమువారు దానినిగురించి ఏదైన చట్టము చేయగోరినయెడల వారు మొట్టమొదట గవర్నరు జనరలుయొక్క అంగీకారమును పొందవలసియున్నది. కావున రాష్ట్రప్రభుత్వములవారు చేయవలసిన పనులను నిర్ణయించుటకును, చేయదలచుకొను పనుల యుక్తాయుక్తములను నిర్ణయించుటకును కేంద్రప్రభుత్వమునకు సర్వాధికారము కలదు. అనగా ప్రస్తుతము మనదేశములోని కేంద్రప్రభుత్వమునకును రాష్ట్రప్రభుత్వమునకునుగల సంబంధము యజమానునికిని నౌకరుకునుగల సంబంధమువంటిది. రాష్ట్రప్రభుత్వములకు స్వాతంత్ర్యములేదు. అవి కేంద్రప్రభుత్వమునకు లోబడి పనిచేయుచున్నవి. పేరునకు రెండుప్రభుత్వములున్నను సర్వాధికారము గల ప్రభుత్వము కేంద్రమందున్నదియే. కావున దీనిని "ఏకైక" (Unitary) ప్రభుత్వవిధానమని చెప్పవచ్చును.

### ఫెడరల్ విధానముయొక్క లక్షణములు

ఇట్టి "ఏకైక" (Unitary) ప్రభుత్వమును మార్చి, "ఫెడరల్" లేక "ద్వంద్వ" ప్రభుత్వమును స్థాపించుటకిప్పుడు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈప్రయత్నములు సఫలములైనయెడల రాష్ట్రప్రభుత్వములకును కేంద్రప్రభుత్వమునకును గల సంబంధము మారిపోవును. ఈ మార్పుయొక్క స్వరూపమును, దానివలన రాగల మరికొన్ని మార్పులును మనము తెలిసికొనవలెను.

(1) ఇప్పటివలెనే ఫెడరల్ విధానమందు కూడ రాజకీయవిషయములు రాష్ట్రవిషయములనియు కేంద్రవిషయము లనియు విభజింపబడును. కాని ఈవిభజనను చేయువారు కేంద్రప్రభుత్వమువారు కారు. పార్లమెంటువారు చేయుచట్టమునందే ఈవిభజన నిర్ధారణ చేయబడును. ఒకపర్యాయము నిర్ణయింపబడిన విభజనను మార్చుటకు పార్లమెంటుకేగాని కేంద్రప్రభుత్వమున కధికారముండదు. రాష్ట్రవిషయములందు రాష్ట్రప్రభుత్వములు కేంద్రప్రభుత్వమునకు లోబడక సర్వస్వతంత్రము కలవైయుండును. పార్లమెంటువారు చేసిన చట్టమొక్కటియే రాష్ట్రప్రభుత్వములవారిపై అధికారము కలదియగును. కేంద్ర

ప్రభుత్వపు అంగీకారమును పొంది రాష్ట్రవిషయములను గురించి చట్టములచేయు ఆవశ్యకత రాష్ట్రప్రభుత్వముల కుండదు. కావున ఫెడరల్ విధానములో ప్రతిరాష్ట్రప్రభుత్వము కొన్ని (అనగా రాష్ట్ర) విషయములందు స్వతంత్రముకలదియగును. రాష్ట్రవిషయములగు భూమిశిస్తు, కోర్టులు, పోలీసు, మొదలగువాటిని గురించి వా రెట్టిచట్టములు చేసినను కేంద్రప్రభుత్వమువారు "ఏల అట్లు చేసితిరి" అని అడుగుటకుగాని, ఆచట్టములను రద్దుచేయుటకు గాని వీలుండదు.

(2) దీనిని బట్టి బ్రిటిషుఇండియాలోని ప్రజల స్థితియందుకూడ ఒకమార్పు కలుగును. ప్రస్తుతము మనదేశమున కేంద్రప్రభుత్వమొక్కటియే స్వతంత్రప్రభుత్వము. రాష్ట్రప్రభుత్వములు దానిననుసరించినడుచు నౌకర్లు. కావున నిజముగ మనమెల్లరము ఒకస్వతంత్రప్రభుత్వమునకే లోబడియున్నాము. ఫెడరల్ విధానమందు మనపై రెండు స్వతంత్రప్రభుత్వము లేర్పడును. కొన్ని విషయములందు మనము రాష్ట్రప్రభుత్వమునకును కొన్నిటియందు కేంద్రప్రభుత్వమునకును లోబడవలసినవార మగుదుము.

(3) ప్రస్తుతము కేంద్ర ప్రభుత్వమువారేదైన ఒకవిషయము గురించి చట్టముచేసినయెడల ఆ విషయము రాష్ట్రప్రభుత్వమునకు సంబంధించినదను అనుమానము కలవారు అట్టిచట్టము క్రమమైనది కాదనియు, దానిని చేయుటకు కేంద్రప్రభుత్వమువారి కధికారము లేదనియు వాదించుటకు వీలులేదు. కేంద్రప్రభుత్వమువారు చేయు చట్టము లన్నియు క్రమమైనవనియే మనమనుకొనవలసియున్నది. వాటి నన్నిటిని మన మనుసరించి నడుచుకొనవలెను. ఫెడరల్ విధానమున ఇదంతయు మారును. రాష్ట్ర విషయములను గురించి కేంద్రప్రభుత్వమువా రేదైన చట్టము గావించిరని మనకు తోచినపుడు అది క్రమమైనచట్టము కాదని మనము దానిని ఉల్లంఘించవచ్చును. అట్లే రాష్ట్రప్రభుత్వము కేంద్రవిషయమును గురించి ఏదైన చట్టమును గావించినపుడు అది అక్రమమని మనము దాని నుల్లంఘింపవచ్చును. దేశమందు స్వతంత్రప్రభుత్వములు రెండు ఉండుటవలన ఇట్టి సంశయములకును విమర్శనలకును అవకాశ మేర్పడును.

(4) కేంద్రప్రభుత్వము వారుగాని, రాష్ట్రప్రభుత్వము వారుగాని చేసినచట్టములు అక్రమములని ఎవరికైన తోచినపుడు అంతమాత్రముచే వాటిని ఉల్లంఘించుటయా? అవి నిజముగ అక్రమమైనవా? అని నిర్ణయించు అధికార మెవరికైన నుండవలదా? అను సంశయము కొందరికి కలుగవచ్చును. ఈకారణముచేతనే ఫెడరల్ విధానమున మన దేశమందు ఉన్నతన్యాయస్థాన మొకటి ఏర్పడవలసియుండును. ప్రభుత్వములవారు చేయు చట్టములు సక్రమములా అక్రమములా అనువాదమును పరిష్కరించుటయే ఈ న్యాయస్థా

నము యొక్క ముఖ్యధర్మమగును. ప్రస్తుత కాలమున అట్టి న్యాయస్థానము మన దేశమందు లేదు. ఏకైకవిధానమందు (Unitary state) అట్టిదానికి అవకాశము కూడ లేదు.

గనుక (1) రాష్ట్రవిషయములు ఫలానవనియు కేంద్రవిషయములు ఫలానవనియు విస్పష్టముగ విభజింపబడుట, (2) రాష్ట్రవిషయములందు కేంద్రప్రభుత్వమున కింతమాత్రము లోబడక రాష్ట్రప్రభుత్వములు పరిపూర్ణస్వాతంత్ర్యము కలిగియుండుట, (3) చట్టములు క్రమములైనవా కావా యను వివాదము సంభవించినపుడు అట్టి వివాదమును పరిష్కరించుటకు ఉన్నత న్యాయస్థానమొకటి యుండుట—ఈమూడును ఫెడరల్ విధానమునకు ముఖ్యలక్షణములని స్పష్టమగుచున్నది.

ఫెడరల్ విధానమును వరించుటకు
కారణములు

తీవ్రమగు రాజకీయాందోళన మనేకసంవత్సరములనుండి మన దేశమున జరుగుచుండినను, ఇంతవరకు విశేషముగ చర్చింపబడని ఈ ఫెడరల్ విధానము ఇప్పుడింతటి ప్రాముఖ్యమును వహించుటకు కారణములెవ్వి? ఇందువలన కలుగు ప్రయోజనమెద్ది? అని కొందర డుగవచ్చును. వారికి సమాధానము చెప్పవలసి యున్నది.

(1) మనమిప్పుడు కోరుచుండునది స్వరాజ్యము. స్వరాజ్యమనగా ప్రజలకు లోబడిన రాజ్యము. అందు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులు దేశమును పాలింతురు. రాష్ట్రప్రభుత్వమున గవర్నరును, కేంద్రప్రభుత్వమున గవర్నరు జనరలును ఇంగ్లండునుండి వచ్చినను నిజమైన అధికారము వారిచేతనుండక, వారి మంత్రులయందుండును. ఈమంత్రులెల్లరు ప్రజాప్రతినిధులై యుందురు. అనగా పరిపాలనాధికారమంతయు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులయందుండును. స్వరాజ్యముయొక్క ప్రధానలక్షణ మిదియే.

కాని ఇట్టి పరిపూర్ణస్వరాజ్యమున కింకను మనమర్హులము కామనియు, సమర్థులగు ప్రతినిధుల నెన్నుకొనుటకు వలయు తెలివితేటలు సామాన్యప్రజలకు లేవనియు, పక్షపాతబుద్ధిలేక శక్తిసామర్థ్యములతో దేశమునంతను పాలించగల ప్రతినిధులు ప్రస్తుతము దేశమందు లేరనియు కొందరి అభిప్రాయము పరిపాలనభారమునంతను భరింపగల మనువారికిని, ఎంతమాత్రము ప్రజాప్రతినిధులు దానిని భరింపజాలరని వాదించువారికిని సామరస్యము కుదురుట ఎట్లు? ఈ రెండుపక్షములవారికి కొంత రాజీకుదిరిన కాని దేశములోని రాజకీయాందోళనమును దానివలన కలుగుచుండు కష్టనష్టములును తొలగజాలవు. ఫెడరల్ విధానమువలన అట్టి రాజీకుదురునని కొందరి అభిప్రాయము. దీనిమూలమున ప్రజలయందు కొంత శాంతి కలుగ వచ్చునని వీరి నమ్మకము.

స్వరాజ్యము కావలయునను వారిని ఫెడరల్ విధాన మెట్లు తృప్తి పరుపగలదు? అను

సంశయము కొందరికి కలుగవచ్చును. తృప్తి పరుపగలదని అనుకొనువారందరు ఈ క్రింది విధముగ వాదించుచున్నారు. దేశమునంతను పాలించుట సామాన్యమైనది కాదు. దేశసంరక్షణ, సైన్యముల నేర్పరచుట, విదేశములతో నేర్పరుపై వ్యవహారముల గావించుట, మొదలగు కేంద్రవిషయములను చక్కగ నిర్వహించుటకు తగిన సమర్థులు దేశమునందు లేరు. ఈ పనులనుచేయుట కింతో అనుభవము కావలెను. కావున కేంద్రవిషయములందు ప్రజాప్రభుత్వ మిప్పటిస్థితిలో అననుయోగ్యము. అచట నిరంకుశాధికార ముండవలసినదే. కాని రాష్ట్రవిషయము లట్లు కావు; అవి అంత క్లిష్టములు కావు. ఆ విషయములను సమర్థించుకొనుటలో ఏమైన కొన్ని పొరపాట్లు జరిగినను దానిమూలమున విశేషమగు ముప్పు రాజాలదు; కొంత ఉపద్రవము కలిగినను చక్కబెట్టుకొనుటకు వీలుండును. కావున రాష్ట్రప్రభుత్వములను కేంద్రప్రభుత్వమునుండి చాలవరకు వేరుచేసి, ప్రతి రాష్ట్రమునకును స్వతంత్రప్రభుత్వమును కల్పించినయెడల ప్రజాపరిపాలన ముండవలయునని వాదించువారి ఆశయములు కొంతవరకైన నెరవేరగలవు. ప్రతిరాష్ట్రమందును ప్రజాప్రతినిధులతో గూడిన స్వతంత్రప్రభుత్వములను స్థాపింపవచ్చును. వీటిని నడుపుటయందు ప్రజలు తమ తెలివితేటలను చూపినయెడల కాలక్రమమున కేంద్రప్రభుత్వమును కూడ ప్రజల అధీనము చేయవచ్చును.

ఫెడరల్ విధాన ముండినగాని రాష్ట్రములకుస్వాతంత్ర్య ముండజాలదు. రాష్ట్రవిషయములందైనను స్వరాజ్యమును స్థాపించినగాని దేశమందు శాంతి నెలకొనజాలదు. ఇప్పటివలె "ఏకైక" (Unitary) విధానమునందే రాష్ట్రములలో స్వరాజ్యమును స్థాపింపకూడదా యనిన అట్లుచేయుటకు వీలులేదనియే చెప్పవలసియున్నది. ప్రజాప్రతినిధులతో గూడిన రాష్ట్రప్రభుత్వమును నిరంకుశాధికారము గల కేంద్రప్రభుత్వమునకు లోబడునట్లు చేసినయెడల ఈ రెండు ప్రభుత్వములకు నెల్లప్పుడు కలహములు కలుగుచుండును. వానియొక్క దృక్పథము వేరువేరగుటయే దీనికి కారణము. ప్రజాప్రతినిధులు గల రాష్ట్రప్రభుత్వములు నిరంకుశాధికారి యగు కేంద్రప్రభుత్వమున కెన్నడు లోబడజాలవు. లోబడునట్లు చేయజూచుట అసాధ్యకార్యమును తలపెట్టుటయే కావున ప్రజాస్వామికమగు రాష్ట్రప్రభుత్వములను కేంద్రప్రభుత్వముతో సంబంధము లేకుండ స్వతంత్రాధికారము కల వానినిగ మార్చుటయే మంచిది. ఇదియేకదా ఫెడరల్ విధానము.

రాష్ట్రములందే కాక కేంద్రమందు కూడ ప్రజాప్రభుత్వమును నిర్వహించుటకు మనదేశములోని వారికి సామర్థ్య మున్నదను విశ్వాసము గలవారు పై వాదము నంగీకరింపక పోవచ్చును. అట్టి విశ్వాసము లేని వారు మనలో అనేకు లున్నారు. ఆంగ్లేయు లెవ్వరికి కూడ అట్టివిశ్వాసము లేదు. కావున వారంద

రికి ఫెడరల్ విధానము శరణ్యమైనది. దాని మూలమున "సోపాన" వాదము (Theory of Gradual Stages) గెలుచుచున్నది. మొదట రాష్ట్రప్రభుత్వమందు స్వరాజ్యసంపాదనము; తర్వాత కేంద్రప్రభుత్వమందట్టి సంపాదనము. ఈ రెండును పూర్తిగ లభించువరకు ఫెడరల్ విధానముండి తీరవలెను.

(2) ఫెడరల్ విధానము ఇప్పుడింతటి ప్రాముఖ్యమును గాంచుటకు మరియొక గొప్ప కారణమున్నది. ఈవిధానము మూలమున స్వదేశసంస్థానములకును బ్రిటిషుఇండియాకును గల సంబంధము బలపడుననియు, భరతఖండమునకంతకు కాలక్రమమున ఒకేప్రభుత్వము స్థాపింపబడుటకు వీలగుననియు కొందరి అభిప్రాయము. కావున స్వదేశసంస్థానాధీశులు, వారికిని ఆంగ్లేయ పాలనకు లోబడిన మనకును గల సంబంధమును బలపరచనెంచు వారందరు ఫెడరల్ విధానమును వరించుట సంభవించినది.

మైసూరు, హైదరాబాదు, బరోడా మొదలగు సంస్థానములు మద్రాసు బొంబాయి మొదలగు రాష్ట్రములవలె మన మాతృదేశమగు భరతఖండమందలి భాగములే. అయినప్పటికిని రాజకీయవిషయములందు సంస్థానాధీశులును ఆంగ్లేయరాష్ట్రములలోని వారును ఒకచోట కలసి తమ కష్టసుఖములను గురించి ఆలోచించుకొనుటకవకాశ మిప్పుడు లేదు. మనము కోరునది రాష్ట్రములయొక్క శ్రేయస్సుమాత్రమే కాదు. భరతఖండమంతటియొక్క శ్రేయస్సును కోరుచున్నాము. అట్లే స్వదేశసంస్థానములలోని వారుకూడ దేశమంతటియొక్క యోగక్షేమములను కోరవలసియున్నది. ఆంగ్లేయరాష్ట్రములయొక్క ఐశ్వర్యమే మన ఆదర్శమైనయెడల సంస్థానములతోటి సంబంధము మన కక్కర లేకపోయియుండును. సంస్థానములయొక్క మేలును మాత్రమే వారు కోరువారైనయెడల రాష్ట్రములలోనివారితో వారికి సంబంధ మక్కరలేకపోవును. ఇప్పటివరకు వారును మనమును వేరనుబుద్ధితో మనము చరించుచుంటిమి. ఇప్పుడట్లుగాక వారును మనమును ఒకతల్లిబిడ్డలమనుభావ మంకురించియున్నది. ఈభావమును బలపరచుటకు ఫెడరల్ విధానముకంటె మరియొక సాధనము లేదు.

ఇదియొకభావము మాత్రమేనా? లేక స్వదేశసంస్థానములకును రాష్ట్రములకును గల సంబంధము బలపడుటవలన లాభమేమైన కలదా? ఎట్టి సంబంధములేక నూటనూట యేబది సంవత్సరములనుండి కాలక్షేపము చేయుచుంటిమిగదా? ఇప్పుడొకసంబంధమును కల్పించుకొనుట ఏల? అని కొందరడుగవచ్చును. సంస్థానములును బ్రిటిషు ఇండియాలోని రాష్ట్రములును రాజకీయ విషయములందు వేరువేరుగ నుండుటచే అనేకనష్టములు కలుగుచున్నవి. బ్రిటిషుఇండియా ప్రభుత్వము వారు దేశసంరక్షణమున కని గొప్ప సైన్యమునొకదానిని ఏర్పరచి దానికై ఏటేట అరువది కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుచున్నారు. ఈ సైన్యమువలన బ్రిటిషు ఇండియాలోని రాష్ట్ర

ములే గాక స్వదేశసంస్థానములు కూడ రక్షింపబడుచున్నవి. కాని ఇందుకై కావలసిన ద్రవ్యమంతయు రాష్ట్రములలోని ప్రజ లిచ్చుచున్నారేగాని సంస్థానాధీశు లొక కాసైన నిచ్చుట లేదు. విదేశవస్తువులపై బ్రిటిషు ఇండియా ప్రభుత్వమువారు సుంకములను విధించి కోట్ల కొలది ద్రవ్యము నేటేట సంపాదించుచున్నారు. ఈవస్తువులలో కొంతభాగము స్వదేశసంస్థానములకు వెళ్లుచున్నను సుంకములనుండి వచ్చు ఆదాయములో సంస్థానాధీశ్వరుల కేమియు లభించుట లేదు. ఇట్లే కొన్ని సందర్భములందు రాష్ట్రములలోనివారికిని మరికొన్నిటియందు సంస్థానములకును నష్టము కలుగుచున్నది. దీనికి కారణము దేశమంతయు ఒకే పరిపాలన విధానమునకు లోబడక యుండుటయే.

ఇట్టి నష్టములు తొలగుటకును, సంస్థానములును, రాష్ట్రములును ఒకమాత్ర దేశములోని భాగములనియు వానిలోని ప్రజలు సోదరభావముతో మెలగవలయు ననియు తలచువారి కోరిక సఫలమగుటకును దేశమునకంతకు ఒకపరిపాలనవిధానముండుటయు, ఆ విధానమున సంస్థానములును రాష్ట్రములును చేరుటయు అత్యావశ్యము. ఎట్టి విధాన మున్నయెడల ఇట్టి సంబంధ మేర్పడును? అని ఆలోచించితిమేని ఫెడరల్ విధాన మొక్కటియే దీని కనుగుణమైనదని చెప్పవలసి యున్నది.

స్వదేశసంస్థానములలో నొక్కొకటియు ఇప్పుడు విస్తారముగు స్వాతంత్ర్యము కలిగి యున్నది. అందులోని ప్రజలు ఆయారాజులు చేయుచుండు చట్టములకు లోబడి యున్నవారేగాని, సంస్థానమున కావలనుండు బ్రిటిషు ప్రభుత్వమువారు చేయుచట్టములకు లోబడిన వారుకారు. ప్రతిసంస్థానాధీశుడును (ఏవియో కొన్ని విషయములందు తప్ప) రాజకీయ విష విషయములందన్నిటను స్వాతంత్ర్య మనుభవించుచున్నాడు. ఇష్టమువచ్చిన పన్నులను విధించుటకును, సివిల్ క్రిమినల్ చట్టములలో ఇష్టమువచ్చిన మార్పులు చేసికొనుటకును, బ్యాంకీలు, వర్తకము, విద్య, భూమిశిస్తులు, వ్యవసాయము లోనగు విషయములందు యథేచ్ఛగ సంచరించుటకును సంస్థానాధీశుల కిష్టదధికార మున్నది. ఇట్టి సంస్థానములు బ్రిటిష్ ఇండియా రాష్ట్రములతో కూడ మరియొక పరిపాలనమునకు లోబడవలయుననిన ఆ పరిపాలనము సంపూర్ణాధికారము గల "ఏకైక" ప్రభుత్వముగ నుండుటకు వీలులేదు. వందల కొలది సంవత్సరములనుండి స్వాతంత్ర్య మనుభవించుచుండు సంస్థానములు తమ అధికారమునంతను కోల్పోయి, "ఏకైకప్రభుత్వము" క్రింద సామాన్యరాష్ట్రములుగ మారుట కంగీకరింపజాలవు. ఏవియో ప్రధానములును దేశమునకంతకు అత్యావశ్యములు నగు కొన్ని విషయములందు మాత్రము తమ అధికారమును విడనాడుటకు సంస్థానాధీశు లంగీకరింపవచ్చును. అనగా అనేకవిషయములందు వారు స్వాతంత్రులై యుండవలె ననియే వారు కోరుచుందురు. ఇట్టి సందర్భములో దేశమంతటిపైన

అధికారమును చెలాయించు కేంద్రప్రభుత్వము పరిమితాధికారము కలదిగ నుండవలసి యున్నది. కేంద్రప్రభుత్వము పరిమితాధికారముకలిగి యుండుటయు రాష్ట్రములు స్వతంత్రము ననుభవించుచుండుటయు "ఫెడరల్" విధానము యొక్క ముఖ్యలక్షణమని మన మిదివరకే గ్రహించి యున్నాము. కావున స్వతంత్రాభిమానము కలిగినట్టియు, ప్రస్తుతము విస్తారముగ స్వతంత్రము ననుభవించుచుండునట్టియు సంస్థానాధీశులు "ఫెడరల్" ప్రభుత్వమునకు లోబడ గలవారలే గాని "ఏకైక" ప్రభుత్వమునకు లోబడి తమ స్వాతంత్ర్యము నంతను పోగొట్టుకొనజాలరు.

(3) ఫెడరల్ విధాన మిప్పుడు ప్రాముఖ్యము గాంచుటకు మరియొక కారణ మున్నది. మన దేశమందలి మహమ్మదీయులలో ననేకులు ఈ విధానమువలన తమకు విస్తారమగు లాభము కలుగునని దృఢముగ నమ్మియున్నారు. అందుచేత మహమ్మదీయ నాయకులందరు ఇట్టి విధానము నే తామంగీకరింతుమనియు, దీనికిభిన్నమగు "ఏకైక" విధా నమునకు తామెన్నడు సమ్మతింపజాలమనియు చెప్పుచున్నారు. ఫెడరల్ విధానమువలన మహమ్మదీయులకు కలుగనుండు లాభ మెట్టిది ?

స్వరాజ్యమనగా ప్రజాపరిపాలన మని అందరికి తెలిసినదే. ప్రజాపరిపాలన మనిన ప్రజలందరు ఏకగ్రీవముగ విషయములను నిర్ధారణ చేయుట అని అర్థముకాదు. బహుసంఖ్యాకులు (Majority) దేనిని నిర్ణయింతురో దానికి లోబడి అందరు నడుచుకొనుట యని అర్థము. మన దేశములోని ప్రజలలో హిందువులు బహుసంఖ్యాకులుగను మహమ్మదీయు లల్పసంఖ్యాకులుగను ఉన్నారు. కావున కేంద్రప్రభుత్వమందును, కేంద్రశాసనసభలందును హిందువులసంఖ్య అధికముగను మహమ్మదీయుల సంఖ్య అల్పముగను ఉండుట తప్పదు. స్వరాజ్య స్థాపనమైన తర్వాత ఇప్పటివలెనే కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములపై సంపూర్ణాధికారము కలిగియుండినయెడల స్వరాజ్య మన అధికసంఖ్యాకులగు హిందువురాజ్యమనియే చెప్పవలసియుండును. మహమ్మదీయు లందరు హిందువులకు లోబడవలసియుందురు. ఇట్టి యనర్థమునుండి తమ్మును కాపాడుకొనుట కొక ఉపాయము కలదని మహమ్మదీయుల విశ్వాసము. కేంద్రప్రభుత్వమున కేదయో కొన్ని విషయములందు మాత్రము అధికారమిచ్చుటయు తక్కిన విషయము లన్నిటియందును రాష్ట్రములకు స్వతంత్రాధికారమిచ్చుటయే ఈయుపాయము. ఈయుపాయము వారి కనుకూలించుట ఎట్లు ?

మొత్తముమీద దేశమందంతట మహమ్మదీయుల సంఖ్య అల్పమైనను బంగాళము పంజాబు సింధురాష్ట్రములందు వారి సంఖ్య హిందువుల సంఖ్యకంటె అధికముగ నున్నది. ఈరాష్ట్రములందు స్వరాజ్యమనిన మహమ్మదీయరాజ్యమనియే చెప్పవలసియుండును. ఈరాష్ట్రములలోని ప్రభుత్వమందును, శాసనసభలందును వారే బహుసంఖ్యాకులుగ నుం

దురు. కావున రాష్ట్రములకు స్వాతంత్ర్య మున్న యెడల ఈ మూడు రాష్ట్రములందును మహమ్మదీయులు ఆస్వాతంత్ర్య మనుభవించు వారగుదురు. దేశమునంతను పాలించు కేంద్ర ప్రభుత్వమున తామెన్నడు బహుసంఖ్యాకు లగుట సంభవించక పోయినను కొన్ని రాష్ట్రము లందైనను తమ అధికారము పూర్తిగ సాగించుటకు వారుత్సాహపడుచున్నారు. వారి అభీష్టము కొనసాగవలయుననిన రాష్ట్రములకు స్వాతంత్ర్య ముండవలెను. అట్లు గాక ఇప్పటివలె రాష్ట్రములు కేంద్రప్రభుత్వమునకు లోబడి యున్న యెడల బంగళము పంజాబులో నగు రాష్ట్రములు తక్కిన రాష్ట్రములవలె హిందూబాహుళ్యము గల కేంద్రప్రభుత్వమునకు లోబడి యుండుటయు, ఈ రాష్ట్రములందు వారు బహుసంఖ్యాకు లగుటచే వారపేక్షించులాభము వారు పొందకపోవుటయు సంభవించును. ఈ కారణముచేత మహమ్మదీయు లనేకులు రాష్ట్రస్వాతంత్ర్యము మూలసూత్రముగ గల ఫెడరల్ విధానమును కోరుచున్నారు.

పైన పేర్కొనిన మూడు కారణములచేత "ఫెడరల్" విధాన మిప్పు డెంతో ప్రాముఖ్యము గాంచి, రౌండ్ టేబిల్ కాన్ఫరన్సులోని చర్చనీయాంశములన్నిటిలో అగ్రస్థానమును వహించినది. ప్రజాపరిపాలనము కేంద్రము (Centre)న స్థాపించుటకు వీలులేదని విశ్వసించువారును, స్వదేశసంస్థానాధీశులును, మహమ్మదీయులును ఈవిధానమం దెక్కువ యుత్సాహమును కనబరచుచున్నారు. ఇట్టి విధానమును ఆచరణలో నుంచుటయందు మన మెట్టి కష్టముల నెదుర్కొన వలయునో, వాని నెదుర్కొని తొలగించుటకు ఎట్టిమార్గములు గలవో మనము విమర్శింపవలసి యున్నది.

---

## పౌరుషేయచిత్రము

చిట్టా ప్రెగ్గడ సీతారామాంజనేయులుగారు

[శ్రుతి. ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ—శివా దన్యం నకించన—నేహనానాస్తి కించన—బ్రహ్మణోన్యం నకించన—శివఏవ కేవలః— స ఏవహిపరబ్రహ్మ తద్బ్రహ్మాహం న సంశయః, జీవ శ్శివ శ్శివో జీవ స్సజీవః కేవల శ్శివః—]

౧

పురుషుం డంచును, పౌరుషేయ మనుచుఀ భోక్తృత్వ మంచుఀ వితర్కారవంబుల్ - భ్రమసాంద్రవీచికలె గాకఀ! సర్వ మద్వైత మ

తుర మేకైకసహస్రశీర్ష శివచిత్సంకల్పనాట్యాంతరాం
తరవిన్యాస మిదన్య మెట్లగు! ననంతా! భక్తమూర్తీ! శివా!

౨

పురుషుం డెన్నిటనో ప్రయత్నపడ; దేవుం డం దొకం డారయన్
బొఱయన్ లాభమటన్న భేదమెవఁ డుద్బోధించె లోకాన! నీ
పురుషుండెవ్వఁడు దేవుఁ డెవ్వఁ డరరే! పూర్ణాద్వితీయైకభా
స్వరసుప్రాప్య 'శివోహ' మేమయిన దీశా! భక్తమూర్తీ! శివా!

౩

తన కష్టమ్మునకున్ ఫలం బొరునివా స్తంబీయ నౌనంట కే
మని స్వారస్యమొ! విశ్వచిత్రమున మిథ్యావ్యాప్తితో లోకమం
దనిమిత్తంబగు హానిసీమలను జేయన్ జెల్లె! నిర్వ్యాజ ని
ర్గుణ లీలారభటిన్ వికారమిటు లెక్కున్! భక్తమూర్తీ! శివా!

౪

బహు సంకల్పము లల్లిబిల్లిగొనుటన్, ప్రారబ్ధమైనన్ జయా
వహామై తోఁచదు; ఖేదనాట్య మిది! దైవప్రాపులేకన్ ఫలం
బహితంబైనదె, పౌరుషంబున కిటన్! బ్రహ్మైక సత్యం బెటుల్
వహియించున్ పరమార్థభేదముల దేవా! భక్తమూర్తీ! శివా!

౫

ఎదియున్ త్వద్వ్యతిరిక్తమన్న దొకఁడున్నే! భావనాలీలలే
గద! శాస్త్రార్థము లెల్ల నీకు! శ్రుతివాక్యంబేది లక్షించినన్
త్వదనన్యత్వరహస్యగర్భితమె! విశ్వంబంచు నిన్నేవె పో
ల్చెదుగా! చిన్మయద్వంద్వభావ రసలాసీ! భక్తమూర్తీ! శివా!

---

# బ్రిటిష్ సామ్రాజ్య సభ

చా. వెం. హనుమంతరావుగారు, M. A.

## హిందూదేశపు ఆర్థికస్వాతంత్ర్యము

ప్రస్తుతము లండనులో జరుగుచున్న సామ్రాజ్యసభా (Imperial Conference) సమావేశము నందు ఆలోచనకువచ్చు ముఖ్య విషయములలో సామ్రాజ్యాంతర దేశముల ఆర్థికవిషయములు ప్రముఖస్థాన మాక్రమించును. ఆ ఆర్థికవిషయములలో కూడ సామ్రాజ్యమందలి వివిధదేశముల మధ్య వర్తకపు టొడంబడికలు ఏర్పాటుచేసికొనుటను గూర్చి తీవ్రప్రయత్నములు జరుగునని యూహింపవచ్చును. హిందూదేశము కూడ సామ్రాజ్యమందలి దేశములలో ఒకటిగ నుండుటచే మన దేశపు ప్రతినిధులుకూడ ఈ ఆలోచనల యందు పాల్గొనుట కవకాశములు కల్పింపబడును. హిందూదేశపు ప్రతినిధు లనగా హిందూదేశపు ప్రజలచేగాని భారతసామ్రాజ్య శాసనసభవారిచేగాని ఎన్నుకొనబడిన వారు కాకపోవచ్చును. కాని అట్లు ప్రతినిధులుగా నేర్పాటు కాబడినవారు మన దేశము తరఫున మాట్లాడుట కధికారము కల్గియుండుటచే వారా ఏర్పాట్ల నామోదించిన హిందూదేశమంతయు వాటి నామోదించినట్లే పరిగణింపబడునుకాన, వారిని హిందూదేశప్రతినిధులని పిలువవలసి వచ్చినది. ఈ సామ్రాజ్యసభయందు హిందూదేశమునకు ఎట్లు సంబంధ మున్నదో పై విషయములవలన స్పష్టమగును. ఈ సందర్భములలో మన దేశప్రతినిధులమని చెప్పుకొనువారు చాల ఏమరియుండి హిందూదేశ లాభనష్టములే మదియం దుంచుకొని పని చేయవలసి యున్నది.

*　*　*　*

ఇప్పుడు ప్రపంచమం దన్ని దేశములలోను పారిశ్రామికదుస్థితి చాల ప్రబలముగ నున్నది. ఆ దుస్థితిలో ఇతర దేశములతోపాటు బ్రిటిష్ సామ్రాజ్యమందలి దేశములు కూడ చిక్కుబడి యున్నవి. ముఖ్యముగ పరిశ్రమలపైననే ఆధారపడియున్న ఇంగ్లండు దేశములో ఇది మిక్కిలి ఎక్కువగ కాన్పించుచున్నది. ఈ దుస్థితినుండి బయటపడి, తిరిగి ఆ యా దేశములకు పారిశ్రామిక, ఆర్థిక బలములు చేకూరవలెనన్న సామ్రాజ్యాంతర దేశము లన్నియు ఏకీభవించి కలసి పనిచేయుట ముఖ్యము. అట్లు చేసిననే లాభ ముండును. ఎందువల్లననగా పరిశ్రమలచే తయారు చేయబడు వస్తువులయందును, పరిశ్రమలకు కావలసిన వస్తువులను పండించుటయందును బ్రిటిష్ సామ్రాజ్యపు దేశములు వాటిలో అవి సరిపెట్టుకోగల్గుట కవకాశము లున్నవి. కాన ఆయా దేశములు కలసిమెలసి సహాయము చేసి

కొనుట కిష్టపడిన పైన చెప్పబడిన దుస్థితినుండి బయల్పడుట కష్టము కాదు. అట్టి పరస్పరసహాయమున కనుకూలించునట్లు ఒడంబడికలు చేసికొనుటకు ప్రయత్నించునపుడు, బ్రిటిష్ సామ్రాజ్య దేశములం దన్నిటియందును గొప్పదియు, పెద్దదియు ప్రజాబాహుళ్యముకలదియు నగు హిందూదేశపు అనుకూలాభిప్రాయమును సంపాదించుకొనుట కవసర మెంతేని కలదు.

* * * *

కాని హిందూదేశ మీ అంతరసామ్రాజ్య వర్తకపు టొడంబడికల కనుకూలముగ నుండుటకు ముందు మన దేశమునకు వాటి వలన ఎంతవరకు లాభముండును అను సంగతి ముఖ్యముగ ఆలోచనీయము. ఇట్టి ఆర్థికవిషయమును గూర్చి చర్చించునపుడు ఆర్థికముగ లాభనష్టములే గ్రహింపవలెను కాని ఇతరవిషయములను దీనియందు చొప్పించుటపాడిగాదు. కొంతమంది (మన దేశస్థులే) హిందూదేశమునకు బ్రిటిష్‌వారు రాజకీయముగ కొన్ని సదుపాయములుచేయుట కిచ్ఛగించిన, మన దేశము బ్రిటిష్‌వారికి ఆర్థికముగ కొన్ని సదుపాయములు చేయుట కంగీకరింపవచ్చునని సూచించుచున్నారు. వారుచేసిన సూచన దురాలోచనతో చేసిరనుకొనుట కెంతమాత్రమవకాశము లేదు. కాని ఇట్టి ఆర్థిక రాజకీయములగు బేరములను, దేశమున కంతకును సంబంధించు ప్రధానమూలసూత్రములలో ప్రవేశపెట్టుట చాల పొరపాటు మన దేశమునకు స్వరాజ్యము జన్మహక్కు. దాని నెవరును తీసివేయ లేరు. స్వరాజ్యమిచ్చిన ఆర్థికముగ సదుపాయములను చేసెదమని బ్రిటిష్‌వారిని మభ్యపెట్ట జూచుట వారికికాని మనకుగాని శ్రేయస్కరము గాదు స్వరాజ్యము వచ్చిన తరువాత హిందూదేశ మేవిధమగు ఆర్థికవిధానము నామోదించునో ఇప్పుడే ముందు నిశ్చయింపజూచుట కేవలము మనకాళ్లకు మనమే బంధములు తగిలించుకొనుట యగును. ఇంగ్లండునకును, సామ్రాజ్యమందలి ఇతర దేశములకును సదుపాయములు చేయుటయు, వారి సరకులను హిందూదేశములోనికి ఇతర దేశముల సరకులకన్న తేలిక దిగుమతి పన్నులతో రానిచ్చుటయు, ఈ మొదలగు విషయములు మన దేశస్థులు తరువాత ఆమోదించిన ఆమోదించవచ్చును కాని ఇప్పుడే ఆ ఆలోచనలు పెట్టుకొనిన ప్రధాన సూత్రములను మరచిపోవుట తటస్థించును.

* * * *

హిందూదేశమునకు సామ్రాజ్యపు టొడంబడికల వలన లాభ మున్నదా లేదా యను విషయము ఇదివరలో అనేకసార్లు చర్చకు వచ్చినది. ౧౯౦౮ వ సంవత్సరములో ఇంగ్లండు దేశపు ప్రధానమంత్రిగ నుండిన జోసెఫ్ చాంబర్లేనుగారు ఇండియా ప్రభుత్వమువారి నీ విషయములో వారి యభిప్రాయమును గూర్చి ప్రశ్నించినప్పుడు ఇండియా ప్రభుత్వమువారు అట్టి ఒడంబడికలకును, అట్టి విధానములకును వ్యతిరేకాభిప్రాయమును తెల్పి యుండిరి. హిందూదేశ మప్పటినుండియు కూడ ఏవిధమైన Imperial Reference విధానమునకు

గాని ఎప్పుడును ప్రతికూలమునే వ్యక్తీకరించుచున్నది. ఎందువల్లననగాహిందూదేశపు విదేశ వర్తకవ్యాపారము సంవత్సరమునకు సుమారు ౫౦౦ కోట్లుండగా దానిలో సుమారు ౧౧౫ కోట్లు మాత్రమే ఇంగ్లండు దేశముతో చేయు వ్యాపారముయొక్క విలువయై యున్నది. ఇతర దేశములకు ఎగుమతులు చాల ఎక్కువగానున్నవై యున్నవి. ఇంగ్లండు దేశమునకు మనము ఎగుమతి చేయువస్తువులు చాలవరకు పారిశ్రామికముగ వారికి కావలసినవై యున్నవి. హిందూదేశము ఇంగ్లండు నుండి దిగుమతి చేయు ప్రత్తి, బట్టలు, ఇనుము, ఉక్కు మొదలగు వస్తువులపైన ఇతర దేశములనుండి దిగుమతి చేయబడువాటికన్న తక్కువ దిగుమతి పన్నులను విధించుచున్నది. సామ్రాజ్యాంతర భాగములమధ్య ఒడంబడికల మూలమున హిందూదేశము ఇతరదేశముల దిగుమతులపై ఎక్కువ పన్నులను విధించిన మనకు ధనమూలకముగ ఎక్కువగ లాభము లేదు సరిగదా, మన వస్తువులను ఇదివరకు పన్నులు లేకుండ దిగుమతి చేసికొనుచున్న ఇతర దేశములు మనకు నష్టమువచ్చునట్లుగ ఎక్కువ పన్నులను విధించుటకు మొదలిడును. దానివలన మనవిదేశవర్తకమునకు తీరనినష్టము వాటిల్లును మనము ఇతర దేశములకు ప్రస్తుతము ఎగుమతిచేయు వస్తువులకు బ్రిటిష్ సామ్రాజ్య భాగములలో ఎక్కువ అమ్మకముకాని, చెలామణీకాని లేకపోవుటచే పైన చెప్పబడిన నష్టమును ఇతరవిధముగ పూర్తిచేసికొనుట కూడ కష్టము. కాన సామ్రాజ్యాంతర వర్తకపు టొడంబడికలు మొదలగు పద్ధతులవలన మన కేమియు లాభము లేదు. ఈవిషయములే ఇదివరకు ప్రభుత్వముువారుకూడ అనేకసార్లు వెల్లడించియున్నారు. ౧౯౦౭ వ సంవత్సరములో అధినివేశ రాష్ట్రములసభ జరిగినప్పుడు ఈవిషయమై చర్చజరిగినది. దానియందు ఇండియాప్రభుత్వమువారును, హిందూదేశమంత్రివర్గమువారును కూడ సామ్రాజ్యాంతరవర్తకపు టొడంబడికలకు తమ తీవ్రప్రాతికూల్యమును వెలిబుచ్చియుండిరి.

*　　*　　*　　*

హిందూదేశమునకు ప్రస్తుతము ముఖ్యముగ కావలసినదియు, మనదేశస్థులు ప్రధానముగ కోరునదియు ఆర్థికస్వాతంత్ర్యము. ఆర్థిక స్వాతంత్ర్యమనగా ఏ ఆర్థికవిధానము నేర్పాటు చేసికొనవలసినది, ఎట్లు మన దేశాభివృద్ధిని సమకూర్చుకొనవలసినది—ఈవిషయములన్నియు చర్చించి నిర్ణయించుటకు మనదేశ ప్రతినిధులకే సంపూర్ణాధికార ముండవలెను. సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వము వచ్చినను రాక పోయినను, ఆర్థికముగ స్వాతంత్ర్యము మనకలవడిన చాలలాభము కల్గుననుటకు సందేహము లేదు. ఇట్టి అధికారమును ఇంగ్లండుదేశము వారు మన కిచ్చినప్పుడు హిందూదేశస్థులు సామ్రాజ్యాంతరపు టొడంబడికలనుగూర్చియు, సామ్రాజ్యమందలి దేశములకు వర్తకములో సదుపాయములు కల్గించుటను గూర్చియు

ఆలోచించుటకు వీలుండును. హిందూదేశమున కిదివరలోనే అధినివేశ పరిపాలనా విధానము కలదని బెన్నుగారు (ఇండియామంత్రి) చెప్పుట వలనను, వర్తకపుఏర్పాటు (Fiscal Convention) వలన హిందూదేశమున కార్థిక స్వాతంత్ర్యము ప్రసాదింపబడినదని చెప్పుట వలనను, భారతీయులకు తృప్తి కల్గునని తలంచుట వట్టి పొరపాటు. నిజమైన స్వాతంత్ర్యమీయబడి, భారతదేశము యొక్క అభిప్రాయములు పూర్తిగ గమనింపబడినప్పుడే అట్టి తృప్తికల్గుటయు, హైందవీయులు అభిమానమును చూపుటయు జరుగుట కవకాశములున్నవి.

* * * *

పైన చెప్పినదానినిబట్టి ఆర్థికస్వాతంత్ర్యమీయబడగానే భారతదేశస్థులు సామ్రాజ్యాంతర-వర్తకపు టొడంబడికలను ఒప్పుకొందురని అర్థము చేసికొనరాదు. అట్టి ఒప్పుదల కాస్వాతంత్ర్య మొకసోపానము మాత్రము కాగలదనియే మాయభిప్రాయము. కాని ఆయొప్పుదలకూడ దేశాభ్యుదయమున కెంతవరకు తోడ్పడునో విచారించకుండ ఈయబడు నని తలంచుటకు వీలులేదు. హిందూదేశపు స్వదేశ పరిశ్రమల నభివృద్ధి పర్చుకొనుట కీయొడంబడికలు ఏవిధమైన ప్రతిబంధకమును గాని కల్పించునని తోచిన మనదేశీయులు వాటికి సమ్మతింపకయే పోవచ్చును. మన పరిశ్రమలకు బలము చేకూర్చుకొనుటయు, వాటిని ఇతరదేశముల పరిశ్రమలతోపాటు సమానముగ తులతూగునట్లు చేయుటయు, వాటిని స్థిరముగ దేశమునందు వ్రేళ్లు పాతుకొని యుండునట్లు చేయుటయు ప్రస్తుతము చేయవలసిన ప్రధానవిషయములు. దానికి కావలసినది రక్షణపద్ధతియే యని ఇదివరలో అనేకసార్లు చెప్పబడినది. ఈ సందర్భములో సామ్రాజ్యసభాసమావేశమునందు హిందూదేశమునకు ప్రతినిధిగా నున్న సర్ జెఫరీ కార్బెట్‌గారు చెప్పినవిషయములు గమనించదగినవి. "హిందూదేశము నిశ్చయముగ బ్రిటిష్‌సామ్రాజ్యమందలి వివిధదేశములమధ్య వర్తకము నభివృద్ధిచేయుట కేర్పాటుచేయబడు ప్రవిధానమును గూర్చి కాని అనుకూలముగ విచారణసల్పుట కెప్పుడును వెనుదీయదు. కాని ప్రస్తుత మమలునందున్న రక్షణవిధానమును మాత్రము విడనాడుటకు ప్రస్తుత మొప్పుకొనదు. కాన అంతరసామ్రాజ్య వర్తకపు టొడంబడికలనుగూర్చి హిందూదేశము వెంటనే ఎట్లుగాని ఒక నిశ్చితాభిప్రాయమునకువచ్చుట కాదేశస్థులు సమ్మతించిరి. ఒక్కొక్క విషయమును గూర్చి అప్పటికప్పుడు విచారించి నిశ్చయించుటకు వారికి స్వేచ్ఛ యుండవలెను."

ఈమాటలు చెప్పినవారు ఇంగ్లీషు దేశస్థులే యని జ్ఞాపకముంచుకొనుట ముఖ్యము. భారతీయుడే హిందూదేశ ప్రతినిధిగ నుండిన ఇంతకంటె స్పష్టముగ ఆతడు మాట్లాడియుండునని తలంపవచ్చును. ఏది ఎట్లున్నను కార్బెట్టుగారి ఉపన్యాసధోరణిని ఇంగ్లండు దేశస్థులును, అధినివేశదేశప్రతినిధులును తప్పక గమనించెదరు గాక! భారతీయుల ఇష్టములేకుండ ఏదైన ఒక

విధానమును వారిపై రుద్దజూచుట కికముందు అవకాశములు లేవని వారు గ్రహించవలెను. ఏవిధానమైనను హిందూదేశస్థులచే ఆమోదింపబడినపుడే వారు దానిని అనుసరించెద రని కూడ వారు కనుగొనుట మంచిది.

*    *    *    *

హిందూదేశమును చేర్చుకొనని ఏసామ్రాజ్య పునొడంబడిక గాని లాభముగనుండదని ఇదివరలో చెప్పియున్నాము. హిందూదేశమునకు సంపూర్ణ ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యము లేనినాడు అట్టి ఒడంబడికల కెప్వుడును అంగీకరించ దని కూడ చెప్పి యున్నాము. సామ్రాజ్య సభలో ఆర్థిక స్వాతంత్ర్యమును గూర్చియు, దానితరువాత జరుగనున్న రౌండు టేబిల్ సమావేశమునందు రాజకీయ స్వాతంత్ర్యమునుగూర్చియు, చర్చించబడును. అప్పుడు బ్రిటిషు ప్రతినిధులును, అధినివేశ రాజ్యముల ప్రతినిధులును హిందూదేశపక్షమును బలపరిచి, రెండువిధములగు స్వాతంత్ర్యములను హిందూదేశమునకు వచ్చునట్లు సహాయము చేసిన అందరకును లాభముగ నుండును.

---

## భారతీ స్తవగీతములు

విమర్శకాగ్రేసర బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు

ప్రవిమలాక్షర విభవంబు ప్రబలుచుండ
స్వచ్ఛ దివ్యాకృతి వినుతి నందుచుండ
సరసఫణితినిఁ జదువుల సాగఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

జ్ఞాన భానుప్రతాపవిస్తరతఁ బఱపి
అజ్ఞతాంధ తమసమును నణఁచివేసి
సరస హృదయాంబుభవవికాసంబుఁ గూర్చు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

విమల శతపత్ర కలితత వెలయుచుండ
కరము పుస్తకసంపద గ్రాలుచుండ
హృద్యవిద్యావినోదంబు లెనఁగఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

ఎంతొ తమిని బ్రహ్మానంద మెలమి నొసఁగి
కరుణ సుమనః ప్రబోధంబు కలుగఁజేసి
దయను మానవమోదంబు తనరఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

సత్యలోకవికాసంబు సరవిఁ గూర్చి
విబుధలోక వినోదంబు వెస ఘటించి
మనుజలోకంబు నంతయు మనఁగఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

చిత్రరుచి మించి నేత్రవైచిత్రిఁ గూర్చి
చిలుకపలుకులఁ జక్కెర లొలుకఁజేసి
భావగంభీరత రసానుభవముఁ గూర్చు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

కలితనీతుల ఖ్యాతుల కలిమిఁ దెలిపి
శూరజాతుల చేతల సొంపునింపు
స్ఫీతరీతుల ఖ్యాతిగ విపులపఱచు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

వీణఁ గైకొని గానత విశదపఱచు
జాణతనపు విన్నాణంబు రాణఁ దెలుపు
పాణిపల్లవ చాతురి వ్యక్తపఱచు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

పూతభారతదేశ విభూతిఁ బెంప
నూతనోత్సాహ మూని యనూనగతులఁ
జతుర సారస్వతశ్రీల సంఘటించు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

మంచిపెద్దల నరపెడు నంచితంపు
మార్గముల నెల్ల బోధించు మహితమైన
జ్ఞానధనము దిశల వెద చల్లుచున్న
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

మిత్రతం గొని చక్రసమ్మేళన మిడి
కువలయాప్తత గొని కళల్ కూర్మిఁ బెంచి
సత్త్వముం బూని సన్మార్గ సరణిఁ దెల్పు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

రాజహంసలభాతి విభ్రాజితముగ
సకలదేశ సంచారంబు సలిపి సలిపి
వస్తు సారవివేకంబు పరఁగఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

ఒక్కప్రక్కను శాస్త్రార్థ మొప్పుచుండ
నొక్కదిక్కునఁ గావ్యోక్తు లొలయుచుండ
నొక్కచక్కి విమర్శనం బొనరఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

శాంతవీరాదిరసవిశేషములఁ జూపి
హాస్యశృంగారభావాదు లమరఁజేసి
చోట్లఁ బెక్కట నవరస స్ఫూర్తిఁ గూర్చు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

ధ్వనుల సౌభాగ్య మెంతయో వఱలుచుండ
సారతరపరిష్కారముల్ చాల మెఱయ
నర్థ సంపద నేయెడ నలరఁజేయు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

శ్రావ్యకావ్యవిభేదంపు సొరుఁ జూపి
దృశ్యకావ్యరహస్యంపు తేజు నింపి
ఊహ్యభావాళి యోచించు నోజఁ జూపు
భారతీ, నీప్రచారమ్ము భవ్యతమము.

భారతి యతిమహిమాఢ్యల
(శ్రీ)రమణిని శక్తిఁ గూడఁ జేకొని నీలో
భారత భూరతకుకునై
కారుణ్యం బొప్పుచుండఁ గడఁగుము సతమున్.

---

# హరిద్వారము

మిగుల రమణీయములగు నైసర్గిక సౌందర్యముల కాలవాలములై ప్రతిసంవత్సరము లెక్కకు మిక్కిలిగ యాత్రికజనుల నాకర్షించు పుణ్యక్షేత్రములలో ప్రస్తుతము హరిద్వారముకూడ నొకటి. ఇది ఆగ్రా, అయోధ్యా సంయుక్త ప్రాంతమందలి సహరన్‌పూరు జిల్లాలో నొక ముఖ్యపట్టణము. గంగానది యొక్క దక్షిణ పార్శ్వమున గట్టబడియున్నది. ఇతిహాసమునకు గోచరముగాని మిక్కిలి పురాతనకాలమున నిచట కపిలమహర్షి వసించుచుండెననియు, నందుచే నీప్రదేశము కపిలమను పేర బరగుచుండెననియు నొక జనశ్రుతి కలదు. ఇప్పటి హరిద్వారపు రైలుస్టేషను కొకమైలు సుమారు దక్షిణముగ మాయాపురియు, మాయాదేవి మందిరమును ఉన్నవి. ఈమాయాపురీ మాహాత్మ్యములో హరిద్వారము గంగాద్వార మను పేర వ్యవహరింప బడియున్నది. క్రీ. శ. ఏడవ శతాబ్దిమందు భారతవర్ష భ్రమణార్థ మేగుదెంచిన హౌనుత్సాంగ్ అను చీనాదేశపు చరిత్రకారుడు అచట మయూలో లేక మయూరా నామక నగరముండెననియు, దానికి బూర్వోత్తరముగ గంగాద్వారమను పేరుగల బ్రాహ్మణుల దేవాలయ ముండెననియు వ్రాసియున్నాడు. ఈతని మొయూలో మాయాపురమని తలపబడుటచేత దన్మాహాత్మ్యమున వర్ణింపబడిన లాగు అచట గంగాద్వార మనుస్థాన ముండెననుట స్పష్టము. హిమాలయపర్వతశ్రేణులందలి యగాధములగు లోయలగుండ ప్రవహించుచు వచ్చి గంగ ఇచటనే పర్వతావాసమును వదలి సమతలమును ప్రవేశించి యున్నది. డేరాడూను నగరము మొదలుకొని ఇంతవరకు వ్యాపించి యున్న పర్వతసమూహము లన్నియు శివాలిక్ పర్వతములని పిలువబడుచున్నవి. కాని హరిద్వారము దగ్గర గంగకు వామభాగమున నున్న కొండలు చండీపర్వతములని కాని లేక నీలపర్వతములని కాని వాడబడు చుండును. ఇందులకు కారణము ముందు విశదము కాగలదు. వామదిశయందలి యీపర్వతములును, దక్షిణపార్శ్వమందలి శివాలిక్కుల అంతిమభాగములును బ్రహ్మాండములగు ద్వారబంధములుగ నేర్పడ నిచట నొక మహాద్వారముయొక్క ఆకృతియే కన్పించును. కావుననే ఈప్రదేశము గంగాద్వార మను సార్థకనామధేయము కలిగియుండును. కాని కాలక్రమమున నీపేరు మారిపోయి ముసల్మానుల ఆగమనానంతరము కావచ్చును హరిద్వార మను పేరు కలిగినది. ప్రస్తుతము శైవపక్షపాతులందరు దీనిని హరద్వారమని పిలుచుచుందురు. ఎందుచేతనన కేదారనాథ మనునది హిమాలయపర్వతపుణ్యక్షేత్రములలో నొకటి. ఇందలి ప్రధానదైవము కేదారేశ్వరమహాదేవుడు. ఈ క్షేత్రమునకు బోవలయుననిన నీమార్గముననే పోవలయును. కాబట్టి శైవులందరు హరద్వార మనుచుందురు. ఇక కేదారనాథమునకంటె నెక్కువ రాకపోకలుగల ప్రసిద్ధమగు బదరీనారాయణమునకు బోవలసివచ్చినను ఈదారినే పోవలయును. కావున వైష్ణవులందరు హరిద్వారమని పిలుచుచుందురు. అదిగాక దీనికి స్వర్గద్వారమని వేరొక పేరుకూడ గలదు. ఇదియు దీనికి అక్షరశః సార్థకమనియే చెప్పవగును. సహజసౌందర్యమున కావాసములైన హిమాలయపర్వతారణ్యప్రదేశములన్నియు కేవలస్వర్గతలములేకాని వేరుకాదు. ఈకారణముననే మనప్రాచీనులీ యుత్తరఖండమందలి పుణ్యభూములను స్వర్గసీమలనియు, దక్షిణఖండభాగములను పృథివియనియు వాడుచువచ్చిరి. ఈ ఖండద్వయమునకు సరిహద్దుగనుండినది స్వర్గద్వారము. కాని మహమ్మదీయులు వచ్చినపిదప హరిద్వార మను పేరుగాంచి నేటివరకు నదియే వ్యవహరింపబడుచున్నది. కాళిదాసు మేఘదూతకావ్యములో యక్షునిద్వారా మేఘునకు రామగిరినుండి అలకానగరమువరకు గల మార్గమును నిరూపించి వర్ణించు నవసరమున కనఖలపురమును మాత్రము పేర్కొనియున్నాడు. ఈ కనఖలపురము

ప్రస్తుతపు మాయాపురము నంటుకొని గంగాతీరముననే మైలు మైలున్నర దక్షిణముగ వ్యాపించియున్నది. కాబట్టి మిక్కిలి ప్రాచీనకాలమున జనావాసయోగ్యములగు గృహములేమియు లేక కేవలము గంగాద్వారమనుపేర గుడియొకటి మాత్రముండెననుట స్పష్టము. కాని యాస్థలము చుట్టుప్రక్కల నొప్పు రమణీయ ప్రాకృతికసౌందర్యముచే ఆకృష్టులై సంసారవిముఖులైన యోగులు, తపస్వులు, మౌనులు లోనగు ఏకాంతవాసాభిలాషులు వారి వారి కనువగు ప్రదేశములలో పర్ణకుటీరముల నిర్మించుకొని ధర్మాచరణముల సలుపుకొనుచు వచ్చిరి. ఈ మహాత్ముల దర్శించి వారినుండి హితోపదేశముల బడయుటకై సాధారణ గృహస్థులే కాక సంస్థానాధీశులు, రాజులు, మహారాజులుగూడ వచ్చుచుండిరి. ఈ దర్శకబృందములు కావించు ప్రబంధములవలననో లేక రాజ్యవ్యవస్థలమూలముననో ఆశ్రమవాసులగు వారికి జీవనోపాయము నిర్విఘ్నముగ జరిగిపోవుచువచ్చినందున వీరలు వేరొండు చింతలేక అనన్యపరాయణులై కేవలము దైవచింతనలయుందే కాలముగడుపుచువచ్చిరి. ఇట్టి విధానము హిందూరాజుల ప్రాబల్య ముండినంతపర్యంతము ఉండియుండవచ్చును. దేశమంతయు ధనధాన్యపుష్కలమై యుండినందున ఆశ్రమవాసులుకాని, ఆ ప్రాంతములో నివసించుగృహస్థులుకాని, మహాత్ములదర్శింపబోవు యాత్రికులుగాని ధనధాన్యసంగ్రహణలోభమునకు చిక్కియుండలేదు. కేవలము ధర్మరతి, ధర్మచింతనము, ధర్మానుష్ఠానములు లోనగు ధార్మికవిషయములే యప్పటివారల కర్తవ్యములై యుండెడివి.

కాని కాలక్రమమున భారతవర్ష మెట్లు రూపాంతరమందినదో యదేవిధమున నచటి గంగాతీరమందలి పర్ణశాలలును మహారాజవాసములుగ మారి ప్రస్తుతహరిద్వారముగ బరిణమించినది. ఈమార్పుకలిగినది మహమ్మదీయుల భారతవర్షాక్రమణానంతరమని చెప్పవచ్చును. ముసల్మానుల రాజ్యకారణమున బ్రాహ్మణుల కనేకులకు జీవనోపాయములు నష్టమయిపోయినవి. అట్టివారందరకు వేరొండువిధములగు జీవనోపాధుల సమకూర్చుకొనక శరీరయాత్రల గడపుట కష్టతరమయ్యెను. కావున మహాత్ముల సందర్శనార్థమై వేలకువేలుగ జనుదెంచు యాత్రికులద్వారా వీరలు తమమనోరథముల బూర్తిజేసికొన సంకల్పించుకొనిరి. నూతనప్రదేశమునందు నవాగంతుకులకు సరియగు వసతులు దొరకకపోవుటవలన నట్టివారలు కొన్నియిబ్బందులకు లోనగుట సహజమే. అట్టి తరుణములందు వీరలకు గావలసినవసతిసౌకర్యముల జేకూర్చి తత్ప్రతిఫలముగ స్వజీవనార్థము దానరూపమున గొంత ధనమును స్వీకరింప నేర్పాటుచేసుకొనిరి. జీవనోపాయములుపోయిన బ్రాహ్మణుల కిందువలన బ్రదుకుతెరువు లభించుటయు, పరదేశీయులకు క్షేత్రస్థలములం దేవిధమైన కష్టములుం గలుగకుండుటయు సంభవించెను. తీర్థసంవాసులగు బ్రాహ్మణు లెంతకాలమువరకు లోభస్వార్థములకు లోనుగాక పరోపకారపరాయణతనే ధ్యానమందుంచుకొని కేవలము జీవనమునకుమాత్రము అవసరమగు ద్రవ్యమును యాత్రికుల కేవిధమైనకష్టముగాని కలుగకుండని మార్గమున గ్రహింపుచువచ్చిరో యంతపర్యంతము వీరలవలంబించినమార్గము న్యాయసంగతమై యుండెననియే తలపవచ్చును. కాని తరములు గడచినకొలది, దేశమున దారిద్ర్యము ప్రబలినకొలది, ఈపండాలసంతతులకు లోభస్వార్థములు రెండును మితిమీరి పెరిగిపోయినవి. అట్టిచో నేప్రకారమైననుసరే, ధనమును రాబట్టుకొనుటయే వీరికి ప్రధానకర్తవ్యమయ్యెను. అందుల కనుకూలముగురీతి దూరదేశములనుండి వచ్చుయాత్రికులతో మరికొన్ని స్థిరనియమముల గల్పించుకొని వారికా హరిద్వారప్రాంతప్రదేశములన్నియు ముక్తిదాయకములని బోధించి తరచుగ నచటికి వచ్చునట్లు ప్రోత్సాహము గావించిరి. వీర లేర్పాటుచేసికొనిన క్రొత్తనియమములప్రకారము పండాలకును, యాత్రికులకును వంశపారంపర్యముగ నడచు సంబంధ మొకటి యుత్పన్నమగుట కవకాశము కలిగెను. ఎట్లనగా మొట్టమొదటి పర్యాయమే బ్రాహ్మణుడు ఏయాత్రికునకు గావలసిన వసతిసౌకర్యముల గావించి యతనిచేత తీర్థవిధుల నన్నింటిజేయించునో ఆబ్రాహ్మణు డతనికిబురోహితుడు అనగాయజ్ఞాదికర్మలచేయించువాడును, ఆయాత్రికుడతనికి యజమాని అనగా యజ్ఞాదిధర్మకార్యముల జేయు

వాడును నగును. ఈకట్టుబాటువలన సాధారణముగా నొక యజమాని తన పూర్వపురోహితుని వదలి వేరొక బ్రాహ్మణుని బురోహితునిగ జేసికొనుటకు వీలులేదు. ఒక యజమానిని మరియొక పురోహితుడు స్వీకరింపనే స్వీకరింపడు. మరియు నీ నియమము ఒక్కతరములో గడచేరునది కాదు. ఈపురోహితయజమానుల సంబంధము వంశపారంపర్యముగ నుండునదే. ఒక యజమాని యొక్క మనుమడు అతని తాతగారేర్పరచిన పురోహితునో, లేక యతని సంతతి వాని నెవనినో పురోహితునిగ గ్రహింపవలయును గాని వేరొకని స్వీకరింప వీలు లేదు. తన యజమాని వేరొకని దగ్గరకు బోకుండుటకును, ముందురాగల యతని సంతతివారు సైతము మరియొకని స్వీకరింప కుండుటకును పండా తన చిట్టా పుస్తకములో నామధామ సమేతముగ బ్రథమయజమాని చేతనే కొన్ని ప్రతిజ్ఞా వాక్యములను వ్రాయించుకొనును. ఎట్లనగా:- క్రొత్త యజమాని యొక్కడో "ఫలాని ఫలాని వారి మనుమడు, మనుమడు, కొడుకు నగు నేను ఫలాని శుభ దినమున నీగంగా తీరమందు ఫలాని పండాను బురోహితునిగ స్వీకరించితిని కాన ముందు నావంశము లెవ్వరిచటికి వచ్చినను వారందరు ఈయననే పురోహితునిగ నంగీకరింపవలయు" ననియు, లేక ప్రాంత యజమాని సంతతి వాడగుచో నతనిచేత "ఫలానివారి కుమారుడగు నేను ఫలాని పండా దగ్గరి చిట్టాలో నాపూర్వ పురుషుని ప్రతిజ్ఞా లేఖనమును జూచుటచే నీయననే పురోహితునిగ జేకొంటిని కాన ముందురాగల నావంశీకులు నట్లే చేయుదురు గాక" యనియు వ్రాయించుకొందురు. పూర్వపురుషుల బాగుగ నెరుగని ఎవని వంశవృక్షమైన దెలిసికొనుట కీచిట్టా లత్యంతోపయోగకరము లనుటకు సందేహము లేదు. కాని దేశమునందు దారిద్ర్యము హెచ్చుచున్న కొలది ఈపురోహితుల సంతతులకును దురాశాపూర్ణములైన లోభస్వార్థములు హెచ్చు పెరుగు చుండుటచే యజమానులకు బ్రస్తుతము నూతనప్రదేశము లందు సౌకర్యములు, సౌఖ్యములు కలుగుటకు మారుగ గష్టములనే యెదుర్కొనవలసి వచ్చుచున్నది. లక్ష్మీసంపన్నుల కచటికి బోయినను ఏకొరతయు నుండదు కాని బీదలకు, మధ్యమశ్రేణి వారలకే యెక్కువ కష్టములు కలుగుచుండును. ఇది యీహరిద్వారమందే కాదు. ప్రస్తుతము భారతవర్షమందలి సమస్తపుణ్యక్షేత్రములందును యాత్రికుల కిట్టి కష్టములు సంభవించుచుండుట మిక్కిలి విచారకరము. ఈపండాల స్వార్థభూయిష్ఠములగు కార్యములు కొండంత భక్తితో తీర్థయాత్రల కేగువారి శ్రద్ధాభక్తులను గూడ రూపుమాపుటకు గారణము లగుచున్నవి. యాత్రికు లెంత యెక్కువగ ధనమిచ్చిన నంత యెక్కువగ వారికి సౌకర్యములు లభించుచుండును. బీదలగు వారికి దేవస్థానములందలి బంట్రోతుల ధిక్కార పూర్వకములైన త్రోపులు, పూజారుల విముఖతలు, పండాల చేతులలో అగచాట్లు, అవమానములు దప్ప వేరుగతి లేదు. అంతర్యామియగు భగవంతుడే వీరి దుఃఖితాంతఃకరణములకు శరణ్యుడు. హరిద్వారమందు సాక్షాత్కృతయగు భాగీరథీదివ్యశీతలజలావగాహనమే యనాథల హృదయముల జల్లబరచునది. ఈ పండాలయొక్క ద్రవ్యాశాతృష్ణలను సంతృప్తిజేయ నోడియే యిప్పుడు వేర్వేరు ప్రాంతములకు జెందిన శ్రీమంతు లనేకులు గంగాతీరమున మంచి మేడలగట్టించి తామచట గంగాసేవనము జేయుటయే కాక పండాలతో వేగలేని కొందరు గృహస్థులకును ఉచితముగు వసతిసౌకర్యముల నేర్పరచియున్నారు.

హరిద్వారమునందీవిధమున మార్పుజెందినది పండాలసంతతులే కాదు. మహాత్ములును జాలవరకు బ్రస్తుత భారతవర్షమునకు దగినట్లు బరివర్తనము గాంచిరని వ్రాయుట కెంతయు చింత కలుగుచున్నది. హిందూదేశమునందంతట నిక్కాలమున నాబాలగోపాలము నావేశించినది ధనతృష్ణ. మహాత్ములీమాయనుండి దూరముగనుండుట యటుండ దత్ప్రవాహమున నీదులాడుచుండుటయే ధర్మముగ భావించియున్నారు. ఇవన్నియు నధర్మములు, నశాశ్వతములు నని తలచి విరక్తితో దైవధ్యానాసక్తుడై కూర్చుండు వానిని ఎందుకును గొరగాని వట్టి చవటచెవుల సన్యాసియని వీరలు హేళనము జేయుచుందురు. నిజముగు వైరాగ్యముని ఇల్లువాకిలి సమస్తము బరిత్యాగము జేసిపోయినవారును, గొంతకాలము వీరిగాలి

పోషకులవలన మరల సరాగులై యనుచితప్రయత్నముల మెలగుచుందురు. కొంచెముగనో, గొప్పగనో నలుగురి యెదుట మాటాడ గలిగిన జాలును. అట్టి యాతడు దేశమందంతట ధర్మ ప్రచారార్థము బయలు వెడలును. మొదలు మొద లీతని ధర్మప్రచారము నిష్కల్మషముగనే యుండును. కొంతకాలమునకు జనులలో దగినంత పలుకుబడి కలిగినదని యెప్పుడు తలచునో యప్పుడు ద్రవ్యాకర్షణమునకు గడగును. స్వార్థమర్థించినచో నెవడుగాని యొకకాసైన నొసంగడు. కాబట్టి గంగాతీరమున దగిన వసతిసౌకర్యములు లేకపోవుటచే మహాత్ములగు సాధుపుంగవు లనేకులు స్వస్వధర్మానుష్ఠానముల నిర్వర్తించుకొనుటయం దసమర్థులై యున్నారనియు, వారికి గావలసిన సెలవుల నేర్పరచు నిమిత్తము ద్రవ్య మత్యవసరమనియు, నుపదేశింప శ్రద్ధాభక్తులుగల ధనాఢ్యుడగు నే మార్వాడీ వర్తకుని ప్రయత్నమునో కొలది దినములందే వేలకొలది ద్రవ్యము జేసూరి యుపదేశకమహాత్ముని వశమగుచుండును. ఇట్లు ప్రోగైన ద్రవ్యరాశుల సహాయమున నిర్మింపబడిన క్షేత్ర, కుటీ, ఆశ్రమ నామకవిశాలదివ్యసౌధములతో నిండి మహానగరముగ మారి యున్నది ప్రస్తుతహరిద్వారము. ఇక నీసంగ్రహ మొనరించిన ధనమంతయు సాధువుల నిమిత్తమై యుపయోగింపబడుచున్నదా యనిన నదియు గానరాదు. ఒకటి రెండుస్థానములలో దక్క దక్కినచోట్ల నీసంగృహీత ద్రవ్యము మహంతులయొక్కయు, వారి యాంతరంగికుల యొక్కయు, సౌఖ్యార్థము వినియోగింపబడుచున్నట్లు దప్పక గానవచ్చును. కొన్నిస్థలములలో ధనార్జనకర్త జీవించియున్నంతవరకు నచటివ్యవస్థ బాగుగనే యుండును. కాని యతని తరువాత నతనిస్థానాపన్నులగువారివలన క్షేత్రకార్యము లుపేక్షను గాంచుచుండుననియే చెప్పవలయును. వేలకొలది లక్షలకొలది యాదాయముగల కొన్ని ఆశ్రమక్షేత్రములందలి దుష్ప్రబంధముల నాలోకించి వానిని జక్కసేయవలయునను అభిప్రాయముతో యూ. పీ. (United Provinces of Agra & Oudh) పంజాబు ప్రాంతవాసులు "మందిరసుధార్ కమిటీ" (దేవాలయ సుప్రబంధకారిణీసభ)యను పేర నొకసంఘమును స్థాపించి యున్నారు. భారతప్రభుత్వపు అనుమతిని బొంది క్షేత్రాశ్రమదేవస్థానములలోగల లోపములను దూరము జేసి సువ్యవస్థల నేర్పరచవలయునని యీ సంఘమువారి ముఖ్యోద్దేశము. వీరియుద్దేశము లింకను గార్యముగ బరిణమించియుండలేదు. ప్రయత్నములుమాత్రము జరుగుచున్నవి. ధార్మికస్థానములందలి వ్యవస్థలు మంచిస్థితిలో లేవని యీసంఘస్థాపనయే చాటుచున్నదికదా! ఇట్లనుటచేత హరిద్వారప్రాంతమునందు సుస్వభావులు, శాంతాత్ములు, సత్కార్యాచరణులునగు మహాత్ములు లేనేలేరని తలపగూడదు. అట్టి మహానుభావులును గలరు. కాని బహుస్వల్పసంఖ్యాకులు. వారు ఆడంబరపూర్ణములైన కార్యములలో జోక్యముగలుగ జేసికొనరు. సామాన్యముగ వీరు ప్రజాసంక్షోభములు లేని యే యేకాంతస్థలములందో యుండి వారియనుష్ఠానముల నెరవేర్చుకొనుచుందురు.

ఏమైనను గానిండు. పూర్వకాలమున నిర్మానుష్యములుగనుండి ఏకాంతవాసులగు యోగులకు, తాపసులకు వాసయోగ్యములుగనుండిన ప్రదేశములన్నియు నిపుడు పండాలయొక్కయు, మహంతులయొక్కయు, మరి కొందరు గృహస్వాములయొక్కయు, ప్రయత్నములవలన నిర్మింపబడిన మహోన్నతసౌధపంక్తులతో నిండుకొని పోయినవి. అయోధ్యారోహిలఖండపు రైల్వేకంపెనీ వారు కలకత్తానుండి లక్నోమీదుగ లాహోరునకుబోవు మెయిన్‌లైనుమీది "లుక్సర్" నామక జంక్షనునుండి యొకశాఖను హరిద్వారముమీదుగ నిచట పర్వతమును దొలిచి సురంగములద్వారా డేరాడూన్ నగరమునకు గొనిపోయిరి. ప్రస్తుతమీలైనంతయు ఈస్టిండియన్ రైల్వేకంపెనీవారి అధికారముక్రింద నున్నది. ఈరైల్వేలై నిపుడు హరిద్వారమును యూ. పీ. పంజాబులోని గొప్ప పట్టణముల కన్నింటికి మిగుల జేరువయగునట్లు సలిపి తదభివృద్ధికి గారణభూతమైనది. ఆధునికసభ్యతకు ముఖ్యచిహ్నములైన నీటికొళాయీలు, విద్యుద్దీపములు, మోటారుబస్సులు మున్నగునవి మిగిలియుండిన రవంత కొరంతను దీర్చినవని చెప్పవచ్చును. కాబట్టి యిపుడు హరిద్వారము కేవలము పుణ్యతీర్థము మాత్రమే కాదు. కౌతుకవిహారస్థానము గూడను (Pleasure resort). ఈ హేతువుచేతనే యిపుడు గంగాస్నానమందును,

దేవీదేవతలందును విశ్వాసములేని యార్యసామాజికులు, దేవసామాజికులు, బ్రాహ్మలు, అకాలీ సిక్కులు మొదలగువారును ఇచటి కేతెంచి కొన్నాళ్ల పర్యంత మానంద మనుభవించి పోవుచుందురు. కాని ఆస్తికులగు హిందువుల కిది పవిత్రతీర్థము. వైష్ణవులకు వైకుంఠము. శైవులకు కైలాసపీఠము. అన్నిరకములవారికి స్వర్గభూమి. గంగ ప్రత్యక్షదేవత. ఇచటి గంగావర్ణన మెట్టి నాస్తికునకైనను ఒకవిధమగు నుల్లాసము నొసంగి మేను గగుర్పొడువ హృదయము నుప్పొంగునట్లు చేయకమానదు.

హరిద్వారమందును, దానికి బూర్వోత్తరముగ మూడుమైళ్ల పర్యంతము, దక్షిణపశ్చిమముగ మూడు మైళ్ల దూరమువరకును గంగాతీరమునసే అనేకతీర్థములు, స్నానఘట్టములు గలవు. వీని యన్నింటిలో బ్రధానమైనది బ్రహ్మకుండము హరిద్వారయాత్ర యనిన బ్రహ్మకుండయాత్ర యనియే గణింపవలయును. ఇచట బ్రహ్మ తపశ్చర్య గావించియుండినందున దీని కీ పేరు కలిగెనని ప్రసిద్ధి. ఇది ముక్తిదాయకమగు స్థానము. మృతి నొందినవారి యస్థి కలశముల నిందు సమర్పింపబడుచుండును. యూ. పీ. బంగాలము, రాజపుత్రస్థానము సింధూ, పంజాబుదేశముల వారలు మరణించిన తమ బాంధవుల అవశేషములను సంచయనముజేసి తీసికొనివచ్చి స్వశక్త్యనుసారము వెండి బంగారములతో గలిపి బ్రహ్మకుండమున వేయుచుందురు. స్నానముచేయునిమిత్తము ఇచట మొలబంటినీళ్లలో దిగినయెడల అడుగున బరచిన రాళ్లలాగు కాళ్ల కీయస్థులే తగులుచుండును. వీనిలో గలిపివేయబడు వెండి బంగారముల బయటికి దీయుటకై యేర్పడిన నేర్పరులగు మనుష్యులెల్ల పుడు శీతాతపములకు వెనుదీయక కంఠములోతు నీళ్ళలో నిలచి వానిని నతినిపుణముగా వెలికి దీయుచుందురు. ఈ బ్రహ్మకుండ మాహాత్మ్యమును వెల్లడిపరచు గాథలు రెండు గలవు ధర్మాంగదుడను రాజు తన పట్టపురాణి గర్భమున సర్ప ముదయింప నాసమాచారమును దాచి, కుమారుడే జన్మించెనని దేశమంతట వెల్లడిచేయించి కాలాంతరమున యుక్తవయస్కు డయ్యెనదని ఖడ్గప్రతినిధిద్వారా వేరొక రాజకుమారి నాపన్నగమునకు వివాహముసలుపుటయు, శ్వశురాలయమున కేతెంచిన పిదప జరిగిన రహస్యవృత్తాంతము నంతయు దెలిసికొని రాజపుత్రి యాపుస్నాగమును బతిభావమున శిరసావహించి భారతవర్షమందలి సకలపుణ్యక్షేత్రముల, నదీనదముల సేవించుచు జనిచని తుదకు బ్రహ్మకుండావగాహన మొనరించి లేచుటతోడనే నాగము సుందరపురుషాకృతి నొందుటయు, దానినంతయు గాంచుచుండిన యచటి తాపసులు వారిద్దరిని దీవించి పంపుటయు ననుగాథ తెలుగు దేశమందును గొందరికి దెలిసియే యుండవచ్చును. ఇక రెండవగాథ యెట్లన:- కుమారు డజ్ఞానవశమున దనతల్లి చే కామింప నిరువురును కుష్ఠరోగావిష్టు లగుదురు. అంత బరస్పరసమాచారము తెలియబడ పశ్చాత్తాప తప్తులై మునుల యాదేశమున వారిరువురు నీలవస్త్రముల ధరించి సకల పుణ్యతీర్థముల సేవించుచు బోయి పోయి చివరకు బ్రహ్మకుండమున మునిగి తేలుటతోడనే వారు దాల్చిన వస్త్రములు శుద్ధశ్వేతములుగ మార శరీరములందలి కుష్ఠరోగము మాయమగుటయు, నంత నాతల్లికొడుకు లిరువురు నిష్పాపులై యథేచ్ఛంజనుటయు నను వృత్తము గూడ మన దేశములో దెలిసియే యుండవచ్చును. ఇట్టి ముక్తిదాయకమగు కుండమున అవగాహన మొనరించు భాగ్యము పుణ్యాత్ములకు గాని లభింపదు.

హరిద్వారమున కెగువ నొకమైలున్నర దూరము తూర్పున గంగ రెండుపాయలుగ జీలియున్నది. ఈలాగు చీలినపాయల నిచట ధారలని పిలుచుచుందురు. ఈ రెండింటిలో బెద్దదగు ప్రధానధార చండీపర్వతమును రాచుకొనుచు దక్షిణపశ్చిమముగ బ్రవహించిపోవుచుండును. దిగువను దీనినుండి మరికొన్ని ధారలు చీలినవి. ఈ కారణమున నిచట ననేకములగు చిన్నచిన్నలంక లేర్పడియున్నవి. ఇవన్నియు నరణ్యవృక్షములతోడను, పొదలచేతను నిండి చూచుటకు మనోహరములై యుండును. రెండవధార ఉత్తరముగనున్న శివాలిక్ పర్వతభాగమును రాచుకొనుచు హరిద్వారము, మాయాపురము, కనఖలపట్టణములగుండ బ్రవహించి కనఖలమునకు దిగువ చండీపర్వతము ప్రక్కగవచ్చు అసలుధారతో గలియుచుండును. ఈ ఉత్తరముగా వచ్చుధార యచట

శివాలిక్ పర్వతభాగమును గొట్టుకొనుచో నచటనే బ్రహ్మకుండము వెలసియున్నది. జయపురాధీశు డగు సవాయిమానసింహుడు పర్వతముయొక్క ప్రస్తరమయ పార్శ్వమును జెక్కించి సోపానముల గట్టించి నిర్భయముగ స్నానము సలుపుట కనువగునట్లు గావించెను. ఇటీవల బ్రహ్మకుండనిర్మాణము ననేకమార్పులు కలిగినప్పటికి మానసింహుడు కట్టించిన మెట్లుమాత్ర మప్పటివి అప్పటివిగనే ఉంచబడియున్నవి. వీనికి సమీపమందే గంగాద్వార ఆలయ మున్నది. ఇచటనే హరిచరణముగూడ గలదు. ఈ హరిచరణకారణమున నుత్తర భారతీయులు బ్రహ్మకుండమును "హరికీ పౌరీ"యని పిలుచుచుందురు. పర్వత ప్రాంతముల వీడి సమతలమునకు దిగుటవలన నిచట గంగాప్రవాహ మత్యంతవేగవంతమై యుండును. ఏమరుపాటైనచో ప్రవాహవేగమునకు జిక్కి కొట్టుకొనిపోవుట సంభవించును. ఇట్టి యనర్థములు సంభవింపకుండుటకై బ్రహ్మకుండము దిగువగా రెండు మూడు ఫర్లాంగుల దూరమువరకు వ్యాపించియున్న ఘట్టము పొడుగునను గొన్ని గజముల యంతరములలో నినుపగొలుసులు బిగింపబడి యున్నవి. వీనిని గట్టిగ బట్టికొన గలిగిననే స్నానము చేయవచ్చును కాని లేనిచో కష్టము. బ్రహ్మకుండమునందు మాత్రమింత వేగము లేకుండు లాగున నేర్పాట్లను జేయుటయే కాక తప్పిదారి ప్రవాహములో బడినప్పటికి ప్రాణము రక్షించుకొనగల్గు విధానములు గావింపబడియున్నవి. కాని బ్రహ్మకుండము వెలుపల స్నానము జేయవలయునని మెలకువ గలిగియే యుండవలెను. మానసింహుడు కట్టించినది మొదలుకొని బ్రహ్మకుండము దినదినాభివృద్ధి గాంచెనని చెప్పవచ్చును. ముసల్మానుల రాజ్యానంతరము మహారాష్ట్రుల రాజ్యకాలమున బ్రహ్మకుండసమీపమున ననేకభవనములు నిర్మింపబడినవి. పిమ్మట ఆంగ్లేయప్రభుత్వము వచ్చిన తరువాత పటియాలా, జమ్మూకాశ్మీరము, కాంగడా, నాలాగఢము, టిహిరీ, చంబా, లంఢౌరా మొదలగు రాజ్యముల యొక్కయు, సంస్థానముల యొక్కయు అధీశ్వరులు బ్రహ్మకుండము దగ్గరగ గంగ నానుకొని యుండులాగున గొప్పగొప్ప సౌధముల గట్టించి వాని నంటుకొని ఘట్టముల నిర్మాణము చేయించిరి. ఈఘట్టము లన్నియు నొకదానితో నొకటి కలియుటవలన నేర్పడిన మూడు ఫర్లాంగుల పొడుగుననే యక్కడక్కడ నినుపగొలుసులు బిగింపబడియున్నవి. ఈఘట్టముల కన్నింటికి దక్షిణముగ మైలున్నరదూరమున మాయాపురసమీపమున నొక విశాలమైన సేతువును, బంధమును గట్టించి ఈబ్రహ్మకుండపు ధారనుండియే ప్రభుత్వమువారు గంగకాలువ (Upper Ganges canal)ను గొనిపోయిరి. బ్రహ్మకుండము దగ్గరి నైసర్గిక, కృత్రిమ దృశ్యము లత్యంతమోహనములు, చిత్తాకర్షకములు, అవర్ణనీయములు. ఈ కుండమునకు కట్టయెదుట ప్రవాహమధ్యమున సుమారొక ఫర్లాంగు పొడవును, నూరుగజముల వెడల్పును నుండులాగున నొక విశాలవేదివంటి ఘట్టము నిర్మింపబడినది. దీనిమీదికి బోవుటకు బ్రహ్మకుండపుధారమీదుగ చిన్నవంతెన గలదు ఈవంతెన రెండుఘట్టముల నేకీభవింపచేయుచుండును. ప్రతిదినము సూర్యాస్తమానమైన వెంటనే బ్రహ్మకుండపు సోపానములపై నిలచి భాగీరథీ జననికి ఆరతి నొసంగు సమయమున నీఘట్టమంతయు నానాదేశసమాగతయాత్రికలోకసమాకులమై, సాధుజనపూర్ణమై ప్రత్యక్షమై కుంభమో లేక స్వర్గమో యను భ్రమను గలుగజేయును చూపరుల బ్రహ్మానందములో ముంచివేయును.

ఈబ్రహ్మకుండస్నానము నిమిత్తమే తెంచునట్టి యాత్రికుల కారణమున ప్రతిదినము హరిద్వారమందు నిత్యకల్యాణము, పచ్చతోరణమునై వెలయుచుండుట వాస్తవమే కాని ఇచట జరుగువానిలో నన్నింటికంటె గొప్పది పండ్రెండు సంవత్సరముల కొకపర్యాయము వచ్చు కుంభోత్సవము. ఇదియే గంగాపుష్కరము కానోపును. బృహస్పతిగ్రహము కుంభరాశియం దుండుసమయమున నీబ్రహ్మకుండస్నానము మోక్షప్రదమని గణింపబడినది. కాని ఇట్టి పవిత్రతీర్థమున రాగద్వేషదూరులై శాంతభావమున స్నానమాడుటకు మారుగ ధర్మాంధులగు సాధునామకులు కొందరు స్నానదినమున నొకరికంటె నొకరు ముందుగ నీళ్లలో మునుగవలయునని పట్టుదల బూని తుదకు కలహము మితిమీరిపోవ పరస్పరహత్యల గావించు

కాని ఘట్టమునంతయు శవపంక్తులమయము, జలముల రక్తమయముగను సలుపుచువచ్చిరి. ఇట్టి దారుణములగు నత్యాచారములు కొంతకాలము క్రిందటివరకు జరుగుచువచ్చినవి. ఈ కుంభస్నానమున కిచట లక్షలకొలది యాత్రికులేకాక లెక్కకు మీరి సన్యాసులు, బైరాగులు, ఉదాసీనులు, నిర్మలులు ననుపేరుల నొప్పు సాధువులుగూడ బ్రోగవుచుందురు. సన్న్యాసులు శంకరాచార్యానుయాయులు, బైరాగులు రామానుజ రామానందసంప్రదాయులు; ఉదాసీను లింతవరకు సిక్కుమతాంతర్గతులుగ భావింపబడుచుండిరి. కాని అకాలీసిక్కు లిపుడు జాతిమతభేదముల నింపుకైన పాటింపనందున నుదాసీనులందరు హిందూపక్షమవలంబించి గురునానకుయొక్క పుత్రుడగు శ్రీచంద్రుని అనుయాయులమని ప్రఖ్యాతము చేసికొనుచు సిక్కులనుండి వేరగుచున్నారు. నిర్మలులును సిక్కుసాధువులు. వీరిలో నొక్కొక్క సంప్రదాయమున మరల ననేక శాఖోపశాఖలు కలవు. క్రీ.శ.1760-వ సంవత్సరమున జరిగిన కుంభోత్సవసమయమున వైష్ణవసంప్రదాయాంతర్గతులగు గోసాయిలకు, బైరాగులకు కలహము జనింప స్నానదినమున నిరుపక్షముల నుండి 1800 మంది ప్రాణముల గోలుపోయిరి. క్రీ. శ. 1795 లో సిక్కుయాత్రికులకు గోసాయిలకు వివాదము జనింపనపుడు సిక్కులు 500 మంది సాధువులను వధించియుండిరి. క్రీ. శ. 1819 లో మరల పోరాటములు గలుగనపుడు దబాటగాలి పోయిన సిపాయీలతోపాటు 430 మందికి ప్రాణములు పోయినవి. అంత భారతప్రభుత్వమువారు కఠినములగు నియమముల నేర్పరచి నాలుగు సంప్రదాయముల సాధువులు ఒకరి తరువాత నొకరు స్నానముచేయవలయునని పరిష్కారము చేసిరి. సర్కారువారి తీర్పు ప్రకారము మొదట సన్యాసులు, తరువాత బైరాగులు, వారి తరువాత నుదాసీనులు, కట్టకడపట నిర్మలులు స్నానము చేయవలయును. ప్రస్తుత మిటులే జరుగుచున్నది. ఉత్సవావసరములం దిప్పుడును, బూర్వకాలపు ఖూనీలు జనుల తలపునకు వచ్చుచునేయుండును. ఈకాలమందట్టి రక్తపాతములగుట పూర్తిగ పోయినది కాని లక్షల కొలది మనుష్యు లొక పరిమితస్థలమున గూడుటచే జనసమ్మర్దమున జిక్కుపడుట మూలముననో లేక కలరా లోనగు వ్యాధులకారణముననో ఇప్పటికిని గొన్ని ప్రాణములు పోవుచునే యుండును.

కుంభోత్సవము తరువాత నిచట నధికసంఖ్యాకులగు యాత్రికుల నాకర్షించునది వైశాఖియుత్సవము. ఇది ప్రతిసంవత్సరము వైశాఖమాసారంభమున సంపన్నమగుచుండును. దూరదూర దేశముల జనులు రాకపోయినను దగ్గర దగ్గర చుట్టుప్రక్కలనుండి వేనవేలుగ నా దినమున హిందువులు బ్రహ్మకుండస్నానార్థ మేతెంచుచుందురు.

ఈరెండు సమయములందే కాక పర్వదినములు, ఉత్తరాయణ దక్షిణాయనపుణ్యకాలములు, మేష మకరసంక్రాంతులు, సూర్యచంద్రగ్రహణావసరములు, వ్యతీపాతఅర్థోదయయోగకాలములు, వారుణీ, మహావారుణీ, ఆదివారమునందు వచ్చు సప్తమీతిథి మొదలగు విశిష్టకాలములందుగూడ యాత్రికులసంఖ్య యెక్కువగనే యుండును.

బ్రహ్మకుండమందే కాక యాత్రికు లీ నిమ్నలిఖితస్థానములందును స్నాన మొనరించి దానధర్మముల జేయుచుందురు.

1. గోఘట్టతీర్థము. ఇది బ్రహ్మకుండమునకు గొంచెము దక్షిణముగ నున్నది. అజ్ఞానవశమున నెవనికైన గోహత్యాపాతకము కలిగెనేని అత డిచట స్నానము జేయును. ఇచట నివసించు నొక భంగి (కీధుల నూడ్చు పాకీవాడు) గోహంతకుని నెత్తిపై చెప్పుతో గొట్టి యతనిని బాపవిముక్తునిగ జేయును.

2. కుశావర్త తీర్థము. ఇది గోఘట్టమునకు గొంచెము దక్షిణముగ నున్నది. ఇచట దత్తాత్రేయ మహర్షి తపము సలిపియుండెనని ప్రసిద్ధి. ఇచటి ఘట్టమును, దానిమీది భవనమును ఇండూరు మహారాజుచేత నిర్మింపబడినవి యాత్రికు లిచట పితరుల నుద్దేశించి పిండదానముల చేయుచుందురు. ఇచట స్నాన మొనరించిన జన్మరాహిత్యము గునని విశ్వాసము.

3. విష్ణుతీర్థము. ఇది కుశావర్త తీర్థమునకు దక్షిణముగ నున్నది. ఇచట మానసింహుడు కట్టించిన ఘట్టము, శివాలయము గలవు. ఇచటి స్నానము విష్ణులోక ప్రాప్తికి సాధనము.

4. బిల్వపర్వతము. ఇది శివాలిక్ పర్వతము యొక్క అంతిమభాగము. లలితా, లేక శివధారా యని పిలువబడు పర్వతనిర్ఝరమునకు బశ్చిమ మందలి భాగమీపేరున బరగుచున్నది. దీనిమీద బిల్వవృక్షము లమితముగ నున్నవి. ఈలలితాతీరమున బిల్వకేశ్వర మహాదేవుని యాలయ మున్నది. యాత్రికు లీనిర్ఝరిణీ స్నాన మాచరించి బిల్వకేశ్వరుని దర్శించుచుందురు.

5 గణేశతీర్థము. ఇది మాయాపురమునకు దగ్గరగ గంగకాలువకు ఉత్తరమందలి నిరంజనీసాధువుల ఆశ్రమ సమీపమున నున్నది. ఇదియొక స్నానఘట్టము.

6. నారాయణశిల.—ఇది హరిద్వారమునుండి జ్వాలాపురమునకు బోవు రాజమార్గము ప్రక్క నున్నది. ఇచట పితృశ్రాద్ధములు కావింపబడును.

7. నీలపర్వతము—దీని శిఖరముమీద చండికా దేవి దేవాలయ ముండుటచే చండీపర్వత మనియు నిది పిలువబడుచుండును. ఇది హరిద్వారమున కెదురుగ దిన్నగ దక్షిణదిశను వ్యాపించియున్నది. గంగయొక్క అసలుధార ఈకొండ యడుగునుండి ప్రవహించుచుండును. ఈధారకు నీలధార యనియు నామాంతరము కలదు. శిఖరము మీది దేవి యాలయమును క్రీ. శ. 1880-వ సంవత్సరమున జమ్మూమహారాజగు సుచేతసింహుడు కట్టించియుండెను. ఈ చండికాలయమునకుదగ్గరగ అంజనాదేవి గుడియున్నది. పర్వతము యొక్క అడుగుభాగమున గౌరీశంకర దేవాలయము కలదు. దీని కించుక దక్షిణముగా సుచేతసింహనిర్మిత మగు నిల్లేశ్వర ఆలయ మున్నది. దీనికి దక్షిణముగ నొక గుహాభ్యంతరమున నాగేశ్వర మహాదేవుని మూర్తి విరాజిల్లుచున్నది. ప్రవాహ మెక్కువగ నుండు గ్రీష్మవర్షాకాలములందు కస్తీలను బల్లకట్ల ద్వారా గంగను దాటియు, చలికాల మైనచో తాత్కాలికముగ నిర్మింపబడు వంతెనల మూలమున ప్రవాహముల నుత్తరించియు నావలిప్రక్కకేగి యాత్రికు లీనీలపర్వత సంబంధములైన స్థలముల నన్నింటిని దర్శించుచుందురు.

8. భీమగోడాతీర్థము—ఇది బ్రహ్మకుండమునకు ఉత్తరముగ బదరీనారాయణమునకుబోవు మార్గముమీద నున్నది. కొంతకాలము క్రిందటివరకు నిచట పర్వతము మీద గురియు వర్షమంతయుగూడి యొక మడుగుగ నేర్పడుచుండెడిది. ఎండకాలములో నెండిపోవుటయు సంభవించుచుండెను. కాని యిప్పు డిచట గచ్చులో జలాశయమును నిర్మించి గంగాజల మందులోనికి ప్రవహించున ట్లేర్పాటు కావింపబడినది. యాత్రికు లిచట గూడ స్నానదానముల సలుపుచుందురు.

9. సప్తస్రోతతీర్థము — ఇది హరిద్వారమునకు దూర్పుగ మూడుమైళ్లదూరమున నున్నది. పట్టణసమీపమునకంటె నిచటి ప్రాకృతికసౌందర్య మతి రమణీయమైనది. ఇచట గంగ ఏడుపాయలుగజీలి యొక విస్తృతమైన మైదానము నాక్రమించి పారుచుండును. ఈ హేతువుచేతనే దీనికి సప్తస్రోత మనుపేరు కలిగినది. ఏకాంతము నభిలషించువారి కిప్పటికి నిది వాసయోగ్యమైన స్థానము.

10. కనఖలతీర్థము. హరిద్వారమునకు రెండు మూడు మైళ్లదూరములో దక్షిణపశ్చిమముగ నున్నది. కాళిదాసువలన మేఘసందేశమునందు వర్ణింపబడిన దీనగరమే. దీనికి దగ్గర దగ్గరగ పతితపావనేశ్వర, దక్షేశ్వర, తిలవర్ధేశ్వర మహాదేవుల ఆలయము లున్నవి. కనఖలునకు బడమట నొకమైలు దూరమున సతీకుండము గలదు. ఇదియే దక్షుడు యజ్ఞము గావించిన చోటు మహాదేవుని నాహ్వానింపని కారణమున సతి ఇచ్చోటనే శరీరత్యాగము జేసినది. సతీకుండమని పేరుకలుగుట కిదియే కారణము. దీనికి నాలుగువైపుల నిపుడు దట్టమైన యడవి ప్రబలియున్నది. దక్షేశ్వరాలయమును క్రీ. శ. 1810 సంవత్సరమున లంఢౌరా రాణియగు ధనకుమారి కట్టించెనని చెప్పుదురు.

సంస్కృతవిద్యాధ్యయనమునకు హరిద్వారమున మంచి ప్రచారము కలదు. కొన్ని ఆశ్రమములందచట వసించు పండితులగు సాధువులే విద్యార్థులకు విద్యగరపుచుందురు. మరికొన్ని యాశ్రమములందు వేతనయుక్తులగు పండితులును గలరు. విద్య నభ్యసింపదలచు వారికి ఆయాస్థలములందుచితముగ నన్నవస్త్రములు లభించుచుండును. ఈ పాఠశాలలన్నియు సామాన్యముగ నాయాస్థానాధిపతులగు మహంతుల అధికారమందుండి వారి యిష్టానుసారమే నడుపబడుచుండును. ఇదిగాక ఆర్యసమాజమువారి పక్షమున గురుకులమహావిద్యాలయములును, సనాతనహిందువులపక్షమున ఋషికులమును స్థాపింపబడియున్నవి. ఈ సంస్థలయందు విద్యార్థులకు ప్రాచీనాధునికపద్ధతుల రెండింటి ననుసరించి విద్య యొసంగబడుచున్నది. వీనిలో గురుకులమునందు విద్యార్థులనుండి శుల్కము గ్రహింతురు. మహావిద్యాలయము, ఋషికులములందు నిశ్శుల్కముగనే విద్యాదాన మొనరింపబడుచున్నది.

ముఖ్యముగ యాత్రికులకు పనికివచ్చు వస్తువుల వ్యాపారము దప్ప ఇచట వేరువిధమగు వర్తకము లేదు. దేవతాపూజావసరములందుపయోగింపబడు నానాప్రకారములగు పాత్రసామగ్రు లిట లభించును. హరిద్వారప్రాంతమున గంగాజలము మిగుల స్వచ్ఛముగ నుండుటచే నిచటనుండి భారతవర్షమందలి సమస్తభాగములకు గొనిపోబడుచుండును. ఈనీరు నింపుటకు గావలసిన యనేకప్రకారములగు పాత్రము లిచట లభ్యములగును. హిమాలయారణ్యప్రదేశములు వివిధమూలికలకు, నోషధులకు బ్రసిద్ధికెక్కియున్నవి. వీనిలో జాలభాగము హరిద్వారమున నమ్మబడుచుండును. శిలాజిత్తు మొదలగు గైరికధాతువులు, ఊలివస్త్రములు, వ్యాఘ్రాదులగు అటవీమృగముల చర్మములు, చమరీవాలములు మున్నగువాని వ్యాపారమును నిచట విస్తారముగ గలదు.

[వే. సు]

---

## బుద్ధిహీనులు

శ్రీ విక్రమదేవవర్మగారు

ఆయ మెన్నక వ్యయమును జేయువారు
ఋణముఁ జేసి నేలను గొన నెంచువారు
విత్తమును బొంద లోభుల వేడువారు
జూదమున సొమ్ము గడియింపఁ జూచువారుఁ
గుడవకయు నీయకయు సొమ్ముఁ గూర్చువారుఁ
గులటఁ బెండిలియై యాసుఁ గొనెడువారు
మిసిమి గల బాలఁ బెండ్లియాడు ముసలివారుఁ
బైమెఱుంగును గనినంత భ్రమయువారు
నెమ్మి వెలయాలి పలుకుల నమ్మువారు
బలము గలిగియుఁ బనిమాని మెలఁగువారు
నలవిగానిదానిని జేయ దలచువారు
విగతకార్యంబులకొఱకు వగచువారు
స్వప్రతిభఁ జెప్పికొని తుష్టిపడెడువారుఁ
బరులదోషంబులనె యెంచి పలుకువారు
నితరజను లజ్ఞులని నిశ్చయించువారుఁ
దామె విజ్ఞుల మని మదిఁ దలఁచువారు
ననియమాధ్వంబునఁ గడంగి యరుగువారు
నైహికసుఖంబె పురుషార్థ మనెడువారు
జగదధీశుండు లేడని చాటువారు
బుద్ధిహీనులు గాదురు సుమీ పుడమియందు.

---

# 'హిందూ' శబ్దమున కర్థమేమి?

లోకమున నే శబ్దమునకైనను నిర్వచనము చేయవచ్చును. కాని 'హిందూ' అనుపదమున కట్లుగాదు. అది ఎన్నియో హిందువుల తత్త్వాభిప్రాయములవలె అనిర్వచనీయము. కారణము ఈపదముయొక్క మూలము, వ్యాప్తి, ప్రయోగము మిగుల నస్పష్టములయి యుండుటయే.

'హిందూ' అను పేరు మన ముంచుకొన్నది కాదు. పరులిచ్చినది. ముసలమానుల రాకకు పూర్వము ఈపేరు మనయందెచ్చటను ఉన్నట్టు కానరాదు. ముసలమానులీ దేశమందు రాజ్యాభిషిక్తులై మనలను హిందువులని పిలచిన పిమ్మట నీపేరిట వాడుకకు వచ్చెను. ముసలమానులిచ్చటికి వచ్చినపిదప తమమతస్థులు కాని యీ దేశవాసులందరిని సమష్టిగ హిందువులని పిలచిరి. దానికి పూర్వము ఈ దేశమందలి అసంఖ్యాకజనస్తోమమునకు ఒకటే యొకసమష్టినామమేదియు లేకుండెను. ముసలమానుల పారపత్యమధికముగ నున్నతరి యిచ్చటివారందరికిని వారు సమానముగ శత్రువులుగ నుండినందున వీరందరు నొకజట్టుగా చేరి ఐక్యభావన పడసి యొక సమష్టినామము నందుకొన నావశ్యకత కలిగెను. అప్పుడు పరులు వీరికొసగిన 'హిందూ' అను పేరు వీరియందును ప్రచారమునకు వచ్చెను. దీనికి మొదలు ఈ దేశమున మతభేదములు, కులవ్యత్యాసములు, నాగరికతాంతరములు నధికముగ నుండినందున నొకే సంస్కృతిపరిస్థితియందుంటున్నను వీరు తామందరు నొకటే యని తెలపకనే యుండిరి. ఇది మన దేశచరిత్రవలన స్పష్టమగును. ఇప్పటికిని మనదేశపు పండితులకు హిందూ శబ్దార్థము సరిగ తెలియుటలేదు.

## పదమూలము

పరులవలన మనకు లభించిన యీ 'హిందూ' అను పేరుకు మూల మెయ్యది? ఈ విషయమున నెన్నియో భిన్నాభిప్రాయములు కలవు. సింధునదిపేర నీపేరు మనకు కలిగియుండునని పలువు రూహింతురు. గురుదాసబెనర్జీ యభిప్రాయమే ఉదాహరణము: 'హిందూ' శబ్దము పరకల్పితము; సింధునదిపేర పుట్టియుండును. ఆనది పూర్వభాగమందు వసించు జనులను సంబోధింప మహమ్మదీయులు దీనిని వాడియుందురు. ఇది సరియని చెప్ప వీలులేదు. మహమ్మదు జననమునకు ముందునుండియు పారశీకులు, గ్రీకులు నీపదము సరిగి యుండిరి. మరియు ప్రాచీనకాలమునుండియు హిందువులు సింధునదీపశ్చిమప్రాంత్యమున వసించుచుండిరి. ఇప్పటికిని వసించుచున్నారు. ఋగ్వేదపు సప్తసింధు కూటములో కాబూల్ నదికూడ చేరియున్నది. ముసలమానులిప్పటికిని సింధునదీ సింధుప్రాంత్యములను యథావత్తుగా నుచ్చరించుచున్నారే గాని హిందూనది, హిందూ ప్రాంత్యము అని చెప్పుటలేదు. అట్టితరి వారు హిందూ శబ్దమును సింధునదిపేర క్రొత్తగా కల్పించిరని చెప్పనీ లెటులు?

ఈపేరును ముసలమానులు రూఢికి దెచ్చిరే కాని కల్పించలేదు. వారు దానిని పారశీకులనుండి నేర్చుకొనియుందురు. ప్రాచీనపారశీకులు మనదేశము ఆర్యులను సింధునదిపేర 'హిందూ' అని పిలచిరనియు, గ్రీకు లీపదమును 'ఇండాయ్' అని మార్చికొనిరనియు పలువురు పండితులు చెప్పుచున్నారు. ఈ ఇండాయ్ అనుదానినుండి యిప్పటి ఇండియా అను పదము పుట్టినది. ప్రాచీనపారశీకుల అవెస్తాగ్రంథమున 'హప్తహెందు' అనుపదము కానవచ్చుచున్నది. ఇది 'సప్తసింధు' అను శబ్దమునకు పారశీకభాషారూపమని పండితుల యూహ. ఈ 'సప్తసింధు' అను పదమే మన హిందూనామమునకు మూలమని యీ పండితుల వాదము. ఋగ్వేదకాలమున నార్యులు సింధునదీతీరమున నుండిరి. ఋగ్వేదమున 'సప్తసింధు:, సప్తసింధవః (బహువచనము)' అను పదములు కనబడుచున్నవి. పెక్కుచోట్ల ఈపదములు కేవలనదీవాచకములుగ

-నున్నవి. ఒకచోటమాత్రము (ఋగ్వేదము viii 24-27) 'సప్తసింధవః' అను పదము ఒక దేశమును తెలుపుచున్నది. ఇది యేదేశమో నిశ్చయింప వీలులేదు. ఈ పదమున సూచకములుగ నున్న ఏడు నదులు పంజాబు నదులే యని నిర్ధరింపరాదు. ఒకవేళ అట్లుచెప్పినను ఈదేశము 'సప్తసింధు' అను వైదికనామమును వదలి చాలకాలము నుండియు పంచనద దేశమని పిలువబడుట యేలకో చెప్పరాదు. పంజాబున కే హిందూగ్రంథమందును, ఒకచోటను ఈ 'సప్తసింధు' అను పేరు కానరాదు. మరియు హిందూగ్రంథవారాశియందు మరెచ్చటను 'సప్తసింధు' అను పేరుగల ప్రదేశము చెప్పబడియుండలేదు. వేదయుగ మయినతోడుతనే పుట్టిన మహాభారత కాలమున సింధుదేశమను ప్రత్యేకరాజ్య ముండెను. పంజాబు దేశము మ్లేచ్ఛభూమిగా కూడ నుండెను. ఇందువలన పంజాబు దేశము వేదభూమి యనుటకు వలనుపడదని యిటీవల కొందరు వాదింప నారంభించిరి. ఈరీతిగ వేదమందలి 'సింధు' అను పదము ఎల్లచోట్లను పంజాబు సింధు నదినే సంబోధించునని చెప్పుట కష్టము. మరియు పైచెప్పిన'సింధు'అనునది సింధునదియే యైనను సప్తసింధు అన సింధునదీతీరమందలి దేశమని చెప్పుట మరియు కష్టము. 'సింధు' అన సముద్రమని యొక అర్థము కలదు. మన పురాణములు సప్త సముద్రములను వివరించుచున్నవి. ఈ నమ్మకమే వేదకాలమందు నుండి యుండవచ్చును. కాని కొందరు పండితులు వేదకాలమువారికి సముద్రమనునదియే తెలిసియుండలేదని చెప్పుచున్నారు. అది యెట్టులయిన నందుగాక! పారశీకులు మనకు ప్రసాదించిన 'హిందూ' నామము సింధునది పేరనే పుట్టినదని చెప్పుట సులభము కాదని మీదిచర్చవలన తెలియుచున్నది.

కొందరు హిందూ, ఇండాయ్, ఇండియా అను పదములు 'సప్తసింధు' అనుపదమునుండికాక 'ఇందు' అనుపదమునుండి పుట్టినవని యూహించుచున్నారు. ఋగ్వేదమునందలి 'ఇందవః పితరావ్యాః' అను వాక్యమునుండి యీపేరు నుద్ధరించుచున్నారు. కాని యీవాక్యమును వివరించుట కష్టము. ఈదేశమును ఇందుకుల రాజన్యులు మహాఖ్యాతితో పాలించి సామ్రాజ్యముల నేర్పరచినందున ఈపేరు కలిగియుండనోపునని మరియొక యూహ. మరియు నీదేశము మనప్రాచీనుల యభిప్రాయము ప్రకారము చంద్రమండలమున ప్రతిఫలించి కుందేటివలెను రావియాకువలెను కానవచ్చుచున్నందున దీని కిందువర్ష మను పేరు కలిగి తన్మూలమున పైపేర్లు వచ్చియుండుననియు నొక యూహ కలదు. ఈ యూహలకు తగిన యాధారము మనప్రాచీనగ్రంథములం దెచ్చటను కానరాదు. ఇందుదేశము, ఇందువర్షము అను పదములుకూడ దొరకుటలేదు

హిందూశబ్దమూలమును గురించి యిట్టిదే కృత్రిమమగు మరియొకయూహ మేరుతంత్రమను గ్రంథమునుండి శబ్దకల్పద్రుమమున నుదాహరింపబడియున్నది. హిందూశబ్దము 'హీనం, దూషయతి' అను రెండుపదముల నుండి పుట్టినదట. 'హిందూ' అన హీనమయినదానిని దోషముగ చూచువాడు అని యర్థమట. ఈయర్థము మిక్కిలి కృత్రకము, చాల నిర్జీవమైనది. మేరుతంత్రము ప్రాచీన గ్రంథము కాదు.

## పర్యాయనామము

హిందూశబ్దము పరకీయ మగుటచే దానికి పవిత్రమగు సంస్కృతభాషయందు మరేదైన పర్యాయనామము కల్పింప నిటీవల యేబదివత్సరములనుండి ప్రయత్నము జరగినది. కాని యీప్రయత్నము స్వాభిమానముచే నతికృత్రకముగ నడచినది. మన చరిత్రారంభమునుండియు మన మెన్నియో పరకీయవస్తువులను సంగ్రహించియున్నాము. దాని నొప్పుకొనుటవలన మనకువచ్చిన నష్టమేమియు లేదు. పరకులమువారు పరదేశీయు లెందరో ఇచటచేరి, మనశిష్యులై కాలక్రమముగ హిందూసంతతిగ మారిరి ఇట్లుండ హిందూశబ్దము పరకీయ మైనంతమాత్రమున దాని ననాదరించనేల? ఈ పదము నిపుడు వదలినచో మనకు గతిలేదు. దీనికి సరియగు పర్యాయశబ్దమే లేదు. దీనికి పర్యాయముగ నిటీవల కల్పితములగు పదములను పరీక్షించుచో నిది తెల్లమగును.

వేదకర్తలగు మన ప్రాచీనులు తమ్ము ఆర్యులనియు, ఇతరులను దాసులు, మ్లేచ్ఛులు, దస్యులు, శూద్రులు అనియు సంబోధించిరి. మనవారికి సంస్కృతమున నుండ దగినది యిదొక పేరు తక్క మరిలేదు. కనుకనే అనేకులు 'హిందూ' అనుపేరునకు మారుగ 'ఆర్య' అను పేరును రూఢికి తే ప్రయాసపడుచున్నారు. ఇది సాధ్యముకాని పని. మన శాస్త్రములదృష్టిని వర్ణత్రయమువారు మాత్రము ఆర్యులు. ఇప్పుడు శుద్ధక్షత్రియులు, శుద్ధ వైశ్యులు ఖిల మయి యున్నారని ప్రతీతి యున్నందున ఆర్యులన బ్రాహ్మణులు మాత్రమే అని యర్థమగును. మరియు ద్రావిడులీవిభాగమున చేరరు. మన హిందూమత ధర్మ తత్త్వశాస్త్రములను గౌడబ్రాహ్మణులకంటెను శ్రద్ధా గర్వములతో పరిపాలించుచున్న ద్రావిడబ్రాహ్మణులు కూడ అనార్యులుగ నున్నారు. ఇదికాక పురాణములంగు 'ఆర్య' అనుదానికి 'మ్లేచ్ఛ' అనునది విపరీతపదము. ఈమ్లేచ్ఛకూటమునకు పురాణములు ద్రావిడాంధ్రులను, తండ్రి శాపమునకు గురియయిన యదువు, తుర్వసు మొదలగువారి సంతతివారిని చేర్చుచున్నవి. ఇట్లగుచో సాక్షాత్తు శ్రీకృష్ణుడును, యాదవకులమువారును, సుభద్రాసంబంధమున పాండవసంతతివారును కూడ మ్లేచ్ఛులగుదురు. కాని వీరిలో నెవరినికూడ 'హిందూ' కూటమునుండి విసర్జింప వీలులేదు. ఇప్పుడు వీరినందరిని ఆర్యులని పిలువవలయు నన్న ఆర్యశబ్దమున కనాదినుండియు వచ్చిన రూఢ్యర్థము నొకేమారు మార్చవలసివచ్చును. ఇట్టి యింద్రజాలము సులభమా?

ఇదంతయును మనదేశపు స్థితి. ఇటీవల పాశ్చాత్యులుకూడ ఈ 'ఆర్య' అనుపదమును వివిధార్థముల వాడియున్నారు. పాశ్చాత్యులు సంస్కృతము నభ్యసింప మొదలిడినప్పుడు సంస్కృతము, పారశీకము, గ్రీకు, ల్యాటిన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, రష్యన్ మొదలగు భాషలు సోదరభాషలని స్పష్టమాయెను. ఇవి సోదరభాషలగుచో వీటి కొక మాతృభాష యుండవలయును. మరియు నట్టి మాతృభాష నాడు మాతృకుల మొకటి యుండవలయును. మాక్సుముల్లరు ఈమాతృభాషను ఆర్యభాష యనియు, దాని నాడువారిని ఆర్యులని

యని నచెను. ఈకారణముచే పైభాషల నాడువారి నందరిని ప్రాజ్ఞులు ఆర్యకులమువారని యనిరి. జనకుల మన ఒకేవిధమగు దేహరచవరక్తగుణములను కలవారని యర్థము. తెల్లని యైరోపీయులు ఆర్యకులమున తమకు సమానముగ నల్లని పారశీకులను, హిందువులను చేసినవారని యొప్పుకొనుట కష్టము. ఇందువలన కొందరు పండితులు ఏష్యాఖండపు ఆర్యులు ఆర్యభాష నాడువారుమాత్రమెయైయున్నారనియు, ఐరోపీయులు ఆర్యభాషావాచకులు, ఆర్యకులసంభూతులు నయి యున్నారనియు వాదింప నారంభించిరి. కాని కొంత కాలమునకే ఐరోపీయులయందును పెక్కుకులప్రభేదము లున్నవనియు, కులమునకు, భాషకు నట్టి సాక్షాత్సంబంధము లేదనియు తెలియవచ్చెను. అప్పు డాయా (ఏకులమువారైనను) లన ఆర్యభాషల నాడువారను నర్థము పుట్టెను. ఇట్లు 'ఆర్య' అనుపదముయొక్క అర్థము మనయందు, పాశ్చాత్యప్రపంచమందును మిక్కిలి చిక్కుగా నున్నది. ఇవి మొదలగు కారణములవలన 'హిందూ' అనుదానికి 'ఆర్య' యను పదమును పర్యాయముగా గొనుట అసాధ్యము.

'హిందూ' అన హిందూమతావలంబియని పలువుగు తలంతురు. హిందూమతమునకు సంస్కృతమున పేరిడి తన్మూలముగ హిందూశబ్దమునకు పర్యాయనామములను కల్పింప ననేకులు ప్రయత్నించియున్నారు. ఇవన్నియు నిష్ఫలములు. ఈక్రొత్త పదములకు హిందూ శబ్దమునకు గల వ్యాప్తియు, అర్థపుష్టియు, రూఢియు లభింపలేదు. సార్వత్రికముగ వాడుకకు మనదేశమునందును, ఇతరదేశములందును వచ్చుట చాలా అరుదు. హిందూ శబ్దము కేవలము వాచకమే కాదు. హిందూ మతమును వైదికధర్మమని పిలువ నొప్పుకొన్నను హిందువులను వైదికులని పిలువవలయునన్న మన మనసు వెనుకాడును. ఈక్రొత్త పేర్లను పరీక్షించిన నిది తెలియగలదు.

హిందూమతమును వైదికధర్మ మని పిలువవల యునని కొందరి కోరిక. ఈమతమునకు వేదమే శిరము

గను, మూలమునను ఉండుటవల్లను, దీనియందలి అంతః ప్రభేదములవారు వేదప్రాధాన్యము నొకదానియందు మాత్రమే ఒకటిగ నున్నందునను ఈపేరు సర్వోత్కృష్ట మని వీరి వాదము. కాని హిందువులందు వైదికులవలె లౌకికులు కాని ఆచారశీలు లను నర్థము ఇప్పుడు పుట్టినది. ఐతిహాసికముగ చూచిన మనము ప్రథమమున వైదికులుగ నారంభించినను వెంటనే మనయం దొకశాఖవారు ఔప నిషదికు లయిరి. తొలుత వైదికమతము నామావశేషమై తత్స్థానమున పౌరాణికమతము, వేదాంతమతము, స్మార్తధర్మము నుత్పన్నము లాయెను. ఈ మతము లన్నియూ నిమిడిన ఒక సమష్టిపదము మనకు కావలసియున్నది. కానిచో వేదమును తిరస్కరించు జైన బౌద్ధచార్వాకాదులను కూడ హిందూకూటమున చేర్పవలసి వచ్చును. ఇందువలన పైప్రభేదముల నన్నిటి నొప్పి, వాటి సమష్టిని సూచింపజాలు పదము హిందూధర్మ మనుదానికి వైదికధర్మము నొక ప్రభేదపు పేరెన్నటికిని పర్యాయము కానేరదు.

కొందరు హిందూధర్మమును బ్రహ్మధర్మము బ్రాహ్మణధర్మమని పిలుచుట కలదు. హిందూధర్మమునకు బ్రాహ్మణులు యజమానులు; బ్రహ్మోపాసన ముఖ్యాభిప్రాయము. బ్రాహ్మణధర్మమన బ్రాహ్మణుల ధర్మమని యర్థముకాదు. బహువ్రీహ్యర్థమున బ్రాహ్మణధర్మ మన బ్రాహ్మణులు ప్రధానముగా గల ధర్మమని యర్థము చేసికొనవలయును. ఇప్పటికి నీ పేర్లు సరికావు. హిందూ ధర్మమున బ్రహ్మధర్మము అగ్రస్థానమందున్నను దానియం దనేకములు ఇతరధర్మములు చేరియున్నవి. ఈ యంశమును వెలువరచు పేరుండవలదా? బ్రాహ్మణ ప్రాధాన్యమును బౌద్ధజైనలింగాయతాదులు ఒప్పుకొనరు. ఇప్పుడు రాజకీయముగ నితరులును దీనిని ప్రతిఘటింతురు. ఈ కారణమున బ్రాహ్మణధర్మ మనుపేరు కూడ హిందూధర్మమంత వ్యాప్తి నందలేదు. మానియర్ విల్లియమ్సు పండితుడు వైదికధర్మమును బ్రాహ్మణధర్మ మనియు, అది పౌరాణికధర్మముగ అనంతముగ పెరిగిన పిదప దానికి హిందూధర్మమనియు పేరును సూచించియున్నాడు.

కొందరు మన మతమును మోక్షధర్మమని పిలువ నపేక్షింతురు. మోక్షమన పరలోకమని యర్థమగుచో నాస్తికులను వదలి యందరను మోక్షధర్మమువా రనవలసి వచ్చును. కాని మనవారు స్వర్గాది కామలోకములకంటె నుత్తమము, నిత్యమునగు బ్రహ్మానందప్రాప్తి స్థానము మోక్షమందురు. ఇట్టి మోక్షభావన పరదేశములందును పరమతము లందును లేదనియే చెప్పవచ్చును. ఇట్లు మరెవరి చేతికి నందని మన సిద్ధులకు శిరోరత్నమనదగు నీమోక్షాభిప్రాయనామమును మన పేరుకు మూలముగ నంగీకరించరాదేల? అట్లయిన సాలగ్రామపూజకు లనియు మనము పిలుచుకొనవచ్చును. మోక్షాభిప్రాయము మనయం దొకేజాతిగ లేదు. సాంఖ్యుల మోక్షమునకు, నైయాయికుల మోక్షమునకు, వేదాంతుల మోక్షము నకును సంబంధమే యున్న. వేదాంతులందును మోక్షము, నిర్వికల్పసమాధి, నిత్యవిభూతి, వైకుంఠము, కైలాసము, బ్రహ్మలోకము, బృందావనము నను వివిధరూపముల వర్ణింపబడియున్నది. ఈ గహనమగు మోక్షాభిప్రాయము చాలమంది ఆదరణ నలంకరించలేదు. క్షుద్రదేవతలను పూజించు చండాలుని, అసంప్రజ్ఞాతసమాధియందున్న పరమహంసుని సమానముగ మోక్షధర్మి యనుట సులభము కాదు.

ఇట్లే హిందూ ధర్మమునకు వర్ణాశ్రమధర్మమను పేరుకూడ సమర్పకము కాజాలదు. వర్ణాశ్రమధర్మము మన దేశమందు కాక మరెందును లేదనుట సత్యము. మన సంఘమును లోకమునందలి యితరసంఘములనుండి వేర్పరుప జాలు సంస్థయు నిదియే అని చెప్పవగును. అయినను హిందువుల నందరిని వర్ణాశ్రమి యని పిలువరాదు. జైన బౌద్ధలింగాయతసిక్కుమతములు, భక్తిమతములును ఈ వర్ణాశ్రమధర్మము నడప బుట్టినవి. ఆశ్రమ వ్యవస్థయు నిటీవల ఖిలమయినది. శాస్త్రమున వ్రాసియుండు ప్రకారమిది యెప్పుడును మనయందుండెనని చెప్ప సాధ్యము లేదు. శాస్త్రమందలి వర్ణధర్మమునకు ఇప్పటి ప్రచారమున నున్న జాతిధర్మమునకును సంబంధమే లేదు. సంస్కర్తలు కాక వర్ణాశ్రమధర్మముల నొప్పువారు

వర్ణాశ్రమములని రూఢియగుట దర్ఘమేర్పడినది. కాన నీపేరు 'హిందూ' అను దానికి పర్యాయము కాలదు.

మరికొందరు హిందూధర్మమును ఆర్షధర్మము, ఋషిప్రణీతధర్మము అని పిలువ నారంభించిరి. వేదములు, ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు అన్నియును ఋషులపేర్ల ప్రచారమున నుండుట సత్యమే. కాని భక్తిమతము తలయెత్తిన పిదప పుట్టిన అనంతసంఖ్యాకులు భక్తులు, మతసిద్ధులు, గ్రంథకారులు ఋషికులమువారు కారు. నాభాజియు, మహీపతియు వీరిలో ననేకులు శుకనారదాదిఋషుల యవతారమని యీ రెండుశాఖలవారికి సంబంధమును కల్పించినను దక్షిణదేశము ఆళ్వారులు, ఆచార్యులు అరువదిముగ్గురు శివ రనను ఋషుల యవతారము కాదు. వీరే హిందూమతము సగమునకు ప్రణేతలు. జైనబౌద్ధలింగాయతాదులు ఋషిప్రోక్తులు కారు. అను మొదలగు కారణములచే నీపేరు సమర్పకము కాజాలదు.

ఇన్నిటికన్నను సనాతనధర్మమను పేరు ఇపుడు విశేషముగ ప్రసిద్ధికి వచ్చుచున్నది. ఈపేరు మన ప్రాచీనగ్రంథములం దెచ్చటను కానవచ్చుట లేదు. ఇప్పటి రూఢియందును ఈపేరు జైన బౌద్ధ శిఖ ఆర్య ధర్మాదుల కన్వయించుట లేదు. కాని వా రందరును హిందూమాటమునకు చేరదగినవారు.

ఇక కొందరు హిందూధర్మమునకు భారతధర్మమనియు, హిందువులకు భారతులు, భారతేయులు, భారతీయులు అనియు పేరిడ నుపక్రమించిరి. ఇటీవల కొన్ని సంవత్సరములనుండియు మనదేశమున భారతధర్మమహామండలమను నొకసంస్థ కలదు. ఈ మండలి వారు 'హిందూ' అనుదానికి భారతమనుదానిని పర్యాయముగ జేయదలంచిరి. ఇండియాదేశమునకు భరతఖండము, భారతభూమి, భారతదేశము అనుపేరులు చిరకాలము నుండి యుండినట్లు తెలియవచ్చుచున్నది. సంకల్పమంత్రమున నీపేరు కానవచ్చును. విష్ణుపురాణమున స్పష్టముగ నిర్వచింపబడియున్నది. ఈదేశమున కీపేరు వచ్చినందుకు కారణము మాత్రము వివిధముగ నూహింపబడియున్నది. భరతచక్రవర్తి కారణముగ నీపేరు వచ్చినదని కొన్నిచోట్ల చెప్పబడియున్నది. కాని దీనిని వేర్వేరు మువ్వురు భరతులను–శకుంతలాసుతుడు భరతుడు, ఋషభదేవపుత్రుడు భరతుడు, ప్రియవ్రతకులజగు నగ్నీధ్రుని పుత్రుడు భరతుడు–వీరిని గురించి చెప్పబడి యున్నది. ఈపేరుయొక్క ఉత్పత్తికి మరియు కొన్ని యూహలున్నవి. మనచరిత్ర నారంభించదగిన ఋగ్వేదమున భారతు లనువారు ప్రసిద్ధులుగ నున్నారు. వారి ప్రభువు సుదాసుడు చక్రవర్తిగా నుండెనని చెప్పబడియున్నది. మునుపు పాండవులు భారతులని ప్రసిద్ధులుగ నుండిరి. ఇది యీ దేశమంతయు యుధిష్ఠిరుడు పాలించుచుండెనని మనవారి భావన. పాండవుల భరతకులము, సుదాసుని భరతకులము నొక్కటే యయిన నయియుండవచ్చు. ఇపుడు మన ఇతిహాసపు భారతులె ముఖ్యకర్తలయి యీదేశమంతయు నొకసామ్రాజ్యముగ పాలించినందున నీదేశమునకు భారతదేశమనుపేరు ప్రసిద్ధమయి యుండవచ్చును. విష్ణుపురాణము దీనికే తెలుపుచున్నది. భగవద్గీతయందు జిజ్ఞాసువు మరియరి భారతుడని సంబోధింప బడియున్నాడు. గీత వేదమువలె కొందరికి మాత్రమే ఉపదేశముకాదు. కాని ఉపదేశమునకు జాతి పాపకులముల అడ్డేమియు లేకయే సమస్తభారతప్రజకును ప్రసాదింపబడియున్నది. ఈదృష్టితో భారతుడన గీతోపదిష్టుడని యర్థమగును. భారతశబ్దము తొలుత యెట్లు పుట్టియున్నను విష్ణుపురాణకాలమునుండియు దేశవాచిగానే యున్నందున దానిని ఇండియా అను దానికి పర్యాయముగ నంగీకరించుట యుక్తము. ఇండియాదేశమున హిందువులు మాత్రమే ఉండలేదు. కాని భారతశబ్దమున హిందువులును మనదేశమందలి ముసలమానక్రైస్తవులును సమానముగ నిర్వచింపబడుచున్నారు.

## అర్థవ్యాప్తి

ఇంతవరకు సాగిన విమర్శవలన హిందూ అను పేరు పరకీయమైనను ప్రకృత మాపదమును వదలి మరే పదము నుంచుకొన వీలులేదని తెల్లమయినది. కాని యీహిందూ పదము యొక్క అర్థవ్యాప్తి యెంత? ఇది

దేశవాచకమా? జనకులవాచకమా? జనాంగవాచకమా? భాషావాచకమా? మతవాచకమా? సంస్కృతివాచకమా? రాష్ట్రవాచకమా? హిందూకూటమున నెవ రెవరు చేరుదురు? హిందు వనిపించుకొనవలయునో యుండవలసిన గుణము లెవ్వి? హిందువునకు లక్షణము లేవి? ఇత్యాద్యంశముల నించుక విమర్శింపవలయును. మనదేశమందును బయటను ఈ హిందూపదము కొన్నివేళల సంకుచితార్థమందును, కొన్నివేళల విస్తృతార్థమందును వాడుదురు. అరబ్బి మొదలగు ముసలమానదేశములందు ఇండియాదేశమువా రందరిని, ఇచటి ముసలమానులను కూడ హిందువులని పిలుతురు. వీరియం దీపదము దేశవాచకమై భారతమనుదానికి పర్యాయముగ నున్నది. కాని యీ యర్థము లోకసమ్మతము కాదు. మనదేశమువా రందరికిని ఇతరులు ఇండియనులని పేరిడిరి. కాని అమెరికాసంయుక్తరాజ్యమునందు అచ్చటి ప్రాచీనవాసులకు ఎఱ్ఱ- ఇండియను లని పేరున్నందున ఇప్పటినుండి యటకు బోవు భారతీయులకు మరియొక పేరు పెట్టవలసివచ్చెను. ఆదేశమున కొన్ని సమయములందు జపానువారు, చీనావారు, భారతీయులు మొదలగు సకల-ఏష్యాదేశమువారిని 'హిందూ' అనుపేర బిలుచుట కలదు. కాని భారతీయులందరిని, ఇచ్చటి హిందూ ముసలమాన క్రీస్తాదుల నందరిని హిందువులని పిలుచుట సార్వత్రికరూఢి యయినది. ఈ అర్థము లోకసమ్మతము కాదు. అరబ్బీలు హిందువులన సేవకులని కూడ నర్థముంచుకొని యున్నారు.

మనదేశమున కొన్నివేళల హిందూకూటమున జైనులను, బౌద్ధులను చేర్చుట లేదు సిక్కులు, బ్రహ్మసమాజమువారు, ఆర్యసమాజమువారుకూడ తాము హిందువులు కారనియే చెప్పుకొందురు. కాని అందరు వారిని హిందువులనియే భావింతురు. ఐతిహాసికముగను, వ్యావహారికముగను, సాత్త్వికముగను జైనబౌద్ధులు హిందువులలో నొకశాఖవా రగుదురు. కాని ఈవిచారము సరిగ తెలియనికాలమున యూరోపీయులు వీరిని హిందువులకంటె వేరని తప్పభిప్రాయమును పడజేసిరి. ఈమూఢభావనయే ఇప్పటికిని ఈ జాతిపండితులయందు కానవచ్చుచున్నది. ఇతరులభావన వేరు. అబుల్ ఫజల్ బౌద్ధులు హిందువులలో నొకశాఖవారని నిరూపించి యున్నాడు. ఇటీవల 1927 సం. మొదలు కాశీయందు స్థాపితమగు హిందూమహాసభవారు జైనబౌద్ధులను హిందువులని తమకూటమునకు చేర్చుకొనియున్నారు. జైన బౌద్ధులుకూడ దీని నంగీకరించి యీసభయందు పాల్గొన్నారు. ఈమహాసభవారు గుర్తుంచుకొన్న హిందూశబ్దార్థ మేమన హిందువులన ఎవరెవరు హిందువులని పిలుచుకొనుచున్నారో లేక భారతీయమూలమునుండిపుట్టిన యేమతమునైన నెవరవలంబించుచున్నారో, వారని యర్థము. దీనియందు సనాతనీయులు, ఆర్యసమాజమువారు, జైనులు, సిక్కులు, బౌద్ధులు, బ్రహ్మసమాజమువారు మొదలగువారు చేరియున్నారు.

వీరికితోడు అగ్న్యారాధకులగు పారసీకులను సైతము హిందూకూటమున చేర్చవలయునని కొందరు. ఈ పారసీకు లార్యసంతతివారు. వీరిభాషయు ఋగ్వేదభాషయు ఏకోదరభాషలు. ఋగ్వేదము యొక్క మతసంస్కృతులకును, వీరి మతధర్మసంస్కృతులకును మిక్కిలి సమీపమగు దాయాదసంబంధము కలదు. వీ రిప్పటికిని మన వైదికులవలెనే అగ్న్యారాధకులు, సూర్యోపాసకులును. భారతకాలమునుండియు వీరికిని మనకును అవిచ్ఛిన్నమగు నైతిహాసికసంబంధము కలదు. మహాభారతమున పారశీకపురోహితులు మఘబ్రాహ్మణులని పిలువబడియున్నారు. మరియు శ్రీకృష్ణపుత్రుడు సాంబుడు తనకుష్ఠరోగము బాపుకొన సూర్యప్రతిష్ఠ చేయ నుద్దేశించి మనదేశము బ్రాహ్మణుల కాయాగము తెలియనందున మఘబ్రాహ్మణుల సహాయమున మూలస్థానము (ముల్తాను) న సూర్యదేవాలయమును ప్రతిష్ఠించెనట. మనము మనవేదమును అపౌరుషేయమగు అనూచానశబ్దపరంపర యని నమ్మినట్లే పారశీకులును తమగ్రంథమును నమ్ముదురు. వారిలో మనకువలె ఉపనయనము, యజ్ఞోపవీతమౌంజీబంధనములు నున్నవి. వీరి యాచారము లన్నియు హిందువుల ఆచారములే. వీరిలో ఆచారశీలురు కొళాయినీరుకూడ తాకుట లేదు. మనదేశమందు చేరినపిదప దీనినే మాతృదేశమని యెంచి

గుజరాతిని మాతృభాషగ చేకొనిరి. శీలమందును గుణమందును హిందువులనే పోలుదురు. వీరి పరమగురువగు జరథుష్ట్రుడును మన 28వ వ్యాసుడగు జరత్కారువును ఒకటేయని కూడ కొందర యూహ. బ్రిటిషు వారు ప్రయత్నపూర్వకముగ వీరిని వేర్పరచి క్రొత్త వ్యవహారధర్మమును కల్పించి పారసీకులు హిందువులు కారని సంకేతము చేయకుండిన వీరిపాటికి హిందూప్రాకారమునందే పరిగణింపబడి యుందురు. ఈపైకారణములవలన వీరిని హిందూకూటమునందే చేర్చుటయుక్తము.

మరికొందరు 'హిందూ' అనువానిని 'భారత' అనువానికి పర్యాయముగ చేయదలతురు. ఈయర్థము ప్రకారము క్రైస్త హిందువులు, ముసలమానహిందువులు, బౌద్ధహిందువులు, సనాతనీయహిందువులు, శైవహిందువులు అను మొదలయిన హిందూకూటమున సకల భారతీయులు నడగుదురు. కాని యీయర్థము సూక్తము కాదని ముందే తెలిపియున్నాను.

(౧౯౨౯ డిసెంబరు జయకర్ణాటక సంచికనుండి)

## కరస్పర్శ

శ్రీ శివశంకరశాస్త్రిగారు (సాహితీసమితి)

తన్మయతతోడ నర్ధరాత్రమ్మువరకు
నవవినోదకథాపఠనమ్మునందు
అలసి, కారాగృహమ్ములో నరుగుమీద
నేత్రములు మూతవడుమంత నిద్రపోతి.

అట్టి గాఢసుషుప్తికి నంత రాయ
మొదవ నాకస్మికమ్ముగా నులికిపడితి.
అప్రయత్నమ్ముగా మదీయాక్షియుగళి
తెరపువడి పార్శ్వభూమిని దృష్టి వ్రాలె.

స్వాపమున తద్వితర్దికాంచలమునుండి
కాశ్యపీపతనోన్ముఖకాయ మల్ల
నల్లన మనోజ్ఞశీతలహస్త మంటు
కారణమ్మున మెలకువ కలిగె నపుడు.

లేచి కూర్చుండ కానరాలేదు నాకు
చేతనాకార మేదియు శీతభాను
కరవితానసముజ్జ్వలకక్ష్యయందు:
తాళబద్ధ మయోమయద్వారసీమ.

కాని భ్రంశోన్ముఖం బైన మేని కపుడు
ఘాతము ఘటిల్లనీయక కరుణతోడ
నాకు మెలకువ దెచ్చిన యా కరాబ్జ
మంజులాకృతి నిల్చె నా మానసమున.

కంకణ విభూషితం బైన కరసరోజ
మంగనారత్నసంబంధి యనుట తోచె.
అవల యోజనలో తడిజ్జవముతోడ
పత్ని కర మని జన్మించె ప్రత్యభిజ్ఞ!

అరిగె నా సాధ్వి స్థూలదేహమ్ము విడిచి
సప్తవర్షమ్ములకు మున్ను స్వర్గమునకు.
అవ్యయం బైన యాయమ దివ్యమూర్తి
నన్ను గాపాడుచున్న దీనాడు కూడ!

# కాశీవిశ్వవిద్యాలయము

బాలకవి కూరపాటి వేంకటరత్నంగారు

హిందూ దేశమునందు ప్రస్తుత మున్న సమస్త విశ్వవిద్యాలయములలో నగ్రస్థానము నలంకరించియున్న దీ విశ్వవిద్యాలయమే యను విషయము జగద్విదితమైన వృత్తాంతము. మఱియు నానాహూనవ శ్రేష్ఠులు దీనిని విశేషముగా గౌరవించుటకు గారణ మొండు గలదు మన దేశమునం దిదితక్క వేరుదేశీయవిశ్వ విద్యాలయం బొండు గానరాదు. ఇట్టి యద్వితీయవిశ్వ విద్యాలయమునకు దనజీవితమెల్ల ధారవోసినమహనీయుడు శ్రీ పండిత మదనమోహనమాలవ్యులు! తొలుదొల్త ఈ విశ్వవిద్యాలయము శిథిలగృహంబులలో నుండెడిది. అట్టిది నేడు పదునాల్గువందల యెకరముల విస్తీర్ణముగలిగిన భూమిలో, నితరులతో లేశమాత్రమును సంబంధములేక, పూర్వకాలపు గురుకులాశ్రమపద్ధతుల ననుసరించి కట్టబడిన శిలాశాలలతో, విద్యార్థినిలయములతో, గాఢాంధకార బంధురములైన రాత్రులయందును విద్యుద్దీపకాంతులచే బట్టపగలుగనుండు బాటలతో నొప్పుచు, నిరంతము వీక్షింపవచ్చు యాత్రికబృందము సంతసింప, కాశీపట్టణము నకు క్రోశద్వయమాత్రదూరమున, నిర్మింపబడి యొక నూతననగరమువలె నలరారుచున్నది. విశ్వవిద్యాలయ మిట్టి యున్నతదశ నొందుటకు హేతువు శ్రీమదనమోహన మాలవ్యుల యపూర్వసేవయే!

ఈవిశ్వవిద్యాలయపుత్రికను పండితులు ద్విగుణీకృతానురాగముతో పెంచి పెద్దజేసిరి. ఇందులకు మదన మోహనుని వాక్యమే సాక్షి. "పికెటింగు" చేయుచో ని మ్మహనీయుని సహితము స్వచ్ఛందసేవాదళ సైనికులు పోలీసుస్టేషను ప్రదేశమునకు బోనీయనిచో, మదనమోహనుడు చిరునగవుతో "నేను కని, పెంచి, పెద్దచేసిన నాముద్దు కూతును జూడ నేటికిని నే నీ మీయనుజ్ఞ గైకొనవలెనా? నేను నాయనుంగుతనూజాతపై దయాద్వారములమూయ జాల"నని పలికెను. ఈ వాక్య మమ్మహనీయున కీవిశ్వ విద్యాలయతనూజాతపైగల యనురాగమును విస్పష్టము చేయదా?

ఈ విశ్వవిద్యాలయమును గట్టుటకై మదన మోహనుడు, నానాసంస్థానములకేగి సమస్తమహారాజుల సందర్శించి, కోటిరూప్యము లార్జించి, యావిత్తముతో పదునాల్గువందల యెకరముల భూప్రదేశమును, గంగానదీ తీరమున గాశీపట్టణమునకు క్రోశద్వయదూరములో గొని, చుట్టును ప్రాకారము నేర్పఱచి యందు బ్రహ్మాండ మైన సౌధరాజముల నిర్మించెను. విశ్వవిద్యాలయమునందు మూడువేలమంది విద్యార్థులు నివసించుటకు దగినవిద్యార్థి నివాసమందిరముల గట్టించెను. ఒక్కొక్కగది ప్రత్యేక ముగ నొక్కొక్క విద్యార్థికీయబడును. ఇట్టివి మూడు వేలగదులు గలిగిన భవనము లారున్నను, సంయుక్తపరగణాలనుండి యంతగా విద్యార్థులు రాకపోయినను, ఆంధ్ర, తమిళ, కేరళ, కన్నడ, ఘూర్జర, మహారాష్ట్ర, వంగ, కళింగ మున్నగు నానారాష్ట్రముల నుండియు వేనవేలు విద్యార్థు లరుదెంచుచుండుటచే మఱికొన్ని విద్యార్థినిలయ ములు నిర్మింపబడుచుండెను. విద్యార్థులును, గురువులును విశ్వవిద్యాలయములోనే నివసింపవలెను. ప్రత్యేకపుటను దక్క విశ్వవిద్యాలయభూములలో నన్యు లడుగిడరాదు. విశ్వవిద్యాలయవాసు లెవ్వరును పట్టణమున కెందులకును బోనవసరములేదు. వారికి గావలయునవెల్ల విశ్వవిద్యాలయ మునందే లభించును. మఱియు నీ గురుకులవిద్యానికేతన మున నెందరో త్యాగశీలు రుపాధ్యాయులుగా నుండిరి. ఇందులో "గాంధి, రాణి, ధ్రువ, డే, కింగు" మున్నగు మహనీయులు విదేశవిశ్వవిద్యాలయాధిపతులచే నెంతయు గొనియాడ బడిన వారు. వీరిలో ననేకులు గణిత, రసాయన, పదార్థవిజ్ఞానశాస్త్రములలో నింతవఱకెవ్వరును గనివిని యెఱుగని వనేకములు గనిపెట్టిరి. వీరిలో ప్రస్తుతవిశ్వవిద్యాలయాధిపతియైన "ధ్రువ" గారు వేయు

రూకలు విశ్వవిద్యాలయమున కుచితముగ నిచ్చివేయు చున్న మహోదారశీలుడు. మఱియు 'డే' యను నొక వంగరాష్ట్రీగణితశాస్త్రజ్ఞుడు, తనయాస్తిసర్వమీదేశీయ విశ్వవిద్యాలయమున కొసంగి యిందే నివసించుచు, నెలకు నలువదిరూకలుమాత్ర ముదరపోషణార్థమై తీసికొనుచున్న విశ్వదాత. ఆహా! రత్నఖనియైన యీ భారతభూమి యందు త్యాగశీలురకును, దాతలకును లోటుగల్గునా?

మఱియు నీ విశ్వవిద్యాలయమున ఆయుర్వేద కళాశాలయు, సంస్కృతకళాశాలయు గలవు. వ్యవసాయకళాశాలను నిర్మించుచున్నారు. ఉన్నతవిద్యలన్నియును గలవు. మఱియు ప్రత్యేకముగ నిందు సమస్త వస్తు నిర్మాణ శాస్త్రము (Industrial Chemistry) బోధింపబడును. విద్యార్థులకువలయు దంతచూర్ణములు' సబ్బులు, సుస్వరతైలములు, పరిశుద్ధ నారికేళతైలములు, సిరా—మున్నగునవన్నియు నీశాఖవారే సిద్ధమొనరింతురు. ఎల్లరీవస్తువులనే కొనెదరు.

ఈ విశ్వవిద్యాలయము విద్యార్థి జనకల్పకము. ఇందున్న విద్యార్థులకు దేశభక్తియు,ధైర్యస్థైర్యములును, స్వాతంత్ర్యమును వెన్నతోబెట్టిన విద్యలు. ఏవిద్యార్థిని ఇందు కూపస్థమండూకముగతి మెలగనీయరు. ఏవిద్యార్థికిని నోటికి బీగమువైచి,కాళ్లను బంధింపరు. దేశభక్తియను నామసరాజమును ప్రతివిద్యార్థికిని బలవంతముగ లోపల బ్రవేశింపబెట్టుదురు. ఎవ్వనికిని "బాబూ! కత్తి ముట్టకొనకుము; చేయితెగునుసుమా!" యని బోధింపరు. జీవితకాలములో, త్రిలోకములలో స్వర్గమును సంపాదించుటకు దగుమార్గములు, నమృతవచనము లనుమధురపానీయములో గలిపి త్రాగింతురు. ఇంతకన్నవిద్యార్థులకు వేఱేమి గావలయును?

ఇంక నొకటివెంబడి ఒకటిగ నిందలి చిత్రపటమ్ముల వివరించెదను.



౧. శ్రీ మదనమోహనమాలవ్యులు

కాశీవిశ్వవిద్యాలయరమణీమణి ప్రియ జనకుడు పండిత మదనమోహనమాలవ్యులు. ఇమ్మహనీయు డెల్లరకును దెలిసిన యతడే. విశ్వవిద్యాలయమును బూర్తిచేసి ప్రస్తుతము దేశభక్తి జూపుచున్నవాడు. ఈతడును విశ్వవిద్యాలయములోనే నివసించుచు విద్యార్థుల క్షేమమునుదిన మరయుచుండెడివాడు.



## ౨. లింబిడీ, రాజపుటానా విద్యార్థినిలయములు

ఇవి రెండును పెద్దసౌధములు. రెంటింటిలో నారువందలగదులును, భోజనసదుపాయములును, స్నానసౌకర్యములును గలవు. ఇందు సుమారైదువందలమంది విద్యార్థులు నివసింతురు. వీనిలో నొకభవనమును "లింబిడీ" రాష్ట్రాధిపతులును, ద్వితీయసౌధమును రాజపుత్రస్థానాధిపతులును గట్టించిరి. ఈ రెండుసౌధములకును మూడులక్షలైనవట. విద్యుద్దీపములతో జలయుమార్గములతో, సమస్తసౌకర్యములతో నలరారు సౌధరాజములనూచించు నీపటమును చూచినచో నే విద్యార్థి కిటకు రాకుండుటకు మనమొప్పను. వీనిని జూచితీరవలయును గాని వర్ణించుటకలవిగాదు.



3. ఇంజనీరింగు కళాశాల

ఇది యొక మహాసౌధము. దీనియందు ముప్పదిలక్షలరూకల వెలచేయు పరికరములు, యంత్రసామగ్రులు వేనవేలు కలవు. ఇదియే విశ్వవిద్యాలయమునకంతకు విద్యుచ్ఛక్తిని, జలమును పంపునది. పైనజెప్పిన విద్యార్థినిలయములు రెండును ప్రత్యేకముగ ఇంజనీరింగు విద్యార్థుల కీయబడినవి. దీని ప్రధానోపాధ్యాయుడు 'కింగు'గారను నొకపాశ్చాత్యసజ్జనుడు. మాలవ్యుల కీతడనిన అనురాగము మెండు. ఈత డద్వితీయ విద్యాసంపన్నుడు.



## ౮. ఆర్ట్సు కళాశాల

ఇందు మూడువేలవిద్యార్థులు విద్యాభ్యాస మొనరించుచున్నారు. ఇందులో ప్రత్యేకముగ నొక యుపన్యాసమందిరము గలదు. ౨౦౦దరైనను గూర్చుండి వినుటకు దగిన పద్ధతు లన్నియు నేర్పరుపబడినవి. విద్యుద్దీప సముదయములతో, పంకాలతో జూపరుల నానందసాగరమున నోలలాడజేయు దృశ్యము లింతకన్న నేవి? ఇందనేక భాషలు బోధింపబడును. గణితశాస్త్రమును దేశచరిత్రమును ఇందే బోధింపబడును. ఇందొక గొప్ప గ్రంథనికేతన మున్నది. అందనేకాంధ్రగ్రంథములును, సంస్కృతగ్రంథములును గలవు.



రసాయన, పదార్థ విజ్ఞానశాస్త్రములకు ప్రత్యేకముగ నొక్కొక్కదాని కొక్కొక్కకళాశాల నిర్మింపబడినది. వీనిసమీపముననే పారిశ్రామికకళాశాల కలదు. ఇం దేబదిలక్షలరూప్యముల వెలచేయు వస్తువు లనేకము లున్నవి. ఉన్నతవిద్యాశాఖవారి కొక్కొక్కవిద్యార్థికి ప్రత్యేకరసాయనశాస్త్ర నూతనాంశ పరీక్షామందిరము (Research Chemical Laboratory) నిచ్చెదరు. పారిశ్రామికకళాశాలలో సమస్తవస్తునిచయము తయారు చేయబడును. ప్రస్తుత మీభాగములో నాల్గువందల విద్యార్థులు పారిశ్రామిక విద్యాభ్యాస మొనరించుచున్నారు. వారిలో నాంధ్రు లనేకులు గలరు. పారిశ్రామికవిద్యాభివృద్ధియే మాలవ్యుల యభిమత మగుటచే నిక్కళాశాలను స్థాపించి విశేషధనవ్యయ మొనరించి వలయు సమస్తపరికరముల సిద్ధమొనరించిరి.



౬. ఆర్ట్సు విద్యార్థి నివాస మందిరములు

మొత్తము మూడు విద్యార్థి నివాస మందిరము లున్నవి. అన్నియు నొకరీతిగనే యుండును. ప్రథమ విద్యార్థినివాసనికేతనము పొడవు మూడువందల గజములు. వెడల్పును ఇంచుమించుగా నంతే. ఇవియన్నియు చతురస్రములు (Squares). మూడింటిలో సుమారు మూడువేల గదు లున్నవి. మూడువేల విద్యార్థుల భరించు సమర్థత గలవి. విద్యార్థులకు వలయు జల, భోజనాదిసౌకర్యములెల్ల నీ మందిరములలో నున్నవి. లోపలిభాగములలో జూడ ముద్దుగలుగజేయు ప్రసూనారామములు వేయబడినవి.




౭. వివిధ విద్యార్థినికేతనములు

ఈచిత్రములను వీక్షించినచో వీనిపరిమాణము పాఠకులకే తెలియఁగలదు. ఇవి బ్రహ్మాండమైన మందిరములు. విద్యార్థులకు వలయు స్వదేశవస్త్రముల నమ్ము ఖాదీభాండాగార మిందొక టున్నది. విశ్వవిద్యాలయములో నే వర్తకుఁడును విదేశవస్తువుల నమ్మరాదు. వివిధ స్వదేశవస్తువులును లభించును.



౮. కేళీరంగములు

ఏబదియెకరముల విస్తీర్ణముగల యీచోట వివిధకేళీరంగము లేర్పరుపఁబడియున్నవి. ప్రేక్షకులు వీక్షించుట కనుకూలమైన వృత్తాకారనిర్మిత వీక్షణ మందిరములు (Amphi theatres) అనేకము లున్నవి. ప్రతివిద్యార్థియు నేదో యొకయాటలో బాల్గొనవలెను. సాయంసమయమున నెవ్వరును నివాసస్థానములలో నుండరాదు.



౯. ఆయుర్వేదకళాశాల

ఇదియొక గొప్పమందిరము. ఇందు దేశీయౌషధరాజము లెల్ల శాస్త్రయుక్తముగా నొనరించుట నేర్పెదరు. ఆరుసంవత్సరములు నేర్వవలసియుండును. సిద్ధమకరధ్వజము, వసంతకుసుమాకరము మున్నగు రాజయోగ్యౌషధముల నెల్ల శాస్త్రయుక్తముగా నిం దొనరింతురు. ఇక్కళాశాలలో వేయిమంది యాయుర్వేదవిద్యాభ్యాస మొనరించుచున్నారు. విశ్వవిద్యాలయమునకు వలయు వైద్యసహాయ మీయాయుర్వేదకళాశాలయే యొనరించును.



౧౦. నారీమణీకళాశాల, నివాసస్థానము

స్త్రీలపాలిటి కల్పవృక్ష మన సిక్కు శాలలకు! స్త్రీవిద్యాభిమాని యగు కీర్తిశేషుడైన, "శ్రీ సేతుశాతామాకంటి"యను నొక బొంబాయి వర్తకు డిక్కశాలలకై ౫,౧౧,౦౦౦ రూప్యములొసంగెను. ఇక్కశాలలో స్త్రీలు విద్యాభ్యాస మొనరించుటకు దగిన సౌకర్యములెల్ల నున్నవి. ఇందే వారినివాసనికేతన మున్నది. పురుషు లెవ్వరీప్రదేశమునకు పోరాదు. యఫ్. ఏ. వరకునుమాత్ర మిట స్త్రీలకు ప్రత్యేకముగా పురుషులతో సంబంధము లేక విద్యాభ్యాస మొనరించుటకు దగిన సౌకర్యము లున్నవి. ఉన్నతవిద్యలభ్యసించువారు మాత్ర మిందే నివసించి పురుషశాలలోనే విద్యాభ్యాస మొనరింపవలసియుండును. స్త్రీలకుదగు నాటలు, సంగీతము మున్నగున వన్నియు నిటనేర్పెదరు. స్త్రీలకింతకన్న మంచిశాలల గానరాదు.




౧౧. సెంట్రలు హిందూశాల

ఇందు మెట్రికులేషన్ వరకును విద్య నేర్పెదరు. ఇందును విద్యార్థినికేతనము లున్నవి. విశ్వవిద్యాలయములో నున్నతవిద్య నభ్యసించిన విద్యార్థులనే యిందుపాధ్యాయులనుగా నియమించెదరు.



## ౧౨. విశ్వవిద్యాలయారామము

ఇం దన్నివిధములైన వృక్షము లున్నవనియే చెప్పవచ్చును. వేసవిలో ననేకు లీ ప్రమూనారామమున గల నైకతస్థలములపై గూర్చుండి మలయమారుతముల స్వీకరించెదరు. చుట్టును చిన్న మొక్కలువేసి, ప్రేక్షకుల కానందముగలుగునట్లు వానిపై, హంసలు, మయూరములు మున్నగు పక్షిరాజముల చిత్రముల గత్తిరించిరి. నానావిధ పుష్పము లిందు గానవగు. దీని విస్తీర్ణము నలువదియొకరములు.

## ౧౩. విశ్వవిద్యాలయమునందలి యాంధ్రులు

నేడు ప్రతిమానవునకును విఖ్యాతిసంపాదింపవలెనను నూహ జనించినది. "అఱవవారు దేశసంచారము చేయుటలో వన్నెకెక్కినవా"రని కొందరి యభిప్రాయము. కాని ప్రస్తుత మాంధ్రు లుత్తరహిందూస్థానవిశ్వవిద్యాలయములలో ననేకులు కనిపించుచున్నారు. కాశీవిశ్వవిద్యాలయమునందు గతసంవత్సర మాంధ్రులు రెండువందలు; ఈసంవత్సరము మూడువందలు. నానాటికిని వారిసంఖ్య హెచ్చుచున్నది. మఱియు నాంధ్రులే పరీక్షావిషయమున ప్రథమసోపాన మలంకరించుచున్నారు. ప్రతి యాంధ్రసోదరుడును మొదటితరగతిలో వచ్చుటకే ప్రయత్నించుచుటయుట వాడుక. అందుచే నాంధ్రులలో ననేకులు మొదటితరగతిలో వచ్చుటయు, నొక్కొక్కప్పుడు విశ్వవిద్యాలయమునకే ప్రథములగుటయు, మఱియు నొక్కొక్కప్పుడు విశ్వవిద్యాలయములో నాతరగతిలో వచ్చిన యున్నత గుణమునకు (Highest mark) మించి వన్నెకెక్కి ప్రఖ్యాతిగాంచుటయు సంభవించుచున్నది. ఆంధ్రుల నుపాధ్యాయులు గాఢానురాగముతో చూచుచుందురు.

రెండేండ్లక్రింద శ్రీ సీతారామశాస్త్రిగారను నొకయాంధ్రులు విశ్వవిద్యాలయపూర్వోన్నత గుణమునకు మించిన మార్కుల సంపాదించి, పండిత మదనమోహనమాలవ్యుల వినుతికి పాత్రులై సెల కిన్నారు మాక

లార్జించుచు నిటనే యుపాధ్యాయులుగా నుండిరి. ఇంజనీరింగు కళాశాలలో నిరుడు విశ్వవిద్యాలయమునకు మొదటి యాతడును, రెండవ యాతడును మనయాంధ్రులే యైరి. వారి నామధేయములు మాత్రము దావనేలి(౧) చి. దుగ్గిరాల సూర్య ప్రకాశరావు, (౨) చి. వేంకట సుబ్బారావు. గత సంవత్సరము నలువు రాంధ్రు లింజనీరింగు కళాశాలలో మొగటితరగతిలో నుత్తీర్ణులైరి. అనేకుల కిది క్రమక్రమముగ నీ పనగణాలవారిని ప్రోత్సహించి ఆంధ్ర విద్యాలయ మగు "నేమో" యను భయ మున్నది. ఇందులకు మాలవ్యాగారి వాక్యమే తార్కాణము. వారును ఆంధ్రులకు ప్రత్యేకముగ వేరొక విద్యార్థి నివాసనికేతనము కట్టించుటకు వాగ్దానము చేసిరి. ఆంధ్రస్త్రీలును మువ్వురున్నతవిద్యాభ్యాస మొనరించుచున్నారు. వేయేల! ఆంధ్రులకు నిట కలదొంది యాంధ్రమాత యప్పుడెప్పు ప్రఖ్యాతి నామెకు బహుమానముగా నిచ్చెద రని మా యభిప్రాయము.



౧౩. విశ్వవిద్యాలయమునందలి యాంధ్రులు



## సర్ చంద్రశేఖర వెంకటరామన్ గారు

సర్ చంద్రశేఖర వెంకటరామన్ గారికి పదార్థ విజ్ఞానశాస్త్రమున వారు గావించిన నూత్నపరిశోధనలకై నోబెలుబహుమాన మొసగబడినట్లు నవంబరుమాసమున ప్రపంచ మెఱిగికొనెను. ఇది ఆధునికభారతచారిత్ర మున నొకఘట్టము. బహుమానప్రదానము రామన్ మహాశయునకే కాక భారతజాతికి ప్రపంచము గావించు చేమోడ్పు. భారతజాతిచైతన్యము క్షీణించె నని పాశ్చాత్యులలో నొక దురభిప్రాయము ప్రబలమై యుండెను. భారతీయుల సృష్టిచాతురి, శాస్త్రపరిశోధన, ఆత్మసాధన—ఇత్యాదు లన్నియు పూర్వకాలమున వర్తిల్లెనేమో కాని యిపుడు వానిని ప్రశంసించుటకూడ అప్రస్తుత మని ప్రబలయుండినవా రెల్లరుకు మేల్కొనవల సినతరుణ మాసన్న మాయెను.

ఇదానీంతనులలో భారతాగ్రేసరులు కొందఱి జీవితచారిత్రము లిదివఱకే ప్రపంచమున కల్లుకొని భారత జాత్యౌన్నత్యము భ్రమయో ప్రమయో నిరూపించి యున్నవి. రామన్ మహాశయునికి నాగరకప్రపంచ మొసగిన యీ మన్నన హైందవభూరుహమున నవోదయముం గాంచిన ధవళకుసుమము.

ఇం దేమియు నతిశయోక్తి లేదు. అరయుడు. హిందూదేశమున నూత్నవిద్యావిధానము నెలకొని శతాబ్దియైనం గాలేదు. 1857 వ సంవత్సరమున కెటేవలనేకదా మన విశ్వవిద్యాలయము లుద్భవిల్లెను. పకులశాసయుండె మనవిద్యాభ్యసనము సాగుచున్నది. పాశ్చాత్యభౌతిక శాస్త్రములు హిందూదేశమున దిగిన క్రొత్తసరకు. స్వతరిపాటనము లేమిచేత పరిశోధనావకాశములా స్వల్పములు. అయినను రామన్ గారును, ఇతరభారతీయశాస్త్రజ్ఞులును గావించుపరిశోధనలు పైన జెప్పినకష్టములం జవిమాడక



సర్ చంద్రశేఖర వేంకటరామన్ గారు

యున్న పాశ్చాత్త్యదేశములు గావించుపరిశోధనలకు తీసిపోకయున్నవి. పాశ్చాత్త్యులకు కొందఱ కిది ఆశ్చర్యము గొలుపవచ్చును. కాని ఆత్మవిశ్వాసమును కోలుపోని భారతీయులకు స్థైర్యసాహసములనే కలిగింప గలదు.

రామన్ మహాశయుని జీవితము గణుతింపదగినది. ఈయనజననము క్రీ. శ. 1888 వ సం. నవంబరు 7 వ తేదిన. తిరుచినాపల్లి వీరిజన్మస్థానము. తండ్రి విశాఖపట్టనమందు ఏ. వి. యన్. కాలేజీలో గణితశాస్త్రాధ్యాపకులుగాను, పిమ్మట కళాశాలోపాధ్యక్షులుగాను పనిచేసియుండిరి. రామన్ గారు ఆగర్భప్రజ్ఞావంతులు. పండ్రెండవయేటనే మెట్రిక్యులేషన్ పరీక్షయందు కృతార్థులైరి. మదరాసు విశ్వవిద్యాలయమునం బ్రవేశించి 14 వ యేట యఫ్. ఏ., పరీక్షయందును, క్రమముగా నాలుగేండ్లలో బి. ఏ., యమ్.ఏ., పరీక్షలందును కృతార్థులైరి. పైరెండు పరీక్షలలోను వీరు రాజధాని కంతకును ప్రథములుగా మొదటితరగతిలో నుత్తీర్ణులైరి. విద్యార్థిదశయందే వీరికి భౌతికశాస్త్రములందుగల ఆసక్తి వ్యక్తమగుచుండెను.

ప్రజ్ఞావంతులలో పలుతెరగులు గలవు. కొందఱు బాల్యమున నివురుగప్పిన నిప్పువోలె సామాన్యులుగానుండి తటాలున ప్రపంచమునకు తమప్రజ్ఞం బ్రకటింతురు. కొందరు బాల్యమున నద్భుతప్రతిభ గనుపఱచి ఆశల కవకాశ మొసగి వాటిని వ్యర్థ మొనరించుటయుం గలదు. కొందరు బాల్యమునుండియే పూర్ణవిధునిపగిది భాసిల్లెదరు. రామన్ గారీకడపటితెగకు చెందుదురు. వీరి తేజము బాల్యముననే గప్పున వెలిగి చల్లారిపోలేదు. చిన్నప్పటి ఆశ లిప్పటికి ఫలించినవి. 'గౌరవముల నిక తపాలాబిళ్లలవలె కూర్చగల' నని చెప్పగలుగు దశకు వచ్చినవి.

యమ్. ఏ. పరీక్షయందు కృతార్థులైనపిమ్మట ఐరోపా కేగి చదువు సాగింపవలె నని వారు తలంపుగొనిరి. కాని వైద్యులు వారి కా శీతోష్ణస్థితి సరిపడ దనియు అనారోగ్యకారణ మగుననియు నభిప్రాయపడిరి. అందువలన వారు ఐరోపా కేగలేదు. అచటనే చదువు సాగించినచో వా రింతకన్న నెక్కుడు గణనీయములగు పరిశోధనలను గావించియుందురేమో యెవరు చెప్పగలరు? ఐనను, ఇందువలన భారతవిద్యార్థుల కొకగుణపాఠము గలదు. భౌతికశాస్త్రపరిశోధనలను సైతము హిందూదేశమును విడిచిపోకయే సాధించుట కంతేని యవకాశము కల దనియును, అట్టివారిపరిశోధనలం త్రోసిపుచ్చదగినవి గాక శాస్త్రలోకమున నొకచిన్నవిప్లవముల గలిగించునంతటివిగగూడ నైయున్న వనియును రామన్ గారియు మరికొందఱియు విజయోదాహరణములు స్పష్టము చేయుచున్నవి.

సందర్భవశముగా నింకొకమాట: రామన్ గారిని యౌవనమున పాశ్చాత్త్యదేశములకు పోనీక వైద్యు లడ్డువెట్టినను ఇటీవల వారు ఐరోపాఖండ మంతటను అమెరికాయందును సంచార మొనర్చిరి. వారి ఆరోగ్యమున కేభంగమును వాటిల్ల లేదు. ఇపుడు స్వీడనుదేశప్రభునిహస్తమునుండి నోబిలుబహుమతిం గొనుట కా శీతలమండలమునకు పోయి దానిం బడసిరి. వైద్యు లెంత నిపుణులైనను విధివ్రాలునకు కర్తలు గారుగదా!

అట్లు ఐరోపాప్రయాణము విరమింపవలసివచ్చినందున రామన్ గారు ఆర్థికశాఖలో నున్నతోద్యోగముకొరకు జరిగినపోటీపరీక్షయందు జయముగాంచి ప్రభుత్వోద్యోగముం బడసిరి. ఆశాఖలోనే కలకత్తాయందు పనిచేయునపుడును, వారు తమ బాల్యప్రియ యగు పదార్థవిజ్ఞానశాస్త్రమును వదలిపెట్టక, భౌతికశాస్త్రాభివృద్ధికై డా॥ మహేంద్రలాల్ సర్కారుగారు స్థాపించిన ఇండియను అసోసియేషను పరిశోధనాగారమున శాస్త్రపరిశోధకులుగా వ్యవధి నెల్లను సార్థకపఱచుచుండిరి. అప్పుడే వారు ధ్వనిశాస్త్రమున కొన్ని పరిశోధనలం గావించి వ్యాసరూపముగా ప్రచురించిరి.

తరువాత 1914 వ సం. లో కలకత్తానగరమున అఖిలభారతభౌతికశాస్త్రసమావేశము జరిగెను. అపుడు రామన్ గారు తమపరిశోధనలవలన గన్గొనినయొకవిషయముం గూర్చి వ్యాసమును రచించి చదివిరి. ఇది కలకత్తా విశ్వవిద్యాలయోపాధ్యక్షులు సుప్రసిద్ధవిద్యాదక్షులు నగు సర్ అశుతోషముఖర్జీగారియొక్కయు, మరికొందరు జ్ఞానవృద్ధులయొక్కయు గణుతి కెక్కెను. జ్ఞానాంకురముల గుర్తించి పోషించి పెద్దచేయుటయందు సర్ అశుతోషుగారికిగల ప్రతిభ యితరుల కెవ్వరికిని లేదు. అందువలన వారు 1918 వ సం.లో కలకత్తా విశ్వవిద్యాలయపు సైన్సుకళాశాలాధిపనములు పూర్తి కాగానే రామన్ గారిని పదార్థవిజ్ఞానశాస్త్రమున పలిట్ ప్రొఫెసరు

(Palit Professor of physics) గారమ్మని ఆహ్వానించిరి. రామన్ గారు ఆర్థికముగా తమకు ప్రభుత్వోద్యోగమే లాభకారి యైనను జ్ఞానతృష్ణం దీర్పగల అధ్యాపక పదవినే అంగీకరించెను. మొదట ప్రభుత్వోద్యోగమునకు రెండేండ్లు సెలవు పెట్టి అటుపిమ్మట దానిని పూర్తిగా వదలుకొని తనజన్మమును శాస్త్రపరిశోధనకే జ్ఞానవ్యాప్తికే సమర్పింప నిశ్చయించెను. వారి యీ నిశ్చయమువలన వారు ధన్యత్వం గాంచిరి. భారతదేశమును ధన్యతంగాంచినది; ప్రపంచమునకు లాభించినది. శాస్త్రలోకమునకు అందరాని పండ్లు కొన్ని చేజిక్కినవి.

ఇదియును స్తోత్రపాత్రమగు త్యాగమే. ఎందఱు భారతీయువజనులు విద్యార్థిదశయం దద్భుతప్రతిభ జూపి ఉపాధ్యాయులకును సహాధ్యాయులకును మిఱుమిట్లు గొల్పువారు కేవలము ప్రభుత్వోద్యోగులై విద్యాగంతును విడనాడి స్వార్థపరులై మానవలోకమునకును జ్ఞానలోకమునకుం గూడ అపరాధ మొనర్చుచున్నారు! వారెల్లరు రామన్ మహాశయు నాదర్శముగగొని శాస్త్రోపాసనయే జీవనధర్మముగా గొని కృతకృత్యు లయ్యెదరు గాక! మనవిశ్వవిద్యాలయములును అట్టివారికి పలయు సదుపాయముల నెల్ల సమకూర్చుచుండు గాక!

అప్పటినుండియు రామన్ గారు కలకత్తా విశ్వవిద్యాలయమున నదేపదవియందు కృషి చేయుచున్నారు. వారిపరిశోధనాగారమునుండి ప్రతిసంవత్సరమును కొంతనూత్న తేజము బహిర్గతమగుచునే యున్నది. ముఖ్యముగా నిపుడు వీరికి నోబెలు బహుమానము జేకూర్చినది వెలుతురు తరంగములంగూర్చి వీరు గావించినపరిశోధన. దీనికే 'రామన్ ఎఫెక్టు' (Raman Effect) అని ప్రపంచము నామకరణము జేసినది. దీనింగూర్చి వ్యాసాంతమున నించుక నుడివెద.

గౌరవములును వీరికరము నందుకొనుటకు ఆలసింపలేదు. 1921 వ సం. కలకత్తా విశ్వవిద్యాలయమువారు వీరికి డాక్టరు ఆఫ్ సైన్సు (Doctor of Science) గౌరవ బిరుదము నొసగిరి. 1924 లో వీరు రాయల్ సొసైటీయం దున్నతసభ్యులు (Fellow of the Royal Society) గా చేర్చుకొనబడిరి. బ్రిటిష్‌సామ్రాజ్యమున శాస్త్రవేత్తలకింతకుమించిన గౌరవము లేదు. 1929 వ సం. లో ప్రభుత్వమువారు వీరికి "సర్" బిరుదము నొసగిరి. తరువాతనే ఇటలీదేశమువారు వీరికి "ప్రేమియో మెటుసీ" మెడలు నొసగి బహూకరించిరి. అదేకాలమున జర్మనీలోని ఫ్రీబర్గువిశ్వవిద్యాలయము వీరికి ప్రకృతి దార్శనికపారీణ (Doctor of Natural Philosophy) బిరుదము నొసగెను. కెనడా, అమెరికా మున్నగుదేశములందు రామన్ గారు సంచారమొనర్చి కడుంగడు ప్రశంసింపబడిరి. ఇప్పుడు నోబెలుబహుమాన మందుటకు ముందుగా రాయల్ సొసైటీవారు హ్యూస్ మెడలును వీరికీయ నిశ్చయించిరి.

నోబెలుబహుమానములు యావల్లోకప్రాశస్త్యము గలవి. ఇవి ఐదు. స్వీడనుదేశపు రసాయనశాస్త్రజ్ఞుడు సర్ ఆల్ఫ్రెడ్ నోబెల్ గారు డైనామైట్సు (Dynamite) మున్నగు యుద్ధసామగ్రిం గనిపెట్టినవారు. విశేషధనము సముపార్జించి, అది జ్ఞానాభివృద్ధికిని ప్రపంచకల్యాణమునకును తోడ్పడుగాక యని ఐదువిషయములందు ప్రపంచములోనెల్ల ఉన్నతిగనినవారికి నొసగవలసినట్లు ఐదుబహుమానముల నేర్పఱచి యశఃకాయు డాయెను. ఈబహుమానములు ప్రతిసంవత్సరము నొసగబడుచుండును. ఒక్కొకటియు రమారమి 6500 పౌనులు. ఇవి యేవిషయములకన—(1) పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics) (2) రసాయనశాస్త్రము (Chemistary) (3) వైద్యశాస్త్రము (Medicine) లేక మానవ శారీరశాస్త్రము (Physiology) (4) ఆదర్శ శ్రేష్ఠరీతి కవిత (5) ప్రపంచశాంతి.

ఆసియావాసులలో నోబెలుబహుమానము నందుటకు రామన్ గారు ద్వితీయులు. ప్రథములు రవీంద్రనాథ టాగూరుగారు. వీరు కవిత్వమున గౌరవమునందిరి. భౌతికశాస్త్రమున ప్రాశస్త్యమునకై నోబెలుబహుమతిం బడసిన ఆసియావాసులలో రామన్ ప్రథములు.

మరి రామన్ గారి పరిశోధనంగూర్చి యించుక: 'రామన్ ఎఫెక్టు' అనునది వెలుతురు తరంగములకు సంబంధించినదని చెప్పియున్నాను. దీనికి రామన్ గారు క్రొత్తరేడియేషన్ (New Radiation) అని నామమిడిరి. రామన్ ఎఫెక్టు అనుపేరు పెట్టినది జర్మను

శాస్త్రజ్ఞుడు ప్రింగ్‌షీమ్ (Pringshim). దానిని Encyclop œdia Britannica) లో ప్రొఫెసరు ఆండ్రడేగా రిట్లు వర్ణించినారు.

"ఏకవర్ణకిరణ మొకటి ప్రవేశనీయపదార్థముం జొచ్చినప్పుడు, సనాతనకిరణపథంబునుండి కొంత తేజస్సు చిందబడుచున్నది. దీనితరంగదీర్ఘత ఆదికిరణ తరంగదీర్ఘతకన్న నెక్కుడుగానున్నది. ఈపరిణామమే రామన్ ఎఫెక్టు (Raman Effect) ఇది 1928 వ సం.న రామన్‌గారిచే కనిపెట్టబడెను."

ఇదియే కాక, రామన్‌గారు ఆకాశపు నీలిమం గూర్చియు సముద్రజలవర్ణముం గూర్చియు వీణాద్యనేక సంగీతధ్వనితరంగములం గూర్చియు నూత్నసమాధానము లను క్రొత్తక్రొత్తవిషయములను ప్రపంచమున కెఱిగించి యున్నారు.

---

## చైతన్యుడు – సత్యాగ్రహము.

సత్యాగ్రహము మహమ్మదీయుల కాలమునాడు కూడ గలదని చరిత్ర ఘోషించుచున్నయది. మతము నుద్ధరించిన మహనీయులలో చైతన్యస్వామికూడ మిగుల గొప్పవాడే. వంగదేశ మంతయు చైతన్యుని మతముచే పునీతమైనది. చైతన్యుని మతము ప్రేమ మతము. ఇప్పుడు క్రిస్టియను లెట్లు తమ మతోద్ధారణ నిమిత్తమై పాటు బడుచున్నారో, పూర్వము మహమ్మదీయు లట్లు పాటు పడెడువారు. మహమ్మదీయమతము జోరుగ విజృంభించెడి దినములయందు చైతన్యమతము చెలియలికట్ట వలె దాని కడ్డుదగిలినది. చైతన్యస్వామిది నడియా నగరము. ఆపట్టణపు కాజీ చైతన్య మతముపై నలుపుటకై "కృష్ణ సంకీర్తన మెవ్వరైన నొనరించినచో వారిని పట్టుకొని బలవంతముగ మహమ్మదీయమతమున గలుపుకొందుము" అని ప్రకటించెను. ఆప్రకటన నాలించినంతనే చైతన్య స్వామి తనప్రియశిష్యుడైన నిత్యానందుని బిలచి యాగ్రామమునందలి ప్రతి వైష్ణవుని గృహము నకు జని "నేను నేడు కృష్ణసంకీర్తనముతో భజన సమాజమును కాజీగారి యింటిముంగిటనుండియే నడిపించు కొని పడలెదననియును, అందు పాల్గొనదలంచు భక్తులెట్టి కష్టములకైన సహింప సంసిద్ధులయి రావలయుననియును తెలుపవలసినది" యని పంపించెను. వెంటనే హిందువు లెల్లరు స్త్రీపురుషులు ఆయూరి నదియందు స్నానము చేసి తిరుమణి శ్రీచూర్ణముల నలంకరించుకొని "రాధా రమణ మదనమోహన బృందావనచంద్ర కృష్ణ" యనుచు పాటలబాడుకొనుచు నాటలాడుకొనుచు బ్రహ్మాండమగు నూరేగింపుతోడ కాజీగారి యింటిముంగిటనుండి చనిరి. కాని కాజీదూరదృష్టిగలవా డగుకతమున తన బెదిరింపు నమలుసంపుంపలేదు. అప్పుడు చైతన్యుడు తన శిష్యుని ద్వారా లోని కిట్లని కబురంపించెను. "నేను తమ మందిరమున ఆతిథ్య మొందుటకు శిష్యసహితుడనై రాగా యేల దాగొనియెదరు." ఆపలుకు లాలించి కాజీ పశ్చాత్తప్తచిత్తుండై "మహానుభావా! నాయపరాధముల క్షమింపుడు. ఏకగ్రామవాసుల మగు కతమున మన మిరువురమును అన్నదమ్ములము. నాయుద్యోగము పోయినను సరియే గాని మీవంటి భగవద్భక్తులను బలవంతముగ నిస్లాము మతమున చేర్చి నే నపచార మొనరింపజాలను. నేటినుండియు మీ నగర సంకీర్తనమున కెట్టిభంగము నుండబోదు" అని నుడివెను.

—పులవర్తి కమలావతి దేవి.

---

## ౪ వ ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభ

## ౧౩, ౧౪–౧౨–౧౯౩౦

## విద్యావిషయక తీర్మానములు.

1. ప్రజల నిరక్షరత్వమును బాపుట ప్రభుత్వము వారి ప్రథమకర్తవ్యము గనుకను, చదువురాని జన బాహుళ్యమునకు రాజకీయసంస్కరణముల ప్రయోజనము తెలియదు కావునను పల్లెయు, గ్రామము, పట్టణము అను భేదములేకుండ దేశమందంతటను అచిరకాలముననే బాలబాలికలకు వేరు వేరుగా గాక కలిసియే నిర్బంధప్రాథమిక విద్య యుండవలయుననియును ఈసభవారు రాష్ట్రీయప్రభుత్వమువారిని, స్థానికాధిసంఘము

వారిని, పురపాలక సంఘమువారిని కోరుచు ప్రజలను కూడ తగినంత ఆందోళన చేయవలయునని కోరుచున్నారు.

2. ప్రతిజిల్లాకు అధమము ఒక ఉన్నత పాఠశాల, స్త్రీలకు ప్రత్యేక కళాశాల లేకపోవుట ఒక గొప్పలోటుగా నున్నది కావున ఆంధ్ర విశ్వ విద్యాలయమువారిని త్వరలోనే ఆలోటు పాపి స్త్రీల ఉన్నత విద్యావ్యాప్తి హెచ్చించుటకుగాను శీఘ్రమైనంత త్వరలోనే కళాశాల నొకటి స్థాపించుట అవసరమని ఈసభవారు తీర్మానించుచున్నారు. ఒక ప్రత్యేక సంస్కృత కళాశాలకూడ స్త్రీలకొరకు స్థాపించుట అత్యావశ్యకము.

3. పాఠశాలలలో బోధింపబడు విషయము లన్నియు స్వభాషలోనే నేర్పబడవలెను. ఆంగ్లము రెండవ భాషగ నుండవలెను. హిందీకూడ తప్పని సరిగ నేర్పబడవలెను.

4 ప్రస్తుతము నేర్పబడు విద్యావిధానము సరిగా లేదనియు, దేశభక్తి, నీతి మొదలగు విషయములను బోధించునదిగా విద్య యుండవలెననియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

5. చిన్నవయస్సుననే విద్యను విరమించిన వారికిని, జీవనోపాధి లేక యల్లాడువారికిని ఉన్నత విద్య గరపుటకై ప్రత్యేక పాఠశాల లుండవలెను. ఆపాఠశాలలలో ఎక్కువగ పరిశ్రమలను బోధించునవిగా నుండిన చాల లాభకరము.

6. దేశదారిద్ర్యమును తొలగించుటకు దేశీయ పరిశ్రమల అభివృద్ధి చేయుట ఆవశ్యకము గనుక అటువంటి దేశీయ పరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సాహము నొసగ ప్రజలను ప్రార్థించుచున్నారు. మన దేశములోనే తయారైన వస్తువులనే వాడుకొనవలసినదిగ ఈసభవారు ప్రజలను కోరుచున్నారు.

7. వైద్యవిద్య నభ్యసించుటకు స్త్రీలకు ఎక్కువ ప్రోత్సాహము కలుగునట్లుగా విశాఖపట్టణ వైద్య కళాశాలలో ఎక్కువ మంది విద్యార్థినులు చేరుటకుగాను వారికి ప్రత్యేక వసతి గృహము నేర్పరుచుటకు ఆంధ్ర కళా పరిషత్తువారిని ఈ సభవారు కోరుచున్నారు.

8. గత 20 సంవత్సరములనుండి స్త్రీవిద్యాభివృద్ధికై తోడ్పడుచున్న నర్సాపురంతాలూకా స్త్రీ విద్యాభివృద్ధి సంఘమువారిని ఈసభవారెంతయు అభినందించుచున్నారు.

9. ఉన్నత బాలికా పాఠశాల లుండు ప్రదేశములందు ఉపాధ్యాయులకు, విద్యార్థినులకు తగు వసతి గృహములను ఏర్పరచవలెను.

10. పాఠశాలా భవనములు పరిశుభ్రముగాను, గాలి, వెల్తురు ధారాళముగా లోపల ప్రవేశించుట కనుకూలముగాను, తగినంత బహిరంగ-ఆట-స్థలము కలవిగా నుండవలయును.

11. ఆంధ్రదేశమునందు బాలికలకు సంబంధించిన జాతీయ సంస్థలను మనము ఆమోదించవలెననియు, అందు బాలికాభివృద్ధికై జాతీయపద్ధతులపై నడుపబడుచున్న జాతీయ విద్యాలయములకు మన ఆంధ్ర మహిళామణులెల్లరు బాలికల నంపియు, అర్థసహాయము చేసియు తోడ్పడవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

12. మన ఆంధ్రదేశమున స్త్రీలకొరకు గృహలక్ష్మియను పత్రికారత్నమును స్థాపించి స్త్రీల విజ్ఞానాభివృద్ధికై అమూల్య సహాయము చేయుచున్న డాక్టరు కె. యన్. కేసరిగారి నీసభవారు మనఃపూర్వకముగ నభినందించుచున్నారు.

## సాంఘిక తీర్మానములు

1. హరవిలాస శారదా గారు చట్టముగా మార్పించిన బాల్యవివాహ నిషేధచట్టమును జన బాహుళ్యము ఆచరణలో పెట్టకుండుట ఎంతయు శోచనీయము. శారదాసంఘము లేర్పడి తగిన ప్రచారము చేయగలందులకు ఈ సభవారు ప్రజలను గోరుచున్నారు.

2. ఈచట్టములో వయస్సు తగ్గించు మార్పుచేయదలంచుచున్నట్లు నూపనలు కన్పట్టుచున్నవి. అటువంటి మార్పుకు ఈసభవారెంతయు అసమ్మతి చూపుచున్నారు. బాల్య వివాహము చేసినట్లు కేసు పెట్టువారు 100 రూ. ధరావతు కట్టవలెనని గవర్నమెంటువారు చట్టములో పెట్టి

యున్నారు. ఆవిధముగా 100 రూ. ధరావతు ప్రజలు కట్టుట అసంభవము గనుక అవందరూపాయల ధరావతు తీసివేయమని ఈసభవారు కోరుచున్నారు.

3. స్త్రీవిద్యావ్యాప్తికిని, దేహారోగ్యము కలుగుటకును, లోకజ్ఞాన మలవడుటకును ప్రతిబంధకమైన ఘోషాపద్ధతిని తొలగించుట అత్యవసరమని ఈసభవారు నొక్కి వక్కాణింపుచున్నారు.

4. సంఘ గౌరవమునకు హానికర మగు వరశుల్కములను తీసుకొను పద్ధతిని నీసభవారు ఖండించుచున్నారు.

5. ఇప్పటికిని మన దేశములో అస్పృశ్యతాదోషము ప్రబలముగా నుండుట కడు శోచనీయ మనియును, పాఠశాలలు, వసతిగృహములు, సత్రములు దేవాలయములు, బావులు, చెరువులు మున్నగు ప్రదేశములకు ప్రవేశము కలుగచేయు విషయములలో అంటరాని వారికిగల నిర్బంధము లన్నింటిని తొలగించి హిందూ సంఘమునకు సాంఘిక బలమును చేకూర్చవలసినదని హిందువులలోని అన్ని వర్ణములవారిని హెచ్చరించుచు అట్టి నిర్బంధములను తొలగింప ప్రయత్నించు వారి కందరకు వలసిన సహాయమును చేయుటకు సంసిద్ధులమై యున్నామని అభిప్రాయమును ఈ సభవారు తెలుపుచున్నారు.

6. పల్లెటూళ్లుతిరిగి వాటిపునరుద్ధారణము చేయుట చాలా ఆవశ్యకము గనుక అట్టి పనిని చేయుటకు సంఘసేవయం దభిలాషగల విద్యావంతులను ప్రతి జిల్లాసంఘము వారు వారివారి జిల్లాలయందు తిరిగి ప్రచార మొనర్చుటకు తగు వేతనము లిచ్చి నియమింపవలెనని యీసభ వారు తీర్మానించుచున్నారు.

7. మద్యపాన నిషేధ విషయమై బాగుగా ప్రచారము జరుపబడి ప్రజలలో అనుకూలాభిప్రాయము కలుగుచున్నందుకు సంతోషమును వెలిపుచ్చుచు మత్తుపదార్థములను తయారుచేయుట, విదేశములనుండి దిగుమతిచేయుట మొదలైనవానిని మాన్పుటకు సమయము వచ్చినది గనుక అట్టి శాసనము శాసించుట అత్యవసరమని యీసభవారు అభిప్రాయపడుచున్నారు.

8. పిత్రార్జితపు ఆస్తిలో కుమాళ్లతోపాటు కుమార్తెలకు కూడ సమానవాటా హక్కులును, భర్త ఆస్తిపై భార్యకు సంపూర్ణాధికార ముండవలెనని తీర్మానించుచు మైసూరు గవర్నమెంటు ఈ విషయములో చేయుచున్న కృషికి వారికి ఈసభవారు అభినందనము లర్పించుచున్నారు.

9. వివాహ విచ్ఛేద విషయములందు స్త్రీ పురుషులకు సమానహక్కు లుండవలెనని యీసభవారు తీర్మానించుచున్నారు.

10. వికలాంగులకు, రోగులకు అనాథశరణాలయములు దేశమం దెక్కువగా కావలసియున్నవి. పెక్కండ్రు నిరాధారముగా అల్లాడిపోవుచున్నారు. ఇతరదేశములందువలె మనదేశమునందుకూడ శరణాలయములు స్థాపించు ఆవశ్యకమని యీసభవారు తీర్మానించుచున్నారు.

11 కన్యలకు చెప్పతగు వితంతుబాలికలు వివాహ మాడకోరినచో వారికి తల్లిదండ్రులు తమగృహమందే తప్పక వివాహము చేయవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

12. ఆంధ్రదేశము చాల విస్తీర్ణమైనది గనుక ఎక్కువ ప్రతినిధులు అఖిలభారత మహిళా సభకు పోవలసియుండును గాని, దత్తమండలములనుండి ఎక్కువ ప్రతినిధులు పోవుటలేదు గాన దత్తమండలములకు ప్రత్యేకముగా ప్రతినిధుల నెన్నుకొను హక్కుండుట (a separate constituency) అవసరమని ఈసభవారు తీర్మానముచేయుచున్నారు.

---

## అమెరికా యందలి స్త్రీలకళాశాలలు

[డా. సుధీంద్రబోసు గారు డిసంబరు, ౧౯౩౦ మాడర్న రివ్యూ పత్రిక యందు వ్రాసిన వ్యాసమునకు సంగ్రహము.]

పదిలక్షల మొదలు ఏబదిలక్షల డాలరులవఱకు ఖర్చుపెట్టుచు, ఐదువేలు మొదలు ఇరువదివేల విద్యార్థు

లకు విద్యాదానముచేయు పెద్దపెద్ద అమెరికను విశ్వకళాపరిషత్తులనుగురించి భారతదేశమున చాలగ తెలియును. అమెరికాసంయుక్తరాష్ట్రములందు కర్మాగారములవలె విద్యాసంస్థలను పెద్దమొత్తములుగా సరకు తయారుచేయుట ఒకగుణము. ఈ ప్రాంతమున పెద్దవిశ్వకళాపరిషత్తు కాక చిన్నకళాశాల లనేకములు వర్ధిల్లుచున్నవి. వాని అందచందములు వానివి. విద్యాభ్యాసమున సమర్థను కిట్టని అనేకులు విద్యార్థులకు ఈ కళాశాలలు నచ్చును. అమెరికా విద్యావిధానమున ఒక ప్రత్యేకలక్షణమేమన, దేశమంతటను చినచిన్నకళాశాలలు, పెద్దవిశ్వకళాపరిషత్తులకు పందెము వేయగలవి, ఏమ్మార్కొని యున్నవి. కళాశాలపరిమాణముతలన అందలి బోధన ప్రామాణ్యమున కేమియు ముప్పు కన్పడదు. సంచిర్థమానముగు స్త్రీ కళాశాల యొకటి నేను పెక్కుసారులు సందర్శించి యోజించుచున్నది లిండెన్‌వుడ్ కళాశాల. ఇది సేంట్‌లూయీకి సమీపమునన్న సేంట్‌చార్లెస్‌కడ నున్నది. ఈకళాశాల నాలుగేండ్ల అధ్యయనమునకు 'Bachelor of Arts,' 'Bachelor of Science,' 'Bachelor of Music'అని మూడు డిగ్రీలు—విద్యలయందు, విజ్ఞానమందు, సంగీతమందు—ప్రసాదించును. అందు ఏట ఐదువందలమందికి మించి చేర్చుకొబడరు. బోధనప్రామాణ్యము మాత్రము అత్యుత్కృష్టమై దేశమందలి ఉత్తమములగు కళాశాలలకును, విశ్వకళాపరిషత్తులకును ఎనవచ్చుచున్నది.



(1) జాన్ ఎల్ రోమరుగారు

ఇది క్రీ. ౧౮౨౭లో సంస్థాపితము. ౧౯౨౭లో శతాబ్దిపర్వము సలక్షణముగ జరిగినది. దీనికి డాక్టరు జాన్ ఎల్. రోమరుగారు అధ్యక్షులు. ఈయన చాల మంచివాడు; ఉత్సాహశాలి; విద్యాసంపన్నుడు. ఇంత సమర్థుడు అధ్యక్షుడుగా నుండుటకు లిండెన్‌వుడ్ కళాశాల నిజముగా నోమునోచికొన్నది. ఆశయములను, బోధననైపుణ్యమునను ఉత్తమకోటికి చెందు స్త్రీపురుషులు ఉపాధ్యాయులై వారికి తోడు. పురుషులకే కాక స్త్రీలకును విద్యాసంపన్నత అలవడుటచే అమెరికా ప్రజాస్వామ్యము క్షేమముగానుండునని యోజించి స్థిరజ్ఞానతత్పరులై వర్తింతురు.

అధ్యాపకులకును అధ్యాయినులకును ఒండొరులకు మిత్రభావమే. ఎంత పనియున్న విద్యార్థిని వచ్చినదన్న అధ్యాపకులు సిద్ధము. పఠనాలయము దాటియు సుఖమైన కలయిక యేర్పడుట కిదియే ముఖ్యకారణము.

ఈకళాశాలకు వచ్చు బాలికలందఱును సంపన్నగృహములనుండియే వత్తు రనుకొందురు. కాని వారియందా టెక్కు లేమియు కన్పడవు. వారు లజ్జావతులు; చూచుటకు ముద్దులొలుకుచుందురు. వారివేషభాషలును, నడతయు మంచి అభిరుచి వెలసినవై, నాజూకుతనము, నవనవ, మోహనత చిలుకుచుండును. అందఱును కలవారు కారు; ఐనను అచట కలవారని, లేనివారని తారతమ్యము లేదనుట చూపుటకు ముంజేతికంకణము. అసలు, లిండెను వుడులో పరువువలని, ధనికతవలని భేదములు గణనకు రావు. అక్కడ కావలసినదెల్ల సత్తు, తెలివి, పరిశ్రమ, శీలము—అంతే.

విద్యార్థినులు ఖర్చు ముక్తసరుగా పెట్టుకొనుటయే అధికారుల తాత్పర్యము. తలిదండ్రులు పిల్లలకు ఖర్చుకని డబ్బు పోసివేయుట వారికి కిట్టదు. పిల్లలసౌకర్యము

నక్కై కళాశాలలో ఒక బాంకు స్థాపించినారు. అందు పిల్లలు డబ్బు నిలువచేసికోవలెను.

పైపట్టణములనుండి వచ్చువారిలో సమీపమందలి సేంట్ చార్లెస్‌వారు తప్ప తక్కినవారందఱు కాలేజివసతి గృహములలోనే ఉండవలయును. ఇట్టి ఐదువసతి గృహములు కలవు. ప్రతివసతి గృహమును ఒక పెద్దపేరక్క (House Mother) చక్కబెట్టుచుండును. ఆబిడ ముఖ్యమైనపని శిక్షపెత్తనము కాదు. ఆమె తన చెప్పుచేతలలో పిల్లలకు 'ఇది మనకుటుంబము' అను ఒక సహకార సాహచర్యశక్తిత్వమును పుట్టింపవలయును. నివాసముపట్ల వారికి కళాశాల ఒకసంసారము: ఈ ఏకసంసారభావ పరిపాకమునకు చాలశ్రద్ధగ ప్రయత్నము జరుగుచుండును. ప్రతివసతిగృహమునను ఒక విద్యార్థిని అధ్యక్షురాలు. పనులు, ఆటపాటలు చక్కగా జరుగుచుండును. ఈ బాలికల జీవితము చాల ఉల్లాసముగా, నిండుగానుండును; ఏమన, వారు యంత్రములవలె గాక మానవవ్యక్తులవలె జీవింతురు.

ప్రతిపిల్ల తనగది తాను చక్కబెట్టుకొనును. అందఱు పిల్లలును గృహపారిశుద్ధ్యమును పాటింపవలసియుండును. సంవత్సరాంతమున ఐదు వసతి గృహములనుండియు ఏదో, ఒక్కదానికి (పారిశుద్ధ్యమునకు) బహుమతు లిత్తురు.

పాటింపవలసినదిగ వారికి చిన్నతో పెట్టునవి కొన్ని 'వద్దు'లు ఈ దిగువ గలవు:

'నీపొరుగక్కలేనప్పు డామె గదిలోనికి వెళ్లవద్దు. ఏదైన పోవచ్చు.

'నీగదిలోని తోడి బాలికవస్తువులు ఆమెను అడుగనిదే వాడవద్దు.

'ఇంటికి తరచు జాబు వ్రాయుట మఱవవద్దు. నీ ఉత్తరములకు అచట ఎదురుచూచుచుందురు: అక్కడ వారికి అంత తొరగా గడవదు వేళ.

'ఒక్కపిల్లతోనే ఆడుకొనుచు కూర్చుండవద్దు. కళాశాలలో ౫౦౦ మంది యున్నారు.



(౩) 1. కోమరుహాలు, లిండన్‌వుడ్ కళాశాల; 2, 3, 5. ఉత్సవదృశ్యములు; 4. కోమరువసతి

'వ్యాయామశాలను ఏమఱవద్దు.

'కళాశాల కొకడజను ట్రంకులు తెచ్చుకొనవద్దు. సాదాఅయిన, యోగ్యమయిన దుస్తులు కొలదిగా నున్న చాలును నీకు.

'ఎవరైన జబ్బుగా నున్న ఆమె కొక చీటి పంపుము. ఆమె మెచ్చుకొనును; నీవు మఱచిపోయినను చాల కాలమామె మఱవకుండును.

'నీసఖురాలిదుస్తులు నీవు ఎరవుపుచ్చుకొనకుము. నీయంతతనము నీ వుంచుకొనుము.'

కళాశాలకు ప్రత్యేక మొకధర్మ—ఆసుపత్రి. అందు వైద్యుడు, దాది పిల్లల ఆరోగ్యము చాల జాగ్రత్తతో చూచుచుందురు. తరుచు వ్యాయామము జరుగుచుండును. ఆటలకు, సాములకు తగిన గరిడీ లున్నవి.

రోమరుగారి భార్య యున్నది; ఆయన వెనుక అబిడయే అప్పటివారి మక్కువ మాఱుకొన్నది. ఆమె విద్యార్థినులకు నాయకురాలు. ఆమెను వారు 'Mother Roemer' ('రోమ రమ్మ') అని పిలుతురు. ఇంకొక చిత్రమైన విషయము: ఇచట నొక 'విద్యార్థినీ స్వపరిపాలనాపరిషత్తు' ఉన్నది. కళాశాలలో ప్రవేశించుట తోనే అందు సభ్యత్వమును లభించునట్లే. దీని అధ్యక్షురాలికి పెద్దఅధికారము లున్నవి. 'కట్టుబాటు సంఘము' వారి సిఫారసుతో ఆమె ఏవిద్యార్థినినైనను వెడలనడిపించవచ్చు. ఇందువలన పాఠశాల పరిపాలనము చాల మట్టుకు విద్యార్థినులచేతిమీదనే నడచుచుండును.

లిండెన్‌వుడ్ కళాశాలాసంస్థాపకులు మగవారివలెనే ఆడువారును తమజీవిత ధర్మములకు యోగ్యతపొందగల విద్య బడయుటకుగాను ఏర్పాటు చేయు సంకల్పము తో లుతగనే వెలిబుచ్చిరి. ప్రస్తుతము కళాశాల కార్యవిధానము మూడు. సామాన్యవిభాగములుగా విడును :

౧. విద్యా, విజ్ఞాన కళాశాల (College of Arts and Science) : ఇందు బి. ఎ. డిగ్రీలు ఒసగుదురు.

౨. వృత్తివిద్యాలయము: ఇందు 'B. S. (Bachelor of Science) in Home Economics' ('గృహ్యార్థశాస్త్రపట్టభద్ర') బిరుదములును, 'B.S. (Bachelor of Science) in Education' ('విద్యాశాస్త్రపట్టభద్ర') బిరుదములును ప్రసాదింతురు.

౩. చిత్ర, గాంధర్వ విద్యాశాల: ఇందు 'B. M. (Bachelor of Music)' ('గాంధర్వపట్టభద్ర') బిరుదములును, చిత్రకళాప్రశస్తులును (Diplomas in Art) ఇత్తురు.

ప్రస్తుతము స్త్రీవిద్యను గూర్చి రెండు వాదము లున్నవి: స్త్రీలు జాతిజీవనానుస్యూతి కుపకరించు స్థానము ననుసరించి వారివిద్యాపద్ధతి నిర్ణీతము కావలెనని ఒకటి. రెండవది, స్త్రీపురుషుల మనోధర్మములు అభేదములే కనుక పురుషులవిద్యయే స్త్రీలకును వలయునని కాని, సాంఘిక ఆర్థికవ్యవస్థలు స్త్రీపురుషులకు విధించు కార్యములందు భేదమున్నదా లేదా, అట్లే విద్యాసామగ్రియు స్త్రీపురుషులకు వేర్వేఱుగ వలయునలయు నని. లిండెన్‌వుడ్ కళాశాల బోధనాధికారిణియగు డాక్టరు అలిస్ ఇ. జిప్సను అనునామె వివరించెను.

లిండెన్‌వుడులో క్రొత్తగా చేరవచ్చిన ప్రతివారికి మన స్తత్త్వపరీక్ష చేసి వారిప్రత్యేకాభిరుచి, సహజసామర్థ్యము గుర్తించుచుందురు.

ఇచట ప్రతివారును, తక్కిన అనేక కళాశాలలలో వలె 'సవాలక్ష'లో అడగిపోక, ఒక ప్రత్యేక వ్యక్తిత్వముతో నుందురు. పట్టము పొందిన వెనుక ప్రతియువతికి ఆమె యే కార్యరంగమున బాగుగ పనికిరాగలదో సలహా యిచ్చెదరు.

చదువుకొనవలసిన పద్ధతినిగుఱించియు, ఆరోగ్యశాస్త్రమునుగుఱించియు, పుస్తకభండారము నుపయోగమును గుఱించియు, స్త్రీల ప్రధాన వృత్తుల గుఱించియు 'సుశిక్షణోపన్యాసములు' (Organization Lectures) అని ఇచ్చట జరుగుచుండును. మొదటి వత్సరపు పిల్లలు అందు పాల్గొనవలయును. వీనికితోడు 'అమెరికను పదుకాలీయ సభ్యతను గూర్చి అధ్యయనశాఖ యున్నది.

ఇందు నేటి అమెరికాయందలి ఆర్థిక, రాజకీయ, సాంఘికస్థితి విన్యాసములు పరిశీలితము లగును. ఇదియూ ప్రథమదర్శియ బాలిక లందఱకు దప్పనిది.

లిండెన్‌వుడ్ అన్నది విద్యకు సమగ్రమైన పర్యాయపద మని చెప్పఁగావచ్చు. ఇందలి విద్యార్థినులు తమ కళాశాలానుభవము వలన ధీసంబంధి, సంఘసంబంధి, దేహసంబంధి తమయందుగల ఉత్తమయోగ్యతను గ్రహించుకొనగల్గుదురు. వారికి కర్తవ్యములను, బాధ్యతలను నిర్వహించుమార్గమున వారిని సుష్ఠుగ నెలకొల్పుటకు లిండెన్‌వుడు సంభ్రమపడుచుండును. ఇట్టి సంస్థ ఒక జాతీయ సంపదగదా!

---

'.....' వేత్తి గానరసం ఫణీ '.....'



బ్రివహబుద్దీను విజయను గారు తీసినది.

---

# బొబ్బిలి చిలుక

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీగిరి ప్రాంతకాంతార భాగములను-వింటి నొక సింహనాదంబు మింటఁ జనుచు
దానిచేతను సింహనాదములఁ బూర్వ-మెన్నఁడో విన్నట్లుగా స్మృతి జనించె.

విన్న సింహనాదంబునే వినఁగవలయు-చేసినఁ సింహనాదమే చేయవలయు
ఇతర నాదంబు లింపు గా వెపుడు నాకు-సారకరవీరవీథీవిహారి నగుట.

చిలుకజాతిలోఁ బుట్టితి చిలుక పలుకె-పలుకవలె నన్న నియమశృంఖల యిదేల?
సింహనాదంబు నేనునుం జేయుదాన-ఘనరవకరీంద్ర బృంహితధ్వనులు సెదర.

ఏమిఫల మపేక్షించి మృగేంద్ర మెపుడు-మింట నుఱిమెడి మేఘంబుమీఁది కెగురు?
శౌర్యవంతుల కెల్ల సాజంబ సూవె-ఇతరులు తృణీకరింప సహింపలేమి.

పిట్టయన్న నందఱకు కల్చు పిట్టకతలు-పిట్ట మేతలు నందుకు. పిట్టపిడుగు
గా దిశావకాశాబ్ధుల నీఁదు టెఱుఁగ-రనయ మాకాశ శిఖ నందుకొను టెఱుఁగరు.

అంతం బుఁడునె యీ విచారణకు? సాధ్యాసాధ్యచింతల్ భయ
భ్రాంతోదంతనిసర్గధర్మములు లాభంబుల్ నిరీక్షించునే
స్వాంతక్లేశకరాపదాపతదవజ్ఞాధిక్య జాజ్వల్యమా
నాంతఃకోప దురాపతాపశిఖ సర్వాంగంబులం బర్వినన్.

ఉల్లాసంబును బెంచుచుండెడి తటస్థోద్దీపన స్ఫూర్తిచే
నుల్లేఖింపఁగఁబడ్డదై యొసఁగు భావోద్రేక శక్తిఁ భవి
వ్యల్లాభంబు కరస్థలామలకమై యాశారసావేశదీ
వ్యల్లోభంబు ఘటింప ధీరున కసాధ్యం బంచు లేదీయిలన్.

దాఁటఁ గలఁ డొక్కయంగ మున్నీటినీటి - మేరుశైలమున్ కొనగోట మీటఁగలఁడు
పృథివి మిన్ను తాళంబు వాయించఁగలఁడు-శూరపత్నికాన్పగు కార్యశూరుఁ డొకఁడు.

శౌర్యరేఖలను తంజావూరు దాఁక దక్షిణ దిక్పటంబున గీచియుండి
మంచి పౌరుషదీప్తి మగధదేశముదాఁక ఉత్తర దిగ్భిత్తి కొనఁగియుండి
కత్తిపట్టునఁ జేసి కన్నడంబునఁ జొచ్చి పడమటి దెస కగఁ బ్రాఁకియుండి
ఆఢ్యకళింగ దేశాదుల లోఁగొని తూరుపు సంద్రంబుఁ జేరియుండి
నన్నుఁ బలికింపకుండునే నా తెలుంగు? నాకు విజయ మిప్పింపదే నా వెలుంగు
సింహనాదంబు నిప్పుడే చేసి చూతు-వీరశార్దూల రావముల్ వెనుకపడఁగ.

రఘునాథరాయల రాజ్యమార్జించెడి సేనలోఁ దనదీప్తి చెంగలించె
అలకృష్ణదేవరాయల కూఁత గాఁగఁ గన్నడమునఁ దనఠీవి నాట్యమాడె
పాటలిపుత్రంబు ప్రక్క నిల్చి యశోకుఁ గడిమికిఁ దనపూన్కి గొడుగు పట్టె
బొబ్బిలి ప్రాంతభూములఁ బ్రాచ్యరాజ్యలక్ష్మికిఁ దన తేజు చెక్కిళ్లు దువ్వె
నన్నుఁ బల్కింపఁజాలదే నా తెలుంగు? నాకుఁ జయలక్ష్మి నొసఁగదే నా వెలుంగు?
సింహనాదంబు లొక కొన్ని చేసి చూతు-స్తనితములవంటి గజబృంహితములతోడ.

పల్నాటి పౌరుషప్రస్తావనలు కొన్ని గోరువంక పలుకులోఁ దిరుగుచుండె
వత్సవాయి నృపుల ప్రాభవంబులు కొన్ని కోయిల పలుకులఁ జెకళించె
పల్లవాదిత్యుల యుల్లాసములు కొన్ని హంసధ్వనులలోన నవతరించె
అశ్వపతుల రాచహావణింపు లొక కొన్ని తుమ్మెదగీతిలోఁ జిమ్మిరేగె
చిలుకజాతిలోఁ బుట్టితి చిలుక పలుకు-పలుకవలెనన్న నియమశృంఖల యిదేల?
సింహనాదంబు లింక నేను జేసి చూతు-ఘనఘటల మీఁది కెగయు సింగంబ నగుదు.

చాళుక్య నృపతులశౌర్య ప్రభలు చూపె దొండపండులమీఁద నుండు కెంపు
కాకతీయ ప్రతాపాకారమును వ్రాసె దానిమ్మపండులలోని యొఱుపు
కృష్ణరాయల శౌర్యకిరణంబు నందిచ్చెఁ గాఁకరపండ్లలోఁ గల యరుణిమ
రెడ్డిభూపాలుర దొడ్డతేజముఁ దెల్పె మఱ్ఱిపండుల మీఁది యెఱ్ఱఁదనము
భావ ముద్దీపనప్రభాభావనమున-భావితంబ. భావోద్రేకపారవశ్య
మేపనికి నేని వెనుకంజ యిడఁగనీదు-పలుకుబడులఁ జూపుదుఁ గవిబ్రహ్మ నగుదు.

---




‘శాకుంతలము’నకు కొన్ని రంగరచనలు

‘రూపలేఖ’ యను ఆంగ్ల త్రైమాసిక పత్రిక యందు శ్రీ కనైయాలాల్ హెచ్. వకీల్‌గారు (బొంబాయి) భావి నాటకరంగ వికాసమునుగూర్చి చర్చించుచు విపులవ్యాసములను వ్రాయుచున్నారు. అందు కడచిన గ్రీష్మ-వర్షల సంచిక యందలి వ్యాసమున ‘శాకుంతల’ ప్రదర్శనమునకు నాలుగు రంగరచనలు సచిత్రముగ సూచించిరి. అవి మంచి ఘట్టములవి: (౧) సమావేశము, (౨) ‘కల్యాణయాత్ర,’ (౩) ప్రత్యాఖ్యానము, (౪) సంయోగము. ఈవ్యాసకర్త విపులముగ రచించెడి చిత్రములనుండి శ్రీ పులినవిహారి దత్తగారు వ్రాసిన చిత్తు రేఖాచిత్రము లివి. రంగమున సాధారణములగు ఏర్పాటులు, సర్దుబాటులు చాలునని సూచించుటయే యీ చిత్రముల యుద్దేశము. *

(౧), (౨), (౩) సందర్భములందు, సొందిక లేని అడుగుమట్టికుడ్లు కానరాకుండుటకుగాను మొక్కలకు అడుగుభాగము కప్పియున్నది. ఈచిత్రములలో నున్నరీతి స్థిరమైనది కాదు. రంగరచనకు నేర్పుతో చేయు కొలది మార్పులవలన సొందికలు మారును. (౧) పరీక్షించిన చూచాయగా నిది కనబడు తెలియును. ఏర్పాటునుబట్టి మొక్కలు, గుబురుగా, రొట్ట దట్టముగా ఎక్కినట్లుండి, వనోచిత ప్రసాధనము కూర్చుచు, నాయకుని అభినయ రమ్యముగు ప్రవేశమున కనువుపడుచున్నవి. మరల నవియే నడుమ నడుమ వ్యవధులతో, ‘సముద్యానము’న నుండి ఒక ఉపవనమును తలపింపగలవు. ముసకగుడ్డలు కప్పి అవి కొంచెము ఎగుడుదిగుడులుగా నుంచుటవలన జొంపము సొంపును చెడలేదు; దాని అలంకరణ ప్రాశస్త్యము వ్యయ

* ఒకానొక సందర్భమున కొంచెములో సంగ్రహముగా శాకుంతల నాటకము నడపవలసి వచ్చినదట: శ్రీ వకీలుగారే సంచాలకులు.

ఒక నాటకము నాట్యప్రయోజనము నర్థముచేసికొనగలపాటి చదువుకొన్నవారై తల తిరుగుడు లేని తెలివిగల నటబృందము దొరకినపుడెల్ల చక్కని నాటకప్రదర్శనమున కనీసపు రంగసౌకర్యములతోనే తారు కృతకృత్యు లగుచుండెడివారట వీరు. అసలు, కనీసపుసౌకర్యముల ప్రయోగమే అనేకము లగు రంగోత్సాహములకు ఉజ్జీవిక మని వీరి అనుభవము. ఈసందర్భమున, ఒక సాదా రంగు వెనుకతెర, సబ్బుపెట్టెలవంటివి అనేకపెట్టెలు, కావలసినన్ని ఖాకిగుడ్డలు, కాషాయపుగుడ్డలును, వనసుకు వచ్చిన సాధారణములై వర్ణసామరస్యము గల చెప్పినట్టు విను దీపికావళి, అట్టి వేషసంచయమును—చాలినవట.



రాజా:—అయే, ఏతా స్తపస్వికన్యాః స్వప్రమాణానురూపై స్సేచనఘటై ర్బాలపాదపేభ్యః పయో దాతు మిత ఏవాఽభివర్తంతే. (నిపుణం నిరూప్య) అహో మధుర మాసాం దర్శనమ్.

శుద్ధాంత దుర్లభ మిదం వపు రాశ్రమవాసినో యది జనస్య,
దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః.
యావ దిమాం ఛాయా మాశ్రిత్య ప్రతిపాలయామి. —శాకుంతలము.



కాశ్యపః:—వత్సే, ఇతః సద్యోహుతాగ్నీన్ ప్రదక్షిణీ కురుష్వ. (సర్వే పరిక్రామంతి.)

కాశ్యపః:—(ఋక్ఛందసాఽఽశాస్తే)

అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః, సమిద్వంతః ప్రాంత సంస్తీర్ణదర్భాః,
అపఘ్నంతో దురితం హవ్యగంధై, ర్వైతానా స్త్వాం వహ్నయః పాలయంతు. —శాకుంతలము.



శార్ఙ్గరవః :—కిదిదానీం ప్రతిగృహ్యతా మాపన్నసత్త్వా సహధర్మచారిణాయ.

శకుంతలా :—(ఆత్మగతం) కిం ణ్ణు క్ఖు అజ్జఉత్తో భణాది. [కిన్ను ఖల్వార్యపుత్రో భణతి.]

రాజా :—కి మిద ముపన్యస్తం ?

శకుంతలా :—పావ ఓ క్ఖు వఅణోవణ్ణాసో. [పావకః ఖలు వచనోపన్యాసః.]

రాజా :—భోస్తపస్వినః, చింతయన్నపి న ఖలు స్వీకరణ మత్రభవత్యాః స్మరామి. తత్కథ మిమా మభివ్యక్త సత్త్వలక్షణాం ప్రత్యాత్మానం క్షేత్రిణ మాశంకమానః ప్రతిపత్స్యే. —శాకుంతలము.




రాజా :—(శకుంతలాయాః పాదయోః ప్రణిపత్య)

సుతను హృదయాత్ప్రత్యాదేశ వ్యలీక మపైతు తే, కి మపి మనస స్సమ్మోహో మే తదా బలవా నభూత్,
ప్రబలతమసా మేవం ప్రాయా శ్శుభేషు ప్రవృత్తయః, స్రజమపి శిర స్యంధః క్షిప్తాం ధునో త్యహిశంకయా. —శా.

పుష్పగల దురుకు 'వాస్తవికత' తొలగిపోయినది. కాక మఱియు కేవ రీతులపాంపిరులకు పెంపు గూర్చుటకుగాని దేర్పడి ఉపయుక్తములైనవి. ఇక (ర)న చూపినట్లు రాజు శకుంతలను ప్రత్యాఖ్యానము సేయుటకు దర్శనమిచ్చు డాబా అతిసులభమైన ఏర్పాటు: సబ్బుపెట్టెలు మెట్లుమెట్లుగా దొంతరపెట్టి ఖాకిగుడ్డలు, కాషాయపు గుడ్డలు పైని కప్పుట. పెద్ద ఆడంబరమైన 'దృశ్య'విధానము, రంగపరికరము ఈరంగమువలని గొప్పరక్తిని మహా పెంపుచేసెడివి కావు.

---

## రాయప్రోలు సుబ్రహ్మణ్యము గారు

శ్రీ సుబ్రహ్మణ్యముగారు విశ్వామిత్ర, రామదాసు మొదలగుపాత్రములనుధరించువారు. పుష్టిగల శరీరము, శ్రావ్యకంఠము, కుశలాభినయము వీరు ధరించు పాత్రములకు వన్నె పెట్టునవి. విశ్వామిత్రుడు రాజర్షియయ్యును రజోగుణ మాతని వీడకుండినది. ఆ విషయమును సుబ్రహ్మణ్యంగారి విశ్వామిత్రునియందు గాంచనగును. విశ్వామిత్రుడు బ్రహ్మర్షికా గోరి నిశ్చలమనస్కుడయి ఉగ్రతపమును చేయుచుండును. ఆతపమును భంగించుటకు ఇంద్రుడు మేనకను పంపును. మేనక మనోహర గానముచేతను, నృత్యముచేతను, శృంగార విలాసాదులచేతను విశ్వామిత్రుని వశపరుచు కొనజూచును ఇది విశ్వామిత్రుని కగ్నిపరీక్ష. ఒకవైపు బ్రహ్మర్షిత్వసంపాదనదీక్ష, ఇంకొకవైపు కామోద్రేకము. కడకు కామోద్రేకమె పైచేయి. ఈ యవస్థలో నుండు విశ్వామిత్రుని మనఃప్రవృత్తిని ఆంగికసాత్త్వికాభినయముల సుబ్రహ్మణ్యముగారు మనోహరముగ చూపగలిగిరి. తదనుగుణముగ వాచికాభినయమును ఒప్పియుండినది. కాని అటనట సంగీత ప్రభావమునకు లోనగుచుండినది. అట్లు కాకుండిన వాచికము ఎక్కువగ సహృదయహృదయములను రంజింపజేయగలదు; నటకునికి ప్రఖ్యాతిని గడింపగలదు. సుబ్రహ్మణ్యముగారి గోపన్న, రామదాసుపాత్రములు గాఢభక్తిని ప్రకాశింపజేయునవి. రామదాసు చెరసాల యందు భక్త్యుద్రేకమున ఉన్మత్తుడగును. అట్టు లయ్యును అతని ఆంగికవాచికాదులు భక్తిని పోషించుటకే యగుచుండును; ప్రేక్షకులను భక్తిపరవశులను జేయును. ప్రేక్షకులను దన్మయులను జేయగలుగుటయేకదా నటకుని యభినయకౌశలమునకు పరమప్రయోజనము!

## జంగా వెంకట సుబ్బయ్యా గారు

శ్రీ వెంకట సుబ్బయ్యా గారి అవయవసౌష్ఠవము, మధురకంఠము స్త్రీపాత్రముల కొప్పియుండును. వీరి స్త్రీపాత్రమున స్త్రీత్వము నాలుగంచులు సరిగ నిమిడియుండును. స్త్రీల సౌందర్యవిలాసాదులు వీరియందు నిండారి యుండును. ప్రేక్షకులు వీరి స్త్రీ పాత్రమును స్త్రీ యనియే భావింతురు కాని ఒక నటకుడు ధరించిన స్త్రీ పాత్రముగా భావింపనవకాశ ముండదను టతిశయోక్తి కాజాలదు.

## నాగయ్యాగారు

శ్రీ నాగయ్యాగారు రామదాసు నాటకమున కబీరుపాత్రమును ధరింతురు. వీరి ప్రసన్న

వదనము, మధురగంభీరకంఠము నా పాత్ర మున కెంతయు నొప్పియుండును.

[చిత్తూరు రామవిలాస సభ వారు డిసంబరు (౧౯౩౧) నెల చివర రామదాసు, కుశలవ, విశ్వామిత్ర అను నాటకములను మూటిని చెన్నపురమున ప్రదర్శించి నారు. ఈ సభయందలి నటకులకు గానాభినయముల యందు నైపుణ్యమలవడియున్నది. వీరి ప్రదర్శనవిధా నము, రంగాలంకారాదులు సామాజికుల నలరింప గలిగి నవి. శ్రీయుతులు రాయప్రోలు సుబ్రహ్మణ్యము, నాగే శ్వరయ్య, డి శ్రీనివాసాచార్యులు, జంగా వేంకటసుబ్బ య్యగారులు విశేషించి పేర్కొనదగిన నటకులు. వీరి గానాభినయముల కౌశలము బంగారుపదకములను గడించినవి. క్రొత్తగా చెన్నపురికి వచ్చి నాటకములను ప్రదర్శించి ప్రేక్షకులను రంజిల్ల జేసిన యీ సభవారు ధన్యవాదముల కర్హులు.]

---

## ఆంధ్రమహాసభ, చెన్నపురి

ఆంధ్రమహాసభవారు ౧౯౩౦వ సంవత్స రము డిసంబరునెల కడపటి నాలుగుదినములు భీష్మ[౧], చిత్రనళీయము, రామదాసు, ప్రహ్లాద నాటకములను వరుసగ ప్రదర్శించినారు. ఆంధ్ర నాటకరంగమున పేరు గాంచిన నటకుల[౨] సాహాయ్యమున ఈ ప్రదర్శనములు ప్రేక్షక జనరంజకములుగ నుండెనవి. ఆంధ్రమహాసభ నటకులకు నాటకపాత్ర ధారణ మానుషంగికము. కళాభిమానమును, ఉత్సాహ మును పురస్కరించుకొని వారు తాముధరించిన పాత్రములను సముచితముగ పోషింపగలిగి యుండుట ఇట పేర్కొనదగిన విషయము. మంచి నాటకసమాజములకు తమ జీవితమును కళాపోషణమునకయి సమర్పించిన మంచి నటకు లుండుటావశ్యకము. ఆయతి లేని సమా జములకు అట్టి నటకులు సమకూరుట దుర్ల భము. మంచి నటకులు లేనపుడు ప్రదర్శన ములు రుచింపకుండుట సహజము. ఎట్లో మిక్కిలి ప్రయాసకు లోనయి నాలుగు నాట కములను ప్రదర్శించి చెన్నపురము నందలి యాంధ్రమహాశయుల కానందము నుచేకూర్చిన నేపథ్యాధికారియు, నటకులును ధన్యవాద ముల కర్హులు. తమకిట్లానందమును గలిగించిన ఈసభవారు మున్ముందు మంచి నటకులను తయారుచేసికొని మంచినాటకములను ప్రద ర్శించి తమ కింతకన్న నెక్కుడుగా నానంద మును గలిగించుటకు జాలునట్లు యథాశక్తిని నాటకకళాభిమానులగు చెన్నపురి ఆంధ్రులు సభవారికి ధనమును సహాయము చేయు టావశ్యకము.

---

౧. ఈ నాటకమును ద్విజేంద్రలాలురాయిగారు తొలుత వంగభాషను రచియించిరి. ఇందలి ఇతివృత్తము పౌరాణికము; దానికి వీరు సాంఘికస్వరూపమును గల్పించిరి. తెనుగు అనువాదము శ్రీ జంధ్యాల శివన్న శాస్త్రిగారిది.

౨. శ్రీ గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారు 'భీష్మనాటకము'న శంతనుపాత్రమును, శ్రీ బెల్లంకొండ సుబ్బారావుగారు 'చిత్రనళీయము'న బాహుకపాత్రమును, శ్రీ బళ్లారి రాఘవాచార్యులుగారు 'రామదాసు' న రామదాసుపాత్రమును, 'ప్రహ్లాద' యందు హిరణ్యకశిపుపాత్రమును, శ్రీ తిప్పయ్యగారు 'రామదాసు'న కబీరు పాత్రమును, 'ప్రహ్లాద'యందు లీలావతీపాత్రమును ధరించిరి.

వీరు ప్రదర్శించిన నాటకములలో భీష్మ నాటకము క్రొత్తది. ముమ్ముందును దేశకాలానుగుణములు, ఉత్తమములు నగు నాటకముల నీసభవారు ప్రదర్శించి నాటకకళాభివృద్ధి గావింప దగుదురు.

శ్రీ రాధాకృష్ణయ్యగారు

భీష్మనాటకమున భీష్మపాత్రమును ఆంధ్ర మహాసభ నటకులలో ప్రధాను లగు శ్రీ వరదా రాధాకృష్ణయ్యగారు ధరించి యాపాత్రను వాచి కాంగిక సాత్వికాభినయముల జక్కగా పోషింపగలుగుట మెచ్చుకొనదగిన విషయము. వీరి యితర (నళ, నారద) పాత్రములయందు సంగీతము మిన్నుముట్టుచుండెడిది. సంగీతము మెచ్చుకొనదగినదే అయినను నాటకములయందు దానికి తక్కువ అవకాశము నొసగదగును. భావములను ప్రదర్శించుటకు వలసిన ప్రయత్నము వేఱు. చక్కగా పాడుటకు చేయవలసిన ప్రయత్నము వేఱు. ఈ రెంటికిని పొత్తు కుదురదు. ఈ రెంటియొక్క సంకరమువలన రసానుభూతి సామాజికులకు గలుగజాలదు.



శ్రీ రాధాకృష్ణయ్యగారు

*　　*　　*　　*

ఇంకొకమాట. ఆంధ్రనాటకరంగమున విఖ్యాతిగన్న శ్రీ బళ్లారి రాఘవాచార్యులుగారిక నాటకరంగము నెక్కబోవుట లేదని తెలియవచ్చెడిని. ఇది నిక్కమేయగునేని ఆంధ్ర రంగమునకు తీరని కొఱత గలిగిన దన్నమాట. నాటకరంగమును వీడుటకు వారికి కారణములు పెక్కుండవచ్చును. కాని కళాపోషణ మమూల్యమను విషయమును వారుభావించి చిరకాలము నాంధ్రనాటకరంగమును వీడకుందురుగాక.

మా న వ ప్ర కృ తి—౨.



# సంగీతపరిషత్తువారి గాయక మహాసభ

1928 సంవత్సరమున జరిగిన అఖిలభారత గాయక మహాసభయందు తీర్మానింపబడిన విధమున చెన్నపురియందు సంగీతపరిషత్తు స్థాపింపబడియుండెను. తదాది సుమారు రెండు సంవత్సరముల నుండి ఈ సంగీతపరిషత్తు సంగీతకళావిషయిక చర్చనీయాంశములను సాంగముగా చర్చించుటకు విద్వత్సంఘము నేర్పరచి యావిధమగు కార్యము చేయుచుండుట యందరు గ్రహించుచున్నారు. ఈసంస్థ గానకళవిషయమై చేయుచున్న ఘనమగు సేవ యీకొలదికాలలనుండి జరుగుచున్న కార్యమానుసరించియే గ్రహింపనగును. 1929 సం.న నొక గాయక మహాసభ నేర్పాటుగావించి, భిన్నాభిప్రాయములకు గురియగు పెక్కు అంశములు, ముఖ్యముగా ద్వావింశతిశ్రుతులగూర్చియు, కొన్ని భాషాంగరాగముల గూర్చియు, చర్చించియుండిరి. కచ్చేరీలందు గాయకులు గమనింపవలసిన కొన్ని అంశములుకూడ చర్చించియుండిరి.

పైవిధమున నేర్పరుపబడిన సంగీతనిపుణుల సలహాసంఘము ఇప్పటికి ముమ్మారు కూడియుండి పై అంశములను బాగుగ చర్చించియున్నది. కడచిన యీష్టరు సెలవులందు నీసలహాసంఘము కూడినపుడు కొన్ని భాషాంగ రాగములు, ద్వావింశతిశ్రుతులు ఏయేరాగములందు ధ్రువిమగుచున్నదియు నెంచి చెప్పుట మున్నగు సంగతులు చర్చింపబడెను.

తిరిగి కడచిన 1930 డిసెంబరు 24 తేదీనుండి జనవరి 1 తేదీవరకు ఈసంగీతపరిషత్తువారొక గాయకమహాసభను ఏర్పాటుచేసియుండిరి. * గానకళావిషయకములగు ననేక చర్చనీయాంశములు ఈ సభవారిచే నాలోచింపబడెను. ఇందుకు మును ముందే యొక కార్యక్రమమును తయారుచేసి సభ్యులకొసంగిరి. ఆ కొలది దినములలో కార్యక్రమములోని సంగతులన్నియు చర్చింపబడి నిపుణులసంఘముచే నీక్రిందితీర్మానములు ఆమోదింపబడెను. మహాసభయందును నివి యామోదింపబడెను.



తిరువాంకూరు జూనియరు మహారాణిగారు ౧౯౩౦ వత్సరాంతమున చెన్నపురమున జరిగిన సంగీతమహాసభ ప్రారంభము గావించిరి.

* తిరువాంకూరు జూనియరు మహారాణీవారు ప్రారంభోత్సవము జరపిరి. బ్ర॥ ముత్తయ్యభాగవతరుగారు అధ్యక్షత వహించిరి. డా॥ యు. రామారావుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. దినదినమును ప్రసిద్ధులగు గాంధర్వవిద్యా విశారదులు కచేరీలు గావించి తమనైపుణ్యమును వెల్లడించిరి. మహాసభ కళాదేవత ప్రసాదము చూరకొనుచు కడువైభవముగ కొనసాగినది.

౧. శ్రుతులు 22 మాత్రము గానమున చాలును.

౨. శ్రుతులపేర్లు వరుసగా షడ్జము, ఏకశ్రుతి ఋషభము, ద్విశ్రుతి ఋషభము, త్రిశ్రుతిఋషభము, చతుశ్శ్రుతిఋషభము, శుద్ధగాంధారము, సాధారణగాంధారము, అంతరగాంధారము, తీవ్రగాంధారము లేక చ్యుతిమధ్యమగాంధారము, శుద్ధమధ్యమము, తీవ్రమధ్యమము, ప్రతిమధ్యమము, చ్యుతిపంచమ మధ్యమము లేక వరాళిమధ్యమము, పంచమము, ఏకశ్రుతిధైవతము, ద్విశ్రుతిధైవతము, త్రిశ్రుతిధైవతము, చతుశ్శ్రుతిధైవతము, శుద్ధనిషాదము, కైశికనిషాదము, కాకలినిషాదము, తీవ్రనిషాదము లేక చ్యుతషడ్జనిషాదము.




బ్ర॥ ముత్తయ్యభాగవతరుగారు
అధ్యక్షులు.

౩. పైశ్రుతులు వరుసగా గౌళ, మాయామాళవగౌళ, కాంభోజి భైరవిరాగములు, కళ్యాణి, భైరవి తోడిరాగములు, ఖరహరప్రియ, కాంభోజి శంకరాభరణములు, కళ్యాణి, సకల శుద్ధమధ్యమరాగములు, బేగడ, పూర్వకళ్యాణి, వరాళి రామప్రియరాగములు, పంచమవర్జము లేని రాగములు, సావేరి, మాయామాళవగౌళ తోడి రాగములు, కాంభోజి, కళ్యాణి, కాంభోజి, భైరవి, ఖరహరప్రియ, శంకరాభరణ మాయామాళవగౌళరాగములు, కళ్యాణి కురంజిరాగములు—వీనియందు స్పష్టమగుచున్నవి.

౪. భాషాంగములయొక్క లక్షణమునుగూర్చి యీ విధముగ తీర్మానింపబడెను:—

(1) అసావేరి రాగము:—

ఇది 8వ మేళమందు జన్యము. ఋషభము కొంచెము హెచ్చుగా నుండినను, దీనిని భాషాంగరాగముగా నెంచ వీలు లేదు.

ఆరోహణము:— స రి మ ప ధ ని స.

అవరోహణము:— స ని స ప ధ ని ధ ప మ గ రి స.

(2) పున్నాగవరాళిరాగము:—

ఇది 8వ మేళమున జన్యము.

ఆరోహణము:— ని స రి గ మ ప ధ ని.

అవరోహణము:— ని ధ ప మ గ రి స ని.

(3) ఆహిరిరాగము:—

ఇది 14వ మేళకర్తయందు జన్యము.

దీనియందు సాధారణగాంధారము వచ్చుచుండినను అంతరగాంధారమే భాష్యము.

ఆరోహణము:— స రి గ మ ప ధ ని స.

అవరోహణము:— స ని ధా ప మ గ మ గ రి స.

(4) సావేరిరాగము:—

ఇది 15వ మేళమందు జన్యము.

దీనియందు కైశికనిషాద, సాధారణగాంధారములు భాష్యములు గావు.

ఆరోహణము:— స రి మ ప ధ స.

అవరోహణము:— స ని ధా ప మ గ రి స.

(5) నాదనామక్రియ రాగము:—

ఇది 15వ మేళమందు జన్యము.

ఆరోహణము:— ని స రి గ మ ప ధ ని.

అవరోహణము:— ని ధ ప మ గ రి స ని.

ఇందు కైశికనిషాదము భావ్యము గాదు.

(6) గౌళిపంతు రాగము:—

ఇది 15వ మేళమున జన్యము.

ఇందు ప్రతిమధ్యమము కూడను.

ఆరోహణము:— స రి మ ప ని స.

అవరోహణము:— స ని ధ ప మ ప ధ మ గ రి స.

(7) సౌరాష్ట్ర రాగము:—

ఇది 17వ మేళమున జన్యము

కొన్నిచో కైశికనిషాదము గలిగినను అన్యాగి రాగభావమున కంత యాంపసగముగ గణింప నక్కరలేదు.

ఆరోహణము:— స రి గ మ ప ధ ని స.

అవరోహణము:— స ని స ధా ప మ గ ప మ గ రి స.

(8) ఆనందభైరవి రాగము:—

ఇది 22వ మేళమున జన్యము.

ఆరోహణము:— స గ రి గ మ ప ధ ప స.

అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

ఇందు కొందరు 'ప ని స' ప్రయోగము పురాతనము.

(9) ముఖారి రాగము:—

ఇది 22వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి మ ప నీ ధ స.

అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

'ప ధ స' ప్రయోగముగూడ గలదు.

(10) హుసేని రాగము:—

ఇది 22వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి గ మ ప ని ధ ని స.

అవరోహణము:— స ని ధా ప మ ప మ గ రి స.

ఆరోహణమున 'రీ' దీర్ఘమును, అవరోహణమున 'ధా' దీర్ఘమును చేసి పాడుట వాడుక. ఇందు శుద్ధధైవతమును గలదు.

(11) కాంభోజి రాగము:—

ఇది 28వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి గ మ ప ధ స.

అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

'సా ని ప ధ స' అను తావున కాకలినిషాదము కలదు.

(12) శహాన రాగము:—

ఇది 28వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి గ మ ప మ ధ ని స.

అవరోహణము:— స [illegible] ధ ప [illegible] గా మ రి గ రి స.

ఇందు 'రి గ మ ప ధ ని' ప్రయోగము గలదు.

(13) యదుకుల కాంభోజి రాగము:—

ఇది 28వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి మ గ మ ప ధ స.

అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

(14) నీలాంబరి రాగము:—

ఇది 29వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి గ మ ప ని స.

అవరోహణము:— స ని ప ధ ని ప మ గ రి గ స.

ఇందలి 'ప ధ ని' ప్రయోగమునందు కైశికనిషాదము అల్పముగ వచ్చును.

(15) అఠాణ రాగము:—

ఇది 29వ మేళమున జన్యము.

ఆరోహణము:— స రి మ ప ని స.

అవరోహణము:— స ని ధా ప మ గా మ రి స.

ఇందు 'పధనిస' విశేషప్రయోగము కలదు. ఇందు కైశికనిషాదముకూడ వచ్చును.

(16) బిలహరిరాగము:—

ఇది 29 వ మేళమున జన్యము.

ఆరోహణము:—స రి గ ప ధ స.

అవరోహణము:—స ని ధ ప మ గ రి స.

ఇందలి 'పధనిధప' ప్రయోగమునందు కైశికనిషాదము వచ్చును.

౫. సభలందు గాయకులు ఈవిషయములు గమనించుటకు హెచ్చరింపబడుచున్నారు:—

(1) గాయకులు ప్లాటుఫారమునకు వచ్చునప్పుడు ప్రేక్షకులవైపు ముఖము పెట్టి ప్లాటుఫారము వెనుకనుండి రావలెను.

(2) పాడునప్పుడు గాయకులు ఒకరి కొకరు అన్యోన్యము కలిగియుండిరనునట్లుండవలెను.

(3) ప్లాటుఫారముపై కాఫీ ఫలహారములు తీసికొను నాచారము భావ్యము కాదు. కావున నిది మానివేయవలెను. క్రిందకు దిగి అట్టివి పుచ్చుకొనరావచ్చును. కావలసిన కచేరికాలమందు మధ్య కొంతకాల మిందుకొరకు వినియోగించుకొనవచ్చును.

(4) మదరాసు రేడియోయందు ప్రతి గాయకుడును పాల్గొనవలయును.

౬. అపూర్వ రాగాంగ రాగచక్రముల గూర్చి ఇట్లు తీర్మానింపబడెను:—

శుద్ధమధ్యమ ప్రతిమధ్యమ మేళకర్తలందలి మొదటిచక్రమందును, చివరచక్రమందును, మరి ప్రతి చక్రమందు గల మొదటి, యారవ మేళములందును, ఈరాగాంగరాగముల జన్యములందును గల కీర్తనములు మున్నగునవి అట్లులే పాడవలెను. వేంకటముఖిమతము ననుసరించి శుద్ధగాంధార, శుద్ధనిషాదములు పంచశ్రుతి ఋషభ, పంచశ్రుతి ధైవతములుగ నెంచవలెనను విజమూరి వరాహనరసింహాచార్యులుగారి యభిప్రాయమును; జనకరాగములను మేళములనవలయును, ఇవి మేళకర్తలు కావను హుల్లి కృష్ణమాచార్యులుగారి యభిప్రాయమును చేర్చుకొనవడమైనది.

౭. సభయందు చదువబడిన వివిధవ్యాసములందలి యభిప్రాయముల గూర్చి ఇట్లు తీర్మానింపబడెను:—

(1) నాగస్వరము కచేరిలందు ప్రవర్తింపవచ్చును.

(2) 'సరిగమ' అను ప్రాతపద్ధతి ఇంకను చర్చించుటకు నిలిపివేయబడెను.

(3) స్కూలుపిల్లలకు గాత్రము నభ్యసింపజేయునప్పుడు స్వరములతో నట్లు చేయవలెను అను అంశము కూడ నింకను చర్చింపబడుటకు నిలిపివేయబడెను.



ఐసీ హై నాగరీ రూప ఉజాగరీ నారి నిహుకే సుచిత చురావే,
నా హుసౌ నేహ లగాయ రహే అతిహాస బిలాస సదా సరసావే,
రాగకే రంగమే భీజ రహే నిజ ఆలీ సంకేత దబాహర ఆవే,
యావిధ సో దీపకకే రాగనీ జాహి గునీ సబ భాయకే గావే.
[జయపుర చిత్రము : దివాన్‌బహాదూరు ఛత్రభుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.]



## 'లీలాకుమారి' నవల

### ప్రథమ, ద్వితీయ భాగములు

వేగుజుక్క గ్రంథమాల, బరంపురం, గంజాంజిల్లా; గ్రంథకర్త: శ్రీయుత పోలవరపు రామబ్రహ్మంగారు, న్యాయవాది, రేపల్లె. మొత్తము పుటలు 440. ఖరీదు ప్రతిభాగమునకు 1-8-0.

నేటివరకు ప్రచురింపబడియున్న తెనుగు నవలలలో 'లీలాకుమారి' యుత్తమశ్రేణికి జెందియున్నదని నుడువగలము. ఆంగ్లేయ నవలాకారుడగు సర్ వాల్టర్ స్కాట్ గారి యొక్కయు, ఇతరాంగ్ల నవలారచయితల యొక్కయు నవలలను కొన్నింటి నీనవల పోలియున్నది. కొన్ని శతాబ్దముల క్రితము ఐరోపాఖండమందు యోధవరులు పలువురు తాము ప్రేమించు యువతీమణుల గౌరవమును, ప్రేమను బొందుటకు సాహసకృత్యములకు బూనుచుండిరి. వారి నాపదలనుండి సంరక్షింపుచుండిరి. వీరిని 'Knights' అని పిలుచుచుండెడివారు. 'లీలాకుమారి' యందును, కథానాయిక యగు లీలాకుమారి యాజ్ఞలను ప్రేమికుడగు విలాసకుమారుడే తలదాల్చి, ఆమెసౌఖ్యముకొరకై తనసౌఖ్యమును విడనాడును. ఆపదల బారిఁబడిన యామెను సంరక్షించును.

ఆధునిక రాజకీయములను గూర్చి గ్రంథకర్త కొన్నిస్థలములందు తమ యభిప్రాయముల నిమిడ్చియున్నారు. ప్రజాస్వామ్యము పేరిట జరుగుచున్న యక్రమములను వారు తీవ్రముగ ఖండించియున్నారు. మరియు, సరిహద్దు ప్రాంతమునందలి కొండజాతుల వారికన్యాయము జరుగుచున్నదని వారొక స్థలమందు సూచించియున్నారు.

ఈనవలయందలి కథ భావగర్భితముగను, రమ్యముగను నున్నది. వంగదేశమును కాక, ఆంధ్రదేశమునే కథకు రంగస్థలముగ జేసిన బాగుండెడిదని మాయభిప్రాయము. కొన్ని విషయములందు నూతనపథమును త్రొక్కియున్న గ్రంథకర్త కాంధ్రులు ప్రోత్సాహ మొసగెదరు గాక యని కోరెదము.

సరస్వతుల చంద్రశేఖరశాస్త్రి

---

## ఆయుర్వేదౌషధ రత్నాకరము

కర్త: ఆయుర్వేదభూషణ, భిషగ్వర, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, ఎ. ఎం. ఎ. సి., గవర్నరుపేట, బెజవాడ.

మహాయోగానందామృతకల్పవల్లి, రసయోగరత్నాకరము, భైషజ్యరత్నావళి, బసవరాజీయము, మొదలగు కొన్ని ముద్రితగ్రంథముల నుండియు, మరికొన్ని అముద్రితగ్రంథములనుండియు, కొన్ని ఔషధయోగములను గ్రహించి 'ఆయుర్వేదౌషధరత్నాకరము' అను పేరుతో శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారీగ్రంథమును సంధానించిరి. 1902 సంవత్సరములో తునిసంస్థానాధిపతులగు శ్రీ రాజా వత్సవాయి వేంకట సింహాద్రి గజపతిరాజు బహద్దరుగారు 850 ఔషధయోగములను సంపాదించి 'మహాయోగానందామృతకల్పవల్లి' యను పేరుతో నొక గ్రంథమును, 1920 సంవత్సరములో శ్రీయుత నండిభట్ల రామశేషయ్యగారు 'రసయోగరత్నాకరము' అను పేరుతో మరొక గ్రంథమును ప్రకటించియున్నారు. ఇప్పుడు శ్రీశాస్త్రిగారు ప్రకటించిన గ్రంథము మూడవది. పైరెండు గ్రంథములలో నున్న

యోగములనే గాక, మరికొన్ని యితర గ్రంథములలోని యోగములను గూడ శ్రీ శాస్త్రిగారు ప్రకటించుట చేతను, కేవల యోగముల ప్రకటించుటయే గాక, ఔషధ విశేష వివరణము, ఔషధనామముల కర్థములు, సేవన విషయములు, ఔషధ పాకవివరణము, 'పంటౌషధముల' పాకపరిజ్ఞానము, సందేహసమాధానములు మొదలగు శీఘ్రి కలక్రింద నుపయోగకరములగు కొన్ని విషయము లను గూడ గ్రంథాంతమునందు వివరించుటచేతను, వైద్య విద్యార్థులకు, సామాన్య వైద్యులకు ఈ గ్రంథము మిగు ల నుపయోగకారిగా నుండగలదు. ఇట్టి వివరణముల నిచ్చుటచేత, క్రొత్తగా నౌషధములను వండి తయారు చేయువారు పాకవిషయమునగల కొలది సందేహ ములను సమయించుకొని, స్వతంత్రముగా నౌషధముల తయారుచేయ ప్రయత్నింప గలుగుదురు. ఆంధ్రదేశ వైద్యులు తరుచుగా వాడు ఔషధయోగము లన్నియు చాలవరకు ఇందు లభింపగలవు. వీ రెంతయో శ్రమపడి, ఇన్ని యోగములను సంపాదించి, ఒకచోట జేర్చి ప్రక టించునప్పుడు, ఈ గ్రంథమునం దుదాహరించిన యోగ ములకన్నిటికి నీలైనంతవరకు ఆకరములు తెలిపియుం డిన పాఠకులకు ఈ గ్రంథమునెడల ప్రామాణ్యబుద్ధి పరిం త హెచ్చుగా నుండెడిది. ఆకరముల తెలుపకపోవుట చేత, యోగప్రామాణ్యమును సందేహించి, ఇతరగ్రం థములందలి యోగములతో పోల్చి చూచుకొనవలసి వచ్చుచున్నది. అట్లు పోల్చి చూడగా (సువ్వునకు) లోక నాథరసము, సువర్ణలోకనాథరసము, మహాసూర్యా వర్తి (పంట) మొదలగు కొన్ని యోగములు చాల మార్పుగా కనపడుచున్నవి. వసంతకుసుమాకరయోగమును పరి కింపుడు:—

"పృథక్ ద్వౌ హాటకం చంద్రం త్రయో వంగాహి కాంతజం, చత్వారి స్యాత్ మృభ్రం" అని ఆంధ్రదేశ మున పలుకబడు ప్రసిద్ధపాఠము. దానిని శ్రీ శాస్త్రిగారు మార్పుచేసి, "చత్వారః పారదో భ్రంచ" అని ప్రకటించి నారు. మరియు టీకయందు "సూత (పారద) భస్మ" అని వివరించినారు. శ్లోకమున సూతశబ్దము జారవిడిచి నను, టీకయందు కూర్చినారు. దానికి విపుల వివరణము పారదభస్మమని వివరించుచున్నారు. గ్రంథాంతమునందు ఔషధవిశేషవివరణమున నీ యోగమును గూర్చి వ్రాయుచు, "గంధకసంయోగము లేనిదే పాదరసము ఇతర రసములతో సరిగ సమ్మేళనము కాదు కావున నిందలి సూతశబ్దముచే రసభస్మ గ్రహింపవలసియున్నది." అని తమ నిశ్చయాభిప్రాయమును వెల్లడించి, కొందరు రససిందూరమును, మరికొందరు షడ్గుణమును గూడ వేయుదురని సూచించినారు. సూతశబ్దమునకు పరిభాషల ననుసరించియు, అధికార ఆగమ సంప్రదాయముల ననుసరించియు రససిందూరమే గ్రాహ్యము కాని పారదభస్మ గ్రాహ్యము కాదు. వారు వివరింప దలచిన యర్థము నకు సరిపడునట్లుగా శ్లోకమునందు 'సూత' పదమును మార్చుటచేతను, తుదకు అర్థవివరణమున ఆపదమునే వాడుటచేతను, విశేష వివరణమున తిరిగి పారదభస్మము నే వేయవలెనని నిశ్చయించుటచేతను, ఇంతి విమర్శన మవ సరమైనది. ఇట్టి మార్పువలన కారణమేమో శ్రీ శాస్త్రి గారు వివరిపనేరి. కాంతవల్లభరసయోగమును వివరిం పుచు, వివాదగ్రస్తవిషయమును విపులవివరణము నపేక్షించునట్టిదియునగు 'అయోగరజ' అనుపదమునకు 'ఋష్ట లోహ భస్మ' అని టీక వ్రాసి, వివరణమున గూడ ఇది మిత్రమని తేమియును నిశ్చయింపక, ఇంకొక క్రొత్త విశేషమును దెచ్చి పెట్టినారు. "షడ్భాగంచ శిలాజతు" అనుచోట వివరణము వ్రాయుచు, "ఇందు శిలాజతు అనగా తెల్లగ నుండు కర్పూరశిలాజతునే అనేకులు వేయుచున్నారు. కాని గోమూత్ర శిలాజతు వేసుకొనుట శ్రేష్ఠము......గోమూత్ర శిలాజతును వేసుకునేయెడల పంటయైన పిదప కుప్పెలను కట్టుకొనునప్పుడు వేసుకొన వలెను."

ఈయోగమున గోమూత్ర శిలాజతును వేసుకొనుట సంప్రదాయ విరుద్ధము. ఎవరును చేయుటలేదు. ఏశిలా జతును వేసినను యోగనిర్మాతయొక్క అభిప్రా యము దానినిగూడ అన్ని వస్తువులతో పాటు కలిపి పాకము చేయవలయుననియే కాని, కుప్పెలు కట్టు నప్పుడు కలుపుకొనవలెనని మాత్రము కాదు. అట్టి అర్థము యోగమునం దెక్కడను యోగకర్త సూచింపలేదు. శ్రీ

శాస్త్రిగారిట్లు వ్రాయుటకు కారణ మేమో కదా! షడ్గుణ బలిజారిత మకరధ్వజమును గూర్చి వ్రాయుచు, యోగమును తప్పుగా వివరించి, ఔషధ నామమునకు అర్థమును వివరించుటలో గూడ నట్లే పొరపడినారు.

షడ్గుణ బలిజారిత మకరధ్వజము=ఆరురెట్లు గంధకముతో వండబడినది కావున షడ్గుణ బలిజారిత మకరధ్వజమని చెప్పబడుచున్నది—అని శ్రీశాస్త్రిగారి వివరణము.

ఆరురెట్లు గంధకముతో విధి ప్రకారము జారణము చేసిన తరువాత వండబడినది కావున ఇట్లు పిలువబడు చున్నదని వివరించిన బాగుండెడిది. అర్థవివరణమునను, యోగప్రకటనమునను గూడ జారణావిధానమును శ్రీశాస్త్రిగారు పూర్తిగా విస్మరించిరి. జారణమనగా నేమియో, ఎట్లు జారణము చేయవలెనో, ఏమియు వివరింపక స్వర్ణము 8, పారదము 64, గంధకము 128 చేర్చి మూడుతడవలు వండిన షడ్గుణ బలిజారిత మకరధ్వజము తయారగు ననుచున్నారు. ఇందు వస్తువులు కలుపుటలో గూడ షడ్గుణ (ఆరురెట్లు) క్రమమును పాటింపరైరి.

జారణ విషయము రసేంద్రసారసంగ్రహము, ఆయుర్వేద ప్రకాశము, రసప్రకాశ సుధాకరము రసజలనిధి, ఇత్యాదిగ్రంథములందు విపులముగా వర్ణింపబడి యున్నది. సిద్ధయంత్రమునను, కచ్ఛపయంత్రమునను, కూర్మయంత్రమునను, జారణము చేయవచ్చుననియు, రసమునకు ఆరురెట్లు గంధకమును తీసుకొని, ముందుగా నొక మట్టిపాత్రలో సగమువరకు ఇసుక నుంచి, దానిపైన నొక మూకుడు నుంచి, పిదప పై జెప్పబడిన మట్టిపాత్ర పొయిమీద నుంచి, మూకుటిలో రససమాన గంధకమును వేసి, ఆగంధకమును తైలమువలె కరగించి, దానిలో పాదరసము నుంచవలెను. గంధకము జీర్ణించువరకు అట్లే వండి పిదప మిగిలిన గంధకము గూడ క్రమక్రమముగా వేసి, అంతయు జీర్ణమగు వరకు వండవలెను. ఇదియే షడ్గుణ బలిజారణము. తదుపరి ఇందు స్వర్ణాదులను విధిప్రకారము జేర్చి కుప్పెయందు వండిన మకరధ్వజ మగునని శాస్త్రకారుల మతము. (జారణాభేదములను, యంత్రభేదములను, వేర్వేరు విధానములను పైగ్రంథములందు చూడవచ్చును: విస్తర భీతిచేత విపులముగ నిక్కడ వివరింపలేదు.)

గంధకము జారణచేయుట ప్రధాన మనియు, అట్లు చేసిననేగాని లోహములు రసమున జీర్ణము కావనియు శాస్త్రకారులు చెప్పుచున్నారు:—

"గంధకం జారయేత్పూర్వం రసే కచ్ఛపయంత్రకే;
...వినా గంధేన కర్తవ్యా నైవహి ధాతుజారణా;
న క్షుధా జాయతే సూతే జారయంతి న ధాతవః;
తస్మాత్ గంధః పురా జార్యః సూతవహ్ని వివృద్ధయే."
రసజలనిధి, ౧-వ భాగము, పేజీ ౯౩.

పైవిషయములనుబట్టి, ముందు గంధకజారణమువిధిగా చేయవలెననియు, అట్లు జారణము చేయనిదే ఇతరలోహములందు కలుపరాదనియు, కలిపినను, రసమునకు ఇతర లోహములను జీర్ణించుకొను శక్తి కలుగదనియు గ్రంథకారులు వివరించుచున్నపుడు అట్లు జారితమైన గంధకమునే ఈయోగమునందు వాడుట ప్రశస్తము. ఇట్టి ముఖ్యమగు విషయమును శ్రీశాస్త్రిగారు వివరింపకుండుటకు కారణము తెలియుటలేదు. ఈవిషయముల నెల్ల పర్యాలోచించి చూచినయెడల శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు వివరించిన యోగము అర్థము ప్రమాదకరమని విజ్ఞులు గ్రహింపగలుగుదురు.

శ్రీ శాస్త్రిగారు చెప్పిన విధమున ఔషధనామముల కర్థవివరణము మచ్చునకు జూపుచున్నాను.

కాంతవల్లభరసము=కోరబడెడి యౌషధములలో ప్రధానమైనది కావున.

కాంతము ప్రధాన ద్రవ్యముగా గలిగి, ప్రియమైనది గనుక—అనిన బాగుండెడి దేమో!

కాలకూటము=యముని గూడ పీడించునది అనగా, సన్నిపాతము మొదలగు వ్యాధులను నశింపజేసి, మరణమునుగూడ రాకుండ జేయునది కావున.

ఈ అర్థము ఎంతయు డొంక తిరుగుడుగా నుండి, ముక్కును చూపుటకు తలచుట్టు చేయి త్రిప్పిన ట్లున్నది. విష (నాభి) ప్రధానమైన యోగౌషధము కావున — అనిన బాగుండెడిది కదా!

“అనేక ప్రాచీనశిథిలగ్రంథములనుండియు, అనేకమందియొద్ద వ్రాతపుస్తకముల నుండియు గ్రహించబడి, వ్రాయబడి యున్నవి. మరియు, అనుభూతములగు కొన్ని యోగములను దయతో నిప్పించిన బ్రహ్మశ్రీ ద్విభాష్యం వేంకటేశ్వర్లు మొదలగువారికిని అనేక వందనము లర్పించు చున్నాను” అని శ్రీ శాస్త్రిగారు ఈ యుపోద్ఘాతమున వ్రాసి, కృష్ణపండితీయమని గ్రంథమునకు అన్యనామ మిడి, మరియు దొంగలను ఇట్లు హెచ్చరించుచున్నారు:

“ఇందలి యోగములను గాని, విషయములను గాని ఇతరు లెవ్వరు, ఏవిధముగను ప్రకటింపగూడదు.”

యోగకర్తలు, తుదకు గ్రంథకర్తలు వీరు కానప్పుడు (కేవల సంధాతలు) పై ప్రకటనము ఎట్లు సంభావ్యమో విచారణీయము. ఏమైనను వ్యయ ప్రయాసలకు లోనయి, గ్రంథప్రకటనమును కొనసాగించిన శ్రీశాస్త్రిగారు వంద్యులు. ఇంకొక ముద్రణమున నిట్టి ప్రమాదములు సవరింపబడిన, గ్రంథము పనిపడును.

‘వైద్య వినోది’

## ఆంధ్ర భైషజ్య రత్నావళి

కర్త:— ఆయుర్వేద భూషణ, భిషగ్వర శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, ఎ. ఎం. ఎ. సి., గవర్నరు పేట బెజవాడ. వెల రు. 2.

ఇందు ఆసవములు, అరిష్టములు, చూర్ణములు, తైలములు, ఘృతములు, కషాయములు మొదలగు ఔషధభేదములు సంస్కృత శ్లోకములతోను, తెలుగు టీకతోను వివరింపబడియున్నవి. ఈ గ్రంథమునం దుదాహరించిన యోగములు గూడ ఏయే గ్రంథములనుండి గ్రహించి ప్రచురించినదీ వివరించిన బాగుండెడిది. ఔషధ రత్నాకరము కన్న ఈ గ్రంథము ప్రశస్తముగానే యున్నది. ప్రమాదములు లేకపోలేదు. రాస్నాతైల యోగమున ఏరండతైలమునకు బదులు తిలతైలమును వాడినారు. అశోక మనగా ‘నరమామిడి’ యని వ్రాసినారు. ఆంధ్రదేశమున అశోకమునకు బదులుగా నరమామిడిని వాడుచున్నారు గాని అసలు అశోకము ఇది గాదు. ఈ పొరపాటును శ్రీశాస్త్రిగారు సవరించియుండవలసినది. వారును నరమామిడి అనియే వ్రాయుచున్నారు. అసలు అశోకము చెన్నపురమున గవర్నమెంటు గార్డెనునందును, మ్యూజియము తోటలోను చూడవచ్చును. మలబారున విశేషముగా గలదు. కుంకుమాది తైలమున కొంతమార్పు కనపడు చున్నది.

‘వైద్యవినోది’

## చికిత్సారత్నము

కర్త:— బాలకవి కోపూరి వేంకటరాఘవసూరిగారు. సత్యనారాయణ బుక్కు డిపో, రాజమండ్రి. వెల రు. 1.

వైద్యవర, విద్యాపతి రచితమగు చికిత్సాంజనమను సంస్కృత (భాషా టీక) గ్రంథమున కిది తెలుగు చేత; సులభ శైలిని పద్యరూపమున శ్రీసూరిగారు హృద్యముగ రచించిరి. శాస్త్రీయముగ సులభముగ నన్నివ్యాధుల చికిత్సలు వివరింపబడియున్నవి. పండితులగు ప్రతివాది భయంకర కృష్ణమాచార్లుగారు ఉపోద్ఘాతము వ్రాయుచు, శ్రీసూరిగారి కవిత్వమును మెచ్చుకొని ఆనందించుటచేత ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యము వెల్లడి యగుచున్నది.

‘వైద్యవినోది’

## భారత బాల వీరులు

2 క్రౌను 16 పుటల సైజు. పు 96. వెల 0-6-0.

అనువాదకులు:— పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు.

ప్రకాశకులు:—ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ, మదరాసు.

ఈ 'పుస్తకము మాతృకను బాలుర నిమిత్తమే హిందీ భాషలో నొక కవి వ్రాసి ముద్రింపించి ప్రకటించియున్నాడు. దానిని అనువదించుచు ననువాదకులు కొంతభాగ మచ్చటచ్చట భారతమునందుండియు, జైమిని భారతమునందుండియు సంగ్రహించి జతపఱచియున్నారు. ఇందర్జునునకు (౧) నాగకన్యయగు నులూపియందు జనించిన ఇలావంతునియు, (౨) చిత్రాంగదయందుఁ బుట్టిన బభ్రువాహనునియు వీరవృత్తము చక్కఁగ వర్ణితమయినది. 'న మాతుః పరదైవతమ్' అను సూక్తి నీ గ్రంథము చాటును. రచన రసవంతముగను, సుగ్రాహ్యముగను నున్నది. విషయగౌరవముచే నేమి, రచనాసౌందర్యముచే నేమి, యీ చిన్న పుస్తకము నాలుగయిదు ఫారముల చదువు బాలురు చదువఁదగినది.

---

## భగవద్గీత—అనాసక్తియోగము

అనంతములైన భగవద్విభూతులు విశ్వమునందంతటను అనంతములైన నామరూపముల ప్రత్యక్షమగుచున్నవి. వేదములు, వేదాంగములు, శాస్త్రములు, పురాణేతిహాసములు, కావ్యములు, కళలు, భగవద్విభూతులను పలువిధముల వర్ణించుచు సంకీర్తనముచేయుచున్నవి. భగవద్విభూతులను ప్రత్యక్షముచేయుటకై భిన్నమతములు, యోగములు, తత్త్వములు వెలసినవి. భిన్నమతస్థులు ప్రత్యేకములైన వేదముల యాధారమున భగవంతుని నారాధించుచున్నారు. వేదములు, జెండ్ అవెస్తా, బైబిలు, కొరాను మొదలగు మతగ్రంథము లన్నియును, భగవదారాధనమును భిన్నరీతులను నిర్ణయించుచున్నవి. ప్రపంచావ్యములయిన మతగ్రంథములు, గీతలు, సంకీర్తనలు భగవద్విభూతులను విస్పష్టము చేయజాలకున్నవి. భిన్నయోగములందు మతాచార్యులు, తత్త్వజ్ఞులు, శాస్త్రజ్ఞులు, భక్తులు, భగవద్విభూతులను ప్రత్యక్షముచేయుటకు అవతరించుచు ధర్మోద్ధరణమును చేసెడివిధమును ప్రపంచేతిహాసములు విశదము చేయుచున్నవి. భగవద్విభూతులను సులభగ్రాహ్యము చేసెడిగ్రంథములందు భగవద్గీతసంక్షిప్తమైన ఉత్తమగ్రంథముగ నున్నది.

భగవద్గీతకు త్రిమతస్థాపకులును వారి సిద్ధాంతముల కనురూపముగ వ్యాఖ్యలను వ్రాసియుండిరి. సుప్రసిద్ధపండితులు వారివారి సంస్కారముల కనురూపముగ వ్యాఖ్యానములను వ్రాసియుండిరి. లోకమాన్యతిలకు, అరవిందఘోషు మొదలగు దేశభక్తులును గీతావ్యాఖ్యానములను ప్రచురించియుండిరి. వర్తమానయుగధర్మప్రవర్తకుడు గాంధిమహాత్ముడును గీతావ్యాఖ్యానమును రచించి దానికి అనాసక్తియోగమని పేరిడిరి. దానికి బలరామకృష్ణయ్యగారు నిష్కామయోగమని నామకరణము నొనరించిరి.

అనంతమైన భగవద్గీతకు ననంతములైన వ్యాఖ్యానములను రచియించుటకు గల యవకాశములను ప్రపంచమునందు వ్యాప్తిచెందిన వ్యాఖ్యానములు విశదపరచుచున్నవి. గీతాశాస్త్రమునకు మహాత్ముడు వ్రాసిన వ్యాఖ్యానము ప్రపంచపరిస్థితులందు నూతనలక్ష్యమును వ్యక్తముచేయుచున్నది. గాంధిమహాత్ముడు చేసిన అనాసక్తియోగనామకరణమును, బలరామకృష్ణయ్యగారు చేసిన నిష్కామయోగనామకరణమును గీతాప్రయోజనమును వ్యతిరేకార్థరూపమున ప్రతిపాదించుచున్నవి గాని పరమార్థరూపమున ప్రతిపాదించుటలేదు. గీతాశాస్త్రమునకు ప్రయోజనము ఆసక్తియోగము, కర్మయోగము. గీతాంతమునందు విజయుడు శ్రీకృష్ణుని యుపదేశానుసారముగ స్వధర్మనిర్వహణమును చేయుట కంగీకరించెను. ఆసక్త్యనాసక్తియోగముల లక్షణములు లక్ష్యము ననుసరించి నిర్ణయింపబడియున్నవి. యోగలక్ష్యము విషయేంద్రియార్థమైనపుడు అనాసక్తియును, భగవదర్థమైనపుడు ఆసక్తియును యోగమునకు పరమార్థములు. ఈపరమార్థమే గీతాశాస్త్రమునందు వివిధములైన యోగరూపములను నిర్ణయింపబడినది.

గాంధిమహాత్ముడు గీతాశాస్త్రమునకు కల్పించిన విశాలభావములు వారివ్యాఖ్యానమునందు ప్రత్యక్షములగుచున్నవి. కురుక్షేత్రమునందు విజయునకు కల్గిన విషాదయోగము సకలమానవులకును సందిగ్ధసమయములందు

కల్గుచున్నది. మానవహృదయమునందు నిరంతరము సంప్రాప్తమయ్యెడి ధర్మసంరంభమును, యోగారూఢులు ధర్మసంరంభమునందు పొందగల మహావిజయమును గీతాశాస్త్రము బోధించుచున్నది. మానవులకు సంసారయాత్రయందు ధర్మనిర్వహణము చేయుటయందును, పురుషార్థమును బడయుటయందును కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, సన్న్యాసయోగము సాధనములుగ నేర్పడినవి. దేహధారులు నిరంతరము కర్మయోగమును జేయుచు పురుషార్థమును బడయుదురని గీతయందు భిన్నయోగముల రూపమున ప్రతిపాదింపబడియున్నది. భిన్నరూపములను భగవద్గీత ప్రతిపాదించుచున్న యోగములన్నియును అన్యోన్యాశ్రయము గల యోగాంగములై పూర్ణయోగమునందు పరిస్ఫుటము లగుచున్నవి.

భగవద్గీతకు గాంధిగారు వ్రాసినవ్యాఖ్యానమాత్మకథయందు ప్రతిపాదితమైన ఫలరహితమైన కర్మయోగమునకు వ్యాఖ్యానముగ నున్నది. పూర్ణాదర్శప్రాయములైన హిందూమతమును వేదాంతమును నన్యోన్యాశ్రయము లేకను పురుషార్థసాధనమునకు నిరర్థకములైనవి. నిత్యప్రవృత్తియందు సిద్ధాంతములకును, ఆచరణములకును సంబంధము లేకున్నది. జీవయాత్రయందు ఖండయోగములకుగల ప్రతిపత్తి పూర్ణయోగమునకు గలుగకున్నది. పూర్ణయోగమునకు సాధనములును, భగవద్గీతకు కీలకములును నైన ధర్మము, యజ్ఞము, కర్మము, భక్తి, సన్న్యాసము జ్ఞానము మొదలగు భావములకు గాంధిమహాత్ముడు తన వ్యాఖ్యానమునందు పూర్ణార్థమును నిరూపణచేసి గీతాప్రయోజనము విశ్వజనీనమని వ్యక్తము చేసెను.

పీఠికయందు "నిష్కామకర్మచేతనే, యజ్ఞార్థము కర్మచేయుటవలననే, కర్మఫలపరిత్యాగమూలముననే, సమస్తకర్మల శ్రీకృష్ణార్పణమొనరించుటవలననే, అనగా మనోవాక్కాయ కర్మల భగవదర్పితమొనరించుటవలననే కర్మబంధము లేక దోషస్పర్శము వీడున"నని గాంధిమహాత్ముడు నిరూపించిన భావములను వ్యాఖ్యానము విస్పష్టము చేయుచున్నది ఈయుదాహరణములు స్పష్టము చేయుచున్నవి.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.

వ్యాఖ్యానము:—ఎవఁడు కర్మచేయుచుండియుఁ గర్తృత్వముయొక్క యభిమానమును గలిగియుండఁడో వానికర్మ యకర్మయే యనఁబడుచున్నది. ఎవఁడు బాహ్యమునకుఁ గర్మను బరిత్యజించియుండియు మనస్సునందు దాని భావమును జింతించుచుండునో వాని యకర్మ కర్మయే యగును. ఎవనికిఁ బక్షవాతము కలుగునో వాఁడెప్పుడు కోరి, అభిమాన పూర్వకముగ, నిశ్చేష్టముగ నున్న యంగమును గదలించునో, అప్పుడే యది కదలుచున్నది. ఈవిధమున నాపక్షవాతరోగి యవయవమును గదలించు క్రియకుఁ గర్తయగుచున్నాఁడు ఆత్మయొక్క గుణ మకర్తృత్వము. వ్యామోహవశముచేఁ దన్నుఁ గర్తగ భావించునట్టి యాత్మకుఁ బక్షవాతము కలిగినదనియే భావించవలసి యున్నది. అట్టియాత్మ యభిమానమునకుఁ జిక్కి కర్మ నాచరించుచుండును. కర్మయొక్క యీగతి నెఱుంగు మనుష్యుఁడు బుద్ధిమంతుఁడును, యోగియు నగు కర్తవ్యపరాయణుఁడుగ భావింపఁబడుచున్నాఁడు. "నేను చేయుచున్నాఁడను" అని తలపోయువాఁడు కర్మ వికర్మ (నిషిద్ధకర్మ)ల భేదమునే మఱచిపోవును. మఱియు నట్టివాఁడు సాధనము యొక్క మంచిచెడ్డలను గుఱించియే విచారణ సేయఁడు. ఆత్మయొక్క స్వాభావికగతి యూర్ధ్వము. కాఁబట్టి మనుష్యుఁ డెప్పుడు నీతిమార్గమును బరిత్యజించునో, అప్పుడు మనము తప్పక వానియందు 'అహం' కలదని చెప్పవచ్చును. అభిమానశూన్యుని కర్మలు సహజముగా సాత్త్వికములుగనే యుండుచుండును.

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.

వ్యాఖ్యానము:—ఎవనియాత్మ పరిశుద్ధమైనదో, ఎవఁడు సమత్వముయొక్క సాధనమునందు విజయమును బొందెనో వాని కాత్మసాక్షాత్కారము సులభసాధ్యము. యోగారూఢుఁ డగువ్యక్తి లోకసంగ్రహ (కల్యాణము) దృష్టితోనయినను గర్మముఁ జేయవలసిన యవసరమే యుండదనుట దీనియర్థము గాదు. అట్టివాఁడు లోకకల్యాణముఁ